# ఆంధ్ర భాగవత విమర్శ

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారి
Ph. D. పట్టమును పొందిన
పరిశోధన నిబంధనము

★

డాక్టర్
ప్రసాదరాయ కులపతి

సర్వస్వామ్యసంకలితము

వెల - 50 రూ/-

ప్రతులకు

డా|| ప్రసాదరాయకులపతి
ఆంధ్ర సంస్కృత శాఖాధ్యక్షులు
హిందూకళాశాల, గుంటూరు - 522003
Phone : 25623

ముద్రణము :

పి. రామకృష్ణమూర్తి,
మేనేజింగుడైరెక్టరు,
వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,
బ్రాడీపేట, గుంటూరు-2 ఫోన్ : 25081



శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
రచయితల సహాయ ప్రణాళిక క్రింద
చేయబడిన ఆర్థిక సహాయముచే
ముద్రితము.

## ముద్రాపక ప్రశంస

నేర్పరి జీవిత పథమున
తీర్పరి ధర్మమ్మునందు తెలుగు వెలుగులన్
కూర్పరి కవితాప్రియుడగు
కర్పూరపు రామకృష్ణ ఘనయశు దలతున్.

భాగవతులటన్న భాగవతమ్మన్న
భక్తి గలుగునట్టి భాగవతుడు
భాగవత విమర్శపై భక్తి గల్గుట
ఏమి వింత రామకృష్ణునకును.

అతని మనసు నెరిగి సుతులు సహాయులై
రచ్చకొరకు నచ్చమైన భక్తి
క్రాంత భాషణుండు శాంతిభూషణుడు సూ
ర్యప్రకాశు డమలినాంతరుండు.

స్నిగ్ధ హృదయులు వారి నాశీర్వదించి
వారి తండ్రికి నిర్మల భాగవతునకు
దివ్యలోకాల శాశ్వత దీప్తి నొసగ
భాగవతనాథు ప్రార్థింతు పరమ భక్తి.

[కీ. శే. శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారేర్పరచిన సీతమ్మ, సూర్యనారాయణ. యుగంధర లక్ష్మి ధర్మనిధినుండి వారి కుమారులు శ్రీ శాంతిభూషణ్, శ్రీ సూర్యప్రకాశ్ ముద్రణకవ సరమైన ధనసహాయము చేసిరి.]

# కృతి సమర్పణ

బహుళవాంఛల లౌకిక ప్రాభవులకు
బ్రతికి యుండగ నిత్తురు కృతులు జగతి
కేవలము భక్తి గురు పితృదేవతలకు
కృతుల నిచ్చెద రేవేళ ఋణముదీర్ప

సహజముగ కావ్యమిచ్చుయశమ్ము సుకృత
మందుచేగల్గు నిహలోకమందు తృప్తి
పరమునందు స్వర్గమ్మును - స్వర్గమందె
వరలువారికి ఇకనేమి వచ్చునొక్కొ

ఈకృతి విశేషమైనది ఈశ్వరార్థ
చింతనము భాగవత తత్వ సేవనమ్ము
కాననిదియు స్వర్గాధిక మైనయట్టి
అపునరావర్త లోకమ్ము లందజేయు

అరయ స్వర్గీయుడైన ఏకాన్వయునకు
ఆంజనేయున కిచ్చెద నమితభక్తి
ఈకృతిని నాదు బహుళాత్మకృషి ఫలమ్ము
భాగవత విమర్శాఖ్య కావ్యమ్ము నేడు

ఏదియో ఒక విధముగ ఋణముదీర్ప
కావ్యము నొసంగి చేతులు కడుగుకొనెడి
వాంఛతోగాక కేవల భక్తితోడ
అంకితము నిత్తు కృతి కృతజ్ఞార్పణముగ

నాశుభము నాదు జీవితౌన్నత్యపథము
తలచె నాతడు తన జీవితమున నెపుడు
నేను కోరెద నా మహనీయు శుభము
ఆ పరాత్పరునకు భక్తి నంజలించి

భాగవతతత్వ విభుడైన భక్తసులభు
ప్రార్థనము జేతు నొక్కవరమ్ము దీర్ప
అచట నాకృతి ఫలమొందు ఆంజనేయు
డేదికోరునో అదియెల్ల నిమ్మటంచు

తండ్రినలెంజూచె విమలవాత్సల్యబుద్ధి
కోరక యొసంగె లెక్కింపకుండ ధనము
నాదుకవిత మహాభిమానమ్ము పూని
నిర్మలమనస్వి శ్రీ ఆంజనేయబుధుడు

గొప్పవాడాయనయె మరికొంతకాల
మాయురారోగ్యములతోడ నలరెనేని
నన్నుచుట్టిన అరిఘర్షణాగ్నులకును
ఉగ్రవర్షస్వరూపుడై యుండడొక్కొ

అంత శక్తిలేకున్నను అంత ధర్మ
దీప్తి కలిగిన వారి ద్వితీయసుతుడు
స్నిగ్ధహృదయుండు మృదుభాషి నిర్మలుండు
హితుడు నాయిష్టసఖుడు రాజేశ్వరుండు

అవసరమునందు నాకు ధైర్యమ్మొసంగె
ఆదుకొనె ఆర్థికమ్ముగ హార్దికముగ
ఆతనిని మెచ్చి అందుకు హేతువైన
తజ్జనకు ధర్మదీక్షను దలతునెపుడు

ఆ మహాత్ముని సారస్వతాభిమాను
ఆంధ్రకవిలోక కృష్ణరాయావతారు
పండిత విధేయు కవితాప్రపంచగేయు
సహజసౌజన్య సన్మాన్యు సంస్తుతించి

అట్టి అమృతస్వరూపున కట్టిదాత
కమరలోకనివాసికి ఆంజనేయ
విబుధవరునకు విమల వివేకమతికి
నా హృదయపూర్వకము గ గ్రంథమ్మునిత్తు.

## కృ త జ్ఞ త లు

1. పరిశోధన పర్యవేక్షకులు
   ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారికి
   ఆచార్య శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారికి
2. వేంకటేశ్వర విశ్వవిద్యాలయాధికారులకు
   ఆంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య శ్రీ జి.యన్. రెడ్డిగారికి
3. ప్రోత్సాహకులు - గుంటూరు హిందూకళాశాల పాలకవర్గము వారికి
4. న్యాయ నిర్ణేతలకు.

# విషయ సూచిక

# ఆంధ్ర భాగవత విమర్శ

## 1. పురాణవాఙ్మయము-భాగవతము

పురాణ స్వరూపము :- ప్రపంచ మంతటిలో భారతజాతి అత్యంత ప్రాచీనము, మహోన్నతము నైన నాగరికతను, సంస్కృతిని సంపాదించుకొన్నది. విశ్వ వాఙ్మయములోనే మొదటివిగా పరిగణింపబడు వేదములు దాని మహోదాత్త విశిష్టతకు చిహ్నములు. వానిలోనే పురాణ కథలు, పురాణ బీజములు కన్పించుచున్నవి.[1] పురాణము ప్రాచీన చరిత్ర. అది యొక పురాతన గాథాసంపుటి. పురాతనమనగా మనకంటి కందినంత మేర మాత్రమే కాదు. మన చూపు ప్రసరించని ఊహ అందుకొనజాలని ఏ ప్రమాణములును తెలిసికొనలేని అనంతకాలము. అప్పటినుండి వచ్చిన సమస్త సృష్టిచరిత్రయు పురాణములలో నుండును ఈ విశ్వములోని ప్రత్యేకమానవజాతులలో ప్రతి జాతిలోను దాని ప్రాదుర్భావకాలమునుండి కొన్ని గాధలుండును. అవి ఆ జాతిలో ఆదికాలమున సంభవించినవి కావచ్చును. లేదా అందలి ఆదిమానవులూహించినవి కావచ్చును. ఆయూహయు ఆనాటి పరిస్థితులనుబట్టి సంభావ్యతా సిద్ధాంతమున కనుకూలముగానే యుండును. అనగా ఆ గాధలన్నియు ఆజాతిలో సంభూతసత్యములుగాని, సంభావ్యసత్యములుగాని కాగలవనుట నిర్వివాదాంశము. ఆ దృష్టితోనే పండితు లనేక పౌరాణికగాధల నర్థవాదములందురు.

పురాణము ప్రధానముగా భగవద్విషయికమైనది. సృష్టికాధారభూతుడై, తత్పరిపాలకుడైన పరమేశ్వరుని లీలావిశేషములను వర్ణించుట దానిధ్యేయము. దాని ఆదర్శము సృష్టి కతీతుడైన ఆ సర్వేశ్వరుని చేరుకొనుటకు మార్గము సూచించుట. రామాయణ భారతాదులగు ఇతిహాసములలో "దేశములయొక్క మహారాజులయొక్క చరిత్ర ప్రధానముగా నుండును. పురాణములలోను కొన్ని సందర్భములలో ఐతిహాసికమగు చారిత్రకాంశములున్నను అవి ప్రధానముకావు. భగవదవతారలీలావర్ణనాదులే ప్రధానములు. ఏకనాయకాశ్రయత్వము, వస్త్వైక్యము వానిలో నుండవు. యుగాంతరవ్యాప్తిగలవస్తువు-సమస్తలోకములకును,మన్వంతరములకును వ్యాపించిన భగవల్లీలాకథన మందుండును. కావున పురాణములకు నాయకుడు భగవంతుడే. తల్లీలామాహాత్మ్యములు వ్యక్తమగుటకు సాధనములుగా మాత్రమే ప్రసంగవశమున భక్తుల

యొక్క మహారాజులయొక్క దేవతలయొక్క చరిత్రలు విస్తరింపబడును. ఆభక్తులు, ఆ మహారాజులు, ఆ దేవతలు వారెవ్వరును పురాణనాయకులు కారు. పురాణకర్త స్థాపింపనెంచిన సిద్ధాంతమునకు వారాలంబన మాత్రులు. ఇది ఈనాడు మనకు కనిపించు పురాణముల స్వరూపము.

నిర్వచనము :- పురాణశబ్దమునకు పలుచోట్ల పలు నిర్వచనములు కలవు. బ్రహ్మాండపురాణము ప్రక్రియాపాదములో 'యస్మాత్ పురాహ్యనక్తీదం పురాణం తేనతత్ స్మృతం' అని కలదు. పురా = అతీతానాగతవృత్తములను అనక్తి = పొందించునది, లేక తెల్పునది అని వ్యుత్పత్తి. యస్మాత్ పురాహి అనతి ఇదం పురాణం, అని వాయుపురాణము [2] నిర్వచించెను. పురా = పూర్వవిషయములను అనతి = చెప్పునది అని దాని అర్థము. కొందరు పురాభవం పురాణం అనుచున్నారు. అనగా పూర్వమందు పుట్టినదని అర్థము. పురా అపినవంఅని మరికొందరి వ్యుత్పత్తి అనగా పూర్వమందును క్రొత్తది అనియు లేదా ప్రాతదయ్యును క్రొత్తదిగా భాసించునది అనియు అర్థము. ఈ అన్ని నిర్వచనములను బట్టియు ఒక విషయము నిష్కర్షగా చెప్పవచ్చును. ఇది అత్యంత ప్రాచీనములైన దివ్యమానుషగాథలను తెల్పును. ఆ తెల్పుటలో నున్నవిశిష్టతచే అది నిత్యనూతనముగా భాసించును.

ప్రస్తావన :- అతిపురాతనమగు శ్రుతి, స్మృతులలో, బ్రాహ్మణములలో పురాణప్రయోగము కన్పించుచున్నది. ఇతిహాసపురాణగాథా .... .... (అథర్వవేదము) [3] : ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వవేద ఇతిహాస పురాణ ఉపనిషత్సూత్ర .... ....(శతపథ బ్రాహ్మణము) [4] వేద ఇతిహాస పురాణగాథా .... .... (తైత్తిరీయారణ్యకము) [5] ఇతిహాస పురాణం పంచమం వేదానాం వేదం .... .... చాందోగ్యోపనిషత్[6] : ఇత్యాది

శ్రాద్ధములలో పురాణము పఠింపబడవలెనని మనుసంహిత[7] ప్రస్తావించినది. వేదార్థ నిర్ణయమునకు పురాణేతిహాసజ్ఞానమవసరమని వసిష్ఠ స్మృతి పలికినది.

లక్షణము :- ఇది విష్ణుపురాణమున [8] నిట్లు కలదు.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
సర్వేష్వేతేషు కథ్యంతే వంశానుచరితం చ యత్

మత్స్యవాయ్వాది పురాణములలో పైదాని ద్వితీయార్ధమునకు 'వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణం' అను పాఠాంతరము కలదు. ఇదే అమరకోశము లోను గ్రహింపబడినది. పైలక్షణములు కాక మహా పురాణమునకు మరి యైదు విశేషములుండునని కొన్ని చోట్ల కలదు.

శ్లో॥ సర్గో ప్యస్య విసర్గశ్చ వృత్తి రక్షాంతరాణి చ
వంశో వంశానుచరితం సంస్థా హేతు రపాశ్రయ:
దశభిర్లక్షణై ర్యుక్తం పురాణం తద్విదోవిదుః

సర్గము బ్రహ్మసృష్టి. ప్రతి(వి)సర్గము ప్రజాపతులసృష్టి. బ్రహ్మాదుల పుత్రపౌత్రపరంపరానుగత శరీరసంఘాత ప్రవాహము వంశము. మన్వంతర మనిన స్వాయంభువాది మనువుల కాలము, అప్పటి దేవతాధర్మాదిస్థితులును; సూర్య చంద్రాది వంశజాతులగు మహాపురుషుల చరిత్రమే వంశానుచరితము. భూతజీవికా సాధనము వృత్తి. అవతారాదులచే భగవంతుడు ధర్మమును రక్షించుట రక్ష.

నైమిత్తిక ప్రాకృతికాత్యంతిక భేదముల విశ్వమునకు జరుగు ప్రళయము సంస్థ. జగత్సర్గాది నిమిత్తుడగు జీవుని ప్రతిపాదించునది హేతువు. బ్రహ్మము సర్వసాక్షియై. సర్వావస్థలందు భిన్ననామముల ఉండుటనునిరూపించుట అపాశ్రయము.

విభాగము :- అనేకఋషు లనేకకాలములలో నిర్మించిన పురాణములను పరిశీలించి, సమీకరించి వేదవిభాగకర్తయు, భారతరచయితయు నగు కృష్ణద్వైపా యన వ్యాసుడొక పురాణసంహితను రచించెను.

శ్లో॥ ఆఖ్యానై శ్చాప్యుపాఖ్యానైః గాథాభిః కల్పశుద్ధిభిః
పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః

దానిని శిష్యుడగు రోమహర్షణున కాయన ఉపదేశించెను. రోమహర్షణ సూతుడును సంశపాయనుడు. అకృతవ్రతుడు సావర్ణి అను మరి ముగ్గురు శిష్యు లును నాలుగు పురాణ సంహితలు వ్రాసిరి. ప్రస్తుత మివేవియు ఉపలభ్యమగుట లేదు. వీరు కాక సుమతి, అగ్ని వర్చస్సు, మైత్రేయుడుఅను ముగ్గురు శిష్యులును పురాణప్రవర్తకులు.

తన నాటికి అంతులేని మహాసముద్రమువలెనున్న పురాణ వాఙ్మయమును సంస్కరించి వ్యాసు డొక రూపమునకు తెచ్చెను. తత్ఫలితముగా అష్టాదశ పురాణ, ములు సిద్ధమైనవి. వానిపేర్లివి. 1. బ్రహ్మ 2. పద్మ 3. విష్ణు 4. శివ 5. భాగవత 6. భవిష్య 7. నారద 8. మార్కండేయ 9. అగ్ని 10. బ్రహ్మవైవర్త 11. లింగ 12. వరాహ 13. స్కాంద 14. వామన 15. కూర్మ 16. మత్స్య 17. గరుడ 18. బ్రహ్మాండ—పురాణములు.

ఈ పేర్ల పట్టికలు వివిధపురాణములలో కొంచెము భేదించుచున్నవి. విష్ణు భాగవత, స్కాందాదులు చాల వానిలో పై పట్టికయే కలదు వాయుపురాణమును, శివపురాణమును వేరని కొన్ని స్థలములలోని పురాణనామపట్టికలు భ్రాంతి కలిగించిన మాట సత్యమే కాని ఆ రెండు నొక్కటియే. కూర్మ పురాణ మగ్నికి బదులుగా వాయువును పేర్కొన్నది. అగ్నిమత్స్యపురాణములు శివపురాణమును విడిచి వాయువునుదాహరించినవి. వరాహపురాణము గరుడ బ్రహ్మాండములను వదలి వాయు, నరసింహములను చెప్పినది.

ఈ పురాణములు సాత్విక, రాజస, తామసములని మూడు విధములు. సర్వ సృష్టికి గుణత్రయ భేదమున్నట్లే పురాణములకును ఈ భేదము కావింపబడినది. హరిహరబ్రహ్మ లధీశ్వరులుగా గుణముల ననుసరించి ఒక్కొక్కరి కారు చొప్పున పురాణములు వర్గీకరింప బడినవి. ఆవిభజన మిది.

సాత్వికములు:— విష్ణు,నారద, భాగవత, గారుడ, పద్మ, వరాహ—పురాణములు ఇవి విష్ణు పరములు.

రాజసములు :— బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రహ్మపురాణములు—ఇవి బ్రహ్మపరములు.

తామసములు :— మత్స్య, కూర్మ. లింగ, శైవ, స్కాంద అగ్నిపురాణములు ఇవి శివ పరములు.

దేవతాదృష్టితో ఈ విభాగము సర్వసమగ్రమని తలపరాదు. అవి తదధి దేవతలను గూర్చి మాత్రమేకాక ఇతర దేవతలను గూర్చి కూడ చెప్పుచుండును, కొన్ని పురాణములు కేవల శాక్తేయములుగానుండుట గమనార్హము. వైదికమత ములో కాలక్రమమున బ్రహ్మకు పూజాప్రాధాన్యము తగ్గిన పిదప పురాణముల

లోను బ్రహ్మకు సంబంధించిన ప్రాధాన్యము తగ్గి శివ, విష్ణు, దేవీ విభాగములే ప్రధానముగా పరిగణింపబడినవి. ఒక్కొక్క పురాణములో ప్రధానముగా నొక దేవత కనబడినను అన్యదేవతా నిరసనము పౌరాణిక సిద్ధాంతమునకు విరుద్ధమగుటచే సర్వపురాణముల గమ్యస్థానమును ప్రతిపాదితాంశమును ఒకే సత్యమును బోధించు ననుట పరమార్థము.

ఈ పదునెనిమిది మహాపురాణములు కాక అన్నియే ఉపపురాణములును కలవు ఇవి పదునెనిమిదను ప్రతీతియేగాని పురాణపట్టికలలో లెక్కలు మిక్కిలిగా నున్నవి. సామాన్యముగా కనిపించు నుపపురాణముల పేర్లు క్రింద నొసగబడినవి. వానిలో నేవో ఒక పదునెనిమిది ప్రతి పట్టికలో నుండును.

1. నారదీయ 2. బృహన్నారదీయ 3. నందీశ్వర 4. బృహన్నంధీశ్వర 5. శివ 6. సాంబ 7. గణేశ 8. లైంగ 9. కల్కి 10 కాళికా 11. చండికా 12. వాసిష్ఠ 13. మారీచ 14 వారుణ 15. పారాశర్య 16. వామన 17 సనత్కుమారీయ 18. దేవీ 19. ధర్మ 20. శివధర్మ 21. బృహద్ధర్మ 22. విష్ణుధర్మోత్తర 23. విష్ణుధర్మ 24. నారసింహ 25 భార్గవ 26. బ్రహ్మాండ 27. ఆది 28. ఆదిత్య 29. నంది. 30. దౌర్వాస 31. కాపిల 32 మానవ 33. ఔశనస 34 భవిష్యోత్తర 35. భాగవత 36. కూర్మ 37. భవిష్య-వీనిలో పరస్పర విరోధయుతములుకూడ కలవు. శైవ, వైష్ణవ, శాక్తేయ సౌర, గాణాపత్యాద్యనేకమతముల నివి ప్రబోధించుచున్నవి.

కర్తృత్వము:- పురాణోపపురాణము లన్నియు వ్యాసకృతము లనుట సంప్రదాయము. సర్వపురాణవాఙ్మయ సమీకరణము చేయుటచే వ్యాసున కాపేరు వచ్చినది. ఆయాపురాణములలోనే స్పష్టముగా వాని కర్తల పేర్లు కలవు. ఈ సందర్భమున శివపురాణమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ బ్రాహ్మం తు బ్రహ్మణా ప్రోక్తం పాద్మం తేనైవ శోభనం
పరాశరేణ కథితం వైష్ణవం మునిపుంగవాః ॥
శైవం శైలాదినా ప్రోక్తం... ...

ఇట్లే ఉపపురాణములనుగూర్చియు కూర్మపురాణమున ఈ విధముగా చెప్పబడినది.

శ్లో॥ ఆద్యం సనత్కుమారోక్తం నారసింహం తతః పరం
తృతీయం వాయవీయం చ కుమారేణ చ భాషితం
చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశభాషితం
దుర్వాస సోక్త మాశ్చర్యం నారదీయ మతఃపరం ......

పురాణకాలము :- వేద పురాణ వాఙ్మయ సంతతిని నేటి రూపమునకు తీసి కొని వచ్చిన వాడు వ్యాసుడని సంప్రదాయోక్తి. దాని ననుసరించి వ్యాసుడు ద్వాపర యుగాంతమున దాదాపు ఐదువేల ఏండ్ల క్రిందట జీవించినవాడు. ఆయన కాలమున జరిగిన భారత కథావిశేషములను పలువురు పండితులు కాలనిర్ణయమునకై పరిశీలించి యున్నారు. పూర్వవిద్వాంసులగు వృద్ధగర్గుడు, భట్టోత్పలుడు, వరాహమిహిరుడు, ఆర్యభట్టు, కల్హణుడు మొదలగువారు జ్యోతిర్గణనము నాధారము చేసికొని భారత యుద్ధము సప్తర్షులు మఖలో నుండగా అనగా నేటికి దాదాపైదువేల సంవత్సరముల క్రింద జరిగినదని నిరూపించిరి. ఆధునికులగు కె. వి. అభంకర్, టి. యస్. నారాయణశాస్త్రి, కోటవెంకటాచలం, నడింపల్లి జగన్నాధరావు మొదలగువారు మన ప్రాచీనుల కాలగణనపద్ధతిలోని విశేషాంశములను సవిమర్శముగా పరిశీలించి పై నిర్ణయమునకే వచ్చిరి. వారి పరిశోధనప్రకారము క్రీ.పూ. 3102 ఫిబ్రవరి 17-18 అర్ధరాత్రి, గురువారమున కలియుగారంభము జరిగినది. వ్యాసు డప్పటి వాడు కావున పురాణ వాఙ్మయ నిర్మాణ మానాడే జరిగినదని వారి సిద్ధాంతము.

ఆధునిక విమర్శకులలో ననేక లిందుకు భిన్నములగు నభిప్రాయములను కలిగియున్నారు. వ్యాసునికాలము భారత యుద్ధకాలము, భారతరచనాకాలము పురాణనిర్మాణకాలము వీని విషయమున కొందరు విద్వాంసుల అభిప్రాయము లీ క్రింద నొసగబడుచున్నవి[11].

వ్యాసునికాలము-మేక్డొనెల్-క్రీ.పూ. 1400: పర్గిటర్ - క్రీ.పూ. 1050: హావెల్-క్రీ.పూ. 1400-1300 మధ్య: సి. వి. వైద్య - క్రీ.పూ. 1400: సీతానాధ ప్రధాన్-క్రీ.పూ. 1150:

భారతయుద్ధకాలము :- పర్గిటర్ - క్రీ.పూ. 950: స్మిత్ - క్రీ.పూ. 400: క్రీ.శ. 400 మధ్య జోన్స్ - క్రీ.పూ. 1460: కోల్‌బ్రూక్ - క్రీ. పూ. 14శ ఎలిఫిన్‌స్టన్-క్రీ.పూ. 14శ, తిలక్ - క్రీ.పూ. 14శ హంటర్-క్రీ.పూ. 12శ.... ....

భారతరచనాకాలము వీబర్ - క్రీ.పూ. 3శ. తరువాత: వింటర్ నిట్జ్ క్రీ.పూ. 3శ. ప్రాంతము; మేక్డొనెల్ - క్రీ.పూ. 5శ. పూర్వరూపము; హాప్‌కిన్స్ క్రీ. పూ. 200 ముందు; ఎలిఫిన్‌స్టన్ - క్రీ.పూ. 9శ. జోన్స్ - క్రీ.పూ. 13శ హంటర్ - క్రీ.పూ. 5శ; తిలక్ - క్రీ.పూ. 5శ; ఆర్. జి. భండార్కర్ - క్రీ.పూ. 4,5 శ; కె. ఎ, నీలకంఠశాస్త్రి - క్రీ.పూ. 300 తరువాత

పురాణ నిర్మాణకాలము :- పైన చెప్పబడిన ఆధారములను బట్టియేకాక వీనిని ప్రత్యేకముగా పరిశోధించి రచనా కాల నిర్ణయము చేయుట కనేకులు ప్రయత్నించి యున్నారు. చాల పురాణములు భారత, హరివంశకథలను కలిగియుండుటచే వానికి తరువాతివని కొందరు భావించిరి. మరి కొందరు పురాణములలోని భవిష్యద్రాజకథనము ప్రధానాధారముగా గ్రహించి తరమున కిన్ని సంవత్సరములని వెనుకకు లెక్కించిరి. కానీ తరమున కెన్నేండ్లనునది అనిశ్చితాంశమగుటచే దానిననుసరించి చెప్పబడిన ఫలితములను నిర్దుష్టములని అంగీకరింప వలనుకాదు. ఈ కలియుగ రాజవంశకథనము వట్టి బూటకమని కొందరు త్రోసివేసినను పర్గిటర్ [12] మొదలగువారు దీనిని చారిత్రకముగానే భావించినారు. అమరసింహుని నాటికే పురాణము పంచలక్షణమని నిర్ణీతమగుటచేతను, భాసకాళిదాసాశ్వఘోషాదులు పురాణముల నెరిగియుండినట్లు తెలియుటచేతను ఇవి క్రీస్తు శకారంభమున కీవలివని చెప్పుట కవకాశము లేదని కొందరనగా, మరికొందరు కాళిదాసాదులు క్రీ.శ. లోని వారే అని పల్కిరి. కర్మ భక్తి జ్ఞాన మార్గములను సులభముగా నుపదేశించుచు, నడుమ నడుమ నాస్తికమతము నణగద్రొక్కుచు, శైవ వైష్ణవ మతములను, విగ్రహారాధనమును విస్తరింపజేయుచు వచ్చిన ఇవి హరివంశమునకును, క్రీస్తుశకారంభమునకును మధ్య నుదయించి యుండునని ఇంక కొందరు భావించిరి. శైవవైష్ణవాది మతములు పరస్పరము ప్రతిఘటించుకొన్న క్రీ. శ. 6, 7, 8,ల ప్రాంతమున పురాణోపపురాణములు పెక్కువెలసినవని మరి కొందరి యభిప్రాయము. ఇవన్నియు ఏకకాలమున రచింపబడలేదనియు, భిన్నకాలములలో భిన్న వ్యక్తులచేత అర్వాచీనముగ రచింపబడినవనియు నవ్యులలో అధికసంఖ్యాకుల అభిప్రాయము.

బ్రాహ్మణాదులలో ప్రస్తావింపబడిన పురాణములు నశించినవని ఇప్పుడు మనకు పురాణములపేర వచ్చినవన్నియు దాదాపుజరిగిన వేయిసంవత్సరముల కాలములోనివే అనియు వీబర్ పండితుని [13] అభిప్రాయము. ప్రొఫెసర్ లాసెన్ ఊహ లిట్లే.[14]

క్రీ.శ. 7శ. లోని బాణభట్టును, క్రీ.శ. 8శ. లోని కుమారిల భట్టును, క్రీ.శ. 9శ లోని శంకరాచార్యులును క్రీ. శ. 11శ, లోని రామానుజాచార్యులును పురాణములను పవిత్ర గ్రంధములుగా ప్రస్తావించుట వాని కాల నిర్ణయమునకు తోడ్పడినదని పండిత గౌరీనాధశాస్త్రి [15] భావించుచున్నాడు ప్రఖ్యాత యాత్రికుడగు అల్బెరూని క్రీ.శ. 1030 ప్రాంతమున భారతదేశమును దర్శించి తాను వ్రాసిన గ్రంధములో పదునెనిమిది పురాణములను పేర్కొనియున్నాడు. ఇదియును రాణకాల నిర్ణయమునకు సహకరించినది.

వ్యాసునకు పూర్వమే అధర్వవేదాది ప్రాచీన గ్రంధములలో ప్రస్తావింపబడిన పురాణము లెట్లుండెనో గుర్తింపగల ఆధార మేదియును లేదు. పూర్వరచనలోని ఏభాగము లేవిధములుగా వ్యాస ప్రవర్తిత భాగములలో చేరినవో గుర్తుపట్టుట దుష్కరము. ఏది ఎట్లైనను అనేక ప్రాచీనభాగములు మాత్రము ఇప్పటి పురాణములలో కలిసియున్నవని ఎక్కువమంది విమర్శకుల నిశ్వాసము క్రీ.పూ 4 లేక 5 శ. లకు చెందినవిగా భావింపబడు ఆపస్తంబ గౌతమ ధర్మసూత్రములలో ఇవి పేర్కొనబడుట చేతను, ఇతర కారణములచేతను తననుతానే పురాణముగా చెప్పుకొను భారతముకంటే గూడ పురాణములోని కొన్ని భాగములు ప్రాచీన తరములని ఎట్టిభేదాభిప్రాయమును లేక అనేకులు భావించుచున్నారు హరివంశ, వాయు పురాణము లలో చాల శ్లోకము లొక్కటిగా కనిపించుటయు నిందుకు నిదర్శనము కాగలదు. బౌద్ధగ్రంధము లెన్నో పురాణములను పేర్కొన్నవి లలితవిస్తరము పురాణ మని చెప్పబడుటే కాక పురాణతుల్యవిషయము లెన్నో అందు కలవు. పురాణ రాజవంశాను చరిత్ర పరిశీలనమున వానిలో సామాన్యముగా ఆంధ్ర భృత్యగుప్తరాజుల కాలమువరకు మాత్రమే కన్పించు ననియు అంతకు తరువాతవారగు హర్ష చక్రవర్తి ప్రభృతులు పేర్కొనబడకపోవుటచే పురాణములు గుప్తరాజుల కాలములో రచింపబడినవిగా నిర్ణయించవచ్చుననియు గౌరీనాథశాస్త్రి యభిప్రాయము [16] మొత్తముమీద పురాణములలోని కొన్ని పూర్వభాగములు క్రీస్తుపూర్వమును, కొన్ని తరువాతి భాగములు క్రీ.శ. 7శ ప్రాంతములోను రచింపబడియుండునని ఆయన భావన [17].

ప్రాచీనతర పురాణములు :- క్రీ. శ 9 శ ముందువని వింటర్ నిడ్జ్ అభిప్రాయము [18]. క్రీ. శ. 8 లేక 9. శ- క్రీ. శ. 16 లేక 17 శ ల మధ్య పురాణ

రచన జరిగియుండునని ప్రొఫెసర్ విల్సన్ అభిప్రాయము. అక్షయకుమారదత్తు[20] విల్సన్ సిద్ధాంతముతో నేకీభవించెను. మహా మహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి నేపాల్ నుండి సంపాదించిన క్రీ. శ. 7శ. కు చెందిన స్కాందాం తర్గత నందికేశ్వర మాహాత్మ్యలిఖితప్రతి, కలకత్తా విశ్వవిద్యాలయములో 933 శక సంవత్సరమునాడు చేతితో వ్రాయబడిన స్కాందపురాణ కాశీఖండప్రతి, శంకరు డుదాహరించిన విష్ణు మార్కండేయపురాణ భాగములు, బాణభట్టు వాయు పురాణము నుదాహరించుట, మయూరుడు సౌరపురాణమునుండి తన సూర్యశతకములో నిచ్చిన విశేషాంశములు, వంగ దేశప్రభువగు బల్లాలసేనుని దానశాసనోదాహృత పురాణనామములు ఇత్యాది హేతువులను జూపి విల్సన్ వాదమును మేజర్ బి. డి. బసు తీవ్రముగా ఖండించెను.[21] భవిష్యద్రాజవంశకథనమును గూర్చి వ్రాయుచు జావాద్వీపములో దొరికిన క్రీ. శ. 5శ. నాటి బ్రహ్మాండ పురాణప్రతిలో అది లేకుండుటచే నెమ్మదిగా తరువాతికాలమున పురాణములలో ప్రవేశించియుండు నని అతడు వ్రాసెను [22] మొత్తముమీద ఆపస్తంబధర్మ సూత్రములకు ముందే చాల పురాణములు రచింపబడినవని అతడు ప్రకటించెను.

శివవిష్ణురామకృష్ణాదు లీదేశమున నొకప్పుడు జాతీయనాయకులనియు, రామాయణ భారతకాలములనాటికి వారు వీరులుగానే పరిగణింపబడిరనియు పురాణములు వచ్చునప్పటికి వారు దేవతలైరనియు, ఇది వీరారాధనపరిణామమును సూచించుచున్నది గావున పురాణము లత్యాధునికములనికొందరు చేసిన వాదమును మేజరుబసు ఖండించి కృష్ణాదుల అవతారవిశేషములును, దేవత్వవిషయములును రామాయణ భారతేతిహాసములకు ముందే ఉపనిషత్తులలో, బ్రాహ్మణములలో, అరణ్యకములలో కలవని ఎత్తిచూపి పురాణములు ప్రాచీనములని నిరూపింప ప్రయత్నించెను.[24] మత్స్యావతారము శతపథబ్రాహ్మణములో,[25] కూర్మావతారము తైత్తిరీయారణ్యక[26] శతపథబ్రాహ్మణములలో[27] వరాహావతారము తైత్తిరీయ సంహితా బ్రాహ్మణములలో[28] శతపథబ్రాహ్మణములలో[29] వామనావతారము ఋక్సంహితా,[28] శతపథ బ్రాహ్మణములలో,[31] భార్గవరామావతారము ఐతరేయ బ్రాహ్మణములో దేవకీ పుత్రుడగు కృష్ణుని అవతారము ఛాందోగ్యోపనిషత్తులో[32] వాసుదేవ శ్రీకృష్ణుని విషయము తైత్తిరీయారణ్యకములో[33], నుండుట నాతడు గుర్తించి తన వాదమున కాధారములు చేసికొనెను[34]

పూర్వమూలము లున్నను అధునాతనపురాణములు బౌద్ధమతధ్వంసమునకే వచ్చినవనియు, శివవిష్ణుదేవత్వ ప్రతిపాదకములగు నివి కేవలమత గ్రంథములనియు సర్ మోనియర్ విలియమ్స్ వ్రాసి అందుచే నవి అర్వాచీనములని ప్రతిపాదించెను.[35] వివిధపరిస్థితులలో వివిధకాలములలో ఇవి రచింపబడినవనియు క్రీ. శ. 8, 9. శ ప్రాంతములలో నుండిన శంకరాచార్యులకు ముందు ఏ పురాణములును ఇప్పటికి రూపమును బహుశః పొందియుండలేదనియు, అంతే కాక వైష్ణవాచార్యులై క్రీ.శ. 12 శ. లో నివసించిన రామానుజాచార్యుని, 13 శ. లోని మధ్వాచార్యుని, 16శ.లోని వల్లభాచార్యుని, బోధనల నివి అనుసరించిన వనియు ఎలిజబెత్ రీడ్ వ్రాసెను.[36]

ఈ విధముగా పురాణకాలమునుగూర్చి అనేక పండితు లనేకాభిప్రాయములను ప్రకటించియున్నారు. ఏదైనను అత్యంత ప్రాచీనకాలముననే వీనిలోని అనేక భాగములు రచింపబడియుండు ననియు, భిన్నకాలములలో అనేకాంశములు వానిలో కలుపబడియుండు ననియు భావించుట సముచితము.

పురాణ విశిష్టత : బహు వివాదాస్పదమైన ఈ పురాణములు సర్వవిద్యలలో గణన కెక్కి, అతి పురాతనములై జగజ్జనీనములైన విషయముల నెన్నో వర్ణించి, అనంత వాఙ్మయమును కాలగర్భములో కలిసిపోకుండ నిలిపినవి. భారత రామాయణములవలె శ్రవణపఠన వ్యవహారయోగ్యమై భరతఖండ మంతట సుహృత్సమ్మితముగా నివి విశ్రుతి వహించినవి. సర్గప్రతిసర్గాది పంచలక్షణోక్త విషయములనే కాక సంహితా బ్రాహ్మణారణ్యకోపనిషత్తులందును, భారత రామాయణము లందును బీజరూపములుగా నున్న అనేక కథల నివి సవిస్తరముగా వర్ణించినవి. వీనిలో లేని శాస్త్రము లేదు. శిల్పము, చిత్రలేఖనము, జ్యోతిషము, వైద్యము, సంగీతము, ధనుర్వేదము మొదలగు అనేక విషయముల నివి వివరించినవి. బహు విశేష సమన్వితమై, ఋషి ప్రోక్తమై సర్వజనారాధ్యమై ఇవి పంచమవేద గౌరవము నందినవి.

భాగవతము :- ఈ విధముగా సర్వజనస్తుతమగు పురాణ వాఙ్మయములో భాగవతమున కొక ప్రత్యేకస్థానము కలదు. ఇతర పురాణముల నన్నింటిని రచించిన పిదప వానియందలి సారమును గ్రహించి వ్యాసుడు భాగవతము రచించినట్లు పద్మపురాణములో కలదు.

శ్లో॥ తత్ర పద్మపురాణం తు ప్రథమం చ ప్రణీతవాన్
తతోఽన్యాని పురాణాని కృత్వా షోడశ తు క్రమాత్
అష్టాదశం భాగవతం సార మాకృష్య సర్వతః
కృతవాన్ భగవాన్ వ్యాసః శుకమధ్యాపయత్ స్వయం

భాగవతముననే తద్గ్రంథోదయమును గూర్చిన ప్రస్తావన గలదు. భారతమువంటి మహాద్భుత గ్రంథము వ్రాసినను వ్యాసునకు సంతృప్తి కలుగక మనసున నేదో వేదన కలిగెను. భారతమున ప్రధానముగా వేదసమ్మతమగు ధర్మబోధనమే కలదు గాని హరికి, యోగివరులకు అభిలషితమైన భాగవత విధము ప్రపంచితము కాలేదు. అదియే ఆతని బాధాకారణము. ఆ సమయమునకు త్రిలోక సంచారియగు నారదుడు వచ్చి వ్యాసుని సందేహమును తీర్చి విష్ణులీలాత్మకమగు భాగవతము రచింప ప్రోత్సహించెను. అంతట వ్యాసుడు భక్తివేదాంత పూరితమగు భాగవత పురాణము రచించి కుమారుడగు శుకునిచే దాని నధ్యయనము చేయించెను. శుకుడు దానిని ముముక్షువగు పరీక్షిత్తునకు బోధించెను. ఆ తరువాత నైమిశారణ్యములో శౌనకాది మహర్షులు సత్రయాగము చేయునపుడు సూతునిచే వారలకిది వినిపింపబడినది.

ఈ భాగవతము విష్ణు వధి దేవతగా కలది. ఇది కాక పరాంబిక అధిదేవతగా కలిగిన దేవీభాగవత మొకటి కలదు. పురాణములలో వ్యాసుని రచనగా ప్రశంసింపబడిన దీ రెంటిలో నేది యను విషయమున పండితులలో చాల చర్చలు బయలుదేరినవి. వైష్ణవ శాక్తేయుల మధ్య మతద్వేషముతో బయలుదేరిన ఈ వాద ఝంఝూమారుతము రెండు శతాబ్దుల క్రిందటనే ఉత్తర హిందూస్థాన మంతయు వ్యాపించినది. దాని వాసన దక్షిణాపథమునకును సోకక పోలేదు. కాశీ నివాసియు దక్షిణాచార ప్రవర్తకుడునైన గదా కాశీనాథభట్టు 'దేవీ భాగవతమే' ప్రమాణము, అదే మహాపురాణముల లోనిది. భాగవత మార్షమే కాదు. అని నిర్ణయించుచు దుర్జనముఖ చపేటికయను గ్రంథమును రచించి భాగవత పక్షవాదులను నిరసించెను. దాని కుపోద్బలముగా భాగవతము వ్యాసునిపేర వోపదేవుడు రచించినది కాని వ్యాసుడు రచించినది కాదను వాదము పుట్టినది. దానిని త్రోసి రాజని భట్టోజీ

దీక్షితుల శిష్యుడగు రామాశ్రయ పండితుడు 'భాగవతము వోపదేవరచితము కాదు. అది ఆర్షమే. దేవీ భాగవత మార్షము కాదు'. అనుచు దుర్జనముఖచపేటికా ఖండన మను గ్రంథము రచించి దేవీ భాగవత పక్షవాదులను ధిక్కరించెను. అంతట మరియొక పండితుడు దానిని ఖండించుచు దేవీభాగవతార్షత్వమును స్థిరపరచుచు దుర్జన ముఖ పద్మపాదుక అను గ్రంథము రచించెను, ఈ విషయమును పురస్కరించుకొనియే భాగవత స్వరూప విషయశంకా నిరాసత్రయోదశ మను పేర పురుషోత్తమ పండితు డొక గ్రంథము వ్రాసెను. మితాక్షర వ్యాఖ్యాతయగు బాలంభట్టు కూడ ఈ భాగవత రచనా విషయమును ప్రస్తావించెను.

పురాణ వాఙ్మయ పరిశోధకులగు పాశ్చాత్యపండితులనేకులు భాగవతమును గూర్చి తమ అభిప్రాయములను ప్రకటించినారు. ఆరువందల సంవత్సరముల క్రింద నివసించిన వ్యాకరణ కర్తయగు వోపదేవునిచే శ్రీభాగవతము రచింపబడినదని అనేక హైందవపండితులు పలుకు అభిప్రాయముతో నేకీభవించుచున్నానని కోల్ బ్రూక్ వ్రాసెను.[37] కల్నల్ వాన్సుకెన్నెడీ ఇది అపరిశీలితాంగీకారమని విమర్శించుచు పురాణములు మొదటినుండియు పదునెనిమిదియే ఉండగా అందులో చేరిన భాగవత మారు శతాబ్దులక్రిందనే వ్రాయబడినచో మిగిలిన పురాణములును అట్లే అర్వాచీనము లని పలుకవలసియుండును. కావున అసంగతమగు ఆ విషయము సత్యదూర మని పలికినాడు.[38] శ్రీధరస్వామి వ్రాసిన "భాగవతన్నామాన్యదిత్యపి నశంకనీయం" అను వాక్యము కొంతవరకు వివాదకారణమైనదనియు ఆ ఆచార్యుని వచనములో శంకాసూచన కలదనియు ప్రొఫెసర్ విల్సన్ అభిప్రాయపడుచున్నాడు[39] ఆతడు కెన్నెడీ అభిప్రాయమునుగూడ ఖండించుచు పదునెనిమిది పురాణములును పూర్వమునుండియే కలవనియు, ఎప్పుడేది సంస్కరింపబడెనో చెప్పుట కష్టమనియు, ప్రతి పురాణములోను పదునెనిమిది పురాణములే కలవు గాని పదునేడు పురాణములను ప్రస్తావించిన దొక్కటియు లేదనియు ఈ పదునెనిమిది పేర్లను తరువాత ప్రతిదానిలోను చేర్చబడి యుండుననియు వీని పూర్వపరచర్చ భాగవతకాల నిర్ణయమునకు బాధకము కాజాలదనియు వ్రాసెను[40] కేవలసంప్రదాయము తప్ప వేరు అభ్యంతరములేమియు లేకుండుట చేతను, పురాణములును భారతమును రచింపబడిన తరువాత భాగవతము రచింపబడుటచే ఇది అష్టాదశ పురాణములలో చేరదనియు, దేవీభాగవతమే మహాపురాణమనియు, భాగవతము

12వ శతాబ్దిలోని బోపదేవుని రచనమనియు విల్సన్ లిఖించియున్నాడు.[41] భగవంతుడగు విష్ణుని మహిమను వర్ణించుట చేతనే భాగవత పురాణమున కాపేరు వచ్చెనని చెప్పుచు, దాని రచనాకాలము మాత్రము 13వ శతాబ్ది ప్రాంతమునకు చెందియుండవచ్చునని మేక్డొనెల్ తన సంస్కృత సాహిత్య చరిత్రలో వ్రాసెను.[42] ఈ పురాణము క్రీ.శ. 9వ శతాబ్దములో రచింపబడినదని – పర్గిటర్ అభిప్రాయ పడుచున్నాడు.[43] ఎలిజబెత్ రీడ్ – కోల్ బ్రూక్ విల్సన్‌ల అభిప్రాయమునే ప్రకటించియున్నాడు.[44] భాగవతకర్త వోపదేవుడే అను విషయము నిశ్చయముగా నిర్ణయింపలేమని థియోడొర్ గోల్డ్‌స్టక్కర్ అభిప్రాయము.[45] మేజర్ బి. డి. బసు విష్ణు భాగవతములో ప్రధానముగా దర్శనముల ననుసరించిన వేదాంత సిద్ధాంతములు కన్పించుననియు, దేవీభాగవతములో దేవీ యజ్ఞాది సందర్భములలో తాంత్రిక కర్మకాండ కన్పించు చున్నదనియు, తంత్రశాస్త్రములు క్రీ.శ. 1వ శతాబ్దమునకు చెందినవని నిస్సంశయముగ నిరూపితమగుటచేతను, పురాణములకంటె ప్రాచీనమైన వగుటచేతను. విష్ణుభాగవతమే ప్రాచీనతరమని ప్రతిపాదించెను.[46] తంత్రశాస్త్రప్రభావముచేతనే రాధాపూజ దేవీభాగవతములో ప్రవేశించియుండునని అతని అభిప్రాయము.[47] విష్ణుభాగవతములో ఈ విధమైన రాధా ప్రశంసలేదు. అందుచే ఇట్టి అనేకాధారములచే కొన్ని భాగములు విష్ణుభాగవతముకంటె ప్రాచీనతరమైనను దేవీ భాగవతము క్రీ.శ. 9. 11 శతాబ్దముల మధ్య ఇప్పటి రూపమును దాల్చియుండునని అతడు వ్రాసియున్నాడు.[48] ఇతడు మరియొక చిత్రమగు అభిప్రాయమును గూడ ప్రకటించి యున్నాడు. అనేకహేతువులచే ప్రాచీనకాలమున భాగవతులచే గౌరవింపబడిన భాగవత మొక్కటియే ఉండినదనియు, బౌద్ధమతప్రభావముచే బ్రాహ్మణ ధర్మము కృశించిన వేళ ఈ ప్రాచీన భాగవతము మృతస్థితికి వచ్చియుండుననియు, తిరిగి బ్రాహ్మణ్యపునరుజ్జీవనము జరిగినపుడు వివిధ శాఖీయులు బలము పుంజుకొని – వైష్ణవులు శ్రీభాగవతమును శాక్తేయులు దేవీ భాగవతమును రచించియుందు రనియు మేజర్ బసు భావించుచున్నాడు.[49] అంతే కాక మంగళచండీ, షష్ఠి మానస మొదలగు దేవతల వృత్తాంతములు దేవీభాగవతములో కన్పించుచుండుటచే ప్రాచీన పురాణముల వరుసలో దీనిని లెక్కించుటకు సందేహము కలుగుచున్నదనియు, ముఖ్యముగా వంగదేశమునుండి ఎన్నో ప్రక్షిప్తము లందుచేరి యుండుననియు అతడు వ్రాయుచున్నాడు.[50] ఈ సందర్భములోనే వై. వి. కొల్హాత్కర్ శ్రీమద్భాగవతాదర్శ మను గ్రంథమును వ్రాసియున్నాడు.

భాగవత కాలమునుగూర్చి చర్చించి క్రీ. శ. 10వ శతాబ్దమని సి. వి. వైద్య, 8వ శతాబ్దమునకు ముందని బి. ఎన్. కృష్ణమూర్తిశర్మ, క్రీ. శ. 550–650, మధ్య యని ఎ. ఎన్. పాయ్, 8వ శతాబ్దమునకు ముందుది కాదని దుర్గాశంకరశాస్త్రి, ఇత్యాది పండితులు వ్రాసియున్నారు. ఎ. డి. రాయ్ భాగవతపురాణకర్తను తమిళ దేశీయుడని నిరూపించుటకు ప్రయత్నించెను. అతడు భాగవతములో గౌడపాద కారికలలోని పదములు, భావములు అట్లే కలవని చూపెను. శ్రీమద్భాగవతముకంటే దేవీభాగవతమే ఇంచుక ప్రాచీనతరమనియు అది 6వ శతాబ్దము నాటిదనియు ఎస్. శ్రీకంఠశాస్త్రి నిరూపించుటకు ప్రయత్నించియున్నాడు, గంగానాథ్‌ఝా పండితుడు శివపురాణములోని వర్ణనము దేవీభాగవతమునకే ఎక్కువగా సరిపోవుచున్న దని వ్రాయుచున్నాడు.[51]

బృహద్ధర్మ పురాణాదులు కొన్ని ఈ రెండింటిని కూడ అష్టాదశపురాణాదు లలో చేర్చియుండుటచే వీని మహాపురాణత్వము చర్చింపపనిలేదనియు, తక్కిన పురాణములవలె ఇవియు ఆర్షములేయని యనుకొన్న సరిపోవుననియు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు సమన్వయించుటకు ప్రయత్నించినారు.[52]

ఇంతవరకు ప్రాచ్యపాశ్చాత్యపండితుల అభిప్రాయము లొసగబడినవి. ఇంక భాగవతార్షత్వ కర్తృత్వములను గూర్చి వివిధపండితులు నొనర్చిన వాద ప్రతివాదముల సారాంశ మీక్రింద నీయబడుచున్నది.

వాదము:– శాస్త్రకర్తలెవ్వరును ఆనంద తీర్థాచార్యుని వరకు భాగవతమును తమగ్రంథములలో నుదాహరింపలేదు. క్రీ. శ. 8వ శ. నాటి శంకరాచార్యులు ప్రధానముగా విష్ణు పురాణమునుండి అనేక శ్లోకముల నుదాహరించెను. ఆ తరువాత వచ్చిన రామానుజాచార్యులును అగ్ని కూర్మాది పురాణములనుండి ఉదాహరణములు గ్రహించిరేగాని భాగవతము నెత్తుకొనలేదు. భాగవత మాధ్వవ్యాఖ్యలో హనుమ దాదులు రచించిన ఎనిమిది వ్యాఖ్యలు చూడబడినవనియు, వానిలో శంకరుని దొక టనియు కలదు. కఠినశైలీయుతమగుటచే పఠనపాఠనములు లేక శంకరవ్యాఖ్య నష్టమైనదట శంకరుడు భాగవతవ్యాఖ్యానము వ్రాసెనను మాట అంగీకార్యముకాదు

శైలీకఠినత నష్టమగుటకు హేతువని చెప్పుట తర్కసహముకాదు హనుమంతుడు వ్యాఖ్యానము వ్రాసెననుటలోనే మాధ్వవ్యాఖ్యానమునందలి అప్రమాణత గోచరించుచున్నది. కాన భాగవతము శంకరపూర్వముకాదు.

ప్రతివాదము :- శైలీకఠినత సంగతి అటుంచి ఈ దేశమున ప్రాచీన కాలమందు గ్రంథములు నష్టమగుట అసహజము కాదు. మన వేద వాఙ్మయమెంతో అట్లు నష్టమైనదని పండితులు గుర్తించి యున్నారు. పురాణభాగము లెన్నో కాలగర్భమున కలిసిన విషయము నందరెరుగుదురు. ఎక్కడనో ప్రాచీనుల సంగతి. మహర్షుల విషయము నటుంచి పరిశీలించినను మహాకవి యగు భాసుని రచనలు గణపతి శాస్త్రిగారు సంపాదించునంతవరకు దొరకనే లేదు కదా. తెలుగుకవి యగు ఎఱ్ఱన వ్రాసిన ఇతర గ్రంథము లన్నియు నుండి రామాయణ మేల నష్టము కావలెను ? దానికి రాజావలంబన లోపము లేదే? నన్నెచోడుని వంటి రాజకవి గ్రంథ మేమైనది ? నిన్న మొన్న గదా బైటపడినది. కాన ఈ దేశమున గ్రంథములీ కారణమున నష్టమైన వని ఎవ్వరును చెప్పజాలరు. ఆచార్య శంకరుల భాగవత వ్యాఖ్యయు అట్లే కాలగర్భమున కలిసిపోయినదని ఏల భావింపరాదు.

పోనిండు ; శంకరులు భాగవతవ్యాఖ్య వ్రాయలేదనుకొందము. ఒక రొకదానికి వ్యాఖ్య వ్రాయనంత మాత్రమున దానిలోని శ్లోకములను తన గ్రంథములలో నుదాహరింపనంత మాత్రమున ఆ గ్రంథ మా వ్యక్తికి ముందు లేదనుట పొరపాటు. శంకరాచార్యు లుదాహరింపని గ్రంథములెల్ల వ్యక్తులెల్ల అంతకుముందు లేనట్లేనా? అట్లు నిష్కర్షగా చెప్పుట తగదు. శంకరులు భాగవత ప్రస్తావన చేయకుండుట దాని పూర్వకాలీనతకు బాధకము కాజాలదు.

వాదము :- క్రీ. శ. 1271 - 1309 నడుమ దేవగిరిని పాలించిన యాదవ వంశీయుడగు రామరాజునకు మహామంత్రి హేమాద్రి. అతని ఆశ్రితుడు వోపదేవుడను విర్వత్కవి. వైష్ణవమత ప్రాబల్య స్థాపనకై హేమాద్రి ప్రేరేపణచే నాతడు విష్ణుభాగవతము రచించి వ్యాసప్రోక్తమని ప్రచారము చేయించెను. తమ మతస్థాపనకై తామే కొన్ని శ్లోకములో, గ్రంథములో వ్రాసి ఋషికృతములనుట ఈ దేశమున క్రొత్తకాదు. అదియునుగాక పై విషయ మన్యుశ్రుతముగా జన

పరంపరలో వినవచ్చుచున్నది. ఈ సందేహ ముండుటచేతనే కాబోలు శ్రీధరులు 'భాగవతం నామాన్యదిత్యపి న శంకనీయమ్' అనినారు.[53] ఇందుచేతనే అన్యద్భాగవతము కలదని ద్యోతతమగు చున్నది.

ప్రతివాదము :- శ్రీధరుల వాక్యమున కా అర్థము వచ్చుననుట కాధారము లేదు. ఒకవేళ వచ్చినను ఆయన లోక ప్రవాదములను విని సిద్ధాంతరూపముగా ఆ వాక్యము చెప్పియుండవచ్చును.

ఇక వోపదేవుడు భాగవత కర్తకాడు. అతడు భాగవతాధ్యాయసారము, భక్తిము క్తాఫలము, భక్తిలహరి, అను మూడు గ్రంథములు రచించెను. అందు మొదటి దానిని మంత్రి హేమాద్రి తుష్టికై భాగవత కథానుక్రమణికా ప్రతిపాదకముగా అతిసంగ్రహరీతి రచించెను.[54] అతని భక్తి ముక్తాఫలము భాగవతములోని కొన్ని భక్తిశ్లోకముల సంకలనము వోపదేవుడే దానికి కైవల్యదీపిక యను వ్యాఖ్యానమును రచించి హేమాద్రి పేరు పెట్టెను.[55] ఆ గ్రంథాంతమున శ్రీమద్భాగవతము ద్వావింశతివార మధీతమైనదని పలికి తన్మాహాత్మ్యవర్ణన పూర్వకముగా వేదవ్యాసస్తుతి నాతడు కావించెను. అతడు తన గ్రంథములో చేర్చుకొన్న భాగవత శ్లోకములు చూచి భాగవతమంతయు అతడే రచించెనని కొందరు భ్రాంతి నొందిరి, తరువాత దానిని పెంపొందించుటకు మత వైషమ్యము మూలమైనది.

వాదము :- భారతములో అత్యంత సరళమగు శైలి కలదు. భాగవతములో నట్లు కాక మిక్కిలి ప్రౌఢమగు బంధము కలదు భారతములో పురాణ సహజమగు అనుష్టుప్ ఛందమే తరచుగా వాడబడుచుండును. భాగవతములో ఛందోవైవిధ్య మెక్కువ. కావ్యములలో వలె వివిధ వృత్తప్రయోగ మధికముగా కన్పట్టును. భారతము ప్రధానముగా కథా కథనాత్మక పద్ధతి ననుసరింపగా భాగవతము వర్ణనాత్మక మార్గము ననుసరించి యున్నది. భారతములో ద్రాక్షాపాక, కైశికీవృత్తులనుసరింపబడగా, భాగవతములో నారికేళపా కారభటీ వృత్త్యాదు లనుసరింపబడినవి. ప్రత్యక్షమగు ఈ పరస్పర వైధర్మ్యమును పరికించినయెడల రెండు గ్రంథములును భిన్న కర్తృకములని చెప్పక తప్పదు. భారతము వ్యాసకృతమనుట సర్వాంగీకృతము కావున భాగవత మట్లు కాజాలదు.

ప్రతివాదము :— అనేక శతాబ్దముల క్రింద మహర్షులచే రచితములైన గ్రంథముల కర్తృత్వము నిర్ణయించుటకు శైలీప్రమాణ మెంతవరకు పనికివచ్చు ననుట సందేహాస్పదము. అసామాన్యమగు ప్రజ్ఞావిశేషము కల వ్యాసుడు అవసర మునుబట్టి, ఔచిత్యమునుబట్టి, అధికారి తారతమ్యమునుబట్టి భిన్నశైలీ విశేషముల ప్రయోగించి యుండును. అది ఆయన అఖండశక్తికి నిదర్శనము.

ఆ మహర్షి ఋషులకొఱకై వేదము విభజించెను. వేదార్థ నిర్ణయము కష్టము కాన తత్సౌలభ్యమునకై ఆయన శిక్షాదికమును రచించెను. అది అర్థబోధకై వ్రాసి నదికాన దాని శైలి అత్యంత సరళమైనది. అటులే ఆ మహర్షి రచించిన బ్రహ్మ సూత్రములు కఠినశైలీయుతము లైనవి. అందు ఒక చిన్నసూత్రములో మహార్థ మిమిడియుండును. గురుసాహాయ్యమున మాత్రమే విద్వాంసులు దాని నెరుగగలరు. బ్రహ్మజ్ఞాన మార్గమున గురువెల్లును అవసరమే కావున దాని క్లిష్టత, గూఢార్థ కల్ప నము సంస్కృత భాషాసూత్రనిర్మాణ మహాపద్ధతికి తలమానికమై సార్థకమైనది. దాని కట్టి గంభీర దుర్గమశైలి అవసరమని భావించెను కాబోలును వ్యాసు డా విధ ముగా రచించెను. అదే విధముగా భారతమల్ప మేధసులగు సామాన్యులకొరకుద్దిష్టము. మరి దాని శైలి సరళముగా, సులభముగా సుబోధకముగా నుండి తీరవల యును ఏలన గ్రహీతల అధికార మట్టిది. బ్రహ్మసూత్రముల శైలి దీని కనవ సరము. దాని క్లిష్టత దీని కాపాదింపరాదు. కావున భారతశైలి ఆ పద్ధతి నొందినది.

మరి భాగవతరచన వేరు. భారతము పామరులకైన భాగవతము తత్త్వాన్వే షులకు. భారతరచన ధర్మస్థాపనార్థమైన, భాగవతరచన భక్తిస్థాపనార్థము. ధర్మ బోధలో సూటిగా నిశితముగా, స్పష్టముగా చెప్పవలసిన అవసరమున్నది. దానికి లలితశైలియే ఉపయోగించి తీరవలయును. భాగవత మట్టిదికాదు. అది భగవద్వర్ణ నాత్మకము, భక్తి ప్రబోధకము. వేదాంతరహస్య ప్రవర్తకము. కవితాశిల్ప నిర్మాణములోనే ఈ శైలీభేద విషయమున నొక రహస్యమున్నది. కేవల కథాగమ నము ధర్మ ప్రబోధము మొదలగువాని సందర్భమున నుపయోగించు శైలి ఎప్పు డును సుకుమారముగా నుండును. వర్ణన సందర్భమున ప్రౌఢశైలి దానంతటది వచ్చును. భాగవతములోని కథలన్నియు వర్ణనాత్మకములు. విష్ణుమహిమ ప్రతి పాదకములు. అట్టి సందర్భమున ప్రౌఢతరశైలి నుపయోగించుట అసహజము కాదు. అంతేకాదు. సర్వోపనిష ద్రహస్య ప్రతిపాదకములగు ఘట్టము లనేకములు భాగవత

మున కలదు. అట్టిచోట్ల బ్రహ్మ సూత్రాదులలోవలె కొంతగూఢత, క్లిష్టత తప్పదు. సమయమునుబట్టి, స్థానమునుబట్టి, బోధ్యబోధకులనుబట్టి వచోవైఖరి మారుచుండును. భాగవతములోని భారతభిన్నశైలి యందలి విశేషమిది. దీని నాధారముగా చేసికొని భారత, భాగవతకర్తలు వేరనుట పొరపాటు.

వాదము :- మత్స్యపురాణమున భాగవతమును గూర్చి ఇట్లు చెప్ప బడినది.

శ్లో॥ యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః
వృత్రాసురవధోపేతం తద్భాగవత మిష్యతే
లిఖిత్వా తచ్చ యో దద్యాత్ హేమసింహాసమన్వితం
ప్రోష్ఠపద్యాం పౌర్ణమాస్యాం స యాతి పరమం పదం.

దీని ననుసరించి ప్రోష్ఠపదానక్షత్రమున పూర్ణిమయందు స్వర్ణ సింహముపై భాగవతలిఖితప్రతినుంచి దానముచేసిన పుణ్యము కలుగును. సింహము దేవీవాహనము కావున ఇక్కడి దానవస్తువు దేవీభాగవతమై యుండవలయును. కొందరు విష్ణువుయొక్క నరసింహరూపమున సింహచిహ్న ముండుటచే పై శ్లోకము విష్ణుభాగవతపరమే అనుచున్నారు. అదితప్పు. నరసింహావతారమున సింహము శిరస్సు. భాగవతమున ప్రతిపాద్యుడు విష్ణువు. ప్రతిపాద్యుని శిరస్సుపై ప్రతిపాదక మెక్కుట అనుచితము. కాన పై శ్లోకములోని సింహము విష్ణుచిహ్నము కాజాలదు. అందుచే మత్స్యపురాణోక్తి దేవీభాగవత ప్రస్తావకము.

ప్రతివాదము :- భాగవత లిఖితప్రతుల ప్రచారమునకై పైశ్లోకము నిర్మింపబడియుండునని తోచుచున్నది. లోకమున సింహాసనమెక్కుట ఒకచక్రవర్తి గౌరవము. సింహము పరాక్రమముగల జంతువగుటచే రాజులా చిహ్నము గ్రహించి యుందురు. భాగవతముపై భక్తిగల మత్స్యపురాణము దానమిచ్చునప్పుడు పుస్తకముతోపాటు విలువగల దక్షిణయుండుట యుచితమని భావించి స్వర్ణముతోచేసిన సింహముపై ఆరోపితము చేసి ఇమ్మనినది. అందు సింహము గౌరవార్థము. స్వర్ణము దక్షిణార్థము. ఈ సింహము వైష్ణవ, శాక్తేయుల మధ్య కలహమునకు లోనైనది.

దీనిని శాస్త్రీయదృష్టితో పరిశీలించిన - దానముచేయు భాగవతము స్వర్ణసింహ సమన్వితమై యుండవలయును. అనగా ఆ సింహ మొక విగ్రహరూపము. దాని నిర్మాణము, లక్షణములు, దానవిధులు, కర్మకాండకు సంబంధించినవి. ఇవి ఆగమములలో నుండును. కావున నిచ్చట ఆగమశాస్త్రములు ప్రమాణములు. వానిలో నారాయణునకు సింహవాహనముకూడ నున్నట్లు చెప్పబడినది. చూడుడు-

భృగుప్రోక్తే వైఖానసే దైవికయజ్ఞాధి కారస్థోత్సవ పటలే - సూత్రం - అథ విష్ణోర్వాహనాని వ్యాఖ్యాస్యామః- ప్రథమే హంసో. ద్వితీయే సింహః, తృతీయే హ్యాంజనేయః, చతుర్థేఫణీంద్రః, పంచమే వైనతేయః, షష్ఠే దంతావళః, సప్తమే రథః, అష్టమే తురంగమః, నవమే శిబికాః, దశమే పుష్పకం - తథైవ అత్రిప్రోక్తకారికాగ్రంథే పాంచరాత్రాద్యాగమేషు చ.

అదియునుగాక హేమాద్రిరుద్రయామళప్రభృతి గ్రంథములలో వివిధదాన సమయముల ఒకే దేవతకు భిన్న వాహనములు, భిన్నాయుధములు ఉండునట్లు చెప్పబడినది. కావున గరుడునివలెనే సింహమును ఇచ్చట విష్ణుచిహ్నమే.

ఈ సింహవిషయికచర్చ వదలి మిగిలినదాని ననుసరించి మత్స్యపురాణవర్ణన దేనికి సరిపోవునో పరిశీలించుట ఉచిత తరముగా నుండును. ఈదాన సందర్భములోనిదే మరియొక విభాగము కలదు. అది దానకాల ప్రతిపాదనమునకు సంబంధించినది. ప్రోష్ఠపదానక్షత్రమున పూర్ణిమయందు భాగవతము దానముచేయవలెననిగదా పురాణ వచనము. ఆరోజులందు దేవీసంబంధమగు దానములుచేయవలె ననిగాని, దానఫల మిట్లుండు ననిగాని, అవి దేవీసంబంధమగు పుణ్యదినము లనిగాని. ప్రత్యేకారాధనా సమయములనిగాని ఏ పురాణాగమతంత్రములలోను లేదు. అందుకు ప్రతిగా ఆదినములు శివవిష్ణు ప్రీతికరములని కంఠోక్తిగా చెప్పబడుటేగాక ఆయా దేవాలయములందు సుప్రసిద్ధముగా సాంప్రదాయకముగా ఆయారోజులలో ఉత్సవములు చేయబడుచున్నవి. అవి హరిహరప్రీతికరములగు దివసములగుటచే అప్పుడు చేసిన దాన మధికఫలదాయకమగు ననుటలో సందేహము లేదు. పూర్ణిమ కధిపతి మహేశ్వరుడు. ప్రోష్ఠపదా నక్షత్రమునకు అధిదేవుడు అహిర్బుధ్న్యుడు. పూర్ణిమ శ్రాద్ధవిశేషకర్మకు విహితము. శ్రాద్ధదేవుడు విష్ణువు. హయగ్రీవోపనిషత్తులో పూర్ణిమయందు హయగ్రీవుని జపించిన వ్యక్తి మహానుభావు డగునని చెప్పబడినది. ఈ విషయములను పరిశీలించిన ప్రోష్ఠపదాపూర్ణిమా కాలమున స్వర్ణసింహారోపిత

భాగవతదానము విష్ణుభాగవతపరమేకాని దేవీభాగవతపరముకాదని తెలును. కావున మత్స్యపురాణమున ప్రసక్తమైనది. విష్ణుభాగవతమే.

**వాదము :** భాగవతమునుగూర్చి స్కాందపురాణమున నిట్లున్నది.

శ్లో॥ హయగ్రీవబ్రహ్మవిద్యా యత్రవృత్రవధ స్తథా
గాయత్ర్యాచ సమారంభః తద్వై భాగవతం విదుః

భాగవతమును హయగ్రీవబ్రహ్మవిద్య యనుట సుప్రసిద్ధము. హయగ్రీవావతారకథ దేవీభాగవతముననే[56] కలదు. విష్ణుభాగవతమున లేదు. దేవీప్రసాదమున వచ్చిన ఆఅవతారమునకు వినష్టనిఖిలమహావిద్యానామక శ్రీవిద్యోద్ధరణమే ఏకైకప్రయోజనము. ఆయుద్ధరించిన శ్రీవిద్యను హయగ్రీవు డగస్త్యున కుపదేశించెను[57]. ఆయుపదిష్టవిద్య హయగ్రీవబ్రహ్మవిద్యయని శాక్తేయులలో విశ్రుతము. కావున స్కాందపురాణోక్తి దేవీభాగవతపరమే.

ప్రతివాదము :- హయగ్రీవావతారము విష్ణువు తానై కల్పించుకొన్నదని హయగ్రీవతంత్రమున స్పష్టముగా కలదు[58]. అదిదేవీప్రసాదకారణము కాదు. ప్రళయకాలమున నష్టమైన వేదాదిశాస్త్రవిద్యలను హయగ్రీవు డుద్ధరించెను. అందుచే వానికిహయగ్రీవబ్రహ్మవిద్యయను పేరు వచ్చినది. బ్రహ్మవిద్యయనగా వేదాది విద్యలేకాని శ్రీవిద్య యను నర్థము లేదు. 'శతే పంచాశ న్న్యాయేన' శ్రీవిద్యయు వేదవిద్యలం దంతర్భాగ మనిన అభ్యంతరము లేదు. కాని బ్రహ్మవిద్య యనిన శ్రీవిద్యయని మాత్రము కాదు. కావున స్కాందపురాణోక్తి బ్రహ్మవిద్యాబోధకమగు విష్ణుభాగవతమునకే చెల్లును కాని శ్రీవిద్యాబోధకమగు దేవీభాగవతమునకు చెల్లదు. భాగవతము బ్రహ్మసూత్రార్థమని చెప్పిన గరుడపురాణోక్తియు దీనినే సమర్థించుచున్నది[59]. భాగవతారంభశ్లోకమున 'జన్మాద్యస్యయతః' అను బ్రహ్మసూత్రముండుట గమనార్హము. అదియునుగాక పై స్కాందపురాణోక్తిలోను ఇతరమత్స్యాది పురాణశ్లోకములలోను భాగవతము వృత్రవధాత్మకమని కలదు. అది నిస్సందేహముగా పై పురాణవర్ణనలు విష్ణుభాగవతపరమని తెలియపరచును.

ఈవాదప్రతివాదములను[60] పరిశీలింపగా అష్టాదశ పురాణములలో నొకటిగా వ్యాసునిచే రచింపబడినది విష్ణుభాగవతమే యని నిస్సందేహముగా నిర్ధారణ మగుచున్నది. భారతీయతాత్త్వికదృక్పథమునకు మూల భూతములగు జ్ఞానకర్మభక్తియోగ

ములు మూడింటిని స్థాపించుటకై వ్యాసుడు బ్రహ్మసూత్రభారతభాగవతములు రచించెను లోకములో సామాన్యముగా రామాయణ మనిన వాల్మీకిరామాయణమన్నట్లే, సహస్రనామము లనిన విష్ణుసహస్ర నామములనినట్లే నిరుపపదముగా భాగవతమనిన విష్ణుభాగవతమనియే అర్థమురూఢమై యున్నది. ఇక దేవీభాగవతమునెవరు వ్రాసినను అదిభాగవతమునకు ప్రతిగా తదనంతరకాలమున రచింపబడినదని దాని పేరే నిరూపించుచున్నది. అష్టాదశపురాణములలో దేవిపరముగా నొక పురాణము రచింపబడినయెడినయెడల దానికి దేవీపురాణమని పేరుండవలెను. కాని దేవీభాగవతమని పేరుండవలసిన అవసరము లేదు. గాయత్రీసమారంభము, వృత్రవధ, బ్రహ్మవిద్య కల భాగవతమును జూచి దానివలెనే గాయత్రీ సమారంభము: వృత్రవధకు బదులుగా శుంభవధ: బ్రహ్మవిద్యకు బదులుగా శ్రీవిద్య: ఉండునట్లు దేవీభాగవతము నిర్మింపబడియుండును. అందుచేతనే రెండును ద్వాదశస్కంధ – అష్టాదశసాహస్ర శ్లోకయుతములుగా కన్పట్టుచున్నవి.

ఇంతవరకును అష్టాదశపురాణములలోనిది కాదనియే కాని దేవీభాగవత మార్ష వాక్కు కాదని పలుకబోవుటలేదు. నిస్సంశయముగా అదియును నొక భక్తిప్రబోధక మగు నార్షగ్రంథము. ఏది ఎట్లున్నను భారతీయుల కత్యంత పూజ్యములును ప్రియతమములును నగు రామాయణభారతభాగవతములలో రామాయణ మాదర్శమానవ జీవితమును ప్రదర్శింపగా, భారతము కర్మవీరుల చారిత్రము పలికినది. ఇక భాగవతమో ; మానవత్వమునుండి దివ్యత్వమునకు పయనించు మహాభక్తుల భక్తిభావావేశరసస్ఫురణము నందించి ప్రజాజీవనమున కత్యంత సన్నిహితమైనది. మహనీయ మగు వ్యాసవాణి ఆవిధముగా మానవజీవిత తరణోపాయము సూచించినది.

భాగవతము వ్యాసకృతము కాదని తలంచువారు కొంద రుండవచ్చును కాని సంస్కృతభాగవతమునకు సంబంధించిన కర్తృత్వాది విషయములు, వివిధచర్చలు, ప్రస్తుత పరిశోధనారంగములోని కెక్కవు, సంస్కృతభాగవతము ననువదింపబూనిన పోతనామాత్యుడు దానిని వ్యాసకృతముగానే సంభావించుట జరిగినది. అప్రస్తావన కనుగుణముగా, ఆదృష్టితోనే సంస్కృతమున పురాణవాఙ్మయమును, భాగవత ప్రశస్తియు నానుషంగికముగా వివరింపబడినవి.

---

# 2. ఆంధ్ర మహా భాగవతము

## 1. అవతరణిక పూర్వరంగము

సంస్కృతములో సుప్రసిద్ధమైన భాగవత పురాణమును తెనుగులోని కనువదించినవాడు పోతనామాత్యుడు. ఈ కవి దేశకాలములను గూర్చి విమర్శకుల మధ్య ఎన్నో వాదప్రతివాదములు జరిగినవి.

నివాసము :- భాగవతములో పోతన యింటిపేరు బమ్మెర అని కనిపించుచున్నది.[1] ఏకశిలానగరమున అతడీ గ్రంథమును రచించినట్లు చెప్పుకొన్నాడు.[2] పురాణం హయగ్రీవశాస్త్రిగారు, వావిలికొలను సుబ్బారావుగారు మొదలగుపండితులు ఏకశిలానగరమనిన కడప జిల్లాలోని ఒంటిమిట్టఅని వాదించి పోతన అక్కడివాడని నిరూపింపప్రయత్నించిరి.[3] శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు, శేషాద్రిరమణ కవులు, మొదలగు విద్వాంసులు ఏకశిలానగర మనిన ఓరుగల్లనువిషయమును సహేతుకముగా నిర్ధారించి పరిష్కరించిరి.[4] ఇప్పుడు దానిని గూర్చి యెట్టి వివాదమును లేదు. పోతన స్వగ్రామము వరంగల్ జిల్లా జనగామతాలూకా - బమ్మెర - యని అనుములసుబ్రహ్మణ్యశాస్త్రిగారు స్థాపించినారు.[5] భాగవతములోని యితరరచయితలగు సింగన నారయల యింటిపేర్లు ఏర్చూరి,[6] వెలిగందల [7] ఈ రెండును ఏకశిలా మండలములోని గ్రామములే. పోతన తెలంగాణమువాడే యనియు, ఆయన ఓరుగల్లు నివాసియనియు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విస్పష్టముగా వ్రాసియున్నారు.[8]

కాలము :- పోతన కాలము మిక్కిలి వివాదాస్పదమైన దనియు, అది యీనాటి వరకును సునిశ్చితము కాదనియే మా యభిప్రాయమనియు అకాడమీ భాగవత పీఠికాకారులు వ్రాసియున్నారు.[9] కొందరు పండితుల అభిప్రాయము లీ సందర్భమున నొసగబడుచున్నవి.

వీరేశలింగం పంతులుగారు[10] - క్రీ.శ. 1400-1470 మధ్య

రాయదుర్గం నరసయ్యశాస్త్రిగారు[11] - క్రీ.శ 15శ. ప్రథమార్థము

వంగూరి సుబ్బారావుగారు[12] - క్రీ.శ. 1480-1520.

శేషాద్రిరమణకవులు[13] - క్రీ.శ. 1372 ప్రాంతము జననము.

చాగంటి శేషయ్యగారు[14] క్రీ.శ. 1450–1508/1509.

అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు[15] – క్రీ.శ. 1410 – 1470

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు[16] – క్రీ.శ. 15శ. ఉత్తరార్థము.

నిడుదవోలు వేంకటరావుగారు[17] – క్రీ.శ. 1400 – 1470.

కాలనిర్ణయము చేయుటకు వివిధపండితులు గ్రహించిన ఆధారములు :—

1. పోతన శ్రీనాథులు బావమరదులని అనుశ్రుతముగా కథలున్నవి. వానినిసవిమర్శముగా పరిశీలించి ప్రమాణరహితములని విమర్శకులు త్రోసిపుచ్చియున్నారు. పోతన ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. శ్రీనాథుడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. పాకనాటి నియోగులకు, ఆరువేల నియోగులకు ఇటీవలి కాలమున కూడ సంబంధములు లేవు. కాని ఇందుకు బాధకముగా శ్రీనాథుని బావమరది ననిచెప్పుకొన్న దగ్గుపల్లి దుగ్గన ఆరువేల నియోగిగా కన్పట్టుచున్నాడు. శ్రీనాథుని బాంధవుడగు అన్నామాత్యుని యింటిపేరిటివారు – బెండపూడివారు – నేడు లింగధారులు. కాన ఈ శాఖా సంబంధముల విషయము కొంత వివాదయుతము. ఏదైనను రాకపోకల కానుకూల్యములు విశేషముగా నేర్పడిన యీనాడే మధ్యాంధ్రదేశీయులు తెలంగాణావారితో వియ్యమందుట అరుదుగా కనబడుచున్నప్పు డాకాలములో కొండవీటి వాడైన శ్రీనాథుడు వైవాహిక సంబంధమువలన పోతనకు బావమరది యయ్యెననుట సందేహాస్పదము. ఈ బంధుత్వగాథ వట్టి పుక్కిట పురాణమని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వంటి పండితులు[18] త్రోసివేసినారు.

2. పోతన ప్రపౌత్రులైన కేసకవి మల్లకవులు దాక్షాయణీ పరిణయమను కావ్యము రచించి దానిని గురజాల చినమల్లన సోమయాజికి అంకితమిచ్చిరి. ఈకృతిభర్త ప్రపౌత్రుడైన పార్వతీశ్వరుని కొడుకు పేరమంత్రికి పోడూరి పెదరామామాత్యుడు ధాత అశ్వయుజ బహుళ దశమీ సోమవారమునాడు పై కావ్యము ప్రతి వ్రాసియిచ్చెను.[19] దానితేదీ క్రీ.శ. 1756 అక్టోబరు 18. ఈ తారీఖునుండి దాక్షాయణీ పరిణయ కృతిభర్త కాలము నాటికిని, అక్కడినుండి పోతన కాలము నాటికిని తరములు వెనుకకు లెక్కించుకొనుచు పోయిన పోతనకాలము నూహింపవచ్చును. వీరేశలింగము పంతులుగారు తరమునకు 40 సంవత్సరములు లెక్కింపగా చాగంటి శేషయ్యగారు 30 లేక 33 లెక్కింపవలసియుండు ననిరి.[20] మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 25

లేక 30 లెక్కించిరి.[21] వీరేశలింగముగారు పోతనకాలము 15శ. ప్రథమపూర్వ భాగమనగా మిగిలినవారు ఉత్తరార్థ మనిరి.

3. రావుసింగభూపాలుని కొరకై పోతన భోగినీదండకమును రచించెను. అందారాజు కుమారాన్నపోతావనీనాథ సూను డనియు, పోచమాంబా లసద్గర్భసంజాతు డనియు, రావుసింగక్షమానాథ పౌత్రు డనియు సమీచీన రేచర్ల గోత్రాంబుజాతత్వ మిత్రు డనియు, వసంతావనీనాథ సంసేవితాంచత్పదాంభోజు డనియు సర్వజ్ఞసింగోర్వ రాధ్యక్షుడనియు వర్ణింపబడినాడు. రాచకొండ పరిపాలించిన రేచర్లవంశజులలో రావు సింగనామము ముగ్గురికున్నది. వారి వంశమిది. మొదటి సింగమనాయకుని కుమారు డనపోతమాదానాయకుడు. అతని కుమారుడు కుమార సింగభూపాలుడు. ఇత డన్న మాంబా పుత్రుడు. రసార్ణవ సుధాకర గ్రంథకర్త. ఇతని కుమారు డనపోత భూపా లుడు. ఇతని పుత్రుడు రావు సింగభూపాలుడు. పోతన వర్ణించినది పోచమాంబా కుమారుడగు సర్వజ్ఞసింగభూపాలుని. మొదటి సింగభూపాలునకు సర్వజ్ఞబిరుదము లేకపోవుట చేతను, సర్వజ్ఞబిరుద మున్న మిగత యిద్దరిలో చివరి వానికి మాత్రమే పోతన యిచ్చిన తల్లిపేరు సరిపోవుటచేతను, భోగినీదండకము ముమ్మడి సింగ భూపాలుని కొరకే వ్రాయబడినది

వసంతావనీనాథుడను బిరుదు రెడ్డిరాజులలో అనవేమారెడ్డికిని, అనపోతారెడ్డి కుమారుడగు కుమారగిరి రెడ్డికిని కలదు గాని, ఆ రెడ్డిరాజులు సింగమనాయని పదాం బుజములను సేవించువా రనుట కెట్టి ఆధారములును లేవు గాన, అతడు రెండవ సర్వ జ్ఞుని సోదరుడై యుండునని చాగంటి శేషయ్యగా రూహించియున్నారు.[22] ఈ ముమ్మడి సింగభూపాలుని కాలము క్రీ.శ. 1430–1475 అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నిర్ణయించి యున్నారు.[23] ఆ రాజుకొరకై భోగినీదండకము వ్రాసినపోతన ఆ కాలమువాడై యుండును.

4. శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకా గుండ్లపాలెం శాసనములు రెంటిననుసరించి 23–10–1438 నాటికే భాగవత రచన పరిసమాప్తమై దూరదేశములలో సైతము కంఠస్థమై ప్రచారమందున్నట్లు స్పష్టపడు చున్నదని వ్రాసినారు.[24] ఈ శాసనములు మొదట వేయింపబడినవి కాక ఉద్ధరింప బడినవి. ఇందలి సంవత్సరము సందేహాస్పదమని బట్టరువత్తుగారు నెల్లూరు శాస నములసంపుటములలో గుర్తించిన విషయమును శ్రీ వంగూరుసుబ్బారావుగారు

గ్రహించి యున్నారు.[35] పై రెండు శాసనములలో చెప్పబడిన ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమును, కాటమరాజు యుద్ధము కాలమును దోషయుతములు. కావున భాగవత రచనా కాలమందు సరిగా చెప్పబడెనని అంగీకరింపజాలము.

పై విషయము లన్నియు పరిశీలించి చూచిన యెడల ఇప్పటి కాధారములు లభించి నంతవరకు పోతన క్రీ.శ. 15శ. ఉత్తరార్ధమునకు చెందినవా డని భావించుట సముచితము.(అకాడమీ భాగవత పీఠికాకారులును నిదే యభిప్రాయమును ప్రకటించి యున్నారు[36].) ఏలన వివాదాస్పదమగు కాలములను నిర్ణయింపవలసి వచ్చినప్పుడు తరములను లెక్కించుపద్ధతి ప్రధానాధారము కాజాలదు కావున పోతనకాలము నిర్ణయించుట కున్నంతలో సింగభూపాలుని కాలమే నిర్వివాదమగు నాధారము. సింగభూపాలుని కాలమును మల్లంపల్లివారు పరిష్కరించుటచే-ఆ రాజు సమకాలికుడును, ఆయన కోరికపై భోగినీదండకమును వ్రాసినవాడును అగు పోతన అప్పటివాడై యుండవలెను. భోగినీ దండక రచన నాటికి పోతన యువకుడై యుండునని విద్వాంసు లెల్లరును భావించు చున్నారు. భాగవత రచనాకాలమునాటికి పోతన అత్యంత పరిణతవయస్కుడై యుండునని ఊహించుట సమంజసము. భాగవతమున నాతడు ప్రదర్శించిన భావనా ప్రసార మిందుకు బలవత్తరమగు సాక్ష్యము నొసంగగలదు. కావున పోతన 15శ. ఉత్తరార్ధముననే భాగవతరచన కావించియుండవలెను.

ఇక పోతన భాగవతము రచించునాటి దేశకాలపరిస్థితులెట్టివో ఎట్టి మత రాజకీయ సాంఘిక సారస్వత పూర్వరంగము భాగవతమునకు కలదో పరిశీలించుట ఆ గ్రంథోదయ సందర్భవిశేషములను ప్రకటితము చేయగలదు.

రాజకీయపరిస్థితులు :- ఓరుగల్లు పతనము పిదప కాకతీయ సామ్రాజ్య మొక మహాసంక్షోభమునకు గురియైనది. దాదాపు దక్షిణాపథమంతయు ఘోరదుర్దశావశ మైనది. తరువాత కొన్ని దశాబ్దములకు తెలుగుదేశమున స్వాతంత్ర్య వాయువులు వీచినవిగాని, దాని అఖండత నిలబడలేదు. ఈ మహాంధ్రక్షోణి విజయనగరప్రభువులు కొంత, కొండవీటిరెడ్లు కొంత, రాచకొండ వెలమలు కొంత, గజపతులుకొంత పంచుకొనుటచే రాజకీయముగా నాల్గు ముక్కలైనది. ఈనలుగురిలోను ఒకరికొకరికి పడదు. వీరిమధ్య నిరంతర పోరాటములు. ఈ యదను నాధారముచేసికొని బహ్మనీ రాజ్యము వీలయిన భాగ మెల్ల దక్కించుకొన్నది.

హిందూరాజులలో విజయనగరమును స్థాపించినది ప్రతాపరుద్రుని పరివారము లోని హరిహరబుక్కరాయలను నిద్దరన్నదమ్ములు. మహమ్మదీయులచే బలవంత ముగా మతాంతరీకరణము నొందిన వారిని శృంగేరీ పీఠాధిపతియగు విద్యాశంకర భారతీస్వామి రక్షించి మరల హిందూత్వదీక్ష నొసగెను. వారి శిష్యుడును, అఖండ ప్రజ్ఞాసమన్వితుడును ప్రథమమున మాధవాచార్య నామముకలవాడును, అనంతర కాల మున శృంగేరీ పీఠాధిపతియు నైన విద్యారణ్యస్వామి హరిహర బుక్కరాయలకు చేయూతయయ్యెను. ఆ మహాతపస్వి అనుగ్రహముతో ఆ సోదరులు విజయనగరమున హిందూసామ్రాజ్యము స్థాపించిరి. మాధవ విద్యారణ్యుల సోదరుడగు సాయనుడు వేదభాష్యాదులు రచించి ధర్మప్రచారమునకు తోడ్పడెను. అనిధముగా మహమ్మదీయ మహాప్రవాహమున కానకట్టయై సాంస్కృతికముగా రాజకీయముగా నెదురొడ్డి నిలిచిన ఆ విజయనగరరాజుల వంశములోని ప్రౌఢదేవరాయలును, మల్లికార్జునరాయలును పోతనకు సమకాలికులు. తన ఆస్థానపండితుడగు డిండిమభట్టును వాదములో నోడించి ఆతని కంచుఢక్కను పగులగొట్టించిన శ్రీనాథునకు కనకాభిషేకము చేసిన దీప్రౌఢ దేవరాయలే. పోతనామాత్యుని కాలమున పరిపాలించిన యితరరాజులు బహ్మనీ రాజ్యమున అహ్మద్‌షా, అల్లాఉద్దీన్‌షాలును, కళింగదేశమున కపిలేశ్వర గజపతి, రాచకొండలో కుమారాన్నపోత ముమ్మడిసింగమ నాయకులు. దేవరకొండలో లింగమనీడు.

ఈ ముమ్మడి సింగమనాయకుని కాలమున కించుక పూర్వమునుండియే బీదర్ రాజధానిగా పరిపాలించుచుండిన బహ్మనీసుల్తానులకును, రాచకొండ దుర్గాధిపతులకును వైరానలము ప్రజ్వరిల్లినది. అహ్మద్‌షా రాజ్యకాలము చివర తెలంగాణముపై మహమ్మదీయులు దండెత్తి రాచకొండ రాజ్యాధిపతుల కోటలను కొన్నింటిని పట్టు కొనిరి. అహ్మద్‌షా అనంతరము బహ్మనీసుల్తానులకును, రాచకొండ రాజ్యాధిపతు లకును, ఎన్నో యుద్ధములు జరిగినవి. వానితో తెలంగాణము నిప్పులపుంత యైనది. రాచకొండ దుర్గాధిపతులు కటకము గజపతుల సాహాయ్యముతో మరల ఓరుగల్లు భువనగిరి మొదలైన దుర్గములను గెలుచుకొనిరి. ఐనను శాశ్వతముగా నీదుర్గములు రేచెర్ల ప్రభువుల అధికారముక్రింద నిలువలేదు చివరకు క్రీ.శ. 1474 నాటికి తెలంగాణమున రాచకొండ దేవరకొండ ప్రభువుల రాజ్య మంతరించినది. రెండవ మహమ్మద్‌షా రాజ్యకాలమున నది పూర్తిగా నాతని యధికారములోనికి పోయినది. ఈబహ్మనీ రాచకొండప్రభువుల యుద్ధమున తెలంగాణమున శాంతిభద్రతలు నశించి

నవి. ఈ సంక్షోభకాలమున పోతన ఓరుగల్లులో నుండియుండునని చరిత్రనుబట్టి ఊహింపవలసి యున్నది.

మతపరిస్థితులు :- కాకతీయుల కాలమునాటికే తెలుగుదేశమున బౌద్ధమత మించుమించుగా నామావశిష్టమయ్యెను. కానీ తత్సహోదర మగు జైనమతము మిక్కిలి ప్రబలముగా నుండెను. శంకరాచార్యులకు ముందుకాలముననే ఆంధ్రుడగు కుమారిల భట్టు జైనమత నాశనమునకై ఎంతో కృషిచేసెను. అతనికి మహావాదియనియు, మహాఘోరుడనియు, జైనులకు సాక్షాదంతకుడనియు పేరుండెడిది. ఆతరువాత శంకరాచార్యులాసేతుశీతాచలము సంచారముచేసి ప్రతివాదుల నందరనుజయించి అద్వైత మతమును సంస్థాపించెను. కుమారిలభట్టు కర్మమార్గమును ప్రబోధింపగా శంకరుడు జ్ఞానమార్గమును ప్రబోధించెను. ఆ నాడాచార్యశంకరుల కెదురు నిలబడగలిగినవారు సమస్త భూఖండములో నొక్కరును లేరు. ఆయన తర్వాత నాల్గుదిక్కుల నాయన సంస్థాపించిన మఠములు అద్వైతమత ప్రచారకేంద్రములైనవి. బ్రహ్మసూత్రములకు నుపనిషత్తులకు, భగవద్గీతకు నాయన వ్రాసిన భాష్యములు పండిత శిరోధార్యములైనవి.

కుమారిల శంకరాచార్యుల తరువాత కూడ బౌద్ధజైనులతో వైదికమతస్థులకు నిరంతర వాదప్రతివాదములు జరుగుచుండెడివి. సమాజము నిత్యసంఘర్షణలతో వ్యాకులమై యుండెడిది, అట్టి సమయమున నుత్తరహిందూస్థానముపై ఝంఝూమారుతమువలె మహమ్మదీయుల దాడి ప్రారంభమయ్యెను. పరాజయ పరాభవములకు జంకని ఆ మతావేశపరుల విజృంభణమునకు హైందవుల అనైక్యముతోడై ఉత్తరాపథమున ఇస్లామ్‌మతము వ్యాపింప బొచ్చినది. వారి రాజ్యస్థాపనకును మతమునకును నొకటే వేగము.

ఇంచుమించుగా నంత మతావేశపూరితమైనదే దక్షిణదేశమున కళ్యాణకటకమున బసవడు సంస్థాపించిన వీరశైవము దీని ప్రళయతాండవమునకు జైనమతము తట్టుకొనలేకపోయినది. ఆంధ్రకర్ణాటకదేశములలో జైనులను నిజముగా ధ్వంసము చేసినవారు వీరశైవులే. వారు శాస్త్రముకంటె శస్త్రమునే ఎక్కువగా ఆధారము చేసికొనిరి. అట్లని వీరిలో పండితులు లేరనికాదు. పాల్కురికి సోమనాథునివంటివాడు వేదశాస్త్ర పారంగతుడగు మహావిద్వాంసుడు. ఎటులైననేమి? రాజులను వశపరచుకొని వారికి వీరశైవదీక్ష నిచ్చి వారిగురువులై మంత్రులై దండనాయకులై రాజ్యములను

వశీకరించుకొని, కథలతో, కల్పనలతో, క్రతులతో బహువిధవిధానము లవలంబించి యీ వీరశైవులు వీరవిహారము చేసిరి. ఆనాడు పండితులలో వేదశాస్త్రములు ప్రమాణములగుటచే వారినివాదించి ఒప్పించుటకు ఆ వేదశాస్త్రములనే ప్రమాణముగాగైకొని తమ మతసిద్ధాంతములు నిరూపించుటకు వారు ప్రయత్నించిరి. వర్ణవ్యవస్థవిషయమున వారికి బ్రాహ్మణులతో నిరంతర వాదయుద్ధములు జరుగుచుండెడివి. పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్యచరిత్రములలో ఈవీరశైవ విజృంభణ విశేషములు వీక్షింపవచ్చును.

ఆదే సమయమున తెలుగుదేశములోనికి వైష్ణవము వీరశైవమున కెదురుగా వచ్చి విజృంభింప నారంభించెను. క్రీ. శ. 12వ శతాబ్దములో తమిళదేశమున రామానుజాచార్యులు వైష్ణవమతమును పునరుద్ధరించి విశిష్టాద్వైతమును స్థాపించినపిదప దాని ప్రభావము నలుదిక్కుల వ్యాపించినది. అటు కర్ణాటకదేశమునుండి వీరశైవము ఇటు తమిళదేశమునుండి వైష్ణవము తెలుగుదేశమున ప్రవేశించి దానిని తీవ్ర మతకలహరంగస్థలముగా మార్చినవి. జైనమత ప్రాబల్యము తగ్గినపిదప నీరెండే ప్రతిస్పర్థి మతములైనవి చారిత్రకముగా ప్రసిద్ధి వహించి వీరగాథగా తెలుగునాట వెలసిన పలనాటి యుద్ధమునకు కారణములలో నీ మతభేదము కూడ నొక ప్రధానాంశము.

కాకతీయుల తర్వాత వచ్చిన రెడ్డిరాజులు శైవులుగా కన్పింతురు. వీరిది వీరశైవముగాదు. వీరు వర్ణవ్యవస్థను రక్షించిరి. స్మార్తులలో శివు నారాధించు వారివంటి వారే ఈరాజులును. ఇక వెలమప్రభువులు వైష్ణవము స్వీకరించినట్లు కన్పించుచున్నది. వేదాంతదేశికుల కుమారులగు నైనారాచార్యులవారు రాచకొండ ప్రభువులకు వైష్ణవదీక్ష నిచ్చినట్లు తెలియుచున్నది. రెడ్లలోను కుమారగిరి మొదలగువారు వైష్ణవులైనవారును గలరు. కాని మొత్తముమీద వారిలో నెక్కువమంది శివక్షేత్రముల నుద్ధరించిరి.

ఈ శైవవైష్ణవాది మతభేదము లిట్లుండ ఉత్తర హిందూస్థానమున ఘోరాగ్నిజ్వాలలు రేపిన ఇస్లాంమతము కాకతీయ సామ్రాజ్యపతనము నాటినుండి ఒకవైపున తెనుగుదేశమున విజృంభింప జొచ్చినది. బహ్మనీరాజ్యస్థాపనముతో నది మరింత బలబలపడినది. ఈ దేశమున నది కావించిన సంక్షోభ మింతంతని చెప్పతరముకాదు.

పోతనకాలము నాటి కీ గందరగోళము లన్నియు నున్నవి. ఆయన అద్వైతి. అద్వైతులలో చాలవరకు శివపూజాధురంధురులు. కవిబ్రహ్మయగు తిక్కనయే తాను మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుడనని చెప్పుకొనెను. శైవవైష్ణవుల అంతఃకలహము లను సామరస్యముతో పరిష్కరించుట కాయన హరిహరనాథతత్త్వము నవలంబించెను. ఆయన యందు సాహిత్యగౌరవము కల్గిన నాచన సోమనాథుడాయన వలెనే తన గ్రంథమును హరిహరనాథున కంకితమిచ్చెను. కానీ యీ హరిహరనాథార్చన అంతగా ప్రజలఆదరము పొందినట్లు కన్పింపదు సామాన్య ప్రజలకు శివునిపూజించినచో కైలాసమునకు పోదుమనియు, విష్ణువును పూజించినచో వైకుంఠమునకు పోదు మనియు నమ్మకముకలదు. హరిహరనాథుని పూజించినవా డే లోకమునకు పోవును? ఆయన లోకమేది? అదియునుగాక శివవిష్ణుమహిమలను వర్ణించుగాథలు హృదయాక ర్షకమైనవి. వందలు వేలుకలవు. హరిహరనాథుని వర్ణించు కథాసముదాయమేది? ఇత్యాది సందేహము లప్పటి ప్రజలలో కలిగినవి. వీని నాధారముగా చేసికొని యీ హరిహరతత్త్వమును పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథు డతి తీవ్రముగా విమర్శించినాడు. ఏది యెట్లున్నను సాహిత్యమున నదియొక ఆదర్శమాత్రముగా మిగిలిపోయినది. హరిహరనాథునకు కావ్యము లంకితమిచ్చినవారు- తదనంతర కాల మున సింహాసనద్వాత్రింశికా కారుడగు కొరవి గోపరాజు, పంచతంత్ర కర్తయగు బైచరాజు వేంకటనాథకవిరాజు, ఆధునికుడును, భాగవత-ఏకాదశ ద్వాదశ స్కంధ కర్తయగు మిన్నికంటి గురునాథశర్మగారును.

సాంఘిక పరిస్థితులు :- ఇతరమతము లేని యెంత ప్రబోధించినను వైదికధర్మమునకు సంబంధించిన వర్ణవ్యవస్థయే స్థిరముగా దేశమున పాదుకొని యుండెను. అందుచే ప్రజలలో నెక్కువ భాగము తమకులోచిత ధర్మముల ననుస రించి యుండెడివారు. రాజులమధ్య నెన్ని కలహములు వచ్చినను భయంకర యుద్ధ ములు జరిగినను, మహమ్మదీయు లీ దేశమున ప్రవేశించువరకు సామాన్య ప్రజా జీవనమునకెట్టి యిబ్బందులు కలుగలేదు. వర్ణవ్యవస్థాధర్మముల ననుసరించి కొన్ని వర్ణములవారు మాత్రమే యుద్ధములందు పాల్గొనుటచే మిగిలిన ప్రజలకు, గృహస్థు లకు నంతగా బాధలు లేకుండెడివి. వర్ణధర్మములను గౌరవింపని మతములు ప్రబలిన కొలది సాధారణ జనజీవితమున అభద్రత, అశాంతి బయలుదేరినవి.

ఇక క్రీ.శ. 15శ. మధ్య రెడ్డిరాజుల రాజ్యపతనము జరిగి ఒడ్డెరాజులు తూర్పు తీరపుదేశమును గుంటూరుసీమను ఆక్రమించుకొన్న పిదప తెనుగుదేశము కొంత

స్వాతంత్ర్యము కోల్పోయినది. ముఖ్యముగా కవుల ఆదరణము, కళాపోషణము క్షీణించినవి. శ్రీనాథునివంటి మహాకవి వారి పాలనలో నెట్టి బాధల ననుభవించెనో ఆయన అంత్యదశలో రచించిన పద్యములు శిలాక్షరములవలె నిలిచి నిరూపించు చున్నవి. ఆనాడు పన్నులు చెల్లింపలేని వారెట్టి క్రూరశిక్షలకు లోనగుచుండిరో వానిచే తెలియుచున్నది.

రెడ్డిరాజులతో సమానముగా వెలమలును కవులను కళలను బాగుగాపోషించిరి. ఎఱ్ఱాప్రెగడ, శ్రీనాథుడు, వెన్నెలకంటిసూరన, నిశ్శంకకొమ్మన మొదలగువారు రెడ్డి రాజుల ఆశ్రయములో వర్ధిల్లినవారైన, ప్రఖ్యాత వ్యాఖ్యాతయగు మల్లినాథసూరి మొదలగు పండితులు వెలమప్రభువుల ఆస్థానాశ్రితులై కీర్తిధనముల నొందిరి. పోతనామాత్యుడును యౌవనములో రాచకొండ ప్రభువగు సర్వజ్ఞసింగభూపాలు నాశ్రయించి ఆయనకొరకై భోగినీదండకము రచించినవాడే.

సాహిత్య పరిస్థితులు :- తెనుగు ద్రావిడభాషాకుటుంబములోనిది. ఎంత కాలము క్రింద నదియొక ప్రత్యేక భాషారూపమును బొందినను పోతనకు సుమారు 400సంవత్సరములకు ముందే మహాభారత రచన కనుకూలమైనస్థితికి వచ్చినది. ద్రావిడ భాషాతత్వమును బట్టి కుసుమకోమలమైన తెనుగుభాష సంస్కృతభాషా ప్రభావముచే గాంభీర్యపటుత్వముల నలవరచుకొన్నది లాలిత్యకాఠిన్యముల సమరస సమ్మేళన ముతో ఆర్యద్రావిడ మహోదధి రత్నాకర సంగమము తెనుగై యీ సీమకు వెలుగులు తీర్చినది. ఈ పవిత్రాంధ్రసారస్వత ప్రపంచమునకు ప్రథమ సృష్టికర్త నన్నయ భట్టారకుడు. కాశ్మీరమునుండి కన్యాకుమారి వరకు ప్రజాహృదయాబ్జములలో పూజ్య స్థానము నొంది భారతీయ మతసంస్కృతి మూలస్తంభముగా సుప్రతిష్ఠితమైన మహా భారత భవ్యేతిహాసమును ఆంధ్రరాజులైన చాళుక్యప్రభువుల కోరికపై విద్వజ్జన ముల అనుమతితో సుపరిష్కృత సుమనోహర సూక్తిమయ మహాంధ్రభాషలో మహా కావ్యముగా నా యనఘుడు నిర్మించెను. ఆ యాదికవి కవిత ఆంధ్రత్వ సూచకమైన గోదావరీ సముల్లసిత సుమనస్సుగంధ వాయువీచిక వంటిది. ఆ పరిమళమునే తరు వాతి కవు లాస్వాదించి తమ రచనలను సురభిళము చేయుటకై ప్రయత్నించిరి. ప్రసన్నకథాకలితార్థ యుక్తియు, అక్షరరమ్యతయు ఆయన వాక్కునకు ప్రధానలక్షణ ములు. ముప్పాతికవంతు సంస్కృతపదములతో నిండియున్నను నన్నయ రచన అత్యంత సరళముగానే భాసిల్లును. ఎంతదీర్ఘ సమాసమైనను సువర్ణసుందరమై సుగమ

సుబోధకమై సుమనోజ్ఞనాదసమన్వితమై కర్ణపేయముగా నుండునేగాని కఠిన పాషాణము వలె కష్టముగా క్లిష్టముగా నుండదు. ఆరకవితకు సహజమైన సౌలభ్యమును శైలీ రమ్యతయు ఉదాత్తరచనయు ఆయనలో స్వభావసిద్ధముగా కన్పడుటచేతనే కవిబ్రహ్మ యగు తిక్కన నన్నయను విద్యాదయితుడనియు, మహితాత్ముడనియు గౌరవముతో సంభావించినాడు.

నన్నయ తరువాత 12వ శతాబ్దము ప్రత్యేకముగా శివకవి యుగమని చెప్ప వలెను. ఈ యుగమున సుప్రసిద్ధులు కవిరాజ శిఖామణియగు నన్నెచోడుడు, అవ తార పురుషుడని పేరుగాంచిన మల్లికార్జునపండితారాధ్యుడు, మహాప్రవక్తయైన పాల్కు రికి సోమనాథుడును. నన్నెచోడుని కుమారసంభవము తెనుగుసాహిత్యమున ప్రథమ ప్రబంధము. ఇతడు వస్తుకవిత నభిమానించిన కవి. దేశిమార్గములలో దేశీయతకే ప్రాధాన్యము కల్పించినవాడు. ఈ శివకవుల కందరకును దేశికవిత ప్రధానలక్ష్యము. భావములు సరళముగా నుండునట్లు జానుతెనుగున రచించుట వీరి కాదర్శము. ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యము కాదు గావున దానిని విసర్జింప వలయునని వారి సిద్ధాంతము.

అవతారపురుషుడుగా శైవులచే నారాధించబడిన మల్లికార్జున పండితు డెన్నో గ్రంథములు రచించినాడట. కానీ లభించినదొక శివతత్వసారమే ఇది మతగౌరవము నందినంతగా కావ్యగౌరవమును కాంచలేదు. మతసారస్వతములు రెంటియందును అనుపమాన ప్రజ్ఞాప్రాభవములు చూపినవాడు పాల్కురికి సోమనాథుడు. ఆయన బసవపురాణ పండితారాధ్యచరిత్రలు వీరశైవులకు పరమ ప్రమాణములు.

ఈతడు మహాకఠోరమగు వీరశైవము నసిధారా వ్రతముగా పరిపాలించెను. శైవేతరులను కంటితో చూడరాదు. వారిమాటలు చెవితో వినరాదు అన్నంత ఉగ్ర దీక్ష ఆతనిది. జీవితములో నేదీక్షకలదో సాహిత్యములోను అదేఆవేశము-అదేపట్టు దల కల తీవ్రస్వభావుడతడు. సంయమనశూన్యమైన ఆతని మహావేశము, పాక్షిక దృక్పథము, పరమత ద్వేషము, సారస్వతములో నాతని ప్రతిభకు పాండిత్యమునకు తగినంత స్థానము వచ్చుట కాటంకమైనని. ఏమైనను భావావేశపూరితమైన యీతని కవిత అత్యంత ప్రభావ సంపన్నమైనది.

ఆ తరువాత 13వ శతాబ్ది తిక్కనయుగము. గోన బుద్ధారెడ్డి వ్రాసిన రంగ నాథరామాయణము – ఈ యుగప్రారంభములో వెలసిన పండిత ప్రశంసిత కావ్యము

ఇంచుమించుగా ఆ కాలముననే జైనబౌద్ధుల నిరీశ్వరవాదములతో తెనుగుదేశమున నాస్తికవాతావరణము ప్రబలినది శైవవైష్ణవ సంఘర్షణలతో ప్రజాజీవితమునకు సంక్షోభ మేర్పడినది ఆ సమయమున జాతికి వెలుగుబాటలు చూపుటకై కలము ఖడ్గము పట్టగల సామర్థ్యము నొందిన తిక్కన ఉదయించెను. ఐహికాముష్మిక సమన్వయమార్గమున పయనించి ఆదర్శపూరితమగు హరిహరాద్వైతము నాయన బోధించెను. నిర్వచనోత్తర రామాయణ మాయన మొదటిగ్రంథము. అపిదప ధర్మాద్వైత సారమగు భారతమును తెనుగున రచించి అనన్యప్రజ్ఞ చూపెను. నన్నయభట్టు ప్రారంభించిన మహాగ్రంథమును పదునైదుపర్వము లొక్క చేతిమీదుగా రచించి అనితర సాధ్యమగు అద్భుతకార్యము నాయన కావించెను.

నన్నయ తిక్కనలిద్దరును తెనుగున వాల్మీకివ్యాసుల వంటివారు. వాల్మీకి లోని సత్యనిష్ఠ, కారుణ్యము, ప్రసన్నత, ఋషిత్వము నన్నయలో మనకు సాక్షాత్కరించును. ఇక తిక్కనయో సర్వవిధములను వ్యాసుడే. నిస్సంశయముగా నాతడాగమపుంజ పదార్థతత్వ నిస్సంశయకారుడు. గంభీర రాజనీతిరహస్య ప్రజ్ఞాపాటవముతో సూక్ష్మాతిసూక్ష్మ మనోభావవ్యక్తీకరణముతో సిద్ధశుద్ధాంధ్ర పదప్రయోగ బాహుళ్యముతో నాటకీయశిల్ప సంభాషణ సముల్లసనముతో అననుకరణీయ విశిష్టశైలీసంవిధానముతో తిక్కన భారతము మహోదాత్తమై అలరారినది.

ఆంధ్రసారస్వతములో తిక్కనామాత్యుని వంటివాడు మరొకడు లేడు, ధర్మాద్వైత దార్శనికుడగు నా యాంధ్రకవితా జగద్గురువు దేశితెనుగు పలుకులకు ప్రాణప్రతిష్ఠచేసి వేదశాస్త్రసారము జానుతెనుగులో సువ్యక్తమగునని నిరూపించి ప్రపంచ సారస్వతములో మహోన్నతస్థానము నొంద దగినస్థితి తెనుగుభాషకు కల్పించినాడు.

తిక్కనయుగము తరువాతది ఎఱ్ఱనయుగము. క్రీ.శ. 14 శ. ప్రథమార్థమున ఎఱ్ఱాప్రెగడ ఉదయించి భారతమున అరణ్యపర్వశేషమును పూరించెను. ఆదిరాక భారతమున కనుబంధమగు హరివంశమును, నృసింహపురాణమును వర్ణనాత్మకముగా రచించి ఆయన ప్రబంధపరమేశ్వరు డయ్యెను. ఆయన రచించిన రామాయణము నష్టమగుట తెలుగువారి దురదృష్టము. సంస్కృత భూయిష్ఠమగు నన్నయమార్గమునకు, ఆంధ్రపదాధికమగు తిక్కన మార్గమునకు మధ్యేమార్గము ప్రయాణించి ఆ కవివరుడు తనపేరనొక క్రొత్తశైలిని వెలయించెను. ఈతని సమకాలికులే ఉత్తరహరివంశ కర్త నాచనసోమనాథుడును, రామాయణకర్త భాస్కరుడును.

14శ. ఉత్తరార్థమునుండి శ్రీనాథునియుగము ప్రారంభమైనది. తిక్కన కవి బ్రహ్మయని పూజింపబడగా శ్రీనాథుడు కవిసార్వభౌముడని కీర్తిగాంచినాడు. ఆ రెండు బిరుదములును నిజముగా వారితత్వములను సూచించును. మొదటివారి యందలి సాత్వికగుణమును, రెండవవారి యందలి రాజస గుణమును, వారి జీవితములకే సరిపోయినవి. తిక్కన ఎంత మంత్రియైనను, రాజనీతివేత్తయైనను, అఖండ ప్రజ్ఞావంతుడైనను సాత్వికుడుగనే దర్శనమిచ్చును. సత్వము శక్తిసంకేతము. గంభీరతకును, తీవికిని అది చిహ్నము. శ్రీనాథుడు తాత్వికముగ్గా రాజసుడు. అది ఆయన జీవితములో నడుగడుగున కన్పడుచునే యుండును. తన నెదిరించిన పండితుల నాతడు సహింపలేదు. తనను మించిన విద్వత్కవి మరియొక డానాడుండుట అతని ఊహాలోనేలేదు. ఈ దృష్టితో దేశములోని ఆంధ్రాభిమానము గల సర్వరాజమంత్రి సముదాయము నాతడు దర్శించెను. విద్వద్వాదములు కావించెను. డిండిమ భట్టంత వాని నోడించి అతని కంచుఢక్క పగులగొట్టించెను. సువర్ణస్నానము లాచరించెను. ఆనాడు శ్రీనాథుని మించిన పండితుడులేడు. కవిలేడు. అతని కవితా దిగ్విజయాభిలాష తెనుగుదేశమునకొక వరముగా పరిణమించినది. ఆతడు చూపిన ప్రతిభాపాండిత్యములు తెలుగువారికి గర్వహేతువులైనవి.

మరియొక విశేషమేమనగా నాతడు రాజకవియేగాక ప్రజాకవికూడ. మంత్రుల కొరకు, రాజులకొరకు నైషధ కాశీఖండాదులు రచించినచో ప్రజలకొరకు పలనాటి వీరచరిత్ర వ్రాసెను. ఆంధ్రదేశములో కంటికికనిపించినవానినెల్ల నాతడు కవిత్వముతో నింపివేసెను. స్త్రీలు, పురుషులు, క్షేత్రములు, తీర్థములు, జాతరలు, తిరునాళ్ళు, పట్టణములు, పల్లెటూళ్ళు అవియివి యననేల సమస్తమును తత్కవితావస్తువులే. ఆయన జీవితమే శృంగార వీరకరుణ రసాత్మకమగు నొకమహాకావ్యము. అట్టి శ్రీనాథునియుగములో చివరివాడు పోతన.

పోతన సారస్వతమున ప్రజ్ఞసంపాదించి కవిత్వమున నొకవిధమగు నున్నత వ్యక్తిత్వమునుపొంది, మహాకావ్య నిర్మాణముచేయు ప్రాయమును మనస్థితియు వచ్చునప్పటికి మతరాజకీయసాహిత్యాది సముపస్థితి యెట్లున్నదో పైన తెలుపబడినది. భారతీయజీవనములో సర్వాధికముగా పూజ్య స్థానమువహించిన రామాయణ భారత భాగవతములలో మొదటిరెండును అప్పటికి తెనుగున రూపొందినవి. వానితో తుల్యముగా ప్రసిద్ధివహించిన భాగవతము మాత్రము తెనిగింప బడలేదు.

సృష్టిలో కొన్నికార్యములు కొందరు చేయుటకే నిర్దిష్టములైనవనిపించును. విచిత్రమగు విధిప్రభావమున ఏ కార్యమెప్పటికేవ్యక్తిచే కావలెనో అందుకనుకూలమగు వాతావరణ మప్పటికేర్పడును. హింసాత్మకమగు వీరశైవమతముతో నట్టుడికిపోవుచున్న దేశమునకు తిక్కన ధర్మాద్వైత మార్గమును ప్రసాదించినాడు. కాని అద్వైతజ్ఞానము సామాన్యజనుల కందుబాటులోనిదికాదు. సామాన్యులకు భక్తిహృద్యమైనట్లు జ్ఞానము వేద్యముకాదు. వారికి భక్తి గానముకావలెను. అది శైవమువలె ఉద్రేకమునకుగాక శాంతికి దారితీయవలెను. అందుకై వీరభక్తినిగాక జ్ఞానభక్తిని కల్గించు మధుర కవిత్వముదయించినచో నది సర్వప్రజాహృదయములను స్పందింపజేయును. ఆ జ్ఞానాత్మక భక్తిస్పందన కలిగినచో ప్రజలలో శాంతిమధురభావసంచలనము కలిగి అది యొక దివ్యానుభవమునకు దారితీయును. అంతేకాక లౌకిక జీవితములోను ప్రశాంతి నెలకొనును.

ఆ శక్తిగల ఒక మహాకావ్యము నాడుదయించుట ఈశ్వర సంకల్పమైయుండవలెను. అందుకే మధురమై భక్తిపూరితమై ధర్మ ప్రబోధకమై శాంతిసుందరమగు భాగవతము పోతన ధ్యానసమాధినుండి వెలువడినది. వీరమతావేశ సంక్షుభిత ప్రజాజీవనములో శాంతిని స్థాపింప నుద్దేశించిన భగవత్సంకల్పమునకు సాధనభూతుడై పోతన భాగవత మహాకావ్యమును తెనుగువారి కందించినాడు.

సారస్వత పరిణామమార్గమును వీక్షించినను భాగవతరచనకు కలిగిన కాలపరిపక్వతను వీక్షింపగలము. వేదఋక్కులవలె ప్రసన్నమహితమగు నన్నయకవిత్వమును, ఉపనిషత్తత్వ మహత్వసహితమగు తిక్కన కవిత్వమును దర్శనశాస్త్ర మహోద్దండమగు శ్రీనాథుని కవిత్వమును వచ్చినపిదప, హృదయముల కానందస్పందనము కలిగించు ప్రాచేతసచేతస్సమనోజ్ఞమగు లలితకవిత్వము భాగవతరూపమున నుదయించుట సముచితమే.

పోతన నాటివరకుదయించిన సారస్వతములో భారతము పురాణముగా విద్వాంసు లుపన్యసించినపుడు ప్రజాహృదయముల కధికముగా సన్నిహిత మయ్యెడిది. ఇంకను- కవితావాసన గలిగిన పరిణత హృదయుల కారాధ్యమైనది. దానితో పోల్చిన బసవపురాణాది వీరశైవ గ్రంథములు జనులలో నొకపక్షమునకు మాత్రమే చెందినవి. పలనాటి చరిత్రవంటి కావ్యములు వీరగాథలేకాని శాంతిప్రబోధము కలవికావు. కాశీఖండాదులు పండితులకు మాత్రమే. భారతమైనను కథా విషయికముగా దానికి గల గౌరవము పామరులలో కవితా విషయకముగా నున్నదనుట సాహసము. భారత

కవితా సౌందర్య మత్యంత పరిణతులగు మనీషులకు మాత్రమే గోచరించును. అది యునుగాక కంఠస్థము చేసికొని రాగయుతముగా పాడుకొనదగు పద్యములు భారత ములో నంతగా దొరకవు. దాని ప్రణాళికవేరు. ఈవిధముగా పోతననాటికి పండిత పామరులకు సమానముగా ఆదరపాత్రమైన కవితామూర్తి లేదని చెప్పినచో అది సత్యదూరము కాజాలదు.

అట్టిస్థితిలో భాగవత సృష్టికనుకూలమగు పరిస్థితిని గమనింపవచ్చును. పండిత గౌరవమును పామరుల ఆదరమును సంపాదించి మతోద్రేక కల్లోలితమగు జనతకు ప్రశాంతి ప్రసాదించి ప్రతిజనుడును, తన దైనిక జీవితములో స్మరించుకొని పారా యణ చేసికొనదగిన పద్యములతో ఒక పూజ్యగ్రంథ ముద్భవించుటకు కాలములో నొక సమీచీన స్థితి వచ్చి యుండవలెను.

ఇక సాంఘిక దృష్టితో ఆలోచించినను, దానికి నిరూపణ లభించును. ఏ తిక్కనవంటి మహామహుడో తప్ప నాటివరకు కవులందరును రాజాశ్రితులే. ఆయ నయు కులక్రమాగత మంత్రిపదవీ ప్రతిష్ఠితునిగా రాజాశ్రితుడు. కవిగాకాడు. 'నిరా శ్రయా నశోభంతే పండితా వనితాలతా' అను విశ్వాసము బాగుగా పాదుకొని యున్న రోజులవి. అదియునుగాక ఒకకవి కావ్యమును రచించినచో దానికి ప్రఖ్యాతి రావలయు నన్న పండితులు మెచ్చవలెను. ప్రతులు బయలుదేరి దేశదేశములకు వ్యాపింప వలెను. అది రాజాశ్రయము లేనిది కష్టము. శ్రీనాథుని అంతిమ జీవితమునుచూచిన నాటిసంఘములో నిరాశ్రయులైన కవులెంత బాధపడుదురో తెలియవచ్చినది. రాజా శ్రయము లేక కవి ఉండజాలడను నొకభావము ప్రజలలో వ్యాపించినది.

ఇట్టిస్థితిలో కాలమున కెదురీది కవులు రాజాశ్రయములేక కూడ మహాకావ్య ములు నిర్మించి ఆత్మగౌరవము నిలబెట్టుకొనగలరనియు, అట్టికావ్యములను ప్రజలాద రింతురనియు నిరూపించుట కాలపురుషుని నిగూఢమగు నుద్దేశమైయుండును. నిరాడంబ రులై కవులు జీవింపగలరను మహత్తరసత్యమును సమాజము గుర్తించుట పరమేశ్వ రుని సంకల్పమై యుండును.

ఈ విధముగా సర్వదృక్పథములలో తెనుగున భాగవతావతరణము జరుగు టకు నాటి మతరాజకీయ సాంఘిక సారస్వత పరిస్థితులలో నొకకాలపరిపక్వత వచ్చిన దని నిశ్చయముగా నిర్ధారింపవచ్చును.

ఇట్టి పరిణతస్థితిలో నా మహాకావ్య నిర్మాణమునకు తగినవ్యక్తి పోతనామాత్యుడైనాడు శైవ వైష్ణవ పక్షపాత రహితమగు అద్వైత మార్గము ననుసరించి, మహోన్నత భక్తిభావ ప్రేరణకలిగి, శాంతమధుర కవితావేశమునొంది ఆయన దైవ కార్యమునకు తగిన ప్రాయమును, మనస్థితియు గాంచియుండును. నిరాడంబరుడును, జ్ఞానభక్తి యుతుడును, దివ్యకవితోత్సాహియు నగు నా స్నిగ్ధహృదయుడు మహిత కావ్యరచన కుచితమైన ఉన్నతినొంది యుండును. అందుచేతనే శ్రీరాముడు భాగవతము నిర్మింపుమని ఆదేశించుటయు పోతన ఆ మహాకార్యమునకు పూనుకొనుటయు జరిగినది.



# 2. ఆంధ్ర మహా భాగవతము

## (2) కర్తృత్వము

హిమవత్పర్వతమునుండి కన్యాకుమారి వరకును భారతదేశములో మత సాంస్కృతిక గ్రంథములుగా భారత భాగవత రామాయణములు బహుళ ప్రచారము నొందినవి. సంస్కృతమున రామాయణమును వాల్మీకి రచింపగా, భారత భాగవతము లను కృష్ణద్వైపాయనుడు రచించెనను విషయము సర్వజనవిదితము. తెనుగుభాషలో అనువదింపబడిన ఆమూడు మహాగ్రంథములును అదియేమి విచిత్రమోకాని బహు కర్తృత్వమునకు పాలైనవి. ఒకవిధముగా నదియొక విశిష్టాంశముగానే భావింపవల యును. ఆ మూడింటిని రచించిన కవులలో చాలవర కొక్కొక్కరే సర్వగ్రంథమును వైయక్తికముగా నిర్వహింపగల దక్షులు. ఐనను విధివశమున ఏకకర్తృత్వ మా గ్రంథములకు కుదురలేదు.

శ్రీరాముని ఆదేశముపై భాగవతమును తెనుగుసేయ తలపెట్టినవాడు బమ్మెర పోతన. ఆయన తలపెట్టిన ఆ పురాణానువాదములో ఇతరుల రచనలు కన్పించుటకు విమర్శకు లనేకకారణము లూహించియున్నారు. పోతనకాక భాగవతగ్రంథములో కనిపించు నితరకవులు ముగ్గురు. గంగన, సింగన, నారయ.

భాగవత మన్నిస్కంధములును పోతన వ్రాసెననియు అది శిథిలమగుటచే వెలిగందలనారయాదులు దానిని పూరించిరనియు అనుశ్రుతముగా లోకమున నొక కథ వ్యాపించినది. ఈ శిథిలత్వమునకు కారణమును కూచిమంచి తిమ్మకవి ఇట్లు చెప్పెను.

సీ॥ ఘనుడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయక్ష్మావరుం డది తన
కిమ్మని వేడగా నీయకున్న
నలిగి యాపుస్తకం బవని బాతించిన
చివికి అందొకకొంత శిథిలమయ్యె

క్రమ్మర నది వెలిగందల నారప

రాజును మరి బొప్పరాజు గంగ

తే॥ గీ॥ రాజు మొదలగు కవివరుల్ తేజమునగ, జెప్పిరి...

— సర్వలక్షణసారసంగ్రహము

ఈ కథననుసరించి సింగభూపాలుడు భాగవతము పూడ్పింపగా అతని కేదో బాధకలిగెననియు, శ్రీరాము డారాజుభార్యకు కలలో కన్పించి మహాభక్తుడగు పోతన గ్రంథము పూడ్పించుటయే రాజుబాధకు కారణమని చెప్పి ఆగ్రంథమును వెలికి తీయించి లోకములో వ్యాపింపజేయుమని చెప్పెననియు ఆమె తనకల మగనికి చెప్పి పుస్తకమును పైకితీయింపగా అందలి తాళపత్రములు కొన్ని పురుగులుతిని శిథిలమై యుండెననియు, తదనంతరకాలమున గంగన సింగనాదికవులు పూరించిరనియు పండి తాభిప్రాయములు బయలుదేరినవి.

తిమ్మనకవికి పూర్వులెవ్వరును ఈకథను గ్రంథస్థము చేయలేదు భాగవతము లోని రచయితలు ముగ్గురిలో నేయొక్కరుగూడ భాగవతము శిథిలమగుటచే తాము పూరించుచున్నామని చెప్పలేదు, నిజముగా శిథిలమై యున్నయెడల నసీన మారణ్య పర్వశేషము పూరించిన ఎఱ్ఱనవలెనైన చెప్పికొని యుండవలయును. ఆయా స్కంధములను వారు రచించినట్లుమాత్రమే కలదుగాని గ్రంథమున మరెట్టి అంత రంగిక సాక్ష్యమును లేదు.

పోతన మనుమడు ప్రౌఢసరస్వతియని ప్రసిద్ధి వహించినవాడు. ఆయన కుమారులు కేసన, మల్లనలు దాక్షాయణీ పరిణయ, విప్రభజనానందకర్తలగు జంట కవులు. వారిసోదరి ఎల్లమభర్త ఒడయనంబివిలాసకర్తయగు అజ్జరప్పు పేరయ లింగ కవి. వీరెవ్వరును భాగవత ఖననగాధనుగూర్చిగాని శైథిల్యకథనుగూర్చిగాని ప్రస్తా వింపలేదు. అట్టి దేదైన జరిగియున్నచో వారికి తెలియకుండదుగదా!

పోతన కించుమించు సమకాలికుడో లేక కొంచెము తరువాతివాడో అగు కాశంభట్టు తన కవిచింతామణి యందు పోతనవిరచిత భోగినీదండకము నుదాహరించి యున్నాడు. భాగవత శైథిల్యకథ విషయ మాతడును తలపెట్టలేదు.బహుగ్రంథ పరి శోధకుడగు అప్పకవియు ఈవిషయమును పేర్కొనలేదు.

అదియునుగాక ఇది హేతువాదబద్ధముగా కూడ కన్పింపదు. సర్వజ్ఞ బిరుదాంకితుడును, కవిపండిత పోషకుడును అగు రావుసింగభూపాలుడు ఈ దారుణకృత్యమున కొడిగట్టెననుట అవిశ్వసనీయము. ఒకవేళ ఆ గ్రంథమును నిజముగనే నశింపజేయ దలచినచో భూమిలో పాతిపెట్టించుట తెలివి తక్కువపని. అందు కంతకంటె సులభమైన పద్ధతులు చాల గలవు.

కవులు తమహృదయమునకు మహావేదన కలిగినపుడు దానిని కవితారూపములో వెలువరించుట అత్యంత సహజము. మహాకవియగు శ్రీనాథుడు తన జీవితచరమ భాగమున చెప్పిన సీసపద్యము లందుకు నిదర్శనములు. నిజముగా తన కనులఎదుటనే తన భాగవతము పాతిపెట్టబడినచో దుర్భరబాధా పూరితుడైన పోతన హృదయము నుండి కరుణరసాత్మకమగు కవిత తప్పక ప్రవహించి యుండెడిది. కాని అట్టిదొక్క పద్యమును లేదు.

అదియునుగాక వాదమునకు పాతిపెట్టుట నిజమనుకొన్న పైకి తీసినతరువాతనైన దానిని తాను పూరింపక నారయాదుల కేలవిడుచును? కావున భాగవత శైథిల్యము పోతన జీవించియుండగా జరుగలేదన్నమాట. పోతన జీవించియుండగా చేయనిపనిని సింగభూపాలుడు తరువాత చేసెననుట ఊహింపరానిది. కావున ఈసింగభూపాలుని గూర్చి బయలుదేరినదోషారోపణ వృత్తాంతము కేవలము కట్టుకథ.

ఇక భాగవత శైథిల్యకారణమును గూర్చి మరియొకగాథ పండితలోకమున వ్యాపించియున్నది. క్రీ.శ. 1848 వ సంవత్సరమున భాగవతమును మొదట ముద్రించిన శ్రీపురాణం హయగ్రీవ శాస్త్రులవారు తమ పీఠికలో గ్రంథపాతమునకు కారణమును వివరించుచు పోతనయే ఇంతటి మహోత్తమ భగవత్తత్వ భక్తిభావ సంపూర్ణమగు మహాగ్రంథము జానపదులకు చిక్కిన పాడగునని దానిని దేవతార్చన పీఠమునందిడి పూజించుచు తన అవసానకాలమున కుమారుడగు మల్లనకు తన భాగవతముసంగతి చెప్పెననియు, తదనంతరము మల్లన ఆ గ్రంథము తీసిచూడగా, అందుకొంత ఖిలమైయుండుటకు చింతాక్రాంతు డయ్యెననియు, అంత పోతన మల్లనకు స్వప్నమునం దగపడి శిష్యుడగు నారయను శిథిలభాగములు పూర్తిచేసి వ్యాప్తము చేయుమని ఆనతిచ్చెననియు వ్రాసిరి. [1] ఈకథ తిమ్మకవి నాటికి వాడుకలో నున్నట్లు లేదు. ఉన్నచో సింగభూపాలకృత ఖననగాథ నాతడు వ్రాసియుండడు. అతని నాటికి లేని ఈకథ ఇటీవలివారి యూహయై యుండవలయును.

ఈగాథ నాధారము చేసికొని భాగవతగ్రంథమెట్లు శిథిలమైయుండునను విషయమును చాగంటి శేషయ్యగారొక విధముగా నూహచేసిరి[2]. పోతన మొదటి ఆరు స్కంధములను ఒకకవిలె గాను తుది ఆరుస్కంధములను ఒకకవిలెగాను కట్టి ఒకపెట్టెలో పెట్టియుండుననియు, చెదపురుగు అడుగు భాగమునుండి పట్టి మొదటి కవిలెలో పంచమ, షష్ఠస్కంధములును, రెండవ కవిలెలో ఏకాదశ, ద్వాదశ స్కంధములును, దశమోత్తరములో కొంతభాగమును తినివేసి యుండుననియు వారనిరి కానీ ఈఊహలో నొక చిక్కుకలదు. వారి ఊహననుసరించి గంగన, సింగన, నారయలెన్నిపుటల గ్రంథము వ్రాసిరో పోతనయు మొదట నంతే వ్రాసియుండునని తేలును. పోతనగారి రచనను గూర్చి అవిధముగా నూహించుటకు తగిన ప్రమాణములేనందునను, పోతనయే 11, 12 స్కంధములు రచించిన నారయవలె క్లుప్తముగా రచించుట అసంభవముకావునను ఈరెండు కవిలె కట్టల కథ అంగీకారయోగ్యముగా తోచదు. శేషయ్యగారును దీనిని ప్రమాణమని చెప్పక ఊహగానే భావించిరి.

భాగవత శైథిల్యమునుగూర్చి అధునికులలో కొందరు మరియొక విధముగా భావించుచున్నారు. క్రీ.శ. 1474 ప్రాంతమున రాచకొండ వెలమల రాజ్యము పతనమై మహమ్మదీయుల వశమైనదనియు, గృహదహనములతో, దోపిడులతో, నిప్పుల పుంతయైన తెలంగాణము దుర్భర బాధలనుభవించినదనియు, ఆ కష్టకాలమున నేప్రమాదమునకు లోనయ్యెనో, లేక సరియైనరక్షణలేక అజాగ్రత్తకు లోనయ్యెనో, ఎటులైననేమి ఆవిప్లవప్రభావమున భాగవతము శిథిలమైనదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాసినారు[3]. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారును ఆకాలమున నానగరము విప్లవముల పాలైయుండుననియు విద్యావినోదముల కప్పుడక్కడ వెరపులేదనియు, ఈకారణమున కొన్నాళ్ళదాక ఆగ్రంథము నెవరు తాకరైరనియు పరిశీలనము లేకపోవుటచే కాబోలు నది కొంత శిథిలమైనదనియు వ్రాసినారు[4].

ఈవిధముగా భాగవతశైథిల్యము జరిగినదని విశ్వసించి అందులకు తగు కారణములను పలువురు పలువిధముల నూహించిరి. ఇట్లూహించుట కనుశ్రుతముగా వచ్చు కథలేకాక కొన్ని ప్రతులలో కనుపించు స్కంధమధ్యపూరణముదాద కొంత కారణము. భాగవత వివిధప్రతులనుబట్టి ఎవరెవరేయే భాగములు రచించిరో నిర్ధారించిన పిదపగాని శైథిల్య విషయమున విస్పష్టమగు నిర్ణయము చేయజాలము.

భాగవతమును స్థూలముగా 1, 2, 3, 4, 7, 8, 9, 10స్కంధములను పోతన రచించినట్లును, 5వ స్కంధమును గంగన, 6వ స్కంధమును ...

స్కంధములను నారయ రచించినట్లును గోచరించును. ఇవికాక కొన్ని ప్రతులలో ఈ క్రింది విశేషములు కలవు.

1. ద్వితీయస్కంధమున బ్రహ్మ నారదునకు తత్త్వోపదేశము చేయు సందర్భమున

ఉ॥ అట్టిఅనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమందు నే బుట్టి...

అను పద్యము మొలుకొని వెలిగందల నారయ కవిత్వమని పూర్వముద్రిత భాగవత గ్రంథములలో కలదు. స్కంధాంతగద్యలో పోతనామాత్య రచితమనియే ఉన్నది.

2. దశమస్కంధోత్తరభాగము శ్రీకృష్ణుడు కేళీ గృహమునందు రుక్మిణీ దేవితో ప్రసంగించు సందర్భమున

సీ॥　కాటుక నెరయంగ కన్నీరు వరదలై
　　కుచకుంభయుగళ కుంకుమ .. తడియఁ

అను సీసపద్యము మొదలు వెలిగందల నారయకవి విరచితమని ప్రాచీనపండిత లిఖిత పుస్తకములందు చెప్పబడియున్నట్లు గ్రంథపీఠికలయందు తెలుపబడినది. పూర్వము వలెనే స్కంధాంత గద్య పోతనపేరనే గలదు.

3. 5వ స్కంధాదిని ముద్రితప్రతులలో శ్రీకృష్ణ సంబోధకమైన పద్యము గంగనార్యరచితమైనది కలదు. కొన్ని వ్రాతప్రతులలో

కం. శ్రీ సీతా నయనోత్పల
　శ్రీ సతి సహజన్మ త్రిదశ సేవిత ఆశా
　వాస ప్రకాశ జయభా
　సాసురపతి హరణ రామచంద్ర నృపాలా!

అను శ్రీరామ సంబోధకమైన పద్యముకలదు. ఇది పోతనయే వ్రాసియుండ వల యును. అప్పుడు పంచమ స్కంధము గంగన పూర్తిరచన కాకపోవును.

పై మూటికిని సమాధానములీ క్రింద నొసగబడుచున్నవి.

1. కూచిమంచి తిమ్మకవికి పూర్వుడగు అప్పకవికి లభించిన భాగవతప్రతు లలో ఈ ద్వితీయస్కంధ పూరణమున్నట్లు తోచదు. అప్పకవీయము చతు ర్థాశ్వాసమున

ఉ॥ సర్వఫల ప్రదాతయును సర్వశరణ్యుడును [illegible]యును ? .......

అను ద్వితీయస్కంధ పద్యముదాహరింప బడినది. 'అట్టి అనంతశక్తి.... .... .... ....' అను పద్యమునుండి వెలిగందల నారయ కవిత్వమనుచో ఈపై పద్యము దాని తరువాతిభాగములోని దగుటచే అతనిదే కావలయును. కాని అప్పకవి దానిని పోతన కృతముగానే ఉదాహరించెను. కావున అప్పకవినాటి తాళపత్రప్రతులలో ద్వితీయ స్కంధమున వెలిగందల నారయ రచనసంగతి లేదన్నమాట. తిమ్మకవి కథచూచి ఇటీవలి ప్రతులలో ఎవరో లేఖకులు కల్పించియుందురు.

2. భాగవత ప్రతులన్నింటిలోను ఒక్క బండి గోపాలము వ్రాసిన ప్రతిలో ఈ నారపరాజు కవిత్వము విషయము ప్రస్తావింపబడినది. దీనిని చూచి కొందరు విద్వాంసులు ప్రమాణీకరించి తమపీఠికలలో నుద్ఘాటించి యున్నారు. ఏయితర ప్రతి లోను లేక ఒక్క ప్రతిలో మాత్రమే ఉన్నదానిని సాధారణముగా ప్రమాణమని భావింపజాలము. అదియునుగాక గజేంద్రమోక్షము రుక్మిణీకల్యాణము మొదలగు వానివలె దశమోత్తరములోని కుచేలోపాఖ్యానము కూడ చిరకాలముగా తెలుగువారి నోట పారాయణమైన గ్రంథభాగము. అనుశ్రుతముగా నిది పోతనరచనగానే విన వచ్చుచున్నది. 'కాటుక నెరయంగ' అను పద్యమునుండి నారయ కవిత్వమను కొన్నచో కుచేలోపాఖ్యానము నారయకృతమగును. ఇది అంగీకార్యము కాజాలదు. నారయ కవిత్వములో నేమాత్రమును లేని ఒక మహావిశిష్టత పోతన కవిత్వములో కలదు. ఆయనశైలి అత్యంతసరళముగా దివ్యనాద మధురముగా నుండును. ఆశైలీ విశిష్టతచే ఆయన పద్యములు చదివినకొలదియు మరలచదువవలె ననిపించును. కంఠస్థము చేసికొని కమ్మగా గొంతెత్తిపాడుటకవి ఎంతయు ననుకూలముగా నుండును. కుచేలోపాఖ్యానము తెలుగువారుపాడుకొను అట్టిఘట్టములలో నొకటి. దానిలోని శయ్యాసౌష్ఠవము, ఆరచనాపద్ధతి విస్పష్టముగా పోతనదే. కావున ద్వితీయస్కంధ ములోవలెనే ఈసందర్భముననుు నారయ రచనావిషయము సత్యముకాజాలదు. ఈ సందర్భమున మరికొన్ని ఉపపత్తులుకూడ ఈక్రిందచూపబడుచున్నవి.

1. అనితరసాధ్యములగు పోతన శైలీవిశేషములకు నారయ కారోపితమైన భాగమునందలి ఉదాహరణములు చూడుడు.

సీ॥ కమనీయశుభగాత్రు కంజాతదళనేత్రు
వసుధాకళత్రు పావన చరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు
సతపన్నగాకల్పు నాగతల్పు
కౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు
శ్రితజనపోషు సంచితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు
ధృతపీతకౌశేయు సతవిధేయు

తే॥ అఘమహాగదవైద్యు వేదాంత వేద్యు
దివ్యమునిసన్నుతామోదు తీర్థపాదు
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణు కృష్ణు
చూడు దైతేయకులబాల సుభగలీల 8

సీ॥ ఇందీవరశ్యాము వందితసుత్రాము
కరుణాలవాలు భాసురకపోలు
కౌస్తుభాలంకారు కామితమందారు
సురచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయాను కౌశేయపరిధాను
పన్నగశయను సజ్జాతనయను

తే॥ మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు

భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణు కృష్ణు

ఇత్యాదులు[10]

II వర్ణనాత్మకవచనములు రచించుట పోతనకు చాల తరచైన అలవాటు. నారయలో ఇట్టిది కన్పట్టదు. దశమోత్తరమునందలి అట్టి వచనములు చూడుడు

వ. మరియు నయ్యిందువదన లందంద నుందగముసంబునం జెందు ఘర్మజల బిందుసందోహ కందళిత మందహాస చంద్రికా సుందరవదనారవిందంబులనిందిందిర రుచిర చికురబృందంబులు చిందర వందరలై సందడిగొన.[11]

ఇత్యాదులు[12]

అదియునుగాక కాదంబరీశైలి ననుకరించు వచనములు వ్రాయుట పోతన లోని ఒకవిశిష్టత[13]. ఇతరస్కంధములలో వలెనే యీభాగమునను ఉన్న ఇట్టిరచన పోతన కర్తృత్వమును నిరూపించు పరమోదాహరణములలో నొకటి.

ఉదా॥ అమరావతీ పురంబునుంబోలె వసుదేవసంపన్నివా సంబై, అనలపుట భేదనంబునుంబోలె కృష్ణమార్గ సంచారపూతంబై సంయమనీ నగరంబునుంబోలె హరి తనూభవాభిరామంబై[14]......

III: వ్యంగ్యశ్లేషాత్మక పద్యములు రచించి చాతుర్యము ప్రకటించుట పోతన పలుచోట్ల చేసెను.[15] అట్టి విందును కన్పించుచుండును. చూడుడు.

సీ॥ లోకుల నడవడిలోనివారము గాము
పరులకు మాజాడ బయలుపడదు.
బలమదోపేతులు పగగొంద్రు మాతోడ
రాజపీఠములకు రాము తరచు
శరణంబుమాకు నీజలరాశి సతతంబు
నిష్కించనుల మేము నిధులు లేవు

కలవారు చుట్టాలుగారు నిష్కించన
జనబంధులము ముక్తసంగ్రహులము

ఆ॥ సాధవర్తనులము గుణహీనులము భిక్షు
లైనవారిగాని యాశ్రయింప
మిందుముఖులు దగుల రిటువంటి మముబోటి
వారినేలతగుల వారిజాక్షి.[16]

ఇట్టివి పోతన రచనారీతిని స్పష్టముగా తెలియబరచును. నారయ రచనలో ఇటువంటి దెక్కడనులేదు.

IV. నారయ ఎచ్చటను ఎత్తుకొననివియు, పోతన ఇతరస్థలముల తలపెట్టినవియు అగు లయవిభాతి,[17] లయగ్రాహి[18] మొదలగు వృత్తముల వైవిధ్యము పోతన కర్తృత్వమునకొక నిరూపణముగా గ్రహింపవచ్చును.

V అమూలకములైన కల్పనములు మహాద్భుతముగా చేయునేర్పు పోతనలో అడుగడుగునను కన్పించును. నారయ కవిత్వములో అగుణము కానరాదు. దశమోత్తరములోని కొన్ని సుందరకల్పనలు చూడుడు.

ఉ॥ సింధురవైరివిక్రముడు శీతమయూఖ మరాళికాపయ
స్సింధుపటీరనిర్మల విశేష యశోవిభవుండు శౌర్యద
ర్పాంధరిపుక్షితీశ నికరాంధతమః పటలార్కు డీజరా
సంధుని జూడు మాగధుని సద్బృహదశ్వసుతున్ గృశోదరీ![19]

మొదలగునవి[20]

VI. ఈభాగమున పోతన ఇతరస్కంధములలోని పద్యములకు స్పష్టమగు సామ్యములు కన్పించుచున్నవి. చూడుడు.

1. మందారమకరంద మాధుర్యమునుగ్రోలు
మధుపంబువోవునే మదనములకు[21] ...

నీరదాగమమేఘ నిర్ముక్త పయఃపాన
చాతకంబరుగునే చౌటిపయసు[22]...

2. కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ[23] ...

చం॥ హరిభజియించు హస్తములు హస్తము లచ్యుతుఁగోరి
మ్రొక్కుత
చ్ఛిరముశిరమ్ము చక్రధరుజేరిన చిత్తము చిత్తము[24] ...

ఇట్టి పద్యములనుచూచి ఇవి నారయ అనుకరణములని చెప్పరాదా అని కొందరనవచ్చును. నిజమే. కానీ నారయ స్వతంత్రముగా రచించిన 11,12 స్కంధములలో ఇట్టి అనుకరణ ప్రయత్నములు మచ్చునకైన కన్పింపవు. కావున పైవాదము సంగీకరింపజాలము. అదియునుగాక నిర్వివాదముగా పోతన రచన అని చెప్పదగినచోట్లలోనే శైలీభావ సామ్యములు ఎన్నోకలవు. అది రచితాసహజమగు ఒకగుణము. చూడుడు.

1. నల్లనివాడు పద్మనయనంబులవాడు మహాశుగంబులన్
విల్లునుదాల్చువాడు[25] ...
నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు[26]...

2. విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు
కొండలబిలములు కువలయేశ[27] ...
కంజాక్షునకుగాని కాయంబుకాయమే
పవనగుంఫిత చర్మభస్త్రిగాక[28] ...

3. మ॥ పతి నాయింటికి మున్నువచ్చె నిదె నాప్రాణేశు డస్మద్గృహా
గతుడయ్యెన్ మును నేరెబో తొలుత మత్కాంతుండు
నాశాలకే[29]

శా॥ నన్నే పాయఁడు రాత్రులందివములన్ నన్నే కృపంజెందెడిన్
నన్నే దొడ్డగజూచు వల్లభలలో నాథుండు నాయింటనే॥౦

ఈ భాగమున నారయ కవిత్వారోపణకు ప్రధానకారణము తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారి అభిప్రాయము.[31] ఇందలి తత్వఘట్టముల తెనిగింపు చాల వరకు విశిష్టాద్వైత పరమని వారు కొన్నివాక్యము లుదాహరించిరి. నారయది విశిష్టాద్వైత పరానువాదమగుటచే ఈ భాగములోను ద్వితీయాదిస్కంధములలో కొన్నిచోట్లను గల తత్సంబంధ వాక్యములను చూచి ఆయా భాగముల క_ర్తృత్వము నారయదని వారనిరి. భాగవతములో కనుపించు విశిష్టాద్వైత పరవాక్యములను చూచి అట్టి భాగములు నారయవని పోతన వానిని వ్రాసియుండడని తేవప్పెరుమాళ్ళయ్య గారు పొరపాటుపడిరి. పోతన రచనలుగా స్పష్టముగా వారును అంగీకరించిన భాగములలోనే అట్టి వాక్యములున్నవి.[32] వానినెల్ల పోతనవి కావని చెప్పజాలము. అదియునుగాక నారయది విశిష్టాద్వైత పరానువాదము కాదు.[33] అతడును తన గురుడగు పోతనమార్గమునే అనుసరించెను. కావున మతమును ఆధారముగాచేసికొని గ్రంథ భాగ క_ర్తృత్వమును నిర్ణయింపబూనిన తేవప్పెరుమాళ్ళయ్యగారి వాదము అంగీకార్యము కాజాలదు.

పై విధముగా పరిశీలించిన దశమో_త్తరభాగము పోతనదని నిస్సంశయముగా నిర్ధారణ చేయవచ్చును.

3. పంచమస్కంధము రెండాశ్వాసములుగా విభజింపబడియున్నది. రెండాశ్వాసములకు ఆద్యంత పద్యములు కృష్ణసంబోధనాత్మకములుగా కన్పించుచుండ - శ్రీరామ సంబోధనాత్మకమగు ప్రథమాశ్వాసాది పద్యపాఠాంతర మొక్కటి దాని ఉనికిని స్థిరపరచుకొనజాలదు. అది ప్రక్షి_ప్తమైయుండును.

కావున 1,2,3,4,7,8,9,10 స్కంధములను సంపూర్ణముగా పోతన రచించెననియు, 5వ స్కంధమును గంగన, 6వ స్కంధమును సింగన, 11,12 స్కంధములను నారయ రచించిరనియు భావింపవచ్చును. ఇందుకు బాధకముగా కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహములో పోతరాజు చెప్పినవి ప్రథమ స్కంధము, ద్వితీయ స్కంధము కొంతయు, షష్ఠస్కంధము, స_ప్తమాష్టమ నవమ స్కంధములును, దశమ పూర్వభాగము కొంతయు నున్నవనిచెప్పి ఈ భాగములలో రేఫశకట రేఫలమైత్రిలేనందులకు ఉదాహరణలిచ్చియున్నాడు. అంతేకాక నారయాదుల

రచనలయందు రేఫఱకారమైత్రి ఉన్నందుకు 2,3,4,5 స్కంధములనుండియు దశమోత్తర భాగమునుండియు పద్యములుదాహరించెను.[34]

బహుగ్రంథ పరిశోధకుడగు అప్పకవి రేఫఱకార సాంకర్యమున్నందుచే భాగవతము ప్రమాణగ్రంథము కాదని నిరసింపగా[35] మానవల్లి రామకృష్ణకవి అప్పకవి వాదమును ఖండింపదలచి పోతనరచనలో రేఫఱకార సాంకర్యము లేదనియు[36] భాగవత పూరకులగు వెలిగందల నారయాదులు పోతనవలె పండితులు కానందునచే వారి రచనలలో మాత్రమట్టివి కన్పించుచున్నవనియు నిరూపించుటకు ప్రయత్నించెను. అందుకై పోతన రచితములని స్పష్టముగా కన్పించు స్కంధములలో ఉన్న రేఫ ద్వయసంకర పద్యములను పోతనవి కావనియు వాని నన్నింటిని ఇతరులు పూరించిరనియు, ఇతరులు పూరించుటకు పోతనగ్రంథము శిథిలమగుట కారణమనియు ఒక వాదమును ప్రతిపాదించి అందుల కుపస్కారముగా భాగవత ఖనన గాథ నొకదానిని గ్రంథస్థము చేసినాడు. ఆతడింత కష్టపడెనుగాని ప్రసిద్ధముగా పోతన రచనమని గ్రహింపబడుచు ఆతనిచే గూడ నంగీకరింపబడిన స్కంధములలోనే రేఫద్వయ సాంకర్యముండుట నాతడు గమనింపలేదు.[37] అదియునుగాక సింగనకృతమగు షష్ఠ స్కంధమును పోతన కృతమనుట మొదలగు వానిని బట్టిచూడ ఆతనివ్రాతలు ప్రమాణముగా తోచుటలేదు.

భాగవతభాగ కర్తృత్వ నిర్ణయమునకు మతము నాధారముచేసికొనుటకు ప్రయత్నించినట్లే తేవప్పెరుమాళ్ళయ్యగారు శైలినిగూడ నొక ప్రమాణముగా గ్రహింపదలపెట్టిరి. శయ్యాసౌష్ఠవమునుబట్టియు అద్వైతవిశిష్టాద్వైత మతభేదమునుబట్టియు ఏకాదశ ద్వాదశస్కంధములను వ్రాసిన నారయయే దశమోత్తర భాగమును వ్రాసెననియు అతడే ద్వితీయాదులు మూడింటినిగూడ ఉత్సన్నభాగములను పూరించెననియు వారివాక్కు.[38] ఈవిషయమునను వారు పొరపాటుపడిరని చెప్పకతప్పదు. భాగవతము వంటి పురాణమున కావ్యములోవలె ప్రతిపద్య సౌందర్యము కుదురదు. రసోల్బణమగు సమయమున సుందర పద్యములు వచ్చినను ఇతరసందర్భములలో అంత రసవంతములైన పద్యములుండవు. అంతమాత్రమున నీరసమైన పద్యములనెల్ల నితరులు వ్రాసిరని చెప్పుట ఒప్పుకొనజాలము.

పై వాదములవలెనే మతము, శైలివంటి మరియొక ఆధారమును వానిలికొలను సుబ్బారావుగారీ సందర్భమున ప్రతిపాదించి యున్నారు.[39] దానినిగూడ పరామర్శింప

వలసియున్నది. పోతన యతిప్రాసములలో నొక్కదానిని సీసములలో గీతములలో నిబంధనముగ వ్రాయునాచారము కలవాడనియు, సీసము యతులతోనున్నచో గీతము ప్రాసలతోను, సీసము ప్రాసలతోనున్న గీతము యతులతోను, గీతము రెండు పాదములు యతితోడను, మరిరెండు పాదములు ప్రాసములతోడను (క్వాచిత్కముగా) వ్రాయు నాచారము కలవాడనియు, ఈ నియమము భాగవతస్కంధములలో ఎందెంతవరకు పాటింపబడెనో తెలిసికొన్నచో పోతన కవితాభాగమేదో పరులభాగమేదో తేలుననియు వాసుదాసుగారు వ్రాసిరి.

పైవాదమువలెనే వీరివాదమును అంగీకారయోగ్యముకాదు. వీరు గుర్తించిన ఆ నియమమును పోతన పాటించుట శబ్దగత సౌందర్యసాధనకే కాని ఛందోగత నియమమునందలి నిష్ఠచేకాదు. అది ఆయన అనుప్రాస ప్రయత్నమునే సూచించును గాని యతి నియమమును సూచింపదు. 2, 3, 4 స్కంధములలోనేకాక పోతన రచనలని సుబ్బారావుగారును అంగీకరించు 8, 9 స్కంధములలో పెక్కుస్థలముల ఈ నియమమునకు భంగముకలదు.[40] ఆ పద్యములు సులభముగా సంస్కరింపదగినవేయనియు లేఖకప్రమాదము లేమోయనియు శేషాద్రి రమణకవులు సమర్థించుటకు ప్రయత్నించిరి.[41] కానీ అదిపొరపాటని చెప్పకతప్పదు. ఆ పద్యములెవ్వరును సంస్కరింప వలసినపని లేదు. అవి లేఖకప్రమాదములును కావు.

ఈ విధముగా భాగవత శైథిల్యమునకు కారణములనూహించి వివిధ స్కంధ రచనా విషయమున విద్వాంసు లనేకాభిప్రాయములు కలిగియున్నారు. వారిలో కొన్ని ఇచ్చట నొసగబడుచున్నవి.

వీరేశలింగం పంతులుగారు[42] – ఏది ఎట్లైనను పోతరాజకృత భాగవతము కొంతవరకు ప్రభ్రష్టమగుటయు, దానిని గంగనాదులు పూరించుటయు మాత్రము వాస్తవము. ఏ భాగము పోతకవి విరచితమో, ఏ భాగము తచ్ఛిష్యవిరచితమో, ఏయే పద్యములు శిష్యజనపూరితములో ఏవి ఎవరిదోషములో దృఢముగా నిర్ధారణ చేయజాలము.

నాగపూడి కుప్పుస్వామయ్యగారు[43] – దేవతార్చనపెట్టెలో పుస్తకము శిథిలమగుట, సింగభూపాలునిచే ఖననము చేయబడుట వీనిలో ఏకారణము నిజమైనను పోతరాజకృత భాగవతమున అక్కడక్కడ కొన్నిభాగము లుత్సన్నములగుటయు, వానిని నారయాదులు పూరించుటయు స్పష్టము. కానీ ఏయేభాగములు పోతన విరచిత

ములో ఏయే భాగము లితరకవులు చెప్పిరో వానిని నిర్దేశించుటకు తగిన ఆధారము లంతగా కానము. పోతనామాత్య విరచితములని గద్యములున్న స్కంధములలో ఇతరకవు లెంతవ్రాసిరో శైలీభేదమువలన కొంత ఊహింప వచ్చునుగాని ఇది యిత్థ మని నిర్ణయము చేయ సాధ్యముకాదు.

రాయదుర్గం నరసయ్యశాస్త్రిగారు[44]:- పోతనామాత్య విరచితములని గద్యము లున్న స్కంధములలో ఏయే స్థలముల ఏయే పద్యముల ఏయే కవు లెంతెంత రచియించిరో నిర్ణయింప రాకున్నది. శైలీభేదంబుల వలన కొంతకొంత ఊహింపవచ్చును గానీ కలరూపు నిశ్చయింప దురవగాహంబు.

వావిలికొలను సుబ్బారావుగారు[45]:- ఏ కారణమువలన నైననేమి భాగవత జీర్ణభాగములను పరులు పూరించిరి. రెండుమూడు నాలుగు స్కంధములలో దశమ స్కంధోత్తర భాగములో క్రిమిదష్టభాగ పూర్తి కాననగును. పంచమ, షష్ఠస్కంధ ములు పూర్తిగా పరపూరితములు.

శేషాద్రిరమణకవులు[46] :- ఏ కారణమువలన నైననేమి పోతనరచిత పది రెండు స్కంధములలో కొంతభాగము జీర్ణించినది. ద్వితీయస్కంధము తృతీయస్కంధ భాగములు ఏకాదశ ద్వాదశస్కంధములు మధ్యమధ్య క్రిమిదష్టములగు భాగములు పూర్తిచేసి భాగవతమునకొఱకై శ్రమచేసినవాడు పోతనామాత్యుని ప్రియశిష్యుడగు వెలిగందల నారయ. ఈతని జీవితాంతమున మరల భాగవతము భ్రష్టమగుటచే కొటోలు గంగన, సింగనలు చేయిచేసికొనవలసి వచ్చినది. లేకున్న గురుభక్తి శాలియగు నారయకవియే ఉన్నంతశక్తి వినియోగించి కృతార్థుడయ్యెడివాడు

చాగంటి శేషయ్య[47]:- భాగవతమును పోతన దశమ స్కంధము నందు త్తర భాగమున రుక్మిణితో విరసోక్తులాడుట వరకే రచించెను. అప్పటికాతనికి కాలమాసన్నము కాగా అంతటితో అది ఆగిపోయెను. ఆతని అనంతరమున వెలిగందల నారయ దానిని పూరించెను. దేవతార్చన పెట్టెలోపెట్టుటచే శిథిలమైన భాగములను గంగన సింగనలు పూరించిరి. వారును నారయయు సమకాలికులు.

ఇత్యాదిగా పండితులు వ్రాసిన వాక్యముల సారాంశ మీ క్రింద క్రోడీకరింప బడుచున్నది.

1. పోతన భాగవతము మొత్తమువ్రాసెను. అందు కొన్నిభాగములు శిథిలము లయ్యెను. శిథిలభాగములను 5 వ స్కంధమును గంగన, 6 వ స్కంధమును

సింగన, 11, 12 స్కంధములు నారయ పూరించిరి. వారు ముప్పురును సమ కాలికులు.

2. 5, 6, 11, 12 స్కంధములేకాక, 2, 3, 4 స్కంధములలో అక్కడక్కడ, దశమస్కంధోత్తర భాగములలో కొంతకూడ శిథిలమైనది. నారయయే దానిపూరణము కావించెను.

3. పోతన ప్రథమస్కంధమునుండి దశమస్కంధోత్తర భాగములో కొంత వరకు రచించి మరణించెను. మిగిలినది నారయ పూరించెను. నారయతర్వాత, 5, 6 స్కంధములు శిథిలము కాగా వానిని గంగన, సింగనలు పూరించిరి. ఈ నారయానంతర శైథిల్యగాథయే తత్పూర్వశైథిల్యగాథగా లోకమున వ్యాప్తమైనది.

పై వాదములన్నిటిలోను భాగవతము శిథిలమైనదను నంశము ప్రధానముగా చెప్పబడినది. దీనికి ప్రమాణమగు నాధారమేమియు కనబడదు. ఏ సందర్భమున నైనను బలవత్తరమైనది ఆంతరంగికసాక్ష్యము. గంగన సింగన నారయలలో ఏ యొక్కరును ఈశైథిల్యగాథనుగూర్చి ప్రస్తావింపలేదని ఇతఃపూర్వమే చెప్పబడినది. వారిలో సింగన ప్రత్యేకముగా కృత్యాదియు రచించెను. తాను షష్ఠస్కంధమును రచించుచుంటిననియే చెప్పుకొనెనుగాని శిథిలపూరణమని చెప్పలేదు. పంచమస్కంధమున గంగనయు ఏకాదశ ద్వాదశస్కంధముల నారయయు స్కంధాంతగద్యలందు తమకర్తృత్వమునే విస్పష్టముగా చెప్పుకొనిరి. ఏ సందర్భమునందును లేని ఈ శైథిల్యకథ విశ్వాసార్హము కాదు.

మరి అట్లు కాకున్ననో వారిరచనలు భాగవతమున నేల ప్రవేశించిన వను ప్రశ్నవచ్చును. భాస్కరరామాయణాదులలోవలె పోతన అనుమతితోనే వారాస్కంధములను రచించి యుండవచ్చును. కవి జీవితకాలముననే తదనుమతితో గ్రంథ భాగములు రచించుట సాహిత్యచరిత్రలో ఎక్కడను జరుగనిదికాదు. నాటి భాస్కరరామాయణము, ద్విపదభారతము తరువాత నేటి దేవీభాగవతము అందుల కుదాహరణములు. (తిరుపతి వేంకటకవుల దేవీభాగవతమునందలి నవమస్కంధమును వారియనుజ్ఞపై వేరొకరు వ్రాసిరి.) అట్లే పోతన జీవితకాలముననే ఆయనతో ఆత్మీయమగు సంబంధము కలిగిన ముగ్గురుకవులు ఆయన భాగవతారచనా భాగములను చదువుచుండగా విని తమకును ఆగ్రంథరచనలో కొంతభాగము చేకూరిన ధన్యుల మగుదుమని భావించి ఆయన నర్థించియుండవచ్చును. వారి అభ్యర్థనను త్రోసిపుచ్చజాలక కొన్ని

స్కంధములను రచించుటకు పోతన అంగీకరించియుండును. ఆముప్పురిలో నారయ ఆయన శిష్యుడగుటచే స్కంధాంత గద్యలందు పోతనామాత్య ప్రియశిష్య అని విశేషణమును వేసికొనెను. ఇంచుక పాండితీవిశిష్టుడును స్వతంత్రుడును అగుసింగన ఒకప్రత్యేక ప్రబంధమునకువలెనే షష్ఠస్కంధమునకు కృత్యవతరణిక రచించి అందు కవిస్తుతులలో పోతనకును నమస్కరించెను. పోతన అతనికి పూర్వుడగుటచే స్తుతించెనని దానికర్థము చెప్పనక్కరలేదు. ఆయనయందలి భక్తిగౌరవములచే స్తుతిపద్యము వ్రాసెనని సమాధానము చెప్పవచ్చును.[48] ఈ సందర్భమున మరియొక విషయము కూడ గమనింపవలసియున్నది. సింగన ధనవంతుడును, బలిష్ఠుడును, సరస్వతీ ప్రసాదదర్పుడును అని అతని కృత్యాదిపద్యములచే తెలియుచున్నది. అతడవకాశములభించిన తనకు స్వాతంత్ర్యమున్న మొత్తము భాగవతమే తెనిగించునంత ఉత్సాహము కలవాడు. అప్పటికిని వీలున్నంతలో తనస్వత్వమును ప్రకటించుకొనెను గంగన నారయలు పోతనయందు భయభక్తులు కలవారైన సింగన భక్తిమాత్రమే కలవాడు భాగవత శైథిల్యమే నిజముగా జరిగి పోతన మరణానంతరమే తత్పూరణము జరిగియున్నచో సింగనయే శిథిలస్కంధముల నన్నింటిని వ్రాసెడివాడు. అట్లు కనిపించుట లేదు కావున పోతన అతనికి 6వస్కంధమును మాత్రమే రచించుటకనుమతి ఇచ్చి యుండుననుకొనుట సమంజసము. గంగన నారయలును అట్లే పోతన అనుమతి గ్రహించియుందురు.

ఈవిధముగా పోతన కాలముననే ఆయన అనుమతితో ఇతరుల రచనలు జరిగియుండునని శ్రీపింగళి లక్ష్మీకాంతముగా రభిప్రాయపడిరి.[49] అటులే పోతనామాత్యుడు స్వయముగా తనశిష్యుల నను గ్రహింపగోరి భాగవతమునందలి చిన్న చిన్న స్కంధములను వ్రాయుడని వారికి ప్రసాదించియుండునని శ్రీఖండవల్లి లక్ష్మీరంజనము గారును వ్రాసినారు.[50] పోతన భాగవతమును రచియింప తలపుగొని తాను గ్రంథరచనకు ప్రారంభించి తొలినాల్గుస్కంధములు రచించి ఆవెనుక భక్తిరస ప్రధానములగు సప్తమాష్టమ నవమ దశమస్కంధములు తానే రచియింపదలచి మధ్యస్కంధములలో పంచమము గంగనకు షష్ఠము సింగనకు నిచ్చిరచియింపుడని చెప్పి వారు వానిని వ్రాయుచుండగా తాను దశమస్కంధాంతమునకు వచ్చుసరికి చాల కాలముపట్టుటచే ఏకాదశ ద్వాదశస్కంధముల తన శిష్యుడగు వెలిగందల నారయకొసగియుండునని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసియున్నారు.[51] ఈ విషయమునే ఇంకను చర్చించుచు నారయ పోతరాజు మరణించిన వెనుకనైన ఈరెండు

స్కంధములు రచియించి యుండవచ్చుననియు, పోతనరచిత భాగవతము శ్రీధర వ్యాఖ్య ననుసరించి అద్వైతపరముగా రచింపబడగా వెలిగందల నారయ రచనము విశిష్టాద్వైతపరముగా రచింపబడుటచే, పోతనకాలమున అదిరచింపబడి యుండదనియు, తదనంతరము నారయ భాగవతము పూర్తిగావించి శిష్యుడుకావున ఆ గ్రంథమును వ్యాప్తిలోనికి తెచ్చియుండవచ్చుననియు చారిత్రక పరిశీలనచే ఇదియే భాగవతరచనా క్రమముగా కన్పట్టు చున్నదనియు వారుభావించుచున్నారు ఏదైనను పోతనకాలము ననే వేరువేరుకవులచే ఆయాభాగములు ప్రారంభింపబడెనని నిర్ణయించుట సమంజస మనియు, కవిజీవితకారుని అభిప్రాయముకూడ నిదియేయనియు వేంకటరావుగారు వ్రాసినారు.[54]

విశిష్టాద్వైత పరానువాదము సంగతినటుంచి ఏకాదశ ద్వాదశస్కంధముల విపరీతసంగ్రహరచనను చూచినచో మహాద్భుతకల్పనలతో, మూలమును పెంచి రచించు గుణముకలిగిన పోతన తనసమక్షమున నారయ అటుకుపీకరించుటకు అంగీక రింపడనిపించును. వేంకటరావుగారు వ్రాసినట్లు పోతన తనఅవసానకాలమున ఇచ్చిన అనుమతితో ఆయన అనంతరము నారయ రచించి యుండవలయును. లేదా తన అవసానకాలము సమీపించుటవలన భాగవతమంతయు సంపూర్ణమైనదనుమాట విన వలెనని పోతనవాంఛించుటచే ఏదోవిధముగా పూర్తిచేయవలయునను ఆతృతతో నారయ సంగ్రహీకరించి యుండవచ్చును.

ఎటులైననేమి పోతనకాలమున పోతన అనుమతితోనే గంగన సింగన నార యలు వివిధభాగములు రచించిరని నిర్ధారణ చేయవచ్చును తరువాతికాలమున కొందరు కవులు తామును ఆభాగములు రచించుటకు ప్రయత్నించిరి పోతన కించుక తరువాతి వాడగు హరిభట్టు షష్ఠఏకాదశ ద్వాదశస్కంధము లను తెనిగించెను. నందిమల్లయ, ఘంటసింగయకవులు శృంగార షష్ఠమనుపేర షష్ఠస్కంధము నాంధ్రీకరించిరి. ఏకా దశ, ద్వాదశస్కంధములను అధునికులగు సంపన్మూడుంబ సింగరాచార్యులవారును, మిన్నికంటి గురునాథశర్మగారును రచించిరి ఇవన్నియు పోతన రచనలేని స్కంధము లకు సమర్థమగు ననువాదముచేయవలయునన్న కోరికతో వివిధకవులు కావించిన చంపూ నిర్మాణములు.



# 3. భాగవతానువాదవైఖరి - పోతన

తెలుగు దేశములోని సాహిత్యచరిత్రను పరిశీలించినచో భిన్నములగు మార్గ దేశి కవితాపథములు రెండు పండిత పామరజీవనసంస్కృతులతో కలిసిపోయి పురోగమించినట్లు కన్పట్టును. ఏ భాషాసాహిత్యములోనైనను ఇది సహజము. కవితా సృష్టి ప్రాథమికదశలో సులభమును, సరళమును నగు దేశిసాహితిపై జానపదుల కభిలాష హెచ్చుగా నుండును. సాంస్కృతికముగా నభివృద్ధి చెందుచున్న కొలది ప్రౌఢసాహిత్యముపై ఆకాంక్ష పెరుగుచుండును. మానవులలో ఈ రెండుపథముల వారు నెల్లప్పుడు నుందురు కావున సాహిత్యములోను అది తప్పదు. తెలుగు సాహిత్యములోని ప్రథమదశలో ప్రౌఢసారస్వతసృష్టి ప్రారంభమగునపుడు సంస్కృతమునుండి అనువదించుట మాత్రమే జరిగినది సాహిత్యపోషకులగు ఆనాటి రాజులును సాహిత్యస్రష్టలగు ఆనాటి కవులును (శివకవులుతప్ప) వైదిక ధర్మాభినిరతులగుటయే దానికి కారణము. సంస్కృతవాఙ్మయ మీభారతదేశములోని జాతి జీవనముతో పెనవేసికొనిపోవుటచేతను, మతధర్మరక్షణము తమ కర్తవ్యముగా ఆనాటి విజ్ఞానులందరును భావించుటచేతను, అదియునుగాక నాటికే పరిపుష్టమై విశ్వాదర్శ ప్రాయమైన అపారసాహిత్యము సంస్కృత భాషలోనుండుటచేతను తెనుగు కవుల దృష్టి ఆ సంస్కృత గ్రంథములను తెనుగులోనికి తెచ్చుటకై ప్రసరించినది.

హేతువేదైననేమి ఆంధ్రసాహిత్యములో మొదట సర్వధర్మసారమగు భారత ముదయించినది. నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగడలు దానికర్తలు. రామకథ రంగనాథరామాయణముగా, ఉత్తరరామాయణముగా భాస్కరరామాయణముగా తెనుగున రూపొందినది. సుప్రసిద్ధమగు భారతరామాయణ, భాగవతములలో పోతననాటికి భాగవత మొక్కటి ఎవ్వరును స్పర్శింపక మిగిలినది. కవిత్రయమునకు తీసిపోని బహుముఖప్రజ్ఞగల మహాద్భుత విద్వత్కవియగు శ్రీనాథుని చూపెలో దానిపై ప్రసరింపలేదు. ఎవరిచేతను అది అనువదింపబడకుండుట తనఅదృష్టముగా తలచి పోతన ఇట్లు భావించెను.

మ॥ ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విన్ పురాణావళుల్
తెనుగున్ జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో

తెనుగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుజేసెద పునర్జన్మంబు లేకుండగన్ !

పోతననాటి సంస్కృతాంధ్రగ్రంథసందర్భమును పరిశీలించినచో రెండువిధము లగు అనువాదపద్ధతులు గోచరించును. ఒకటి భారతకవు లనుసరించినపద్ధతి. రెండు శ్రీనాథు డనుసరించినపద్ధతి. భారతకవులు సంస్కృతభాగముల ననువదించునపుడు ఘట్టమును ఘట్టముగా ననువదించిరేకాని శ్లోకమును పద్యముగా ననువదింపలేదు. వారికి వివిధకథాభాగముల మూర్తిచిత్రణముపైనున్న శ్రద్ధ ప్రతిపద్య చిత్రణపై లేదు. కథను కథగా ననువదించుటయే వారి ఆశయము. యాదృచ్ఛికముగా నెక్కడనైన ఒక శ్లోకమున కొకపద్యము కనుపింపవచ్చును గాని అట్లు చేసి తీరవలయునన్న నియమమును వారు పాటింపలేదు. వారి అనువాదము సర్వస్వతంత్రము.

అనువాద చరిత్రలో భారతము తరువాత చెప్పదగినది నైషధము. దీనిని శ్రీనాథు డనువదించినపద్ధతి మరియొకవిధమైనది. విద్వదౌషధమని ప్రసిద్ధిగాంచిన నైషధము ప్రతిశ్లోకరమణీయమైనది. పురాణములలో వృత్తిరీతి గుణాద్యాలంకారిక సామగ్రీసమన్వితములగు శ్లోకములెక్కడనోగాని యుండవు. కానీ కావ్యములలో అట్లుకాదు. పదపదమునను ఏదోఒక విచిత్ర శిల్పముండును. దానికొఱకై శ్రీనాథు డవసరమైన చోట్ల యథామూలముగా ననుసరించియు, మూలమునకు కొన్నిచోట్ల మెరుగు దిద్దియు ప్రతిపదశ్రద్ధ తీసికొనెను. కావ్యశిల్పధర్మదృష్టితో అవసరమైనయెడల భారతకవులవలె స్వేచ్ఛాయుతమగు మార్పులను చేయుట కాతడు వెనుదీయలేదు భారతకవులలో లేని ప్రతిశ్లోకపరిశీలన శ్రద్ధ శ్రీనాథునిలో మిక్కుటముగా కన్పించుటకు తద్గ్రంథ స్వభావమే కారణము. అందుచే భారతము, కంటె నైషధము మూలమునకు దగ్గరగా కన్పించును. శ్రీనాథుని రచనలు చదువుచున్నచో అడుగడుగునను సంస్కృతమూలముతో నీవా నేనా యని పోటీపడుచున్నట్లు కన్పించును.

పోతన పై రెండుపద్ధతులకును మధ్యేమార్గ మనుసరించెను. రెండింటిపైనను ఆయన కాదరమే. నన్నయ తిక్కనాదులవలె ఒక్కొక్కచోట కథాభాగమును దీసికొని ఆయన స్వతంత్రానువాదము నొనర్చినాడు. మరియొకచో శ్రీనాథునివలె ప్రతి శ్లోకము నొకపద్యముగా తీర్చిదిద్దినాడు. శ్లోకముకంటె పద్యమున కధికతరసౌందర్యము తెచ్చుటకై అవసరమైనమార్పులు చేసినాడు. ఇంకకొన్నిచోట్ల అర్థవివరణము

కొఱకై మూలవ్యాఖ్యాతల అభిప్రాయములను గైకొని వానినికూడ తన రచనలలో చొప్పించినాడు. మరికొన్నిచోట్ల భావపరవశుడై మూలమును విడిచి స్వేచ్ఛగా విజృంభించి రసోద్రేకము న అనన్యకల్పనలు కావించినాడు. ఈవిధముగా భాగవతాను వాదములో ఆయన చూపించిన అఖండప్రజ్ఞా విశేషము కొన్నిఘట్టములలో ఈక్రింద పరిశీలింపబడుచున్నది.

పరమ మనోహరమగు రాసక్రీడాఘట్టమును సంస్కృతమున పారాశర్యుడు కూడ పారవశ్యముతోనే రచించినాడేమో అనిపించును. దీని ననువదించుటలో పోతన చూపిననేర్పు అపూర్వమును అనితరమును. గోపికలు కృష్ణుని వెదకుచు తరులతా గుల్మములను పృచ్ఛించుచు నిట్లనిరి.

శ్లో॥ దృష్టోవః కశ్చిదశ్వత్థ ప్లక్ష న్యగ్రోధనోమనః
నందసూను ర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః
కచ్చిత్ కురవకాశోక నాగపున్నాగచంపకాః
రామానుజో మానినీనాం గతో దర్పహరస్మితః"

ఈ విధముగా ఇంకను చెట్లపేర్లనేకము లిచ్చుటకలవు.

శ్లో॥ చూత ప్రియాళు పనసాసన కోవిదార
జంబీర బిల్వ వకుళామ్ర కదంబ నీపాః
యేఽన్యే పరార్థభవికా యమునోపకులాః
శంసంతు కృష్ణపదవీం రహితాత్మనా నః'

వీనికి రసవంతమగు పోతన అనువాదము చూడుడు.

సీ॥ పున్నాగ! కానవే పున్నాగవందితు
తిలకంబ! కానవే తిలకనిటలు
ఘనసార! కానవే ఘనసార శోభితు
బంధూక! కానవే బంధుమిత్రు
మనధ్మ! కానవే మన్మథాకారుని
వంశంబ! కానవే వంశధరుని

చందన! కానవే చందన శీతలు
కుందంబ! కానవే కుందరదను

తే॥ ఇంద్రభూజమ! కానవే ఇంద్రవిభవు
కువలవృక్షమ! కానవే కువలయేశు
ప్రియకపాదప! కానవే ప్రియవిహారు
ననుచు కృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.[4]

పున్నాగవందితుడు, తిలకనిటలుడు మొదలగు కృష్ణవిశేషణములను పోతన కల్పించి మూలములోని అర్థసౌందర్యమునకు శబ్దసౌందర్యము జోడుచేసెను. జగత్ప్రసిద్ధమగు నల్లనివాడు పద్మనయనమ్ములవాడు[5] అను పద్యమీసందర్భము లోనిదే. దానికి మూలములేదు.

సప్తమస్కంధారంభమున విష్ణుభావనాశక్తిని బోధించుచు నారదుడు ధర్మ రాజుతో నిట్లనెను.

శ్లో॥ తస్మాద్వైరానుబంధేన నిర్వైరేణ భయేనవా
స్నేహాత్ కామేనవా యుంజ్యాత్ కథంచి న్నేక్షతేపృథక్.[6]

దీనిని ఇంచుమించు యథామూలముగా ఇట్లు పోతన అనువదించెను.

ఆ॥ అలుకనైన చెలిమినైన కామంబున
నైన బాంధవముననైన భీతి
నైన దగిలి తలప నఖిలాత్ముడగు హరి
జేరవచ్చు వేరుసేయ డతడు.[7]

అఖిలాత్ముడగుహరి అనునది ఇందమూలకము. అది భావస్ఫూర్తికై వచ్చి నది. 'నేక్షతేపృథక్' అనునది వేరుసేయడు. అయినది. తరువాతి శ్లోకమిది.

శ్లో॥ యథావైరానుబంధేన మర్త్యస్తన్మయతా మియాత్
నతథా భక్తియోగేన త్వితి మే నిశ్చితామతిః[8]

కం॥ వైరానుబంధనంబున
జేరిన చందమున విష్ణు జిరతరభక్తిన్

జేరగరాదని తోచును.

నారాయణ భక్తియుక్తి నాచిత్తమునన్[9]

తన్మయతామియాత్ అనునది కేవలము చేరుట అనుక్రియతో సరిపెట్టబడినది. నిశ్చితా అనునది వదలబడినది.

శ్లో॥ కీటః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమనుస్మరన్
సంరంభ భయయోగేన విందతే తత్సరూపతాం.[10]

కం॥ కీటకము దెచ్చి భ్రమరము
పాటవమున బంభ్రమింప భ్రాంతంబై తత్
కీటకము భ్రమరరూపము
బాటించి వహించుగాదె భయయోగమునన్[11]

దీని అనువాదమిది.

తమనుస్మరన్ అనునది విడిచిపెట్టబడి భ్రాంతంబై అనునది చేర్చబడినది. ఆ తరువాత రెండుశ్లోకము లనువదింపబడలేదు. తదనంతరము.

శ్లో॥ గోప్యః కామాత్ భయాత్ కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః
సంబంధాత్ వృష్ణయః స్నేహాత్ యూయం భక్త్యా వయం నృప[12]

అనుశ్లోకము కలదు. దీని అనువాదము సుప్రఖ్యాతమైనది.

శా॥ కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రింగంటి మెల్లైన ను
ద్ధామధ్యానగరిష్ఠుడైన హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా![12]

సామాన్యముగా పోతన శైలియనిన ఇట్లు ధారాళముగా ప్రసన్నముగా నుండును ఇందులోని చివరిపాదమునకు పైశ్లోకములో మూలములేదుగాని 'భక్త్యేశ్వ రేమనః'[14] అని మాత్రము దాని ముందుశ్లోకములో కలదు. దానినే పోతన ప్రపంచించెను.

ఈ పద్ధతిలో సమయసముచితముగా, రసభరితముగా, పోతన చేసిన అనువాదములో ఆయా విధానములకు ప్రత్యేకముగా నుదాహరణము లీ క్రింద చూపబడు చున్నవి.

యథామూలానువాదము :- యథామూల మనుమాట నిజమున కెప్పుడును సార్థకముకాదు. ఛందోనుగుణముగా నడువవలసిన పద్యములలో పదమునకు పదమెప్పుడు నవతరింపదు. ఒక భాషనుండి మరియొక భాష కనువాదము జరుగు నప్పుడు యథామూల భావానువాదమే కాని యథామూల పదానువాద ముండదు. కానీ సంస్కృతమునుండి తెనుగున కనువదించు నప్పుడు సంస్కృతములోని పదములు ధారాళముగా తెనుగులోనికి ప్రవేశించు నవకాశముండుటచే మూలములోని పదభావములు రెండును పరిశీలించుట విమర్శకుల కలవాటైనది. ఏదైనను మూలము నెట్టి మార్పులు చేర్పులు చేయక చాలవర కున్నది ఉన్నట్లుగా అనువదించుట కిందుదాహరణములు కాంచవచ్చును. అనగా ఏ ఒకటి రెండు పదములలోనో మార్పు కన్పించినను అర్థములో మాత్ర మెట్టిమార్పు నుండదన్నమాట.

శ్లో॥ ఏతేఽళిన స్తవ యశోఽఖిల లోకతీర్థం
గాయంత ఆదిపురుషానుపదం భజంతే
ప్రాయోహ్యమీ మునిగణా భవదీయముఖ్యా
గూఢం వనేఽపి నజహం త్యనఘాత్మ దైవం.

శ్లో॥ నృత్యంత్యమీ శిఖిన ఈడ్యముదా హరిణ్యః
కుర్వంతి గోప్యఇవ తేప్రియ మీక్షణేన
సూక్తైశ్చ కోకిలగణా గృహ మాగతాయ
ధన్యా వనౌకస ఇయాన్హి సతాంనిసర్గః[15]

సీ॥ నిఖిలపావనమైన నీకీర్తి పాడుచు
నీతుమ్మెదలు వెంట నేగుదెంచె
నడవిలో గూఢుండవైన ఈశుడవని
మునరి కొల్వగవచ్చె మునిగణంబు
నీలాంబరముతోడ నీవు జీమూతమ
వని నీలకంఠంబు లాడదొడగె

ప్రియముతో జూచు గోపికల చందంబున
నిను జూచె నదె హరిణీచయంబు

ఆ॥ నీవు విందవనుచు నిర్మల సూక్తులు
పల్కుచున్న విచట పరభృతములు
నేడు విపినచరులు నీవు విచ్చేసిన
ధన్యులైరిగాదె తలచి చూడ[16]

'ఈడ్యముదా' అని సంస్కృతములో నున్నదానికి 'నీలాంబరముతోడ నీవు జీమూతమవని' అని అనువదించుట నిపుణభావ ప్రస్తారమునకు తార్కాణము. నెమళ్ల సంతోషముతో నర్తించినవని మూలమున నుండగా ఆ సంతోషమునకు బలరాముడు నీలాంబరుడగుట కారణమని పోతన మనోహరముగా కలిపెను. నీలాంబరుడు జీమూతమువలె కన్పించును కావున మయూరములు ఆడదొడగినవి. ఈ కల్పన మధికతర స్ఫూర్తిని సార్థకముగా నందించినది ఈ ఒక్కటితప్ప మిగిలిన పద్యమంతయును యథామూలము.

2. శ్లో॥ ధన్యేయ మద్య ధరణీతృణ వీరుధ స్త్వత్
పాదస్పృశో ద్రుమలతాః కరజాభిమృష్టాః
నద్యోఽద్రయః ఖగమృగా స్సదయావలోకైః
గోప్యోఽంతరేణ భుజయోరపి యత్ స్పృహా శ్రీః[17]

సీ॥ నీపాదములు సోకి నేడు వీరుత్తృణ
పుంజంబుతో భూమి పుణ్యయయ్యె
నీనఖంబులు సోకి నేడు నానాలతా
తరుసంఘములు కృతార్థంబులయ్యె
నీకృపాదృష్టిచే నేడు నదీశైల
ఖగమృగంబులు దివ్యకాంతి జెందె
నీ పెన్నురము మోవ నేడు గోపాంగనా
జనముల పుట్టువు సఫలమయ్యె

ఆ॥ వని యరణ్యభూమి నంకించు పసులను
మిత్రజనులు దాను మేపుచుండి
నళినలోచనుండు నదులందు గిరులందు
సంతసంబు మెరయ సంచరించె[18]

పైశ్లోకమునకు సీసపాదములు మాత్రమే అనువాదము. సంస్కృతములో అన్నింటికి ధన్య శబ్దమే అన్వయించుకొన వలసియుండగా తెనుగున పుణ్యయయ్యె, కృతార్థములయ్యె, కాంతిజెందె, సఫలమయ్యె అని భిన్నపదములు వాడబడినవి. అంతకుమించి మిగిలిన దంతయు యథామూలము

3. శ్లో॥ సాధయిత్వాఽజాతశత్రోః స్వంరాజ్యం కితవైర్హృతం
అజీహన ద్భ్యజ్ఞ సేన్యాః కచస్పర్శక్షతాయుషః

శ్లో॥ యాజయి త్వాశ్వమేధై స్తం త్రిభి రుత్తమకల్పకైః
తద్యశః పావనం దిక్షు శతమన్యో రివాతనోత్.[19]

శా॥ పాంచాలీ కబరీ వికర్షణ మహాపాప క్షతాయుష్కులన్
చంచద్గర్వుల ధార్తరాష్ట్రుల నని౦ జంపించి గోవిందు డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకు కల్పించెన్ మహాఖ్యాతి చే
యించెన్ మూడుతురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్.[20]

కితవైర్హృతం అనునది వదలబడి చంచద్గర్వుల అనునది తెనుగున చేర్చబడినది. మూలములోని 'పావనం' తెనుగున 'మహా' యైనది. ఇవి అల్పమైన మార్పులు. మిగిలినదంతయు మూలానుసరణమగు రమణీయానువాదము.

4. శ్లో॥ అథ స్తవోత్పన్న మిదం కళేబరం
నధారయిష్యే శితికంఠగర్హిణః
జగస్య మోహాద్ధి విశుద్ధి మంధసో
జుగుప్సిత స్యోద్గిరణం ప్రచక్షతే.[21]

మ॥ జను డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన అన్నంబు స
య్యాన వెళ్ళించి పవిత్రుడై నగతి దుష్టాత్ముండవై ఈశ్వరున్

ఘను నిందించిన నీ తనూభవ యసంగా నోర్వ నీ హేయభా
జనమైనట్టి శరీరమున్ విడిచి భాస్వచ్ఛుద్ధి బొందెదన్[22]

'ఉద్గిరణము' అనుదానికి 'వయ్యన వెళ్ళించి, పవిత్రుడనై నగతి' అనుట చాల సుకుమారమును, సుందరమును. 'దుష్టాత్ముండవై' అనునది అధికముగా కలిపిన పదము.

5. శ్లో॥ విరచితాభయం వృష్ణిధుర్య తే
చరణ మీయుషాం సంసృతే ర్భయాత్
కరసరోరుహం కాంత కామదం
శిరసి ధేహి నః శ్రీకరగ్రహం.[23]

ఆ॥ చరణసేవకులకు సంసారభయమును
బాపి శ్రీకరంబు పట్టుగలిగి
కామదాయియైన కరసరోజంబు మా
మస్తకముల నునిచి మనుపు మీశ[24]

విరచితాభయం, వృష్ణిధుర్య, అనునవి తెనుగున విలువబడినవి. 'సంసార భయమును బాపి' అనునది చాలునని పోతన భావించి యుండవచ్చును.

6. శ్లో॥ ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనం
ఫణిఫణార్పితం తేపదాంబుజం
కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్.[25]

ఉ॥ గోవులవెంట ద్రిమ్మరుచు గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవగజాలి శ్రీదనరి దుష్ట భుజంగ ఫణాలతాగ్ర సం
భావితమైన నీచరణపద్మము చన్నులమీద మోపి త
ద్భావజ పుష్ప భల్ల భవ బాధ హరింపు వరింపు మాధవా![26]

'ఫణాలతాగ్ర' ఫణాతలాగ్రమైన ఇంకను రమ్యముగానుండును. 'హృచ్ఛయం' అను దానికి 'భావజపుష్ప భల్ల భవ బాధ సార్థకమైన అనువాదము. ఈసమాసము లోని భకారము బాధాతీవ్రతను స్పష్టముగా వ్యక్తము చేయగలదు.

యథామూలప్రాయము :- పూర్తిగా యథామూలముగా ననువదించుట అన్ని సందర్భములలోను సాధ్యముకాదు ఆది అవసరమని కవియును భావింపడు. యథామూలప్రాయముగా ననువదించుటయే తరచుగా కాననగును. వీనిలో మూలభావమున కొన్ని అల్పమగు మార్పులు చేయబడియుండును. అనగా ఇది యథామూలానువాదమునకు ఒక్కడుగు దూరములో నుండును. దీనిని సన్నిహితానువాదమనినను అనవచ్చును. ఈపద్ధతి కుదాహరణము లీక్రింద చూపబడుచున్నవి.

1. శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.[27]

కం॥ నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసు పదములకు నమ
స్కారముచేసి వచింతు ను
దార గ్రంథంబు దళిత తను బంధంబున్.[28]

సంస్కృతములో అనుష్టుప్వలెనే తెనుగున కందము మిక్కిలి చిన్నఛందము. తెనుగులో మూలములోని 'జయ' మనుమాట లేకున్నను పోతన కత్యంత సహజమైన అంత్యప్రాసఅను నొక శబ్దాలంకారము విజృంభించుట కిది నిదర్శనము.

2. శ్లో॥ నయద్వచ శ్చిత్రపదం హరే ర్యశో
జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్
తద్వాయసం తీర్థ ముశంతి మానసా
నయత్ర హంసా విరమం త్యుశిక్షయాః.[29]

మం॥ హరినామ స్తుతిసేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమైయుండ దయోగ్య దుర్మద నదత్కాకోల గర్తాకృతిన్.[30]

మూలమునందలి 'ఉశిక్షయ' విడువబడినను వాయసముకంటె కాకోలము ఈ సందర్భమున శక్తిమత్తరమగు పదమగుట గమనార్హము. వాయసమనిన కాకి. కాకోలమనిన మాలకాకి.

3. శ్లో॥ హంతాస్మిన్ జన్మని భవాన్మామాద్రష్టు మిహార్హతి
అవిపక్వకషాయాణాం దుర్దర్శోఽహం కుయోగినాం.[31]

ఉ॥ ఏలకుమార! శోషిలగ నీజననంబున నన్నుగాన గా
జాలవు నీవు కామముఖషట్కము నిర్దళితంబుసేసి ని
ర్మాలితకర్ములైన మునిముఖ్యులు గాని కుయోగి గానగా
జాలడు నీదుకోర్కి కొనసాగుటకై నిజమూర్తి జూపితిన్.[32]

4. శ్లో॥ ....విద్వాన్ చక్రే సాత్వత సంహితాం
యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమపురుషే
భక్తి రుత్పద్యతే పుంసః శోకమోహభయాపహా.[33]

మ॥ అవనీచక్రములోన నేపురుషుడే యామ్నాయమున్ విన్నమా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పించగా జాలు భ
క్తివిశేషంబు జనించు నట్టి భువన క్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుడు దాగల్పించె నేర్పొప్పగన్[34]

'భాగవతము'నకు పర్యాయపదముగా 'సాత్వతసంహిత' యనునది మూలమున తరచుగా కన్పట్టును. తెనుగులోని భువనక్షేమంకరంబైన యనునది రమ్యమగు విశేషణము.

5. శ్లో॥ సవా అద్యతనా ద్రాజన్ పరతః పంచమేఽహని
కళేబరం హాస్యతి స్వం తచ్చ భస్మీభవిష్యతి
దహ్యమానేఽగ్నిభి ర్దేహే పత్యుః పత్నీ సహోటజే
బహిస్థ్సితా పతిం సాధ్వీ తమగ్ని మనువేక్ష్యతి.[35]

మ॥ ఉటజాంతఃస్థల వేదికన్ నియతుడై యున్నాడు నేడాదిగా
నిటపై నేనవనాడు మేన్విడువగా నిజ్యాగ్ని యోగాగ్ని తత్
పటుదేహంబు దహింప జూచి నియమప్రఖ్యాత గాంధారి యి
ట్టటుపో నొల్లక ప్రాణవల్లభునితో నగ్నింబడుం భూవరా![36]

మూలములో ఉటజముకూడ తగులబడినట్లుండగా తెలుగులో ఏలకో అది వదలబడినది.

6. శ్లో॥ కకుద్మతో విద్ధనసో దమిత్వా
స్వయంవరే నాగ్నజితీ ముహాహ
తద్భగ్నమానానపి గృధ్నతోఽజ్ఞాన్
జఘ్నే క్షత శ్శస్త్రభృత స్వదస్త్రైః[37]

చ॥ పరువిడి భూరి సప్తవృషభంబుల ముక్కులుగుట్టి దర్పల
స్ఫురణ సహింపజాలక నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి
ద్ధరణిపు నందనన్ వికచతామరసాక్షి బ్రమోదియై స్వయం
వరమున బెండ్లియాడె గుణవంతుడనంతు డనంతశక్తితోన్.[38]

'అవిద్ధనసోః దమిత్వా' అను మూలమునకు ముక్కులుగుట్టి అనునది చక్కని జాత్యానువాదము.

7. శ్లో॥ హిరణ్యం రజతం శయ్యాం వాసాం స్యజినకంబళాన్
హయాన్ రథానిభాన్ కన్యా ధరాం వృత్తికరీమపి.[39]

కం॥ అజిన పట రత్నకంబళ
రజత మహా రజత తిల ధరావరకన్యా
గజ తురగ రథములను సద్
ద్విజకోటికినిచ్చె, పెంపు దీపింపంగన్.[40]

'వృత్తికరీ' మాత్రము తెనుగున వదలబడెను.

8. శ్లో॥ కింవా శివాఖ్య మశివం నవిదు స్త్వదన్యే
బ్రహ్మాదయ స్తమవకీర్య జటాః శ్మశానే
తన్మాల్య భస్మ నృకపాల్య వసత్ పిశాచై
ర్యేమూర్ధభి ర్దధతి తచ్చరణావసృష్టం.[41]

చ॥ పరగ జితాస్థి భస్మ నృకపాల జటాధరుడున్ బరేత భూ
చరుడు పిశాచయుక్తు డని శర్వు నమంగళుగా దలంప రె
వ్వారు నొక డీవుదక్కమరి వాక్పతి ముఖ్యులు నమ్మహాత్ము ప
చ్చరణ సరోజరేణువులు సమ్మతిదాల్తురు మస్తకంబులన్.[42]

'సరోజరేణువులు' మూలమునకు మెరుగు తెచ్చినవి.

9. శ్లో॥ కర్ణౌ పిధాయ నిరయాద్యదకల్ప ఈశే
ధర్మావిత ర్యసృణిభి ర్నృభి రస్యమానే
ఛింద్యాత్ ప్రసహ్య రుశతీ మసతాం ప్రభుశ్చే
జ్జిహ్వా మసూ నపి తతో విసృజేత్ సధర్మః.[43]

చ॥ నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గు దిరస్కరించు న
క్కలుషుని జిహ్వ గోయఁదగుగా కటు సేయఁగ నోపఁడేని దా
బొలియుట యొప్పు రెంటికి ప్రభుత్వము చాలమి కర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁబోడియటందురు ధర్మవర్తనుల్.[44]

'అసృణి' తెనుగున కలుషుఁడగుట ఒక చమత్కార యుతమగు అనువాదము. 'రుశతి' (అకల్యాణవాదిని-శ్రీధర) వదలబడినది.

10. శ్లో॥ గోత్రం త్వదీయం భగవాన్ వృషధ్వజో
దాక్షాయణీత్యాహ యదా సుదర్మనాః
వ్యపేత నర్మస్మిత మాశు తద్ధ్యహం
వ్యుత్స్రక్ష్య ఏతత్ కుణపం త్వదంగజం.[45]

చం॥ వరవృషకేతనుండు భగవంతుఁడు నైన హరుండు నన్ను నా
దరపరిహాసవాక్యముల దక్షతనూభవయంచు బిల్వ నే
బురవుర బొక్కుచున్ ముదము బొందక నర్మవచః స్మితంబులన్
దొరగుదు నీ తనూజనను దుఃఖముకంటెను చచ్చుటొప్పగున్.[46]

త్వదంగజమగు కుణపమును వదులుదునని మూలమునుండగా 'నీ తనూజనను దుఃఖముకంటెను చచ్చుటొప్పగన్' అని తెనుగున రచింపబడినది. మూలములోనిది అర్థసౌందర్యముతో ప్రకాశించుచుండగా తెలుగులోనిది నుడికారపు పెంపుతో అలరుచున్నది.

11. శ్లో॥ క్రుద్ధ స్సుదష్టోష్ఠపుట స్సధూర్జటి
ర్జటాం తటిద్వహ్నిసటోగ్రరోచిషం
ఉత్కృత్య రుద్ర స్సహ సోత్థితో హసన్
గంభీరనాదో విససర్జ తాం భువి.[47]

శా॥ ఆద్యుం డుగ్రుడు నీలకంఠు డిభదైత్యారాతి దష్టోష్ఠుడై
మాద్యద్దుర్భరి మృగేంద్రఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్ని శిఖా సముచ్ఛ్రయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్
సద్యః క్రోధముతోడ బుచ్చి వయిచెన్ తన్మాచక్రమధ్యంబులన్.[48]

మూలమునందలి గంభీరనాదము తెనుగున మాద్య ద్దుర్భరిమృగేంద్రఘోష మగుట ఒక విశేషము.

12. శ్లో॥ ఉశీనరేంద్రం విధినా తథాకృతం
పతిం మహిష్యః ప్రసమీక్ష్య దుఃఖితాః
హతాస్స్మ నాథేతి కరై రురో భృశం
ఘ్నంత్యో ముహు స్తత్పదయో రుపాపతన్.[49]

శ్లో॥ రుదంత్య ఉచ్చై ర్దయితాంఘ్రి పంకజం
సించంత్య అస్రైః కుచకుంకుమారుణైః
విస్రస్తకేశాభరణా శ్శుచం నృణాం
సృజంత్య ఆక్రందనయా విలేపిరే.[50]

ఆ॥ ............జీవరహితుడగు నుశీనరేంద్రు
జుట్టి బంధుజనులు సొరిది నుండగ భయా
క్రాంతలగుచు నతని కాంతలెల్ల[51]

శా॥ ప్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తాబ్జంబులు సాచి మోదుకొనుచున్ హానాథ! యంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వడిన్ ప్రాణేశు పాదంబుపై
అస్తోక స్తనకుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షింపుచున్.[52]

బహుప్రస్తావోక్తులతోడ నేడ్చుట సహజమును, రమణీయమును నగు అమూలకము.

13. శ్లో॥ తత్సాధు మన్యేఽసురవర్య దేహినాం
సదా సముద్విగ్నధియా మసద్గ్రహాత్

హిత్వాత్మపాతం గృహ మంధకూపం
వనం గతో యద్ధరి మాశ్రయేత.[53]

ఉ॥ ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటి నూతిలోపలన్
దెళ్ళక పీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్న తని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లము జేర్చి కారడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ![54]

'అసద్గ్రహాత్' అనుదానికి అహంమమేతి మిథ్యాభి నివేశనాత్ అని శ్రీధరులు వ్యాఖ్యానింప 'పీరు నేమను మతిభ్రమణంబు' అని పోతన అనువదించుట విచారణీయము.

14. శ్లో॥ జితం త్వయైకేన జగత్త్రయం ప్రభో
విజృంభణ త్రస్త సమస్త ధిష్ణ్యపమ్
నతస్య చింత్యం తవ నాథ చక్ష్మహే
నవై శిశూనాం గుణదోషయోః పదమ్[55]

శా॥ శుభ్రఖ్యాతివి నీప్రభావము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో
షభ్రూయుగ్మ విజృంభణంబున దిగీశవ్రాతమున్ బోరులన్
విభ్రాంతంబుగజేసి ఏలితి కదా విశ్వంబు వీడెంత ఈ
దభ్రోక్తుల్ గుణ దోష హేతువులుచింతం బొంద నీకేటికిన్.[56]

'శిశువృత్తము' గుణదోషవిషయము కాదని మూలమున నుండ తెనుగున నది ఈ దభ్రోక్తుల్ గుణ దోషహేతువులు అని అనువదింపబడినది. భావమించుక మారినది.

15. శ్లో॥ యస్మాన్వాత్మ నీదం నిజమాయ యార్పితం
క్వచిత్ విభాతం క్వచ తత్తిరోహితం
అవిద్ధదృ క్సాక్ష్యుభయం తదీక్షతే
సఆత్మమూలోఽ వతుమాంపరాత్పరః[57]

కం॥ ఒకపరి జగములు వెలినిడి
ఒకపరి లోపలికి గొనుచు నుభయము దానై

సకలార్థ సాక్షియగున
య్యకలంకుని నాత్మమూలు నర్థి దలంతున్.[58]

అవిద్ధదృక్, పరాత్పర శబ్దములకు బదులు తెనుగున అకలంక శబ్దము వచ్చినది.

16 శ్లో॥ నయస్య దేవా ఋషయః పదంవిదు
ర్జంతుః పునః కోఽర్హతి గంతు మీరితుం
యథా నటస్యాకృతిభి ర్విచేష్టితో
దురత్యయానుక్రమణః స్పమావతు.[59]

కం॥ నర్తకునిభంగి పెక్కగు
మూర్తులతో నెవ్వడాడు మునులున్ దివిజుల్
కీర్తింప నేరరెవ్వని
వర్తన మెరు లెరుగ రట్టివాని నుతింతున్.[60]

దురత్యయానుక్రమణః అనుదానికి ఎవ్వనివర్తన మెరులెరుగ రనుట జాత్యమగు రమ్యానువాదము. దీనిని మొదటిపాదమున కనువాదమన్నను కాదనలేము. వర్తనపదము అన్నింటిని ఇముడ్చుకొన్నది.

వ్యాఖ్యానావలంబనము :- అనువాదసమయమున చాల శ్లోకముల కర్థనిర్ణయము చేయుటకు పోతన వ్యాఖ్యానముల సాహాయ్యము గైకొనెను. కొన్నియెడల వ్యాఖ్యలలోని వాక్యములకు వాక్యములే తెనిగించిన సందర్భములుకూడ గలవు. అందును ప్రధానముగా ఆయన శ్రీధరవ్యాఖ్యనే గ్రహించినట్లు కన్పించుచున్నది. విమర్శకులందరును ఈవిషయమున ఏకకంఠముతోనే ఉన్నారు. దానికి కొన్ని ఉదాహరణములు.

1. అథావిశత్ స్వభవనం సర్వకామ మనుత్తమమ్.
ప్రాసాదా యత్ర పత్నీనామ్ సహస్రాణిచ షోడశ.[61]

శ్రీధరవ్యాఖ్య :- .... .... ....సహస్రాణిచ షోడశేతి చకారా దష్టోత్తర శతాధికానీతిజ్ఞేయం

చకారమునకు శ్రీధరుడిచ్చిన అర్థము తెనుగున గ్రహింపబడినది.

వ. తదనంతరంబ అష్టోత్తర శతషోడశ సహస్ర సౌవర్ణ సౌధకాంతం
బైన శుద్ధాంతభవనంబు సొచ్చి[62]

2. శ్లో॥ పశ్యతో దశమాస్యస్య తత్రైవాంతర్దధే హరిః
తత స్సర్వగుణోదర్కే సానుకూల గ్రహోదయే.[63]
శ్రీ. వ్యా :– ....దశమాస్యస్య దశమాసపరిచ్ఛేద్యస్య....
ఇందలి అర్థము పదసహితముగా తెనుగున గ్రహింపబడినది.

వ. అంతం గొన్నిదినంబులకు అభిమన్యుకాంతాగర్భంబునందున్న
డింభకుడు దశమాసపరిచ్ఛేద్యుండై[64] ...

3. శ్లో॥ గోప్యాదదే త్వయి కృతాగసి దామతావ
ద్యాతే దశాశ్రు కలిలాంజనసంభ్రమాక్షం
వక్త్రం నినీయ భయ భావనయా స్థితస్య
సా మాం విమోహయతి భీరపి యద్బిభేతి.[65]
శ్రీ వ్యా....త్వయి కృతాగసి దదిభాండస్ఫోటం కృతవతి

ఉ॥ కోపముతోడ నీవు దధికుంభము భిన్నముసేయుచున్నచో
గోపిక త్రాటగట్టిన వికుంచిత సాంజన బాష్పతోయ ధా
రాపరిపూర్ణ వక్త్రము కరంబుల బ్రాముచు వెచ్చనూర్చుచున్
బాపడవై నటించుట కృపాపర! నామది చోద్యమయ్యెడిన్.[66]
తెనుగులోని దదికుంభభేదనము వ్యాఖ్యలోని దనుట స్పష్టము.

4. శ్లో॥ కేచిదాహు రజం జాతం పుణ్యశ్లోకస్య కీర్తయే
యదోః ప్రియ స్యాన్వవాయే మలయ స్యేవ చందనం.[67]
శ్రీ వ్యా:– పుణ్యశ్లోకస్య ప్రియస్య యుధిష్ఠిరస్య....

కం॥ మలయమున జందనము క్రియ
వెలయగ ధర్మజునికీర్తి వెలయించుటకై
ఇలపై నభవుడు హరి యదు
కులమున నుదయించెనండ్రు కొందరనంతా![68]

పుణ్యశ్లోకస్య అను మూలమునకు ధర్మజుని అని తెనుగున అనువదించుట వ్యాఖ్య ననుసరించియే.

5. యద్దోర్షు మా ప్రణిహితం గురుభీష్మకర్ణ
ద్రౌణి త్రిగర్త శలసైంధవ బాహ్లికాద్యైః
అస్త్రా ణ్యమోఘమహిమాని నిరూపితాని
నోపస్పృశు ర్నృహరిదాస మివాసురాణి[69]

శ్రీ. వ్యా :- ఆసురాణి హిరణ్యకశిపుప్రేరితాని అస్త్రాణి నృహరిదాసం ప్రహ్లాద మివేతి....

మ॥ అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గానికైవడి కృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుతద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగుమాధవుదయాదృష్టిన్ నరేంద్రోత్తమా![70]

6. శ్లో॥ ప్రయుక్తాన్ భోజరాజేన మాయినః కామరూపిణః
లీలయా వ్యనుదాత్తాం స్తాన్ బాలః క్రీడనకానివ.[71]

శ్రీ. వ్యా :- ........ క్రీడనకాన్ తృణాదినిర్మితాన్ మృగాన్ సింహాదీన్ యథా.

మ॥ చిరకేళీరతి బాలకుల్ తృణములన్ సింహాదిరూపంబులన్
గరమొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునన్
కరుణాతీతుల కామరూపులగు నక్రూంసప్రయుక్త క్షపా
చరులం గృష్ణుడు సంగరస్థలములం జక్కాడె లీలాగతిన్.[72]

'క్రీడక శబ్దమునకు' శ్రీధరుడిచ్చిన వివరణము కూడ ఇట అనువదింపబడుట కాంచనగును.

7. శ్లో॥ సమాహుతా భీష్మకకన్యయాయే
శ్రియ స్సవర్ణేన బుభూష యైషాం
గాంధర్వవృత్త్యా మిషతాం స్వభాగం
జహ్రే పదం మూర్ధ్ని దధత్ సువర్ణః[73]

శ్రీ. వ్యా:- .... .... సువర్ణః సుపతనః యద్వా సువర్ణ ఇవ స్వభాం సుధా మిత్యర్థః యద్వా శ్రియః రుక్మిణ్యాః తేన సమాహోతాః యేశిశుపాలాదయః కిమర్థం భీష్మక కన్యయా సహ తేషాంబుభూషయా జరాసంధాదీనాం తద్వివాహోత్సవేన .... ....

సీ॥ ఘనుడు విదర్భేశుడనఁనొప్పు భీష్మకు
వరసుతామణి నవవారిజాక్షి
పద్మసమాన రూపశ్రీవిభాసిత
కమనీయభూషణ కంబుకంఠి
చతురస్వయంవరోత్సవ సమాగతచైద్య
సాల్వమాగధముఖ్య జనవరేణ్య
నికర సమావృత ప్రకటసచ్చారిత్ర
రుక్మిణి ననమాన రుక్మకాంతి

తే॥ అమరగుప్తామృతంబు విహంగవిభుడు
గొనినకైవడి మనుజేంద్రకోటి దోలి
కమలనాభుండు నిజభుజాగర్వమలర
దెచ్చి వరియించె నతని నుతింపవశమె![74]

సువర్ణశబ్దమునకుగల బహువిధవ్యాఖ్యానము తెనుగున గ్రహింపబడినదనుట స్పష్టము. అందుచేతనే సీసమువంటి పెద్దపద్యము వ్రాయవలసివచ్చినది.

8. శ్లో॥ తం కిం కరోమీతి గృణంత మాహ
బద్ధాంజలిం భగవాన్ భూతనాథః
దక్షం సయజ్ఞం జహి మద్భటానాం
త్వమగ్రణీ రుద్రభటాంశకో మే.[75]

శ్రీ. వ్యా :- హేరుద్రభట యుద్ధకుశల మద్భటానాం త్వమ్ అగ్రణీస్సన్ సయజ్ఞం దక్షం జహి బ్రహ్మతేజో దుర్జయమితి మామంస్థాః త్వం మే అంశకః

చం॥ గురుభుజశౌర్య ! భూరిరణకోవిద ! మద్భటకోటికెల్ల నీ
వరయ వరూధినీవరుడవై చని యజ్ఞముగూడ దక్షునిన్
బరిపరిసేసి త్రుంపు మట బ్రాహ్మణ తేజ మజేయమంటివే ?
నరిదిమదంశసంభవుడవై తగు నీకు నసాధ్యమెయ్యెడన్ ?[76]

బ్రాహ్మణ తేజమజేయమంటివేన్ అను ప్రశ్న శ్రీధరునకును ఆయనననుసరించి పోతనకును కలిగినదేగాని వ్యాసునకు కలిగినది కాదు.

9. శ్లో॥ సత్యాశిషోహి భగవం స్తవపాదపద్మ
మాశీ స్తథానుభజతః పురుషార్థమూర్తేః
అప్యేవమార్య భగవాన్ పరిపాటి దీనా
న్నశ్రేవ వత్సక మనుగ్రహకాతరోఽస్మాన్.[77]

శ్రీ. వ్యా:- .... .... యథా ఉస్రా నవప్రసూతాధేనుః
వత్సంక్షీరం పాయయతి వృకాదిభ్యో రక్షతిచ తద్వత్.

వ. ఇట్లు నిశ్చితంబైనను సకాములైన దీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు సేయింపుచు వృకాదిభయంబువలన రక్షించు చందంబునన్ గామప్రపదుండవై సంసారభయంబువలనం బాపుదువు. [78]

వృకంబులనుండి రక్షించుట శ్రీధరుని వివరణము. దానిని పోతన అనువదించె ననుట స్పష్టము.

10. శ్లో॥ ప్రాప్త శ్చండాలతాం శాపాత్ గురోః కౌశికతేజసా
సశరీరో గతస్స్వర్గం అద్యాపి దివిదృశ్యతే
పాతితోఽవా క్శిరాదేవై స్తేనైవ స్తంభితోబలాత్
త్రిశంకవో హరిశ్చంద్రో విశ్వామిత్రవసిష్ఠయోః
యన్నిమిత్త మభూ ద్యుద్ధం పక్షిణో ర్బహువార్షికం[79]

శ్రీ.వ్యా....విశ్వామిత్రో రాజసూయదక్షిణాచ్ఛలేన హరిశ్చంద్రం సర్వస్వ మపహృత్య యాతయామాస

డక్కడ పోతన గ్రహించెననుటకు ఉదాహరణము లీక్రింద క్లుప్తముగా నొసగబడు చున్నవి.

1. శ్లో॥ లోకా స్సపాలా యస్యేమే వహంతి బల మీశితుః
యథా గావో నసిప్రోతా స్తంత్ర్యాం బద్ధోపదామభిః[85]
విశిష్టాద్వైతవ్యాఖ్య–నసిప్రోతాః సూచీభిన్ననాసికాయాం
సూత్రేణప్రోతాః తంత్ర్యాంవాదీర్ఘరజ్జౌదామభిః కంఠరజ్జుభిః

వ. సూచీభిన్న వాసికలందు రజ్జుప్రోతంబులగుచు కంఠరజ్జువుల కట్టం బడిన బలీవర్ధంబులంబోలె.[86]

ఇందలి సూచీ భిన్ననాసిక, కంఠరజ్జు శబ్దములు విశిష్టాద్వైత వ్యాఖ్యనుండి గ్రహింపబడినవి.

2. శ్లో॥ తేనాత్మనాత్మాన ముపైతి శాంతం
ఆనంద మానందమయో వసానే
ఏతాం గతిం భాగవతీం గతోయః
సవై పునర్నేహ విషజ్జతేఽంగ[87]

వి. వ్యా– .... అవసానే సర్వాత్మకే బ్రహ్మణి వాసుదేవే శాంతిం యాతి

వ. ...... ఆనందమయుండై ఆనందంబునన్ పరమాత్మరూపంబైన వాసుదేవబ్రహ్మమందు కలియును.[88] —

భాగవతగతి యనగా వాసుదేవ బ్రహ్మమునందు కలియుట అను అర్థము విశిష్టాద్వైత వ్యాఖ్యానుసరణమే.

భావచాలనము :- మూలములో సూత్రప్రాయముగా, క్లుప్తముగా నున్న అనేకాంశములను చాలసందర్భములలో పోతన చక్కగా పెంపుచేసియున్నాడు. శ్రీధరాదివ్యాఖ్యాన సాహాయ్యముతోనే గాక కేవల స్వకీయకల్పన సామర్థ్యముచేగూడ ఎన్నోవిషయములను మూలాతిశయముగా ఆయన వర్ణించియున్నాడు అర్థవివరణా త్మకమగు భావచాలనకుతూహలమే దీనికి కారణము. ఆ విధముగా మూలమును బాగుగా విస్తరించిన కొన్ని సందర్భముల కుదాహరణము లీక్రింద నొసగబడుచున్నవి.

1. శ్లో॥ అంగుష్ఠమాత్ర మమలం స్ఫురత్ పురటమౌళినం
అపీచ్యదర్శనం శ్యామం తటిద్వాసస మచ్యుతం
శ్రీమద్దీర్ఘ చతుర్బాహుం తప్తకాంచనకుండలం
క్షతజాక్షం గదాపాణి మాత్మన స్సర్వతోదిశం.89

సీ॥ మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగుకైవడి మేని
పైనున్న పచ్చని పటమువాఁడు
గండభాగంబుల కాంచన మణిమయ
మకరకుండలకాంతి మలయువాఁడు
శరవహ్నినణఁగించు సంరంభమున జేసి
కన్నుల నునుగెంపు గలుగువాఁడు
బాలార్కమండల ప్రతిమాన రత్నహా
టకవిరాజిత కిరీటంబువాఁడు

తే॥ కంకణాంగద వనమాలికా విరాజ
మాను డసమాను డంగుష్ఠమాత్రదేహుఁ
డొక్క గద జేతదాల్చి నేత్రోత్సవముగ
విష్ణు డావిర్భవించె నవ్వేళయందు. 90

'శ్యామం తటిద్వాససం అనునది మొదటి పాదమైనది. మూలములో వసనమును మాత్రమే తటిత్తుతో పోల్చగాపోతన మేనునుగూడ మేఘముతో పోల్చి ఒకచక్కని పూర్ణోపమను సిద్ధముచేసెను. 'తప్తకాంచనకుండలం' అనునది గండభాగంబుల.... అని రెండవపాదమైనది. మూలములోని కాంచనమునకు పోతన మణులనుగూడ తాపటముచేసి వాని కాంతి గండభాగముల మీద మలయించి ఒకనూతన సౌందర్యమును తెచ్చినాడు. 'క్షతజాక్షం' అనుదానికి శ్రీధరులు వ్యాఖ్యానించుచు 'అహో మద్భక్తస్యాపిగర్భే అస్త్రాదిపీడేతి సంరంభాదత్యారక్తనేత్రం' అన్నాడు. దానిని గ్రహించి పోతన 'శరవహ్నినణఁగించు .... అని మూడవపదమును కూర్చినాడు. 'అత్యారక్తనేత్రం' అనుటకంటె 'నునుగెంపు' అనుటలో ఒక అలవోకతనమును లెక్కలేని తనమును వ్యక్తమగుచున్నది. 'స్ఫురత్ పురటమౌళినం' అనునది 'బాలార్కమండల....' అను నాల్గవపాదమైనది. ఇక్కడ బాలార్కమండల ప్రతి

మానమైనది రత్నమో, హాటకమోకాదు. వానిచే విరాజితమైన కిరీటము. మూలము లోని 'స్ఫురత్' తెనుగున ఇంతసాగినది. మూలములోని 'శ్రీమద్దీర్ఘ చతుర్బాహుం' వదలబడి 'కంకణాంగద వనమాలికా విరాజమానుడ'ను విశేషణమువచ్చినది. ఇట్లర్థ యుతముగా అధికతర సౌందర్యసంపాదకముగా తెనుగు పెంపొందినది.

2. శ్లో॥ శరచ్ఛశికరై ర్మృష్టం మానయన్ రజనీముఖం
గాయన్ కలపదం రేమే స్త్రీణాం మండలమండనః.[91]

సీ॥ శరదాగమారంభ సంపూర్ణపూర్ణిమా
చంద్ర సాంద్రాతపోజ్జ్వలిత మగుచు
వెలయుబృందాటవీ వీథియం దొకనాడు
రాసకేళీ మహోల్లాసుడగుచు
రుచిర సౌభాగ్య తారుణ్య మనోరమ
స్ఫూర్తి జెన్నొందిన మూర్తిదనర
సలలితముఖచంద్ర చంద్రిక గోపికా
నయనోత్పలముల కానందమొదవ

తే॥ భవ్య చాతుర్యభంగి త్రిభంగి యగుచు
అబ్జనాభుండు సమ్మోహ మతిశయిల్ల
లీలబూరించు వరమురళీనినాద
మర్థి వీతెర విని మోహితాత్మలగుచు [92]

చం॥ పతులు మరందులున్ సుతులు బావలునత్తలుమామలున్ సము
న్నతి వలదన్న మానత మనంబున కృష్ణపదాబ్జ సేవనా
న్వితరతి గోపకామినులు వేచనుదే గరుణాపయోధి శో
భితగతి రానకేళి సలిపెన్ దరుణీ నవపుష్ప చాపుడై [93]

శరచ్చంద్ర కిరణోజ్జ్వలమైన రజనియందు స్త్రీమండలమండనుడై పాడుచు రమించెననిమాత్రమే మూలమున కలదు. తెనుగుపద్యములు రెండింటిలోను గల కల్పనయంతయు పోతన చేసినదే

3. శ్లో॥ సాందీపనే స్వకృత్రోప్తం బ్రహ్మాధీత్య సవిస్తరం
తస్మై ప్రాదా ద్వరం పుత్రం మృతం పంచజనోదరాత్.[94]

మ॥ నిలువొప్పంగ షడంగయుక్త మహితామ్నాయంబు జౌపష్టివి
ద్యలు సాందీపనిచే నెరింగి చెలువొందన్ విన్న మాత్రంబులో
పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురుల్
కలరే లోకవిడంబనార్థమగు లీలల్ గావె యమ్మేటికిన్ [95]

ఉ॥ మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబున బొంది పోయి యా
పంచజనోదరస్థుడగు బాలకు దేశికు నందనున్ ప్రభో
దంచితలీలదెచ్చి గురుదక్షిణగా నతిభక్తియుక్తి న
ర్పించె గురుండు చిత్తమున పెంపెసలార మురారి వెండియున్ [96]

మూలములోని ఒకచిన్న అనుష్టుప్పు రెండు వృత్తములైనది 'బ్రహ్మాధీత్య సవిస్తరం' అను దానిని మత్తేభముగామార్చి పోతన కృష్ణుడేకసంధాగ్రాహి యనియు విద్యాభ్యాసములు లీలామాత్రమనియు ప్రవచించెను. ప్రభాసతీర్థమున గురుపుత్రుడు మృతిచెందిన కథను ఉత్పలమాలలో కలిపెను.

4. శ్లో॥ ఇమంలోక మముంచైవ రమయన్ సుతరాం యదూన్
రేమే క్షణదయా దత్త క్షణస్త్రీ క్షణసౌహృదః[97]

సీ॥ సంపూర్ణ పూర్ణిమా చంద్రచంద్రిక లొప్పు
రమణీయ శారద రాత్రులందు
సలలిత కాంచన స్తంభ సౌధోపరి
చంద్రకాంతోపల స్థలములందు
మహితకరేణుకా మధ్య దిగ్గజముల
గతిని సౌదామినీ లతలనడిమి
నీలమేఘంబులీలీల ముక్తామధ్య
లాలిత శక్రనీలముల భాతి

తే॥ సతతయౌవన సుందరీయుత విహారు
డగుచు సతులెంద రందర కన్నిరూప

ములకు గ్రీడించె పెక్కుబ్దములు సెలంగి
నందనందను డభినవానందలీల. 98

పైదాని వలెనే ఇచ్చటను అనుష్టుప్ శ్లోకమొకటి సీసమైనది. ఇందలి ఉపమ లన్నియు పోతనవే యగుట గమనార్హము. రజనీ సౌధవర్ణనమంతయు పోతన కల్పి నదే. ఆయన వర్ణనా చాతుర్యము నిక్కడ అతిశయముగా కాంచవచ్చును.

5. శ్లో॥ తతో౽తికాయ స్తనునాస్పృశన్ దివం
సహస్రబాహు ర్ఘనరుక్ త్రిసూర్యదృక్
కరాళదంష్ట్రో జ్వలదగ్ని మూర్ధజః
కపాలమాలీ వివిధోద్యతాయుధః 99

సీ॥ అభ్రంలిహాదభ్ర విభ్రమా భ్రభ్రమ
కృన్నీల దీర్ఘ శరీరమమర
ప్రజ్వలజ్జ్వలనదీప్త జ్వాలికాజాల
జాజ్వల్యమాన కేశములు మెరయ
చండదిగ్వేదండ శుండాభదోర్దండ
సాహస్రధృతహేతి సంఘ మొప్ప
వీక్షణత్రయలోక వీక్షణద్యుతిలోక
వీక్షణలతతి దుర్నిరీక్షముగను

తే॥ క్రకచ కఠిన కరాళ దంష్ట్రిలు వెలుంగ
ఘనకపాలాస్థి వనమాలికలును దనర
అఖిలలోక భయంకరు డగుచు వీర
భద్రు డుదయించె మారట రుద్రుడగుచు 100

ప్రకారపునరుక్తితో మొదటిపాదము - మూలములోలేని ఒక అద్భుతత్వ మును సంతరించుకొని వీరభద్రుని మూర్తిని శాబ్దికచిత్రణముగా మన కన్నులముందు నిల్పినది. 'జ్వలదగ్ని మూర్ధజః' అనునది సీసము రెండవపాదముగా కొంచెము పొడుగుసాగి మరింతప్రజ్వలన గుణమును సంపాదించుకొన్నది. 'సహస్రబాహుః వివిధోద్యతాయుధః' అను రెండు సమాసములును కలిసి మూడవపాదమైనవి ఆ

బాహువులకు దిగ్వేదండ శుండాభత్వము అధికముగా వచ్చినది. 'ఘనరుక్ త్రిసూర్య దృక్' అనునది సీసము నాల్గవపాదమైనది. మూలములోని 'కరాళదంష్ట్రలు' తెనుగున క్రకచకఠినతను తెచ్చుకొన్నవి. మొత్తముమీద మూలముకంటె అఖిలలోక భయం, కరత్వముతో తెనుగుపద్యము విజృంభించినది.

6. శ్లో॥ బ్రహ్మణ్య శ్శీలసంపన్నః సత్యసంధో జితేంద్రియః
ఆత్మవ త్సర్వభూతానాం ఏకః ప్రియసుహృత్తమః
దాసవ త్సన్నతార్యాంఘ్రిః పితృవద్దీనవత్సలః
భ్రాతృవ త్సదృశే స్స్నిగ్ధో గురు ష్వీశ్వరభావనః[101]

సీ॥ తనయందు నఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాడు
పెద్దలబొడగన్న భృత్యునికైవడి
జేరినమస్కృతుల్ సేయువాడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన సేసి మరలువాడు.
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులగావ జింతించువాడు

తే॥ సములయెడ సోదరస్థితి జరుపువాడు
దైవతములంచు గురువుల దలచువాడు
లీలలందును బొంకులు లేనివాడు
లలితమర్యాదుడైన ప్రహ్లాదుడధిప ![102]

'ఆత్మవత్ సర్వభూతానాం' అనునది 'తనయందు....' అనుపాదమైనది. 'దాసవత్ సన్నతార్యాంఘ్రిః' అనునది పెద్దల బొడగన్న.... అను పాదమైనది. మూలములోనిది కేవలభావము. తెనుగులోనిది భావచిత్రము. తెలుగు చదవగనే ప్రహ్లాదుడు పెద్దలనుకాంచుట, వెంటనే భృత్యునివలె దగ్గరకు జేరి నమస్కరించుట కంటిముందు దృశ్యమువలె కన్పించును. 'శీలసంపన్నః, జితేంద్రియః, అను రెండును 'కన్నుదోయికి....' అని భావచిత్రముగా రూపొందినవి. 'పితృవద్దీనవత్సలః' అను

నది, తల్లిదండ్రులభంగి.... అని అనూదితమైనది. సత్యసంధః అనునది 'లీలలందును బొంకులు లేనివాడు' అని అధికతర విశేషణముతో నొప్పినది. నవ్వులకైన అబద్ధ మాడడనుటచే ప్రహ్లాదుని శీలము మరింత పరిపుష్టమైనది. ఇత్యాదిగా మూలశ్లోకము లకు తెనుగుపద్య మన్నివిధముల మెరుగుపెట్టిన దమటలో సందేహములేదు.

7. నౌమీడ్య తేఽభ్రవపుషే తటిదంబరాయ
గుంజావతంస పరిపింఛ లసన్ముఖాయ
వన్యస్రజే కబళ వేత్ర విషాణ వేణు
లక్ష్మశ్రియే మృదుపదే పశుపాంగజాయ.[103]

సీ॥ శంపాలతికతోడి జలదంబుకై వడి
మెరుగుటొల్లియతోడి మేనివాని
కమనీయమృదులాన్నకబళవేత్ర విషాణ
వేణుచిహ్నంబుల వెలయువాని
గుంజావినిర్మిత కుండలంబులవాని
శిఖిపింఛవేష్టిత శిరమువాని
వనపుష్పమాలికా ప్రాతకంఠమువాని
నళినకోమల చరణములవాని

ఆ॥ కరుణగడలుకొనిన కడకంటివాని గో
పాలబాలు భంగి పరుగువాని
నగుమొగంబువాని ననుగన్నతండ్రిని
నినుభజింతు మ్రొక్కి నీరజాక్ష. [104]

మూలములోని 'అభ్రవపుషేతటిదంబరాయ' అనురెండు పదములనుకలిసి విశేషణవిశేష్య సహితమగు పూర్ణోపమగా పోతన తీర్చినాడు. ఇట్టి రచనావైఖరి ఇంతకు ముందు మనము గుర్తించినదే. సంస్కృత కబళము తెనుగున కమనీయ మృదులాన్న కబళమగుట విశేషము. 'మృదుపదే' అనునది నళిన కోమల చరణము లుగా అయినది. ఇట్లే అడుగడుగునను క్రొత్తదనముతో పోతన అనువాదవైఖరి మూలమును విస్మరింపజేయును.

8. బిభ్రద్వేణుం జఠరపటయో శ్శృంగవేత్రేచ కక్షే
వామే పాణౌ మసృణకబళం తత్ఫలా న్యంగుళీషు
తిష్ఠన్మధ్యే స్వపరసుహృదో హాసయ న్నర్మభి స్స్వైః
స్వర్గే లోకే మిషతి బుభుజే యజ్ఞభు గ్బాలకేళిః.[105]

సీ॥ కడుపున దిండుగాఁగట్టిన వలువలో
లాలితవంశనాళంబు జొనిపి
విమలశృంగంబును వేత్రదండంబును
జాఱిరానీక డాచంకనిఱికి
మీఁగడపెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత మొనయనునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ళసందులను దావెలయనిఱికి

ఆ॥ సంగడీలనడుమ జక్కనఁగూర్చుండి
నర్మభాషణముల నగవు నెరపి
యాఁగభోక్త కృష్ణు డమరులు వెరగంద
శైశవంబు మెరసి చల్దిగుడిచె.[106]

'జఠరపటయోః' అనునది 'ఉదరవస్త్రయోర్మధ్యే'యని శ్రీధరులు వ్యాఖ్యానింప కడుపున దిండుగాగట్టిన వలువలో' అని పోతన అనువదించెను. ధోవతి కట్టుకొనుటలో అనేక విధములుకలవు. దిండుగా కట్టుట అనగా దట్టివలె బిగించికట్టుట. పరుగెత్తుటకు, దూకుటకు, ఆడుకొనుటకు సుకరముగా నుండును కృష్ణుడు క్రీడాపరుడై యుండుట ఇచట సందర్భము కావున దిండుగాకట్టినట్లు పోతన వర్ణించెను. శ్లోకములోని 'వామే' అనునది కాకాక్షిన్యాయమున కక్షపాణులు రెంటికిని విశేషణమగునని శ్రీధరులు చెప్పియుండుటచే రెంటికిని 'డాచంక, డాపలిచేత' అని పోతన అనువదించెను. మూలములో 'మసృణకబళమ'ని ఉండ శ్రీధరులు దానిని మసృణం స్నిగ్ధందధ్యోదన కబళం' అనియు, తత్ఫలాన్యంగులీషు అనుదానికి తదుచితాని బిల్వామలకాది ఫలాని అంగుళీసంధిషు అనియు వ్యాఖ్యానించిరి. తెనుగుదనము కృష్ణునకును అంటించి పోతన మీగడపెరుగుతో మేళవించిన చల్దిముద్దలు, ఊరు

గాయలు ప్రవేశపెట్టినాడు. అది అత్యంతసహజము. కవినాటి దేశకాలపరిస్థితులు, ఆచారములు కావ్యమున ప్రవేశించుట తరచు జరుగుచుండును. శ్రీధరవ్యాఖ్య సహాయముతో కొంత, తన భావనాశక్తితో మరికొంత ఇట్లనేకవిధముల పోతన మూలము విస్తరించినాడు.

9. క్వచిత్ గాయతి గాయత్సు మదాంధాళిష్వనువ్రతైః
ఉపగీయమానచరితః సఖిసంకర్షణాన్వితః
క్వచిచ్చ కలహంసానాం అనుకూజతి కూజితం
అనునృత్యతి నృత్యంతం బర్హిణం హాసయన్ సఖీన్
మేఘగంభీరయావాచా నామభిర్దూరగాన్ పశూన్
క్వచి దాహ్వయతి ప్రీత్యా గోగోపాల మనోజ్ఞయా.[107]

సీ॥ ఒకచోట మత్తాళియూథంబు జుమ్మని
మ్రోయంగ జుమ్మని మ్రోయుచుండు
ఒకచోట కలహంసయూథంబు కూడి క్రేం
కృతులుసేయంగ క్రేంకృతులు సేయు
ఒకచోట మదకేకియూథంబు లాడంగ
హస్తాబ్జములు త్రిప్పి యాడదొడగు
ఒకచోట వనగజయూథంబు లాడంగ
నయముతో మెల్లన నడువజొచ్చు
ఆ॥ క్రౌంచచక్రముఖరఖగము లొక్కొకచోట
పలుక వానియట్ల పలుకగదిసి
పులుల సింహములను పొడగాని యొకచోట
పరచు మృగములందు తరచుగూడి.[198]

వ॥ మరియును [109]

సీ॥ రాపూర్ణచంద్రిక! రాగౌతమీగంగ!
రమ్మ భగీరథరాజతనయ!
రాసుధాజలరాశి! రామేఘమాలిక!
రమ్మచింతామణీ! రమ్మసురభి!

రామనోహారిణి! రాసర్వమంగళ!
రాభారతీదేవి! రాధరిత్రి!
రాశ్రీమహాలక్ష్మి! రామందమారుతి!
రమ్యమందాకిని! రాశుభాంగి!

ఆ॥ అనుచు మరియుఁగలుగు నాఖ్యలుఁగల గోవు
లడవిలోన దూరమందు మేయ
ఘనగభీరభాష గడునొప్ప జీరు నా
భీర జనులు బొగడ పెంపునెగడ [110]

'అనుకూజతి, అనునృత్యతి' అని మూలములో నుండ దానిని వివరించి క్రేంకృతులు పేయుననియు, హస్తాబ్జములు త్రిప్పి ఆడుననియు పోతన రచించెను. వనగజయోధము విషయము నాల్గవపాదమున పోతన కల్పనము. తరువాత గోవులను పేరులు పెట్టి పిలుచుటలో, ఆపేర్లన్నియు పోతన భావనాజన్యములే. 'నామభిః' అని మాత్రము సూచించి వ్యాసుడువదలగా పోతన దాని నిట్లు విస్తరించెను. అందమైన పేర్లు సృష్టించుటతో పద్యమునకు నెక్కడలేని అందము వచ్చినది. మూలవిస్తరకారునకు సామర్థ్యముండవలసిన దిట్టిచోటులనే. అది పోతనలో పరిపూర్ణత్వము నొందినదనుటకు ఇట్టిపద్యములే తార్కాణములు.

మూలభిన్నత :- అనువాద సమయమున మూలములోని పదములకును భావములకును భిన్నమగుపదములను, భావములను చేర్చిన సందర్భము లక్కడక్కడ కన్పట్టుచున్నవి. అట్టివాని కుదాహరణములు కొన్ని.

1. అహో మహీయసీ జంతోః జీవితాశా యయా భవాన్
భీమాపవర్జితం పిండ మాదత్తే గృహపాలవత్. [111]

కం॥ బిడ్డలకు బుద్ధిసెప్పని
గ్రుడ్డికి పిండంబు వండికొనిపొం డిదె పై
బడ్డాడని భీముం డొర
గొడ్డెములాడంగ గూడు గుడిచెద వధిపా! [112]

మూలములోని 'గృహపాలవత్' (కుక్కవలె) పోతనవదలి, పైబడ్డాడు. ఒరగొడ్డెములాడు మొదలగుజాతీయములను వాడి చక్కని నుడికారము పెంపును ప్రదర్శించెను.

2. కాలస్యచ గతిం రౌద్రాం విపర్యస్తరుధర్మిణః
పాపీయసీం నృణాం వార్తాం క్రోధలోభానృతాత్మనాం
జింహ ప్రాయం వ్యవహృతం శాఠ్యమిశ్రంచ సౌహృదం
పితృ మాతృ సుహృద్ భ్రాతృదంపతీనాంచకల్కనం.[113]
కన్యావిక్రయిణం తాతం సుతం పిత్రోరపోషకం
బ్రాహ్మణాన్ వేదవిముఖాన్ శూద్రాన్ వై బ్రహ్మవాదినః[114]

సీ॥ ఒకకాలమున బండు నోషధీచయము వే
ఱొకకాలమున బండకుండునండ్రు
క్రోధంబు లోభంబు క్రూరత బొంకును
దీపింప నరులు వర్తింతు రండ్రు
వ్యవహారములు మహావ్యాజయుక్తములండ్రు
సఖ్యంబు వంచనా సహితమండ్రు
మగలతో నిల్లాండ్రు మచ్చరించెదరండ్రు
సుతులు తండ్రుల తెగజూతురండ్రు

తే॥ గురుల శిష్యులు దూషించి కూడరండ్రు
శాస్త్రమార్గంబు లెవ్వియు జాగవండ్రు
న్యాయపద్ధతి బుధులైన నడవరండ్రు
కాలగతి వింతయై వచ్చె కంటెనేడు.[115]

'విపర్యస్త బుతుధర్మిణః' అనునది మొదటి పాదమైనది. 'కన్యావిక్రయిణం తాతం' అనునది విడువబడినది. సుతం పిత్రోరపోషకం అనుదానికి 'సుతులు తండ్రుల తెగజూతురండ్రు' అనుట అనువాదము కానేరదు. 'బ్రాహ్మణాన్' అను పాదము 'శాస్త్రమార్గంబులెవ్వియు జాగవండ్రు' అనుటతో రమ్యత్వమే వచ్చినది. తేటగీతిలోని ఒకటవ, మూడవ పాదములు పోతన కల్పనలయ్యునుమూలతుల్యములై సుందరముగా నున్నవి

3, భగవాన్ బ్రహ్మ కార్త్స్న్యేన త్రిరన్వీక్ష్య మనీషయా
తదధ్యవస్య త్కూటస్థో రతి రాత్మన్యతో భవేత్.[116]

మ॥ విసుధాంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ముమ్మారు నె
మ్మనమందున్ దలపోసి ఎంతయు పరామర్శించి మోక్షంబు ద
క్కినమార్గంబుల వెంట లేదనుచు భక్తిన్ జింతజేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుడగుచున్ దన్మార్గ నిర్ణేతయై.[117]

మోక్షము తక్కినమార్గంబులవెంట లేదనుట అమూలకము. ఈ ప్రాంతమున వ్యాఖ్యానించుచు శ్రీధరులు యోగాది మోక్షమార్గములు చాలగలవనియు భక్తివలెనే శివసుఖ రూపమును, నిర్విఘ్నమును అయిన మార్గము మరొకటిలేమి అదియే సమీచీనమనియు పలికియున్నారు. వ్యాసుని అభిమతముగూడ ఇదియే అనుట దీనిపై శ్లోకముచేతనే తెలియుచున్నది. పోతన ఇక్కడ మూలదూరముగా వ్రాసెననక తప్పదు.

4. పరతోవత్సపై ర్వత్సాం శ్చారయన్ వ్యహర ద్విభుః
యమునోపవనే కూజద్ద్విజసంకులితాంఘ్రిపే.[118]

చ॥ వర యమునానదీ సలిలవర్ధిత సౌరభయుక్త పుష్పమే
దుర మకరంద పానపరితుష్ట మధువ్రతయూథ మాధవీ
కురవక కుంద చందన నికుంజములందు మయూర శారికా
పరభృత రాజకీర మృదుభాషలభంగి చెలంగి పల్కుచున్.[119]

మూలము మొదటి పాదముయొక్క అర్థమును పోతన పూర్తిగా వదలెను. మూలమున కృష్ణుడు మయూరాది భాషలభంగి పల్కుట లేదు.

5. కౌమారీం దర్శయం శ్చేష్టాం ప్రేక్షణీయాం వ్రజౌకసాం
రుదన్నివ హసన్ ముగ్ధబాలసింహావలోకనః
సఏవాధివయో లక్ష్మ్యా నికేతం సితగోవృషం
చారయ న్ననుగాన్ గోపాన్ రణద్వేణు రరీరమత్ 120

ఉ॥ శ్రీరమణీమనోవిభుడు సింహకిశోరముబోలె లీలగా
ఘోరథశన్ రమావిమలమందిరమున్ ఖురుడించు గోత్రిన్.

వారకమేపుచున్ దరళవంశరవస్ఫుట మాధురీసుధా
సారముచేత గోపజన సంఘములన్ ముదమంద జేయుచున్.[121]

పైన రెండు శ్లోకములలోని చేష్టలకు వయోభేదమున్నది. పోతన దానిని పాటింపక రెంటికిని కౌమారదశనే అన్వయించెను. మొదటి శ్లోకములోని 'రుదన్నివ' లోని భావమును కూడ విడిచెను.

6. సవై మనః కృష్ణపదారవిందయోః
వచాంసి వైకుంఠ గుణానువర్ణనే
కరౌ హరేర్ మందిరమార్జనాదిషు
శ్రుతీ చకారాచ్యుతసత్కథోదయే

ముకుంద లింగాలయ దర్శనే దృశౌ
తద్భృత్య గాత్ర స్పర్శేఽంగ సంగమం
ఘ్రాణంచ తత్పాద సరోజ సౌరభే
శ్రీమత్తులస్యా రసనాం తదర్పితే

పాదౌ హరేః క్షేత్రపదాను సర్పణే
శిరో హృషీకేశపదాభివందనే
కామంచ దాస్యే నతు కామకామ్యయా
యథో త్తమ శ్లోక జనాశ్రయా రతిః.[122]

సీ॥ చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద
పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణుమందిరమార్జనము లంద
శ్రవములు హరికథా శ్రవణమంద
చూపులు గోవింద రూపవీక్షణ మంద
శిరము కేశవ నమస్కృతులయంద
పదము లీశ్వరగేహ పరిసర్పణము లంద
కామంబు చక్రి కైంకర్యమంద

తె॥ సంగ మచ్యుతజనగుణ సంగమంద
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద

రసన తులసీ దళములందు రతులు పుణ్య
సంగతులయందు ఆ రాజచంద్రమునకు.[123]

'తద్భృత్యగాత్ర స్పర్శేంగసంగమం' అనుదానికి 'సంగమచ్యుతజనగుణ సంగమంద' అని పోతన తెనిగించెను. గాత్రము గుణము సమానార్థకములు కానేరవు. అంగసంగము మనిన కరచరణాద్యవయవ సంబంధమనియు, గాత్రస్పర్శన మనిన ఆలింగనహస్త స్పర్శనాది యనియు శ్రీధరులు స్పష్టముగా వ్యాఖ్యానించి యున్నారు. 'సతుకామకామ్యయా' అనునది తెనుగున వదలబడినది.

7, గతేఽథ దుర్వాససి సోఽంబరీషో
ద్విజోపయోగాతి పవిత్ర మాహరత్
ఋషే ర్విమోక్షం వ్యసనంచ బుధ్వా
మేనే స్వవీర్యంచ పరానుభావం.[126]

ఆ॥ అవనిసురుడు గుడువ అతిపవిత్రంబైన
వంటకంబు భూమివరుడు గుడిచె
తపసి నెగులు మాన్ప దానెంతవాడను
హరికృపా మహత్వ మనుచు దలచి.[127]

శ్లోకమునకును పద్యమునకును చివరి రెండుపాదములలో భావమొక్కటియైనను పలుకుబడిలో భేదమున్నది మూలములో మేనేస్వవీర్యంచ పరానుభావం అని కలదు. దానిని శ్రీధరులు వ్యాఖ్యానించుచు 'స్వవీర్యంచధైర్యాదిలక్షణం పరానుభావం భగవతః ప్రభావంమేనే' అనిరి. పోతన స్వవీర్యం అనుదానిని వదలి 'తానెంతవాడను హరికృపామహత్వ మనుచు దలచి' అనుటతో ఒక చక్కని నుడికారపు సౌందర్యము వచ్చినది.

8. క్షుత్ తృట్ శ్రమో గాత్రపరిభ్రమశ్చ
దైన్యం క్లమ శ్శోకవిషాదమోహాః
సర్వే నివృత్తాః కృపణస్య జంతోః
జిజీవిషోః జీవజలార్పణాన్మే [128]

మ॥ బలవంతంబగు నీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో
నలయం దేమియు నీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా

జలదానంబున నేడుమాను ననుచున్ సర్వేశ్వరా ధీనుడై
జలముల్ వోసెను రంతిదేవుడు దయన్ జండాలపాత్రంబునన్[129]

మూలమునను సరించి క్షుత్తృడాదులు నివృత్తమైనది రాజునకు. బ్రదుకగోరు ఒక జీవికి ప్రాణాధారమగు నీరువోయుటచే తనకు ఆకలిదప్పులు నివర్తించునని ఆతడు భావించెను. కాని తెనుగుపద్యమున వీని (పుల్కసుని) హృజ్జ్వరమును, ఆయాసమును, ఖేదమును తనజలదానముచే మానుననుట మూలోక్తము కాదు. అన్వయ వ్యతిక్రమమిట జరిగినది.

9. గాయంత్య ఉచ్చై రముమేవ సంగతా
విచిక్యు రున్మత్తకవ ద్వనా ద్వనమ్
పప్రచ్ఛు రాకాశవ దంతరం బహిర్
భూతేషు సంతం పురుషం వనస్పతీన్.[130]

కం॥ భూతములలోన వెలిప్ర
ఖ్యాతుండగు నట్టి వాని కాంతలు కాళిం
దీతీర వనాంతరముల
బ్రాతిన్ వెదకంగ జనిరి పాడుచు నధిపా![131]

శ్రీధరులు ఇక్కడ 'వనస్పతీన్పప్రచ్ఛుః' భూతేషు అంతరం మధ్యే సంతం పురుషం బహిశ్చసంతమితి అని వ్యాఖ్యానించిరి. భూతముల లోపల అంతర్గతుడై యున్నవానిని బయట వెతకిరని అర్థము. భూతములోన వెలిప్రఖ్యాతుండగునట్టివాని అను తెనుగుసేత మూలార్థభిన్నత.

మూలమును విడుచుట :- మూలశ్లోకము లనువదించుటలో కొన్ని సందర్భములందు అందలి కొన్నిపదములో లేక మరింత అధికభాగములో వదలి వేయుట జరిగినది అట్టివాని కుదాహరణములు.

1. నాహం వేద గతిం పిత్రోః భగవాన్ క్వగతః పితా
అంబా వా హతపుత్రార్తా క్వగతాచ తపస్వినీ
దిష్ట్యా నో భగవాన్ దృష్టో మగ్నానాం వ్యసనార్ణవే
కర్ణధార ఇవాపారే పాహిమాం పారదర్శనః[132]

ఉ॥ అక్కట ! తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ ! వారు నే
డెక్కడ వోయిరో ఎరుగ నెవ్వడు బిడ్డల పేరు గుచ్చితా
బొక్కుచునుండు తల్లి ఎటువోయెనొకో ! విపదంబు రాశికిన్
నిక్కము కర్ణధారుడవు నీవు జగజ్జన పారదర్శనా ![133]

మూలమునందలి 'తపస్విని' అను విశేషణము తెనుగున లేదు. 'దిష్ట్యానో భగవాన్దృష్టః' అనునది చక్కనివాక్యము. భావస్ఫోరకమగు దానిని గూడ పోతన వదిలెను. మగ్నానాం, పాహి మొదలగు పదముల అర్థము తెనుగునకు వచ్చిన మరింత రమణీయముగా నుండెడిది.

2. తాస్వపత్యా న్యజనయ దాత్మతుల్యాని సర్వశః
ఏకైకస్యాం దశదశ ప్రకృతే ర్విబుభూషయా[134]

కం॥ చతురతతో నందొక్కొక
యతివకు బదురేసి సుతుల నాత్మసముల ను
న్నత భుజశక్తుల గాంచెను
వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్.[135]

ఇచ్చట 'ప్రకృతేర్మాయయావిబుభూషయా వివిధం భవనం విస్తార స్తదిచ్ఛయా యద్వాప్రకృతేర్హేతోః వివిధం భవితుమిచ్ఛయా' అని శ్రీధరులు వ్రాసిరి. పుత్రోత్పాదన కారణమగు ఈశ్లోక చతుర్థపాదార్థము పోతన వదలెను 'వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్' అని తానొక క్రొత్తభావమును కల్పించెను. కానీ అది కార్యమునకు కారణము కాజాలదు.

3. ప్రియం ప్రభుర్గ్రామ్య ఇవప్రియాయా
విధిత్సు రార్చ ద్ద్యుతరుం యదర్థే
వజ్ర్యాద్రవత్తం సగణో రుషాంధః
క్రీడామృగో మానమయం వధూనాం.[136]

మ॥ ప్రతిపీరక్షయకారినా బరగి సత్రాజిత్తనుజా హృదీ
ప్సితమున్ దీర్పదలంచి నాకమునకున్ బెంపారగా నేగి వ
ర్ధితశౌర్యోన్నతి పారిజాతమిలకున్ లీలాగతిన్ దెచ్చెను
ద్ధతి దేవేంద్రుజయించి కృష్ణుడన నేతన్మాత్రుడే చూడగన్.[137]

మూలములోని 'గ్రామ్య ఇవ, క్రీడామృగో మానమయం వధూనాం' అనునవి తెనుగునకు రాలేదు. 'సగణోరుషాంధః' అనునది కూడ రాలేదుకాని పైదానిలోని చమత్కారము దీనిలో లేదుకాన దానివలె రాలేదని అనిపించదు.

4. తస్మాదిమాం స్వప్రకృతిం దైవీ సదసదాత్మికాం
దుర్విభావ్యాం పరాభావ్య స్వరూపే ణావతిష్ఠతే.[138]

కం॥ భావింప సదసదాత్మక
మై వెలయుచు దుర్విభావ్యమగుచు స్వకీయం
బై వర్తించుచు ప్రకృతిని
భావమున దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్.[139]

'దైవీం దేవస్య శ్రీవిష్ణోశ్శక్తిం పరాభావ్యతత్ప్రసాదే నైవజిత్వా' అని ఇచ్చట శ్రీధరవ్యాఖ్య. మూలములోని ఈదైవీ శబ్దవిశిష్టార్థము, భావపద్ధతియు తెనుగున రాలేదు.

5. నాహం బిభే మ్యజిత తేఽతి భయానకాస్య
జిహ్వార్క నేత్ర భ్రుకుటీ రభసోగ్ర దంష్ట్రాత్
అంత్రస్రజః క్షతజ కేసర శంకుకర్ణా
న్నిర్హ్రాద భీతి దిగిభా దరిభిన్నఖాగ్రాత్.
త్రస్తోఽస్మ్యహం కృపణ వత్సల దుస్సహోగ్ర
సంసారచక్రకదనా ద్గ్రసతాం ప్రణీతః
బద్ధ స్స్వకర్మభి రుశత్తమ తేఽంఘ్రిమూలం
ప్రీతోఽపవర్గశరణం హ్వయసే కదాను.[140]

మ॥ ఖరదంష్ట్రా భ్రుకుటీసటానఖయు నుగ్రధ్వానయున్ రక్తకే
సరయుం దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయు నైన నీ
నరసింహాకృతి జూచి నే వెరవఁ బూర్ణక్రూరదుర్వార దు
ర్భరసంసారదవాగ్నికిన్ వెఱతు నీపాదాశ్రయుం జేయవే.[141]

భ్రుకుటీనఖాదుల విశేషణములు కొన్ని వదలబడినవి. ఐనను తెనుగు పద్యము యొక్క శైలి అత్యద్భుతము. ఇచ్చట శ్లోకపద్యములోని వాక్యనిర్మాణములో భిన్నత గోచరించుచున్నది. మూలమున నీవు ప్రీతుడవుకాగా అపవర్గశరణమగు

నీ అంఘ్రికమలము నన్నెప్పుడు పిలుచునో అనియుండ నీపాదాశ్రయముంజేయవే?
అని తెనుగునకలదు. దీనిని భావానువాద మనవచ్చును.

6. ఈజేఽశ్వమేధై రధియజ్ఞ మీశ్వరం
మహావిభూ త్యోపచితాంగదక్షిణైః
తతై ర్వసిష్ఠాసిత గౌతమాదిభి
ర్ధన్వన్య భిస్రోతి మసౌ సరస్వతీం.
యస్య క్రతుషు గీర్వాణై స్సదస్యా ఋత్విజో జనాః
తుల్యరూపాశ్చ నిమిషా వ్యదృశ్యంత సువాససః[142]

సీ॥ ఘనవైభవంబున కల్మషదూరుడై
యజ్ఞేశునీశు సర్వజ్ఞునుగూర్చి
మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడ
తగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహువాజి మేధంబులొనరించె
గణుతింపరాని దక్షిణలువెట్టి
సమలోష్టహేముడై సర్వకర్మంబులు
హరిపరంబులుగాగ నవనియేలె

ఆ॥ విష్ణుభక్తులందు విష్ణువునందు గ
లంకమెడల మనసులంకెపెట్టి
విహితరాజ్యవృత్తి విడువనివాడునై
యతడు రాచతపసి యనగనొప్పె [143]

నిరుదకదేశమున సరస్వతినది అభిస్రోత యగుట ఇందొక గొప్ప విశేషము. ఆయజ్ఞస్థల వైశిష్ట్యము తెనుగున విడువబడినది. రెండవ శ్లోకము పూర్తిగా వదల బడినట్లే.

7. అస్యాపి దేవవపుషో మదనుగ్రహస్య
స్వేచ్ఛామయస్య నతు భూతమయస్య కోఽపి
నేశే మహిత్వ వసితుం మనసాంతరేణ
సాక్షాత్తవైవ కిము తాత్మ సుఖానుభూతేః. [144]

మ॥ నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
తనురూపం బిదె నామనంబున కచింత్యంబయ్యె నీయుల్లసత్
ఘన విశ్వాకృతి నెవ్వఁడోపు నెఱుఁగన్ గైవల్యమై యొప్పు నా
త్మనివేద్యంబగు నీదు వైభవము చందంబెట్టిదో యీశ్వరా ![145]

కృష్ణుని శరీరము సామాన్యమానవులకువలె పంచభూతాత్మకము కాదనియు, అది స్వేచ్ఛామయమనియు, సంకల్ప మాత్రముచే అది లోకులకు భాసించుచుండు ననియు మూలభావము. ఇంతమాత్రముతో సంతృప్తిపడక వ్యాఖ్యాతయగు శ్రీధరులు 'స్వేచ్ఛామయస్య' యనుదానికి స్వీయానాం యథాయథా ఇచ్ఛా తథాతథా భవతః అని పల్కిరి. దీనితో 'ఇచ్ఛ' కృష్ణునిదికాక భక్తునిదగును. ఇది గమ నింపదగిన విశేషమే ఏదైననేమి పోతనగారు మరికొంత దూరముపోయి 'భవజ్జ నంబులకు నానందంబు నిండించు నీతనురూపంబు' అని స్పష్టముగా శ్రీధరునే అనుస రించెను. 'నతుభూతమయస్య' అనుదానికి 'అంచిత్యశుద్ధసత్వాత్మకస్య' అని శ్రీధరుడర్థము చెప్ప పోతన నామనంబున కచింత్యంబయ్యె' అని మాత్రము వ్రాసి వదలెను.

8. నిశాత మసి ముద్యమ్య సకిరీటం సకుండలం
శంబరస్య శిరః కాయాత్ తామ్రశ్మశ్రు జహార తత్. [146]

కం॥ గండధరమూర్తి గైకొని
యొండాడక చక్రిసూను డుగ్రతరాసిన్
ఖండించె శంబరునితల
కుండల కోటీరమణులు కుంభినిరాలన్. [147]

శంబరుని శిరస్సు తామ్రశ్మశ్రుయుతమని మూలమున కలదు. మూర్తి చిత్రణమునకు తోడ్పడు నా విశేషణమును పోతన వదలివేసెను.

ఇట్టివన్నియు శ్లోకములో కొంతవిడిచి, అనువదించినవి ఇవికాక అనేక స్థల ముల శ్లోకములే పూర్తిగా వదలివేయబడిననియు కలవు. వానికి కొన్ని ఉదాహర ణములు.

1. గజేంద్రమోక్షణ ఘట్టమున ముందువచ్చిన పర్వత ప్రాంతవర్ణనలోనివి

శ్లో॥ సదావనిజ్యమానాంఘ్రి స్సమంతాత్ పయఊర్మిభిః
కరోతి శ్యామలాం భూమిం హరిన్మరకతాశ్మభిః

శ్లో॥ యత్ర సంగీతసన్నాదై ర్నదద్గుహ మమర్షయా
అభిగర్జంతి హరయ శ్లాఘినః పరశంకయా

శ్లో॥ సరిత్సరోభి రచ్ఛోదైః పులినై ర్మణివాలుకైః
దేవస్త్రీ మజ్జనామోద సౌరభాంబ్వనిలై ర్యుతః

శ్లో॥ తస్య ద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః
ఉద్యాన మృతుమన్నామ హ్యాక్రీడం సురయోషితాం.[148]

2. గజేంద్రస్తుతి పోతన రచన మిక్కిలి ప్రఖ్యాతమైనది. అందలి ఎవ్వనిచే జనించు[149] మొదలగు పద్యములు చిన్నతనముననే బాలబాలికలకు నేర్పుదురు. ఈ ఘట్టమున మూలములో నుండియు యథాతథముగాను కొలదిమార్పులతోను అనేక శ్లోకములను పోతన అనువదించెను. ఇంకను అనువదింపబడక మిగిలిపోయినవి కలవు. వానిలో కొన్ని.

శ్లో॥ జిజీవిషే నాహ మిహా ముయా కిం
అంతర్బహిశ్చావృత యేభయోన్యా
ఇచ్ఛామి కాలేన నయస్య విప్లవ
స్తస్యాత్మలోకావరణస్య మోక్షణం

శ్లో॥ యోగరంధిత కర్మాణో హృదియోగవిభావితే
యోగినో యం ప్రపశ్యంతియోగేశం తంనతోఽస్మ్యహం

శ్లో॥ నమో నమస్తుభ్య మసహ్యవేగ
శక్తిత్రయా యాఖిలధీగుణాయ
ప్రపన్నపాలాయ దురంతశక్తయే
కదింద్రియాణా మనవాప్యవర్త్మనే.

శ్లో॥ నాయంవేదస్వమాత్మానం యచ్ఛక్త్యాహంధి యాహతః
తందురత్యయమాహాత్మ్యంభగవంతమితోఽస్మ్యహం.[150]

ఇట్లే దశమస్కంధమున వర్షఋతువర్ణనలో[151] మూలమున దాదాపిరువది శ్లోకములు ఉపమానభూషితములైనవి కలవు. వాని నన్నింటిని వదలి పోతన స్వేచ్ఛా

రచన మొనర్చెను ద్వితీయ స్కంధమున బ్రహ్మ పలికిన అనేక విశేషములలో షష్ఠాధ్యాయమునందు చాలశ్లోకము లనువదింపలేదు. అష్టమస్కంధములోని షోడశాధ్యాయము నందలి పయోభక్షణవ్రతము పూర్తిగా పోతన వదలివేయుట విమర్శకులు గుర్తించినదే. ఈ విధముగా అనేక స్థలములలో మూలమును విడిచిన ఉదాహరణములు కలవు. వాని కేవో కారణము లూహించిన దొరకకపోవు. ఐనను శతసహస్ర సంఖ్యా శ్లోకసమన్వితములగు పురాణముల ననువదించునప్పు డెన్నో శ్లోకములను మార్పు చేయవలసి వచ్చుటయు వదలివేయవలసి వచ్చుటయు సహజము.

స్వేచ్ఛానువాదము :- మూలశ్లోకభావములను గ్రహించి అందలి పదవాక్యములను యథాతథముగా అనువదింపవలెనను ఉద్దేశముతో గాక, అవసరమైన మార్పులు చేర్పులు చేసి స్వతంత్రించి రచించుట కొన్నిచోట్ల జరిగినది. అట్టి స్వేచ్ఛానువాదమునకు కొన్ని ఉదాహరణములు చూడుడు.

1. శ్లో॥ అహో అమీషాం వయసాధికానాం
విపశ్యతాం లోకగతిం విమోహః
యత్రోద్భవ స్తత్ర గతం మనుష్యం
స్వయం సధర్మా అపి శోచంత్యపార్థం. [152]

ఉ॥ మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహిపుట్టుచున్
చచ్చుచునుండ చూచెదరు చావకమానెడు వారిభంగి నీ
చచ్చినవారి కేడ్చెదరు చావుకునోల్లక డాగవచ్చునే ?
ఎచ్చటబుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణకోటికిన్. [153]

2. తస్య మూర్ధ్న స్సముద్భూత స్సధూమోఽగ్ని స్తపోమయః
తిర్యగూర్ధ్వ మధో లోకా నసకృద్విష్వగీరితః
చుక్షుభు ర్నద్యుదన్వంత స్సాద్రిద్వీపా చచాల భూః
నిపేతు స్సగ్రహా స్తారా జజ్వలుశ్చ దిశో దశ. [154]

మ॥ అదరెం గుంభిని సాద్రియై కలగె నేడంభోనిధుల్ తారకల్
చెదరన్ సగ్రహసంఘులై దిశలు విచ్ఛిన్నాంతలై మండె బె
ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి ఉగ్రాచారుడై త్ర్యంఘ్రిద మూ
ర్ధదిశోద్ధూత సధూమహేతి పటలోదంచత్తపోవహ్ని చేన్. [155]

3. శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే తపస్సిద్ధోఽసి కాశ్యప।
వరదోఽహమనుప్రాప్తో వ్రియతా మీప్సితో వరః

శ్లో॥ అద్రాక్ష మహమేతత్తే హృత్సారం మహదద్భుతం
దంశ భక్షిత దేహస్య ప్రాణాహ్యస్థిషు శేరతే

శ్లో॥ నైతత్పూర్వర్షయ శ్చక్రు ర్నకరిష్యంతి చాపరే
నిరంబు ర్ధారయేత్ ప్రాణాన్ కోవై దివ్యసమాశ్శతం

శ్లో॥ వ్యవసాయేన తేనైవ దుష్కరేణ మనస్విభిః
తపోనిష్ఠేన భవతా జితోఽహం దితినందన

శ్లో॥ తతస్త ఆశిషస్సర్వా దదామ్యసురపుంగవ
మర్త్యస్య తేహ్యమర్త్యస్య దర్శనంనాఫలం మమ. 156

మ॥ ఓసురారికులేంద్ర! యీక్రియ నుగ్రమైన తపంబు మున్
చేసిచూపినవారు లేరిక జేయువారును లేరు నే
నీసమాధికి మెచ్చితిన్ విను నీయభీష్టములిత్తు నా
యా సమేటికి? లెమ్ము లెమ్ము మహాత్మ! కోరుము కోరికల్.

శా॥ దశ్రవాతిములున్ పిపీలికలు మేదఃక్రవ్యరక్తంబులన్
సంశీర్ణంబులుసేసి పట్టితినగా శల్యావశిష్టుండవై
వంశచ్ఛన్న తృణవల్లీయుత మహావల్మీకమం దింద్రియ
భ్రంశంబెంతయులేక నీవు నిలువం బ్రాణంబు లెట్లుండునో?

ఉ॥ ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీక్రియ నూరు దివ్యసం
వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగవచ్చునే?
యుత్సనమయ్యె జూచి నను నుగ్రతపంబున గెల్చితీవు నే
వత్సలతన్ నినుం గదియవచ్చితి కోరికలెల్ల నిచ్చెదన్. 157

4. శ్లో॥ క్వచిద్ రుదతి వైకుంఠచింతాశబళచేతనః
క్వచి ద్ధసతి తచ్చింతాహ్లాద ఉద్గాయతి క్వచిత్,

శ్లో॥ క్వచి త్తద్భావనాయు_క్త స్తన్మయోఽనుచకారహ
నదతి క్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్.

శ్లో॥ క్వచి దుత్పులక స్తూష్ణీ మా_స్తే సంస్పర్శనిర్వృతః
అస్పంద ప్రణయానంద సలిలామీలితేక్షణః [158]

సీ॥ వైకుంఠచింతా వివర్జితచేష్టుడై
యొక్కడు నేడుచు నొక్కచోట
అశ్రాంత హరిభావనారూఢ చిత్తుడై
ఉద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణుడింతియకాని వేరొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుడను నిధానము గంటి నేడని
యుబ్బి గంతులువైచు నొక్కచోట

ఆ॥ పలుకునొక్కచోట బరమేశు కేశవు
ప్రణయహర్షజనిత బాష్పసలిల
మిళితపులకుడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు. [159]

5. శ్లో॥ పరోఽప్యపత్యం హితకృ ద్యథౌషధం
స్వదేహజోఽప్యామయవ త్సుతోఽహితః
ఛింద్యా త్తమంగం హి యదాత్మనో హితం
శేషం సుఖం జీవతి యద్వివర్జనాత్. [160]

మ॥ అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయుక్రియ నీయజ్ఞున్ కులద్రోహి దు
స్సంగున్ కేశవపక్షపాతి నధమున్ జంపించి వీరవ్రతో
త్తుంగ ఖ్యాతి జరించెదన్ కులము నిర్దోషంబు గావించెదన్. [161]

మూలసంవాదము :- పోతనరచనలో కొన్నిస్థలములందు ఒకానొక చిత్రి గోచరించును. కొన్ని పద్యములను వానికి సంబంధించిన మూలశ్లోకము

లను పోల్చి చూచినప్పుడు ఆశ్లోకములకును ఈ పద్యములకును నేదో సంబంధ మున్నదనిపించును. కానీ ఆసంబంధము స్పష్టముగా గోచరింపదు. చాలచోట్ల అది సన్నిహితానువాదముకాదుసరికదా ; దూరానువాదము కూడ కాదు. అట్లని ఆ పద్యములమూలకములని అనలేము. ఆశ్లోకములలోని ప్రధానపదమో లేక అల్ప భావనాస్పర్శయో పద్యమున గోచరించును. ఏదోకొంత అనుబంధమున్నదని మాత్రము తోచును. కావలెననియే అట్టి స్వేచ్ఛ పోతన గ్రహించియుండును. అట్టి మూలసంవాదమునకు కొన్ని ఉదాహరణలు.

1. శ్లో॥ జయ జయ జహ్యాజామజిత దోషగృభీతగుణాం
త్వమసి యదాత్మనా సమవరుద్ధసమస్తభగః
అగజగదోకసా మఖిల శక్త్యవబోధక తే
క్వచి దజయాత్మనా చరతోఽనుచరే న్నిగమః 162

సీ॥ జయ! జయ! హరి! దేవ! సకలజంతువులకు
జ్ఞానపరిదుండవుగాన హరి
వలన దోషంబులు గలిగిన సుగుణ సం
తానంబుగాగొని జ్ఞానశక్తి
ముఖ్య షడ్గుణపరిపూర్ణత జేసి మా
యాత్మావశిష్టుడవగుచు కార్య
కారణాత్మకుడవై కడగి చరింపుచు
నున్న నీయందు పయోరుహాక్ష!

తే॥ తివిరి యామ్నాయములు పరివర్తించుగాన
ప్రకట త్రిగుణాత్మకంబైన ప్రకృతితోడి
యోగమింతయు మాన్పవే! యోగిమాన
సాంబు జాత మధువ్రత యని నుతించి 163

2. శ్లో॥ ఇతి తవ సూరయ స్త్ర్యధిపతేఽఖిలలోకమల
క్షపణకథామృతాబ్ధి మవగాహ్య తపాంసి జహుః
కిముత పునస్స్వధామవిధుతాశయ కాలగుణాః
పరమభజంతి యే పద మజస్రసుఖానుభవం. 164

కం॥ లీలం బ్రాకృత పూరుష
కాలాదిక నిఖిలమగు జగంబుల కెల్లన్
మాలిన్యనివారకమగు
నీలలితకథాసుధాబ్ధినిన్ గ్రుంకి తగన్ 165

3\. శ్లో॥ త్వదనుపథం కులాయ మిద మాత్మసుహృత్ ప్రియవ
చ్చరతి తథోన్ముఖే త్వయి హితే ప్రియ ఆత్మనిచ
నబత రమం త్యహో అసదుపాసన యాత్మహనో
యదను శయా భ్రమం త్యురుభయే కుశరీరభృతః 166

ఉ॥ కొందరు నీశరీరము లకుంఠితభక్తి భవద్వశంబులై
చెందగ నీపదాబ్జములుజేరి భజింపుచు తత్సుఖాత్ములై
యుందురు కొంద రీతనువులోలి ధరించి భవత్పదాబ్జముల్
బొందుగ గొల్వలేక ఇలబుట్టుచు చచ్చుచు నుందురవ్యయా 167

4\. శ్లో॥ నఘటతఉద్భవః ప్రకృతిపూరుషయో రజయో
రుభయయుజా భవం త్యసుభృతో జలబుద్బుదవత్
త్వయి తఇమే తతో వివిధనామగుణైః పరమే
సరితఇవార్ణవే మధుని లిల్యు రశేషరసాః. 168

కం॥ మదివలపోయగ జలబు
ద్బుదములు ధరబుట్టి పొలయు పోలిక గలయీ
త్రిదశాదిదేహములలో
పదలకవర్తించు నాత్మవర్గము నోలిన్ 169

5\. శ్లో॥ స్వజన సుతాత్మదార ధనధామ ధరాసురథైః
త్వయిసతి కిం నృణాం శ్రయత ఆత్మని సర్వరసే
ఇతి సదజానతాం మిధునతో రతయే చరతాం
సుఖయతి కోన్విహ స్వవిహతే స్వనిరస్తభగే. 170

తే॥ పుత్ర దార గృహక్షేత్ర భూరి విషయ
ఘనసుఖాసక్తుడగుచు నేమనుజుడేని

నర్థి జరియించువాడు భవాబ్ధిలోన
జెంది యెన్నాళ్ళకును దరిజేరలేడు.[171]

అనువాదసౌందర్యము :- పోతన చేసిన అనువాదవైఖరులు పైన చర్చింపబడినవి. ఆయాసందర్భములలో మూలమునకు మెరుగుదిద్ది, హృదయంగమములై చదివినంతమాత్రమున ఆకర్షించు అనువాదపద్యములు పోతనలో వందల కొలది కలవు. ఆయన శైలిలోనున్న వైశిష్ట్యమే అటువంటిది. సకలాంధ్ర సాహిత్యములోను ఆయన వ్రాసినన్ని ధారణాయోగ్య పద్యములను ప్రజల మనస్సుకు హత్తుకొనునట్లు వ్రాసినవారు మరొక్కరులేరు. అట్టి రమణీయానువాదమునకు కొన్ని ఉదాహరణములు.

1. శ్లో॥ శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావనిధ్రుక్
రాజన్య వంశ దహనా నపవర్గ వీర్య
గోవింద గోద్విజ సురార్తిహరావతార
యోగీశ్వ రాఖిలగురో భగవ న్నమస్తే ।[172]

శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ![173]

సంస్కృతముననున్న 'నమస్తే' నీకున్ మ్రొక్కెదనని అనువాదముచేసి అంతటితో ఆగక 'త్రుంపవేభవలతల్' అనుటతో అధికతరమగు అర్థస్ఫూర్తి వచ్చినది. మూలములో లేని 'నిర్వాణసంధాయకా' అనుసంబోధనము దానికి దోహదము చేసినది సంస్కృతములోకంటె తెనుగులో సంబోధనలకొక సౌకర్యము కలదు. వృత్తమధ్యమున 'కృష్ణసఖ' మొదలగునవి వ్యాకరణరీత్యా హ్రస్వాంతములగుట చేతను, ఛందోదృష్టితో అక్కడ హ్రస్వమే ఉండవలసివచ్చుటచేతను, ప్లుతోచ్చారణ కవకాశములేదు. భక్తితో నాక్రోశించునప్పుడు సంబోధనాంతమగు అచ్చు ప్లుతమగుట సహజము. అకారాంత, ఇకారాంత శబ్దములు సంస్కృతములోవలెకాక స్వేచ్ఛగా దీర్ఘముతీయు అవకాశము తెనుగుభాషలోని ఒక విశిష్టలక్షణము. అందును అధిక దీర్ఘాక్షరములకు వీలున్న శార్దూలపద్యము వంటివాని నెన్నుకొనుటలో పోతనయొక్క

సామర్థ్యము తేటతెల్లమగుచున్నది. 'శ్రీకృష్ణా' అని అనుటతోనే ఆ పిలుపు దిక్కులకు వ్యాపించును. దానిపై వరుసగా యదుభూషణా, నరసఖా మొదలగునవి ఆపిలుపులోని ఆత్మీయతను ద్విగుణీకృతము చేసినవి 'శృంగారరత్నాకరా' అనుటతో అది పరాకాష్ఠ నందుకొన్నది. కుంతినోట అమూలకముగా శృంగారశబ్దమును పలికించుట ఔచిత్యవిరోధమని కొందరు శంకింపవచ్చును. శృంగారము కామవాసన కతీతమైన దనియు అది అక్కడ జీవేశ్వరసంబంధ సాన్నిహిత్య సూచకమనియు భావించినచో సరిపోవును. అనన్యవిషయమగు ఆరతిని కుంతి కోరుచున్నదనుటకు దీని పై శ్లోకమే విదర్శనము.

శ్లో॥ త్వయి మేఽనన్యవిషయా మతి ర్మధుపతేఽసకృత్
రతి ముద్వహతా దద్ధా గంగే వౌఘ ముదన్వతి. [174]

పోతన దీనికి వ్రాసిన పద్యములో[175] ఈ రతి శబ్దమును వదలివేయుటచే సంస్కృతశ్లోకమునే ఇచ్చట ఉదాహరింపవలసి వచ్చినది. ఈరతికి 'అనవచ్ఛిన్న ప్రీతి' అనియే శ్రీధరులును అర్థముచెప్పిరి. ఈరతి లౌకికరతి ఎట్లుకాదో ఈ శృంగారమును లౌకిక శృంగారము కాదని గుర్తింపనగును. కనుక పోతన ప్రయోగించిన సంబోధనము అత్యంతసార్థకము. లేదా కృష్ణునికి సంబంధించిన విశేషణములలో ఇదియు నొకటి. యదుభూషణ నరసఖాది విశేషణము లెట్లు కుంతి వ్యక్తిత్వములకు సంబంధము లేనివో 'శృంగారరత్నాకరా' అను సంబోధనముకూడ అట్టిదే అనినచో అప్పుడీ విప్రతిపత్తియే రాదు.

2\. శరతల్పగతుడైన భీష్ముడు తన్ను దర్శింపవచ్చిన పాండవులతో ఇట్లనుచున్నాడు.

శ్లో॥ యత్ర ధర్మసుతో రాజా గదాపాణి ర్వృకోదరః
కృష్ణోఽస్త్రీ గాండివశ్చాపః సుహృత్ కృష్ణ స్తతో విపత్. [176]

ఉ॥ రాజట ధర్మజుండు సురరాజసుతుండట ధన్వి శాస్త్రవి
ద్భ్రాజక మైన గాండివమువిల్లట సారథి సర్వభద్రసం
యోజకుడైన చక్రియట ఉగ్రగదాధరుడైన భీముడ
య్యాజికి తోడువచ్చునట ఆపద గల్గుట యేమి చోద్యమో! [177]

'అట' అనునది స్థలార్థకముగా కాక ఒక విశేషార్థమున ప్రయోగించుట భారత రచననాటికే తెనుగున మొదలైనది. (మునికన్యకయట నేనట) ఆశ్చర్యార్థకమై

ఈ శబ్దమొక ప్రత్యేక ప్రయోజనమును తెనుగుభాషలో సంతరించుకొన్నది. ఈ పదము సాహాయ్యముతో పోతన ఎత్తిన ఈపద్యపుఎత్తుగడ పరమరమణీయమై మూలములోని సౌందర్యమును తెనుగునకు తెచ్చినది. గీతలోని

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

అను శ్లోకభావమునకిది తుల్యముగా నున్నది.

3. శ్లో॥ ఏవం బలిష్ఠై ర్యదుభిః మహద్భి రపరాన్విభుః
యదూన్యదుభిరన్యోన్యంభూభారాన్ సంజహారహ [178]

మ॥ బలహీనాంగులకున్ బలాధికులకున్ ప్రత్యర్థి భావోద్యమం
బులు కల్పించి వినాశమున్నెరపి ఈ భూభారమున్ బాపి ని
శ్చలంబుద్ధిన్ గృతకార్యుడై చనియె నానర్వేశ్వరుండచ్యుతుం
డలఘుం డేమని చెప్పుదున్ భగవదీయాయత్త మూర్వీశ్వరా! [179]

చిన్నపద్యములలో క్లుప్తతయున్నచో పెద్దపద్యములలో భావస్పష్టతకు అవకాశమెక్కువగా నుండును. కొన్నిచోట్ల భావవిపులీకరణము అవసరమగుచుండును. అట్టిసందర్భములందు కందగీతాదులకంటె శార్దూలమత్తేభాదులు అధికతర భావవహములై అధికతరగాంభీర్యమునుకూడ కలిగియుండును. వృత్తరచనలో పోతన కభినివేశ మెక్కువ. అట్లని మిగిలిన వానిలో తక్కువనికాదు. ఒక్కొక్కరికి ఒక్కొక్క దానియందు ప్రత్యేకమగు ఇష్టముండును. ప్రావీణ్యముండును. ప్రసిద్ధియుండును. తిక్కనకు కందమునను, శ్రీనాథునకు సీసమునను గల ప్రఖ్యాతి అట్టిదే. పోతన అడిగెదనని కడువడిజను[180] వంటి కందపద్యములను, మందారమకరంద[181] వంటి సీస పద్యములను అత్యద్భుతముగా వ్రాయకపోలేదు. అయినను ఆ ఛందముల కాయ నను చెప్పుకొనరు. వృత్తరచనలో పోతనది పెట్టినపేరు. ఏభావము ఏఛందములో నిముడునో సమర్థుడగు కవి తానే నిర్ణయించుకొనును. సంస్కృతములో ఏఛంద మున్నదో ఆభావము నాఛందములోనే తెచ్చుట కిటీవలి ఆధునికులు కొందరు ప్రయత్నించుచున్నారు. శిఖరిణీ, మందాక్రాంత వంటి వృత్తములు సంస్కృతములో సౌందర్యవంతములైనట్లు తెనుగున కానేరవు. ప్రాచీనాంధ్ర కవులందులకే తెనుగు భాషకు తెనుగుపలుకుబడికి ఏ ఛందములు తగునో వానినేస్వీకరించి రచించిరి

అనుష్టుబాదిచ్ఛందములలో రచింపబడిన సంస్కృతశ్లోకములను అదృష్టితోనే తెనుగు వారు తెనుగుజేసిరి. భాగవతములో పోతన ఇట్టి సందర్భములందు శార్దూలమత్తేభాదుల నెక్కువగావాడుట గమనార్హము. ఆ వృత్తము లాయన చేతులలో ధీర గంభీరగమనమును నేర్చుకొని తెనుగు సారస్వతమున కాదర్శప్రాయములైనవి.

సహజముగా పోతన వృత్తములు శబ్దాలంకారమునకు ప్రాధాన్యము నెక్కువగా నిచ్చునవై యుండును. భారతములోవలె అచ్చపు తెనుగుపలుకుబడితోచు సులభశైలియు అచ్చటచ్చట కాన్పించును. స్నిగ్ధగంభీరమగు అట్టి సరళరచనకు పైనుదాహరించిన 'బలహీనాంగులకున్' అనుపద్యము తార్కాణము.

4. శ్లో॥ సత్యాంక్షితే కిం కశిపోః ప్రయాసైః
బాహౌ స్వసిద్ధే హ్యుపబర్హణైః కిం
సత్యం జలే కిం పురుధాన్నపాత్ర్యా
దిగ్వల్కలాదే సతి కిం దుకూలైః

శ్లో॥ చీరాణి కింపథి నసంతి దిశంతి భిక్షాం
నోవాంఘ్రిపాః పరభృత స్సరితో వ్యశుష్యన్
రుద్ధాగుహాః కిమజితోఽవతి నోపపన్నాన్
కస్మా ద్భజంతి కవయో ధనదుర్మదాంధాన్.[182]

సీ॥ కమనీయ భూమిభాగములు లేకున్నవే?
పడియుండుటకు దూదిపరుపులేల
సహజంబులగు కరాంజలులు లేకున్నవే?
భోజనభాజన పుంజమేల
వల్కలాజిన కుశావళులు లేకున్నవే?
కట్టదుకూల సంఘంబులేల
గొనకొని వసియింప గుహలు లేకున్నవే
ప్రాసాదసౌధాది పటలమేల

గీ॥ ఫలరసాదుల గురియవే పాదపములు
స్వాదుజలముల నుండవే సకలనదులు

పోసగ భిక్షలు పెట్టరే పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల తాపసులకు.[183]

సంస్కృతమున కవియనిన కలఅర్థములు వేరు. తెనుగున కవియనిన కల అర్థము వేరు అందు కవియనగా పద్యాదియుక్తమగు కావ్యమును రచించినాడు. సంస్కృతమున ఈఅర్థమేకాక అధికతరమగు అర్థమును కలదు. విద్వాంసుడనియు, నివేకశీలుడనియు కూడ ఆ పదమున కర్థము చెప్పుదురు. ఆ అర్థము గ్రహించిన పోతనార్యుడీ సందర్భమునందలి మూలభావమును గ్రహించి మూలమునందలి కవి పదమును విడిచివేసి తద్భావసన్నిహితమగు తాపసశబ్దమును ప్రయోగించెను తన ణీయ శైలీసంవిధానముగలిగిన ఈసీసము మందారమకరందాది పద్యముల సరసన చేరగలదు.

5. శ్లో॥ గవాం రుక్మవిషాణానాంరూప్యాంఘ్రీణాంసువాససాం
పయశ్శీల వయోరూప వత్సోపస్కరసంపదాం
ప్రాహిణోత్సాధువిప్రేభ్యోగృహేషున్యర్బుదానిషట్
భోజయిత్వాద్విజానగ్రేస్వాద్వన్నంగుణవ త్తమమ్. [184]

శా॥ పాలేరై ప్రవహింప దగ్గరుచు లేగ్రాయంబులున్ రూపముల్
మేలై ధూర్తలుగాక వెండిగొరిజల్ హేమోరుశృంగంబులున్
గ్రాలంగ్రేపుల యగ్రరునాకుచును రంగచ్చేలలై యున్న మం
దాలన్ న్యర్బుదమట్కమిచ్చె విభు డుద్యద్వేదిక శ్రేణికిన్ [185]

పాలేరై ప్రవహింప దగ్గరుట, ధూర్తలు గాకుండుట, క్రేపుల అగ్రరునాకుట, మూలాధికమగు సుందరదృశ్యములు వానినికన్నులగట్టినట్లు సుందరపదబంధముతో వర్ణించి ఉదాత్తానువాదవైఖరిని పోతన ఇందు ప్రదర్శించినాడు.

6. శ్లో॥ ప్రదిష్టం భృత్యరక్షాయాం పురుషేణ మహాత్మనా
దదాహకృత్యాం తాం చక్రం క్రుద్ధాహిమివపావకః [186]

ఆ॥ ఆప్రకారమెరిగి హరి విశ్వరూపుండు
వెట్టితపసిసేయు వేడబంబు

చక్కఁబెట్టమనుచు చక్రంబు బనిచిన
వచ్చె నదియు ప్రళయవహ్ని పగిది. [187]

శ్లోకములోని మొదటిపాదమునకే క్రింది పద్యమనువాదము. వెఱ్ఱితపసి పేయు వేడబ మనుటలో చక్కని చమత్కారము గోచరించుచున్నది. ఈపద్యము వ్రాయునప్పు డా ఘట్టమును హృదయగతము చేసికొని అనువదించుచున్న పోతనకు దుర్వాసుడు కృత్యను పుట్టింపగానే అతడు పొందబోవు పరాభవము కన్నులముందు కన్పించి నవ్వుకొని యుండును. చక్రము వెంటపడగా కుయ్యో మొఱ్ఱో యని అతడు పరుగెత్తుదృశ్యము చూపట్టి పాపమీపిచ్చివాడు భవిష్యము నెరుగడుగదా అని సానుభూతినొంది వెఱ్ఱితపసిపేయు వేడబంబని వర్ణించెను. ఆ వర్ణనలో మూలము నించుక సరిగాచూడకయో మరేమోకాని క్రుద్ధాహిని పావకునివలె కృత్యను చక్రము దహించెనని సంస్కృతమున నుండ ఆ యుపమానమును దుర్వాసుని వైపునకు మార్చెను. [188]

విషయపరిశీలనలో సామాన్యముగా శాస్త్రహృదయ మార్గములు రెండుండును. ఒక కవితావిభాగమును విమర్శించునప్పుడు విద్వాంసునకీ రెండుపథములును గోచరించు చుండును. ఈరెండింటి సమన్వయ మార్గము అత్యంత సమర్థునకు గాని చేకూరదు. భాగవతము వంటి గ్రంథమున మూలానువాదములు రెండును పరిశీలించునప్పుడు- అందును పోతన కవిత్వమువంటి రసవంతమగు రచన హృదయమును పరవశింపజేయుచున్నప్పుడు, మాధ్యమికమార్గము దుష్కర మనిపించును. శాస్త్ర దృష్టితో ఒక విభాగముచేసి ఇది యథా మూలానువాదము, ఇది సన్నిహితానువాదము, ఇది భావానువాదము - ఇత్యాదిగా విభజించి వానికి తగు నుదాహరణముల నేర్చి కూర్చుట ఒక పద్ధతి. ఆయా అనువాదములలో పోతన హృదయ మేసౌందర్యమును భావించినచో ధ్వనితమగు ఏభావవిశేషముచే పోతన తన విశిష్టతను స్ఫురింపజేయునో అందలి సముదాత్త సమున్నత భావసౌమనస్య మెట్టిదో పరిశీలించుట మరియొకపద్ధతి. ఈ రెండుమార్గములకొక సమన్వయము సాధించి పలుక బూనినచో పోతన భాగవతానువాద విషయమున మనకొక సత్యజ్యోతి సాక్షాత్కరించును. అది ఏమనగా భారత కవిత్వమువలె ఆయనది కేవల కథానువాదమును కాదు. శ్రీనాథాదుల కవిత్వము వలె భావానువాదమును కాదు. ఆయనది హృదయానువాదము. సంపూర్ణమూర్తి సందర్శనాత్మకమగు కథాశిల్పదృష్టితో పాటు ప్రతిపద్య శ్లోక సన్నిహితానువాద సమన్విత మగు ప్రతిపదశిల్ప సమీక్షణ మందును జాగ్రత్ దృష్టి కలిగియుండి, వీనినన్నిం

టిని మించిన ఒకానొక విశిష్టసౌందర్యపరిస్ఫురణమే అంతర్లీన భావపారవశ్యమే తన ధ్యేయముగా పెట్టుకొని పాండిత్యముకంటె పరమార్థమునకు, మూర్తి సందర్శనము కంటె స్ఫూర్తి సంస్పర్శనమునకు, మేధావిలాసమునకంటె హృదయవికాసమునకు, ఆశ్చర్యావహ ప్రజ్ఞాప్రకటనముకంటె పారవశ్యావహరసోదయమునకు ప్రాధాన్యము నిచ్చు రచనాపద్ధతిలో ఆయన భాగవతము ననువదించెను. అట్లని పాండిత్య మేధా శిల్పాది విశేషణముల నెవ్వరికిని తీసిపోని దారచన కానీ ప్రాముఖ్యము మాత్రము రసనిష్యందమానమగు ఆనందబ్రహ్మస్వరూప సాక్షాత్కారమునకే. దానిని పోతన హృదయానువాదవైఖరి సాధించినది.

## అమూలకములు

మతసాంస్కృతిక వాఙ్మయమంతయు దేవభాషయని పేరుగాంచిన సంస్కృత ములో నుండుటచేతను, మహోజ్జ్వలమగు కావ్యములందిదివరకే వెలువడియుండుట చేతను, ఆంధ్రవాఙ్మయ ప్రారంభదశలో తెనుగున సంస్కృతానువాదములే ఉద యించినవి. అనువదించుటయను పేరేగాని అత్యంతసమర్థులును మహానుభావులును అగు నన్నయ తిక్కనాది ప్రాచీనాంధ్రకవిశేఖరులు తమగ్రంథములలో మూలము లోని అనేక విశేషణములతోబాటు అద్భుతమగు ఊహను, భావనను విజృంభింపజేసి తత్ఫలితముగా స్వతంత్రకల్పనా రమణీయములగు ననేకవిశేషణములను గద్యపద్యా త్మకముగా నందించిరి.

ఒక భాషలోని రచనను యథామూలముగా ననువదించుటకు కావలసిన ప్రజ్ఞ వేరు, స్వతంత్రముగా నొకభావనమ భావించి దానిని రసవత్కావితలో నందించుటకు కావలసిన ప్రజ్ఞ వేరు. అనువాదకులలో ననేకులకు మొదటిప్రజ్ఞయే యుండును. చక్కని అనువాదకుడనిపించుకొనుట కదిచాలును. కాని సర్వసారస్వతమున కాదర్శ మూర్తులుగా నిలువవలసిన మహాకవుల ప్రజ్ఞ అంత నియమితమైయుండదు. భావా వేశపూరితమైన వారిలేఖిని అమృతప్రవాహములు కురిపింపజేయుచో దానిని ఏనియ మములును, నిర్బంధములును ఆటంకపరుపజాలవు. మూలకవిసృష్టించిన రచనా సౌందర్యమునకు భావవైశిష్ట్యమునకు తమ కల్పనాశక్తిని, భావచాలనమును జోడిం చుటచే మూలము నతిశయించిన ఒకమహాశిల్పము సంసిద్ధమగును. మన మహాకవు లనుసరించిన మార్గమిదే.

దీనిని గురించిన కొందరు పండితులు భారతాది సంస్కృతవాఙ్మయము బంగా రపుముద్దయైనచో వాని తెనుగు సేతలు స్వర్ణాభరణములని ప్రశంసించియున్నారు.

ముద్దగానున్న బంగారము నాభరణములు చేయుటకు శిల్పి కరగించును. వివిధాకారములు వచ్చునట్లు దానిని పోతపోయును చేతితో చిత్రశిల్పములు మలచును. మధ్య మధ్య నధికతర సౌందర్య ప్రకటనమునకై వజ్రవైడూర్యములను పొదుగును. ఈవజ్రవైడూర్యము లాబంగారములోనివి కావు ఆభరణ రూపముగానున్న ఆ కాంచనమునకు ఇవి కమనీయ కాంతినిచ్చును. ఈఆభరణ నిర్మాణమే ఆంధ్రీకరణ వైఖరి. మధ్య మధ్య ఖచిత రత్నములే అమూలక కల్పనలు.

తెనుగు సారస్వతములో పురాణముల ననువదించునప్పుడు పోతన చేసినంత అమూలకకల్పనములు మరెవ్వరు చేయలేదేమో యనిపించును. వస్తుసంవిధానములో, వస్తువర్ణనలో, భావచాలనములో ఆయన స్వతంత్రకల్పన సామర్థ్యము బహుముఖముగా ప్రసరించి సౌందర్యవంతమైన రచనా విశేషముల నందించినది. భక్త్యావేశముతో ఆమహాకవి రచించుటకు పూనుకొనినప్పుడు మూలము మూలబడి ఒక అఖండ కవితాజలపాతము మహోజ్జృంభణముతో ఉత్తుంగతరంగసంకులమై దూకును. ఆమహావేగమున కే మానవుడును తట్టుకొనజాలడు. ఆమహాప్రవాహమున పడి కొట్టుకొని పోయి ఎవరెక్కడ నొడ్డెక్కుదురో ఆపరమేశ్వరునకే ఎరుక.

భక్త్యావేశరచితములగు సందర్భములందేకాక వివిధరస పోషణాత్మకమగు ఘట్టములలోను పోతన ప్రతిభా పాండిత్య స్ఫోరకములును, భావరూపశిల్పచిత్రణ సమన్వితములును అగు కల్పనలెన్నో భాగవతమున కన్పించుచున్నవి. అట్టి వివిధ విశేషములకు సంబంధించిన కొన్ని ఉదాహరణము లీక్రింద పరిశీలింపబడుచున్నవి.

శుకుడు పరీక్షిత్తునకు చెప్పిన భాగవతమును సూతుడు శౌనకాదులకు నైమిశారణ్యమున జరిగిన సత్రయాగ సందర్భమున చెప్పినాడు. మూలమున నీసందర్భమున నొక్క శ్లోకముకలదు.

శ్లో॥ నైమిశేఽనిమిషక్షేత్రే మునయ శ్శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ సహస్రసమ మాసత.[1]

ఇందులో ప్రథమపాదమునకొక కందపద్యముగా ననువదించి, రెండవపాదమునకు రాకముందే ఒక సుదీర్ఘవచనములో పోతన నైమిశారణ్యమును వర్ణించెను. ఈవర్ణనము బాణుని కాదంబరిశైలిని పోలియున్నది.[2] "మరియును మధువైరి మందిరంబునుంబోలె మాధవీమన్మథసహితంబై బ్రహ్మగేహంబునుంబోలె శారదాన్వితంబై

నీలగళ సభానికేతనంబునుంబోలె వహ్నివరుణసమీరణ చంద్రరుద్ర హైమవతికుబేర వృషభగాలవశాండిల్యపాశుపత జటిపటల మండితంబై.[3]

శ్లేషగర్భితమైన ఈవచనము పోతనపాండిత్యమునకు ఒకచక్కని ఉదాహరణము. ఇట్టివింకను భాగవతమున చాల గలవు.[4]

శబ్దాలంకారములతో, అంత్యప్రాసలతోపాటు పద్య పాదారంభమున ద్విత్రిచతుష్ప్రాసలు పోతన కత్యంతప్రియము. సూతుని శౌనకాదిఋషులు కొనియాడునపుడు రచించిన ఈ క్రింది పద్యములు అట్టివాని కుదాహరణములు.

కం॥ మున్నాడవు చిరకాలము
కన్నాడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాడవు వినదగినవి
యున్నాడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్.[5]

నిజమునకిది పోతనకే స్వయముగా నన్వయించుపద్యము. ఆయనయు పెక్కు గ్రంథార్థములను కనినవాడే. వినదగినవి వినినవాడే. వీనినన్నింటిని మించినది పెద్దలొద్ద నుత్తమగోష్ఠిలో నున్నవాడు. వినదగినవి విన్నాడనుటలో ఎంతో మహార్థమిమిడియున్నది.

కం॥ భూషణములువాణికి నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృత్
తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోపచితభాషణముల్.[6]

విష్ణుభక్తిప్రబోధములగు నిట్టిపద్యరత్నములు వెదకిన కొలదిని భాగవతమహాసముద్రమున దొరకుచునే యుండును.

కృష్ణకథన మెంతవిన్నను తనివితీరదని వర్ణించుచు తనకును తనివితీరకయే ఒకమత్తేభములోను, సీసములోను విష్ణుకథాకథనావశ్యకతను పోతన కల్పించి వర్ణించెను.

మ॥ వరగోవిందకథా సుధారసమహావర్షోరుధారా పరం
పరలంగాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి

స్తరదుర్దాంతదురంత దుస్సహజనుస్సంభావితానేకదు
స్తర గంభీరకఠోరకల్మష కనద్దావానలంబాఱునే. 7

సీ॥ హరినామకథన దావానలజ్వాలల
గాలవే ఘోరాఘకాననములు
వైకుంఠదర్శన వాయుసంఘంబుచే
దొలగవే బహుదుఃఖతోయదములు
కమలనాభధ్యాన కంఠీరవంబుచే
గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణ ప్రభాకరదీప్తి
దీరవే షడ్వర్గతిమిరతతులు

ఆ॥ నళిననయనభక్తి నావచేగాకసం
సారజలధిదాటి చనగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబు
దెలుపవయ్య సూత! ధీసమేత. 8

ఈరెండుపద్యములును పోతన శైలీసంవిధానమునకు నిదర్శనములు. శైలియే గాక ఇట్టి భావములకును తరువాత తరువాత మరింత విపులీకరణముకాననగును.

శ్రీకృష్ణుడు ద్వారకానగరమును చేరు సందర్భమున ఆపట్టణవర్ణనమొక అంత్యప్రాసయుక్తమగు మంచిమత్తేభమున సాగినది.

మ॥ జలజాతాక్షుడు శౌరి డగ్గరె మహాసౌధాగ్రశృంగారకన్
కలహంసావృత హేమపద్మపరిఘాకాసారకన్ దోరణా
వళిసంఛాదితతారకన్ దరులతావర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకురకోరకన్ మణిమయప్రాకారకన్ ద్వారకన్. 9

ఇది చాలక తరువాత ఒకసుదీర్ఘవచనమున ద్వారకాపుర సౌందర్యము మహోజ్జ్వలముగా వర్ణింపపడినది. 10

ద్వారకాపురవాసులు కృష్ణునికి స్వాగతముచెప్పుచు పల్కిన పలుకులలో పోతన చేర్చిన పద్యములు చూడగా అవి ఆయన తత్వమునేగాక మరికొన్ని విశేషములనుగూడ తెలియబరచుచున్నవి.

కం॥ ఉన్నారము సౌఖ్యంబున
విన్నారము నీప్రతాపవిక్రమకథలన్
మన్నారము ధనికులమై
కన్నారము నీపదాంబుజంబులు హరీ! [11]

కం॥ ఆరాటము మదినెరుగము
పోరాటము లిండ్లకడల బుట్టవు పురిలో
చోరాటనమెగయదు నీ
దూరాటన మోర్వలేము తోయజనేత్రా! [12]

ఈరెండుపద్యములను చదువుచున్నచో సుఖముగా ధనికులై యుండుట ఆశింపదగిన విషయముగా కన్పించును. దారిద్ర్యపీడితుడగు పోతనకు అట్లుపలుకుట సముచితముగా తోచియుండును. లేకున్న నాగరులచే నావిధముగా ననిపింపవలసిన పని లేదు. ఇండ్లలో ఎట్టి పోరాటములును లేవట. ఇట్టివానిని గూర్చి ఇక్కడనేగాక రాబోవు మరియొక పద్యములోగూడ ప్రస్తావింపబడనది.[13] పురిలో చోరాటవమెగయదనుటలో పోతననాటి సాంఘికమైన అస్థిరత, అభద్రత గుర్తింపవచ్చును. రాజభట రక్షితమగు ఏపట్టణములలోనో తప్ప పల్లెలలో సామాన్యముగా బందిపోట్లభయ మారోజులలో చాలనెక్కువగా నుండెడిది. పట్టణములనుకూడ శత్రురాజులు జయించినప్పుడాతని భటులే దోచుకొన కుండెడివారుకారు.

ఆతరువాత అంతఃపురమున కరిగిన కృష్ణుడు తనభార్యలను పరామర్శించిన విధము చూడుడు.

కొడుకుల్ భక్తివిధేయు లౌదురుగదా? కోడండ్రుమీవాక్యముల్
కడవంబాటక యుందురా? విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థరససందోహంబులుంజాలునా?
కడమల్ గావుగదా? భవన్నిలయముల్ కల్యాణయుక్తంబులే? [14]

కృష్ణుడీపద్యమున సామాన్యసంసారియగుట చిత్రము. కథారంగమును మరచి పోతన తన సంసారరంగమునే ఇక్కడ ప్రతిఫలింప జేసినాడు. ఆయన రచనావైఖరి లోనే ఇదియొక విశేషము. ఎట్టికథను కవితావస్తువుగా గ్రహించినను అందులీనమై తానేఆపాత్రలలో వర్తించి తన వైయక్తిక భావానుభూతులే వానిలోను ప్రతిబింబింప జేయును. ఆయనకు రెండేరంగములు. ఒకటిసంసారము. రెండవది వైకుంఠము. ఆయన పాత్రలును రెండే. ఒకడుభక్తుడు, రెండవవాడు భగవంతుడు ఈరెండు రంగములమధ్య ఇద్దరుపాత్రలమధ్య పోతన వస్తుశిల్పమంతయు పరిభ్రమించు చుండును. కావ్యశిల్పదృష్టితో ఆలంకారికులు దాని నేవిధముగా పరిగణించినను భాగ వతదృష్టిలో అది వైశిష్ట్యసమన్వితమే అయినది. కృష్ణుడు సామాన్యసంసారివలె ప్రవర్తించినను ఐదేండ్ల ప్రహ్లాదుడు "భవ్యవయోబలప్రాభవోపేతుడై కామరోషా మల క్రందుకొనడు, కామినీప్రముఖ భోగములెన్నిగలిగిన వ్యసనసంక్తి నావంక బోడు" [15] అనివర్ణింపబడినను అందులకు కారణ మాక్షణమున పోతన ఆపాత్రలలో ఏకీభావమునొందుటయే. ఇట్టివిశేషములను పరిశీలించునప్పుడు పోతనను కావ్యధర్మము లక్షితుడైన భాగవతశేఖరునిగా మాత్రమే భావింపవలెను.

కృష్ణుడు తలిదండ్రులకు మ్రొక్కిన పిదప అంతఃపురమున ప్రవేశించునపుడు పోతనకొక సందేహము వచ్చినది. కృష్ణున కెనిమిదిమంది ప్రధానభార్యలేకాక పదు నారువేలమంది రాజకన్యలు భార్యలుగాకలరు. ఇందులో ఎవరింటికి ముందేగ వలెను? ఒకరింటికి పోయిన మరియొకరికి కోపము వచ్చునుగదా! అందుకని కృష్ణు డిట్లువర్తించెనట:

ఒక భామాభవనంబు మున్నుసొర వేరొక్కర్తు లోగుందునో
సుకరాలాపములాడదో సొలయునో సుప్రీతినీక్షింపదో!
వికలత్వంబుననుండునో యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుడై భార్గవా[18]

ఈ సందర్భమున మూలములో నిట్లు కలదు.

శ్లో॥ పత్న్యః పతింప్రోష్యగృహానుపాగతం
విలోక్యసంజాతమనోమహోత్సవాః
ఉత్తస్థురారాత్సహసాసనాశయాత్
సాకం ప్రవత్తైర్వ్రీడితలోచనాననాః[17]

తెనుగుపద్యములోని భావచమత్కారమునకు పోతన నిజముగా ప్రశంసార్హుడు. చతుర కల్పన మాయన కవిత్వమున కొక సహజాలంకారము.

ఉత్తరకు పరీక్షిత్తు జన్మించుఘట్టమున మూలమున నిట్లు కలదు.

శ్లో॥ మాతృగర్భగతో వీరః సతదా భృగునందన
దదర్శ పురుషం కంచి ద్దహ్యమానో ఽస్త్రతేజసా ।[18]

దీనిని తెనిగించుచు

వ... అభిమన్యుకాంతా గర్భంబునందున్న డింభకుండు దశమాస పరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురంతంబైన అశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు... [19]

అనిరచించి అంతతో సంతృప్తిపడక కాబోలును దహ్యమానుడగు నా ప్రాణి వేదనను పోతన నాలుగుపద్యములలో వ్యక్తపరచెను. కరుణరస ప్లావితములగు వానిలోనొక్కటి :—

కుయ్యిడశక్తిలే దుదరగోళములోపల నున్నవాడ ది
క్కెయ్యది? దా ననాథనని యెవ్వనితల్లి గణింపవిందు నే
డియ్యెడ్మషువహ్ని వాయుటకు నెయ్యదిమార్గము? నన్ను గావ నే
యయ్యగలండు? గర్భజనితాపద నెవ్వడెఱుంగు దైవమా?[20]

శమీదికనందనుడైన శృంగి పరీక్షిత్తు తన తండ్రికి చేసిన అవమానమును భరింపజాలక పలికిన మాటలలో పోతన కల్పించిన వివి.

ఉ॥ ఆడడుతన్నుదూషణము లాశ్రమవాసులగాని వైరులం
గూడడు కందమూలములు కూడుగ దించు సమాధిచిత్తుడై
పీడడు లోసచూడ్కులను విష్ణునిదక్క పరప్రపంచముం
జూడడు మద్గురుండు ఫణిజుట్టగ నేటికి రాచవానికిన్. [21]

ఉ॥ హోము హిరణ్యదానములు పుచ్చుకొనంగ ధనంబు లేమియుం
దేము, సవంచనంబులుగ దీవెనలిచ్చుచు వేసరింపగా

రాము వనంబులన్ గృహవిరాములమై నివసింపజేల్ల రే!
పామును వైవగాదగునె? బ్రహ్మమునీంద్రు భుజార్గళంబునన్. [22]

కం॥ పుడమిఁగల జనులు వొగడఁగ
కుడుతురు కట్టుదురుగాక కువలయపతులై
యడవుల నిడుమలబడియెడి
బడుగుల మెడ నిడఁగదగునె? పన్నగశవమున్. [23]

ధనాఢ్యులవలననో రాజులవలననో అవమానమునుపొందిన ఒక సాధుజనుని హృదయావేదన ఈ మాటలలో వ్యక్తమైనదనిపించును. యాచ్ఞాదైన్యములేక నిరపేక్షులై నిష్కాములై జీవించు సజ్జనులకును ధనవంతులచే రాజులచే ఒకప్పుడు బాధలుతప్పని స్థితి ఏర్పడును. పోతనకట్టి అవమానము ఆయన జీవితములో నెప్పుడైనకలిగెనో లేక సాధుజనుల కపకారముచేయు వారియెడల కలిగినకోపమే ఇట్లు పర్యవసించెనో ఎరుగముకాని, శృంగిముఖమున తీవ్రక్రోధదుఃఖ సముద్గతమగు వచోవైఖరి వెలువడినది.

శృంగిపరీక్షిత్తును శపించిన పిదప తండ్రిగళమున సర్పకళేబరమును జూచి దుఃఖార్తుడై ముక్తకంఠమున రోదించెనని మాత్రమే మూలమున కలదు. పోతన అక్కడ కొంత పెంచి ఇట్లు రచించెను.

కం॥ ఇయ్యెడ నీ కంఠమునకు
నియ్యురగశవంబుదెచ్చి యిటుచేర్చిన యా
యయ్యె నికనేమిసేయుదు?
నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁదండ్రీ!

శా॥ ప్రారంభంబున వేటవచ్చి ధరణీపాలుండు మాతండ్రిపై
నేరంబేమియులేదు సర్పశవము న్మెడన్ గ్రుడ్డై వైచినా
డీరీతిన్ ఫణి క్రమ్మఱన్ బ్రతుకునో హింసించునో! కోఁఅలన్
రారే! తాపసులార! దీవిదివరే! రక్షింపరే! మ్రొక్కెదన్. [25]

పైపద్యము చివరిపాదమును, గజేంద్రమోక్షములోని ప్రఖ్యాతపద్యపాదమగు "రావే ఈశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా!"[26] అనునదియు పద

స్వరము సంవదించుచున్నవి. అలంకారశాస్త్రము ననుసరించి దీనియందు వాక్యగర్భిత మను నొక దోషముగలదు. ఒక వాక్యమధ్యమున వాక్యాంతరము ప్రవేశించుట దీని లక్షణము. కానీ భాగవతపద్యమున ఆదోషమును గుణమేయైనది.

'ధరణీపాలుండు మాతండ్రిపై సర్పశవము నేడు గ్రుడ్డై వైచినాడు, అనునది యొకవాక్యము. దానిమధ్య నేరంబేమియులేదు- అను మరియొకవాక్యము ప్రవేశించి నది. ఒక భావ ముత్కటస్థితిలో వెలువడునప్పుడు ఇట్టి వాక్యప్రయోగము లోక దృష్టమే. పోతన జాత్యమగు నుడికారపు సొంపు ననుసరించి అట్లు రచించుటచే ఆ బాలుని అమాయకత్వమును. అతనిలోని భావోద్రేకమును, అక్రమముగా అన్యాయము జరుగుటచే కలిగిన పరితాపమును, ఆ అన్యాయమునుండి రక్షించుటకై ఇతరుల నర్థించుటలోగల ఉద్వేగమును ప్రస్ఫుటితమైనది. ఆయన కవితాశిల్పములో ఇదియొక చిన్న వజ్రపుతునక.

ఈ ఘట్టమున పోతన మరియొక విశేషాంశము నందించినాడు. పరీక్షిత్తు విప్ర శాపము నెరిగి ప్రాయోపవిష్టుడయ్యెడి సందర్భమున కామక్రోధములను గెలిచిన వాడగుటచే శక్తికలిగియు శృంగిని శపింపలేదని ఆయన కల్పించెను.

కం॥ దామోదరపదభక్తిం
గామాదుల గెల్చినాడు గావున గరుణన్
భూమీశు డలుగడయ్యెను
సామర్థ్యము గలిగి దోషసంగిన్ శృంగిన్. 27

పశ్చాత్తప్తుడై భాగవతమహాగ్రంథ శ్రోతకాబోవుచున్న ఒక మహారాజు శక్తి లేక ఊరకుండుటకంటె శక్తికలిగి సహించి ఊరకుండెననుటలో పోతన ఒకవిశిష్టతను భావించి యుండును.

ఈ సందర్భమున గమనింపవలిసిన ఒకవిశేషము కలదు. ఒక కథాఘట్ట నిర్మా ణము చేయుచున్నప్పుడు ఒక్కొక్కసారి పోతన కొన్ని తనకు మిక్కిలిఇష్టమైన సిద్ధాంతములను ప్రతిపాదింపదలచును. అట్లు తలచినప్పుడు అక్కడి పాత్రలెట్టివైనను వానిని నిమిత్తమాత్రముగా గ్రహించి తాను చెప్పదలచుకొన్నది వానిచే చెప్పించును. విష్ణుభక్తు లరిషడ్వర్గ విజేతలనియు, వారు శప్తులైనపుడు తిరిగి శంపింపగలిగియు శపింప రనియు భాగవతములో చిత్రకేతూపాఖ్యానాది కథలలో ప్రతిపాదితమైన సిద్ధాంత

మును పోతన ఇక్కడ ప్రస్తరింపదలచినాడు. అందుకై ప్రస్తుతకథలోని పరీక్షిత్తు నిమిత్తమాత్రుడై నిలిచెను. దీనివలన ఒక మహాభాగవత ధర్మమును ప్రవచించితి నన్న సంతృప్తి పోతనకు కలిగియుండును.

హరిని చింతింపక మత్తుడై విషయసక్తుడై వాసరముల్ ద్రొబ్బెడివాడు[28] నరకములలో పడును. వానికి పుట్టగతులులేవు. మూలములోనే ఆ నరకబాధలు దుర్భరముగా వర్ణితమైనవి, పోతన తానును దానికొక పద్యము జోడించి ఆమంటలు మరికొంత ఎగసనద్రోసెను.

కం॥ మొత్తుదురు గదల మంటల
కెత్తుదు రడ్డంబుదేహమింతింతలుగా
నొత్తుదు రసిపత్రికలను
హత్తుదురు కృతాంతభటులు హరవిరహితులన్. [29]

విష్ణుభక్తిశూన్యులయం దాయన కెంతనిరాదరమో, భాగవతమున నిట్టి పద్యములు పెక్కుసూచించుచున్నవి.

పోతన రచనలో ఒక విచిత్రమగు ధర్మము మనకు గోచరించును. అనేకస్థలములలో నాయన సూత్రప్రాయముగా జ్ఞానమును ప్రతిపాదించి తద్వ్యాఖ్యానప్రాయముగా భక్తిని ప్రబోధించుచుండును. అసలు భాగవతమే అట్టిది. దాని ఆదర్శమద్వైతము. దాని ప్రవర్తనము విశిష్టాద్వైతము. దాని ఆశయము జ్ఞానము. ఆచరణము భక్తి. భగవంతుడు, భక్తుడు అను రెంటి నొప్పుకొనుటతోడనే అద్వైతమునుండి ఒకమెట్టు దిగినట్లే. విష్ణుభక్తిప్రబోధకమగు భాగవతమున ఇంతమాత్రము తప్పదు. శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గముయొక్క శ్రేష్ఠతను గూర్చి చెప్పుచుముందు జ్ఞానమార్గము నిట్లు తాత్వికముగా ప్రకటించెను.

కం॥ కామింపకయును సర్వము
కామించియునైన ముక్తికామించితగన్
లోమించి పరమపురుషుని
నేమించి భజించు తత్వనిపుణుండధిపా. [30]

దేనిని కామింపకుండుట ఉత్తమస్థితి. ఒకవేళ కామించినచో ముక్తినికామింపుమని పోతన యిచ్చు సూచన. తత్వనిపుణుడగువాడట్లు చేయునట. జ్ఞానస్థితినుండి

భక్తిస్థితి పరిణమించుమార్గము నిట్లుచెప్పి, తదనంతరము భక్తిపరవశుడై విష్ణుపార మ్యములగు పద్యముల నిట్లు కల్పించెను.

సీ॥ విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు
కొండలబిలములు కువలయేశ!
చక్రిపద్యంబులు చదువని జిహ్వాలు
కప్పజిహ్వాలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు
కేకిపింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షుపూజకు గాని హస్తంబులు
శవముహస్తంబులు సత్యవచన!

ఆ॥ హరిపదతులసీదళామోదరతిలేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర!
గరుడగమనుభజనగతి లేనిపదములు
పాదపముల పాదంటలమనఘ! [31]

ఈ ప్రాంతమున ఇట్టి సీసపద్యములు మూడుకలవు.[32] వీనిలోని పురుష పశువు, కప్పలజిహ్వాలు, పందిముక్కు, మొద్దు, కట్టెమోపు మొదలగు కొన్నిపద్య ములు విష్ణుభక్తి రహితులయెడ ఆతని తీవ్రభావములకు సూచకములై యున్నవి.

హిరణ్యాక్ష వధఘట్టమున యజ్ఞవరాహ విజృంభణము పోతన కమనీయ కల్పనా శక్తికి ఒక ఉదాత్తోదాహరణము

సీ॥ తుదమొదళ్ళకు జిక్కి తునిసిపారగ మోర
కులశైలముల జిమ్ము కొంతతడవు
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులువోవ
కొమ్ముల దాటించు కొంతతడవు
జలధులేడును పంకసంకులంబై యుంక
ఖురముల మట్టాడు కొంతతడవు

ఉడురాజు సూర్యుండు నొక్కమూలకు బోవ
కురుచ వాలము ద్రిప్ప కొంతతడవు

తే॥ గునియు గుప్పించు లంఘించు గొప్పరించు
నెగయు ధరద్రవ్వ బొరియగా నేపుమిగిలి
దానవేంద్రుని గుండెలు తల్లడిల్ల
పందిమెల్లన రణ పరిస్పందియగుచు. [33]

సర్వభువనములను నిండినట్లు విష్ణువిజృంభణమును వర్ణించుట పోతనకు చాల ప్రీతి. పైసీసపద్యములోని ఒక్కొక్కపాదము చదువుచున్నప్పుడు వరాహమూర్తి విజృంభణమెంత భయంకరమో మనశ్చక్షువుల ముందు సాక్షాత్కరింపగలదు. అఖండ బ్రహ్మాండ సంభరితమైన ఒక మహాభావముయొక్క సముద్గమమెట్లుండునో పోతనవలె ఊహింప గలవారు చాలఅరుదు. ఈవిశ్వాత్మక భావమును మరియొక సందర్భమున లక్ష్మీదేవిచే పోతన భావింపజేసినాడు.

సీ॥ భావించియొకమాటు బ్రహ్మాండకుంతయు
నాటల బొమ్మరిల్లనితలంచు
పోలించియొకమాటు భువనమ్ములన్నియు
తనయింటిలో దొంతులనితలంచు
పాటించియొకమాటు బ్రహ్మాదిసురలను
తనయింటిలో బొమ్మలనితలంచు
గొనకొనియొకమాటు కుంభినీచక్రంబు
నలవడ బొమ్మపీటనితలంచు

ఆ॥ సొలసియొక్కమాటు సూర్యేందురోచుల
నచటి దీపకళికలని తలంచు
భామయొక్కమాటు భారతీదుర్గల
నాత్మసఖులటంచు నాదరించు. [34]

వరాహవర్ణన లక్ష్మీవర్ణన ఈరెండింటిలోను విశ్వసంపూరితత్వమును నొక భావము సమానముగానున్నను రెంటి శిల్పములోను కొంత భేదముకలదు. వరాహ

వర్ణనము వస్తు స్వరూపవర్ణనమైన, లక్ష్మీవర్ణనము వస్తుమనోభావవర్ణనము. రసాన్విత మైన ఒకఘట్టమును వర్ణించునప్పుడు ప్రతికవికిని శిల్పసంధానములో ఈరెండుమార్గము లును గోచరించుచునే యుండును. సమర్థుడగు కవి ఏసందర్భమున నేశిల్పము ననుస రింపవలెనో గుర్తెరిగి వర్ణించును. భారతమున తిక్కన కృష్ణుని కోపమును వర్ణించుచు

తే॥ పుండరీకాక్షుఁడగు తెల్లబోయి అప్పు
డరుణకమలాక్షుఁడయ్యె మురాంతకుండు. [35]

అని రచించెను. ఇదియొక గొప్ప రచనావైఖరి. ఒకభావమును వర్ణింపవలసి వచ్చి నప్పు డాభావము భౌతికస్థితిలో నెట్లు ప్రకటితమైనదో చెప్పుట ఒక మహాశిల్ప రహస్యము. తెల్లదామరలవంటి కృష్ణునికన్నులు కెందమ్ములుగా మారెననుటలో ఆయనకెంతకోపము వచ్చినదో వ్యక్తమైనది. ఇట్టి రూపశిల్పములోగాని, రెండవది యగు భావశిల్పములోగాని తిక్కనతరువాత పోతనదే స్థానము. ఈరూపశిల్పము యొక్క మహోన్నతస్థితి వామనుని త్రివిక్రమ రూపగ్రహణ ఘట్టమున పరాకాష్ఠ నొందినది.

శా॥ ఇంతింతై వటుడింతయై మరియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంతయై ధ్రువునిపైనంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. [36]

దీని తరువాత నొకమత్తేభమును ఆపిదపనొక సుదీర్ఘవచనమును కలవు. వచనములో కనుపించు త్రివిక్రమ సంపూర్ణస్వరూప మహాప్రదర్శనమునకు ముందరి రెండుపద్యములును నాందీప్రస్తావనలై మంగళాచరణము నాచరించినవి. మహో దాత్త శైలీసంభరితములైన ఈరెండుపద్యములును వెలలేని రత్నములు.

లోకములో సామాన్యముగా నొక వాదమునో సిద్ధాంతమునో ప్రతిపాదించు నప్పుడు దానిప్రామాణ్యమును నిరూపించుటకై వేదపురాణాదులనుండి శ్లోకము లుదాహరించుట జరుగుచుండును. ఆశ్లోకభావములను చెప్పినదానికంటె ఆశ్లోకపాద ములనే యథామూలముగా పలుకుట జనదృష్టిలో అధికతర ప్రమాణముగా భాసిం చును. అందుకై కొందరు కవులాయా శాస్త్రవాదములు వచ్చినప్పుడు బలవత్తర ప్రమాణ ప్రకటనకై యథాతథముగా ఆమూలభాషావాక్యములను గద్యపద్యములలో

నిముడ్చుటకు మొదలు పెట్టిరి. ఒకభాషావాక్యము పరియొక భాషావాక్యములో ప్రవేశించుట భాషాతత్త్వమునకు విరుద్ధము. ఐనను సంస్కృతాంధ్రములకుగల అత్యంత సాన్నిహిత్యమును బట్టి మిక్కిలి ప్రఖ్యాతములగు నాతిదీర్ఘవాక్యములను మాత్రము తెనుగుకవులు గ్రహించిరి. మళయాళములోవలె మణిప్రవాళభాషకు తెనుగున స్థిరమగు స్థానముదొరుకలేదు. ఉన్నంతలో శివకవులు దీనినెక్కువగా నాదరించిరి. వేదభాగముల నుండి వాక్యము లుదాహరించునప్పుడు సోమనాథుని ఈవాక్యపరిగ్రహణము మిక్కిలి ఎక్కువై విసుగును పుట్టింపకపోలేదు.

భారతమునన ట్టివి చాలతక్కువ. నన్నయ తిక్కనలేవో
కొలదిచోట్లమాత్ర మట్టినివాడిరి[37]

భాగవతమున తరచుగా అట్టి రచనా విధానము కన్పించును

సీ॥ వలనొప్పగా 'సదైవం కేశవాత్పరం'
బనిపల్కు రాజకీగానవళియును
మహిమ 'సర్వంవిష్ణుమయముజగత్తని
చదివెడి శారికా సముదయంబు
ఏపారగా 'జితం తేపుండరీకాక్ష'
యని లీల బాడు పికావళియును
లలిమీరగా 'మంగళం మధుసూదన'
యనిపల్కు కేకులనారతమ్ము

తే॥ తవిలి 'శ్రౌషడ్వషట్స్వధే'త్యాది శబ్ద
కలితముగ మ్రోయు మధుపనికాయములును
గలిగి యఖిలైక దివ్యమ గళవిలాస
మహిమ జెన్నొందు వైకుంఠమందిరంబు.[38]

పైపద్యములోని సంస్కృతవాక్యములు మూలమున నాఘట్టములో లేవు. విష్ణుపరములగు నాప్రఖ్యాత వాక్యములను పద్యములో నిముడ్చుటకై ఈసీసమును పోతన కల్పించెను. ఆవాక్యములు సువిశ్రుతములైనవగుటచే వానిని ఛందోబంధన నిముడ్చుటకై వలనొప్పగా, మహిమ, ఏపారగా, లలిమీరగా, తవిలి అనుపదములను

వ్యర్థముగా వాడవలసివచ్చినను అపద్యమొక చమత్కారాస్పదమై తనకు నిర్దేశించిన ప్రయోజనమును నెరవేర్చినది.

కేవలము సంస్కృతభాషలోనే పద్యము మొత్తము రచించుట సంస్కృతి ప్రియులగు వారి కొక విధమగు నానందహేతువు. అదియునుగాక మనసంస్కారము లోనే ఒకవైచిత్రి కలదు శబ్దశక్తియనుడు, అర్థప్రభావమనుడు, మరేమైననను డు. నమశ్శివాయ, నమోనారాయణాయ అనుటలో కలుగు భావతరంగ సంచలనవిస్ఫుర ణము శివునకునమస్కారము నారాయణునకునమస్కారము అనుటలో కలుగదు రుద్రగీతయంతయు ఇట్టి సంస్కృతరచనమున కుదాహరణము. సీసములలో గీతము లలో సంస్కృతభాషావాక్యములు రచించి పోతన ఒక వైశిష్ట్యమును చూపినాడు అందలి ఒకపద్యము చూడుడు.

తే॥ సర్వసత్త్వాయ దేవాయ సన్నియామ
కాయ బహిరంతరాత్మనే కారణాత్మ
నేఽ నమస్తార్థలింగాయ నిర్గుణాయ
వేధసే జితాత్మకసాధవే నమోఽస్తు, 39

పాక్షికముగా సంస్కృతయుతములగు

విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి యంచున్ గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనంబాశ్చర్యమున్ బొందగన్ 40

వంటి స్నిగ్ధగంభీర శైలీయుత పద్యములెన్నో భాగవతమున మనము కాంచగలము.

పురాణములలో భారతకథలకును, భాగవతకథలకును, నొక ప్రధాన భేద మున్నది. భారతములో నాద్యంతమొక ప్రధాన కథకలదు. అందులో సందర్భవశమున వివిధములగు నుపాఖ్యానములు వచ్చుచుండును. ప్రధానకథలోని ఒకపాత్రకు ధర్మమును బోధించుటకో లేక ఒకవిశేషాంశమును తెల్పుటకో అవిఉద్దిష్టములై యుండును. వానిప్రయోజనము నియతము. అవి దీర్ఘములైనచో ప్రధానకథాగమన మున కాటంకముకలిగి పాఠకుని మనస్సు ఉపకథలోనే నిలుచును. అట్టియెడ ఒకా నొకప్పుడు ప్రధానకథా సూత్రవిస్మరణము సంభవింపవచ్చును. అట్లగుట కావ్య

ధర్మమునకు విరుద్ధము అందుచేతనే భారతమున తిక్కన కావ్యశిల్పదృష్టితో మూలములో సుదీర్ఘములగు ననేకోపాఖ్యానములను సంగ్రహించెను. మహాకావ్యనిర్మాణ రహస్యము తెలియనివారు కొన్నిచోట్ల మిగులసంగ్రహించెనని అధిక్షేపించుచుందురు. భారతమహాకావ్యశరీరమున ఏఅంగమున కెంతప్రాధాన్యమీయవలెనో అంతవరకే ఆయన ఒసగెను. కొన్నిచోట్ల చక్కని కథలువచ్చినప్పుడు మానవసహజమగు చాపల్యముచే ఇక్కడమరింత వర్ణించియుండిన బాగుండెడిది. ఇక్కడ మరికొన్ని పద్యములు చెప్పవలసినది. అని సాధారణశిల్పులు భావింతురు. మహాకవుల గ్రంథములు పరిశీలించునప్పు డిట్టిశిల్పధర్మముల నె న్ని ం టి నో మనస్సున ననుసంధానించు కొనవలసి యుండును.

భారతమున గల ఈప్రధాన కథాసూత్రము భాగవతమున లేదు. విష్ణుపారమ్య ప్రబోధ మాంతర సిద్ధాంతమే కాని బాహిరమగు ముఖ్య గాధకాదు. ఇందేకథ కాకథ సర్వస్వతంత్రము. అందుచే సమర్థుడగు కవి మనసుతీర వర్ణించు కొనవచ్చును. అంతే కాని భారతములోవలె సంయమించు కొనవలసిన పనిలేదు. భారతమునే తిక్కన ప్రబంధమండలియని పేర్కొనినప్పుడు భాగవతమునకు నాపదము నన్వయించుట మరింత సార్థకము కాగలదు.

ఈవిధముగా భాగవతమొక మహాప్రబంధమండలి. శిల్పశాస్త్రదృష్టితో అందలి ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షము బలిచరిత్ర మొదలగునవి వేనికవి ప్రత్యేక ప్రబంధములు అందాంతర లక్షణము హరిభక్తిప్రచాలనము. ఇట్లు భాగవతమున అవయవియగు కథలేక కథాసూత్రార్థమై భావప్రవాహమును నిగ్రహించుకొనవలసిన అవసరములేక వస్తుగతముగానే ఒకస్వేచ్ఛ లభించుటచే పోతనకు సమగ్ర స్వతంత్ర కల్పనావకాశము సంప్రాప్తించినది. సహజవర్ణనాప్రియుడగు ఆయన దీని నాధారము చేసికొని మధురమధురసతరంగిణులను భాగవతమున ప్రవహింపజేసినాడు. భౌతిక చక్షువులకు గోచరములగు నదీనదపర్వతారణ్య దేవదానవ మానవులనెంత ఔత్సుక్యముతో విపులముగా వర్ణించునో, అదేఔత్సుక్యముతో అంతకంటె తక్కువకాని నేర్పుతో భిన్నపాత్రల మన స్తత్వములను సమగ్రముగా పరిశీలించి కావ్యరూపమున నాయనయందించు చుండును. ప్రహ్లాదచరిత్రాద్యులలోని ఇట్టికొన్ని విశేషములు గమనింపదగినవి.

ప్రపంచములో నొక వీరునిపరాక్రమమును వర్ణించుటకు రెండుపద్ధతులున్నవి. మొదటిదా వ్యక్తియొక్క శస్త్రాస్త్రసంపదలను రణరంగవిహారవైపుణ్యమును, శత్రు

మర్దనమును వర్ణించుట. రెండవది ఆతడోడించిన ప్రతిపక్షవీరుని మహాపరాక్రమ మును వర్ణించి, అంతవానిని కథానాయకుడు జయించెనని చెప్పుటచే ఆతనికుత్కర్ష నాపాదించుట. నిపుణుడగు కవి స్థానోచితముగా ఈరెండుపద్ధతులను ప్రయోగించును. ప్రహ్లాదచరిత్రలో ప్రతినాయకునిగా హిరణ్యకశిపుని చిత్రించుటలో పోతనచూపిన శిల్పరహస్యము గణనార్హము.

సీ॥ కోలాహలముమాని కొలువుడుసురలార!
తలగిదీవింపుడు తపసులార!
ఫణలెత్తకుడు నిక్కి పన్నగేంద్రములార!
ప్రణతులైచనుడు దిక్పాలురార!
గానంబుసేయుడు గంధర్వవరులార!
సందడిపడకుడు సాధ్యులార!
ఆడుడునృత్యంబు లప్సరోజనులార!
చేరికమ్రొక్కుడు సిద్ధులార!

తే॥ శుద్ధకర్పూరవాసిత సురభిమధుర
భవ్యనూతనమైరేయపానజనిత
సుఖవిలీనత నమరారి సొక్కినాడు
శాంతిలేదండ్రు నిచ్చలు చారులధిప! 41

ఋషిదేవగంధర్వ సిద్ధసాధ్యాదులందరును ఆ రాక్షసేంద్రునిచే విజితులై సేవకులైరని ఈపద్యము తెల్పుచున్నది. హిరణ్యకశిపుని విక్రమ మీవిధముగా ధ్వనితముచేయుట ఒక చాతుర్యవిశేషము. ఈపద్యమున నిద్రాసమయ వైభవమును చూచి కాబోలును దేవేశ్వరులకును ఏకాంత సేవాసందర్భమున కవులిట్టి పద్యము లల్లిరి. ఉదాహరణకొకటి చూడుడు.

రాజకళాధరుండు సువిరాజిత భూధరమందిరుండు వి
భ్రాజిత నీలకంధరు డరాతిభయంకరు డద్రికన్యతో
రాజమరాళతల్పమున రంజిలి మిక్కిలి చొక్కినాడయా
రాజవరేణ! ఈరజనిరంజిల నీదిశకాచి యుండుమా. 42

ప్రహ్లాదచరిత్రలో భక్తిభావముయొక్క పరమోత్కృష్టదశను పోతన అత్యద్భుతముగా వర్ణించినాడు. సర్వమును విష్ణుమయముగా చూడగలిగిన ప్రహ్లాదుని మహనీయవర్తనము నాయన మనకన్నులకుకట్టినట్లు అనేకవిధములగు పద్యములలో చిత్రించి తననైపుణ్యమును సార్థకపరచుకొనినాడు.

ప్రహ్లాదుని విష్ణుభక్తి పారమ్యమును తెలియబరచు నీక్రింది పద్యమువంటివి తెలియనివారు తెలుగువారిలో లేరు.

సీ॥ కమలాక్షునర్చించు కరములుకరములు
శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకునిజూచు చూడ్కులుచూడ్కులు
శేషశాయికిమ్రొక్కు శిరముశిరము
విష్ణునాకర్ణించు వీనులువీనులు
మధువైరిదవిలిన మనముమనము
భగవంతువలగొను పదములుపదములు
పురుషోత్తముని మీఁది బుద్ధిబుద్ధి

తే॥ దేవదేవుని జింతించు దినముదినము
చక్రహస్తునిఁబ్రకటించు చదువుచదువు
కుంభినీధవుఁజెప్పెడి గురుడుగురుడు
తండ్రి హరిఁజేరుమనియెడి తండ్రితండ్రి. 43

"కంజాక్షునకుగాని కాయంబు కాయమే[45] సంసారజీమూత సంఘంబువిచ్చునే[45] మందారమకరంద మాధుర్యమున్దేలు[46] అడుగడ్డునకు మాధవానుచింతనసుధా" [47] మొదలగుపద్యములు పోతనార్యుని కవిత్వమునకు పరమోదాహరణములు.

ప్రహ్లాదుని విష్ణుశరణాగతిని సర్వసమర్పణభావమును ప్రవచించు నీపద్యరత్నములు తెనుగుసాహిత్యమునకే దివ్యాలంకారములు

అమూలకమైనను సమయోచితముగా చొప్పించుటచే ప్రహ్లాదుని విద్యాభ్యాసమిషచే చదువునుగూర్చి పోతనకుగల అభిప్రాయములు మనకు తెలిసినవి.

కం॥ చదువనివా డజ్ఞుండగు
చదివినసదసద్వివేక చతురతగలుగున్
చదువగవలయునుజనులకు [48]

అందుచే ఆర్యులొద్ద చదువలెనట ! కాని ఈచదువులలో గ్రహింపవలసిన రహస్యమొకటికలదు. దానినే ప్రహ్లాదుడిట్లనుచున్నాడు.

కం॥ చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు నే
చదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ! [49]

పోతనయు చిన్నతనమున గురువులచెంత చదివినవాడై యుండును. అందువలననే 'చదువంగవలయుజనులకు' అన్నాడు. చదువులలో మర్మము తెలిసి కొన్నపిదప ఇంకనాచదువునే వల్లించుట అనవసరమని గుర్తెరింగి

చక్రహస్తుని బ్రకటించు చదువుచదువు
కుంభినీధవుజెప్పెడి గురుడుగురుడు [50]

అని ఘంటాఘోషముగా సిద్ధాంతీకరించినాడు సర్వశాస్త్రముల సారము నీ క్రిందివిధముగా ప్రహ్లాదునిచే పలికించి విద్య హరిభక్తికి నడువవలెనని ఆయన ప్రబోధించినాడు,

శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వెయ్యేటికిన్
గాథల్ మాధవశేముషీతరణి సాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాటగవచ్చునే సుతవధూమిత్రానోగ్ర వాంఛా మద
క్రోధోల్లోలవిశాలసంసృతి మహాఘోరామితాంభోనిధిన్ [51]

హరిభక్తిని ప్రబోధించు నిట్టిపద్యములలో మకుటాయమానమైనది ఈప్రఖ్యాతకందము

కం॥ ఇందుగలడందు లేడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం

డెందెందు వెదకిచూచిన
నందందేగలడు దానవాగ్రణి! వింటే [52]

ఈఘట్టములోని రసపోషణ సామర్థ్యమునకు మరియొక సందర్భమును గుర్తింప వచ్చును. నరసింహుడు హిరణ్యకశిపునిచేసిన చిత్రవధ పరమదారుణము. బీభత్స రసాస్పదమగు నాఘట్టము నేకవివర్ణించినను జుగుప్సావహముకాక తప్పదు. కానీ భాగవతమున నాచిత్రవధయు మనకు భయభక్తిభావములనే కలిగించునుగాని బీభత్స మును కలిగింపదు. అది అతిమానుష కథయగుటకు తోడు పోతనరచనా సామర్థ్య మును దానికట్టి స్థితినొసగినది.

హిరణ్యకశిపుని చీల్చిన నృసింహుని నఖములు కుఠారములవలె, కుద్దాలముల వలె, లవిత్రములవలె, క్రకచములవలె నలరారుట[53] సాహిత్యములోని అపూర్వవర్ణన లలో నొకటి. ఈచోటనే పోతన ఒక సర్వలఘుకందమును వ్రాసినాడు. అంత్యప్రాస యుక్తమగు నీపద్యమొక వింతగమకమును కలిగియున్నది.

కం॥ స్ఫురిత విబుధజనముఖములు
పరివిదళితదనుజనివహపతితనుముఖముల్
గురురుచిజిత శిఖిశిఖములు
నరహరికరనఖము లమరు నతజనసఖముల్ [54]

ఇట్టి సర్వలఘు పద్యములు వ్రాయుట పోతనకు మిక్కిలిఇష్టము. లక్ష్మీ దేవి నరసింహుని సమీపింపవలెనని ప్రయత్నించుచు నిట్లు ప్రవర్తించినదట.

కం॥ పలికెదనని గమకముగొను
పలికిన కడునలిగి విభుడు ప్రతివచనములన్
పలుకడని నిలుచు శశిముఖి
బలువిడి హృదయమున జనవు భయమును గదురన్ [55]

భయసంకోచయుతమగు లక్ష్మీదేవి అడుగులు తడబడుట ఈపద్యములోని సర్వలఘు గమనములో కనుపించును. అతొట్రుపాటు విషయమున నెవరికైన సందేహ మున్న గజేంద్రమోక్షములోని ఈ క్రిందిపద్యములోనది కలుగనే కలుగదు.

కం॥ అడిగెదనని కడువడిజను
అడిగిన తను మగుడ నుడువడని నడయుడుగున్.
వెడ వెడసిడిముడి తడబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్ [66]

ఛందోగమనమునకు శబ్దపునరుక్తి తోడ్పడినచో రసభావమెట్లు ధ్వనితమగునో సూచించుటకిట్టి పద్యములు సమ్యక్ తార్కాణములు.

నరసింహుని చూచి లక్ష్మీదేవి పొందిన సంకోచ మింకను ప్రళయార్కబింబమ్ము వగిదినున్నదిగాని[67] మొదలైనరీతిలో వర్ణింపబడినది. భయానక శృంగార భావముల పై ధర్మ్యమించు చక్కగా భావింపబడినది.

ఈవిధముగా రసనిధులగు షుమారేబది పద్యములను ప్రహ్లాదచరిత్రలో పోతన అమూలకముగా కల్పించినాడు. ఆయన రచనాసామర్థ్యమున కిదియొక శిఖరాయమాణ మగు ఘట్టము

భాగవతము నందలి కల్పనలన్నింటిలోను మకుటాయ మానమైనది గజేంద్ర మోక్షణకథ. మూలములో సూత్రప్రాయముగా నున్న ఈకథ తెనుగున విస్తృతమై భక్తిమార్గ శిరోమణియై అనుపమాన ప్రాశస్త్యము నందుకొన్నది. ఇతర స్కంధము లలో నింతవిపులమగు కథాకథన మెచ్చటను కన్పింపదు.

గజేంద్రుడార్తుడై గ్రాహపీడితుడై సర్వేశ్వరుని ప్రార్థించెను. తన్నెవ్వరు రక్షింపగలరో ఆతడెరుగడు. అందుకని ప్రత్యేకమగు నామరూపములుగల ఏదేవతనో ప్రార్థింపక నామరూపరహితుడును, నిర్గుణుడును, సర్వాత్మకుడును, విశ్వమయుడును నగు, జగదీశ్వరుని ప్రార్థించినాడు. దేవతలలో సామాన్యముగా నొకపద్ధతి యున్నది. భక్తుడెవరి నారాధించిన వారువచ్చి రక్షింతురు. ఇంద్రుని ప్రార్థించిన ఇంద్రుడు వచ్చును. చంద్రుని ప్రార్థించిన చంద్రుడు వచ్చును. గజేంద్రుని ప్రార్థన బ్రహ్మాదులకు తెలియకపోలేదు. ఆతడు తమ్ముగాదుకదా ప్రార్థించినదని వారూరకొనిరట. దీనిని వ్యాసుడిట్లు రచించెను.

ఏవం గజేంద్రముపవర్ణితనిర్విశేషం
బ్రహ్మాదయో వివిధలింగభిదాభిమానాః

నైతే యదోపసస్రువు ర్నిఖిలాత్మకత్వాత్
తత్రాఖిలామరమయో హరి రావిరాసీత్.[58]

దీనికి పోతన ఇట్లు తెనుగువ్రాసెను.

ఆ॥ విశ్వమయతలేమి వినియునూరకయుండి
రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుడు విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డపడదలంచి[59]

ఆతరువాత గరుడాధిరూఢుడును, చక్రాయుధుడును నగు హరి మకరమును చంపి గజేంద్రుని రక్షించినట్లు మూలమున మూడుశ్లోకములలోగలదు.[60] ఇక్కడ పరికింపవలసిన రహస్యమొకటి కలదు. అవతారములలో వివిధములగు విభేదములు కలవు శ్రీరామునకు తాను విష్ణువుననుస్మృతి ఎన్నడునులేదు. కృష్ణున కో సర్వ సంస్మృతులను, సర్వశక్తులును కలవు. ఈవిధముగా అవతారములలోని విశేషములను పరిశీలించిన నాల్గవమనువు తామసుని కాలమున విష్ణ్వవతారముగా నుద్భవించిన మూర్తిపేరు హరి. హరిమేధునకును, హరిణికిని పుట్టిన ఆహరి గ్రాహబద్ధుడైన గజరాజును విడిపించి ప్రాణభయమువలన బాపి కాచెనని భాగవతములో కలదు. అనగా గజేంద్రమోక్షణము చేసినది హరిమేధుని పుత్రుడగు హరియేకాని వైకుంఠ వాసియగు విష్ణువుకాడు. ఈహరి గరుడచక్రముల నుపయోగించుటచే విష్ణుత్వప్రజ్ఞప్తి కలవాడని భావింపవలెను. ఈహరియును విష్ణువుయొక్క అవతారమేకదా! విష్ణువే వచ్చి రక్షించెననిన తప్పేమి అనవచ్చును. రావణుని సంహరించినదెవరనగా శ్రీరామ చంద్రుడనియే చెప్పుదుముగాని శ్రీమహావిష్ణువని చెప్పము. ఈరాముడా విష్ణువుయొక్క అవతారమే కావచ్చును. కానీ వ్యవహారమునకు రాముడురాముడే. విష్ణువువిష్ణువే. ఎవరుచేసిన కార్యములు వారికేగాని మరియొకరికారోపించుట గందరగోళమునకు కారణమగును. కానీ పోతన గజేంద్రుని రక్షింప వైకుంఠవాసియగు విష్ణువు బయలు దేరెనని కల్పించెను. ఇక్కడ పోతన రచించిన ప్రఖ్యాత పద్యముచూడుడు.

అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందార వనాంతరామృత సరఃప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రముపాహిపాహియనకుయ్యాలించిసంరంభియై[61]

ఈపద్యమున మరియొక ఇబ్బంది కన్పట్టుచున్నది. ఈకథ నాల్గవమన్వంతరములో జరిగినది. ఐదవమన్వంతరములోగాని వైకుంఠము నిర్మింపబడలేదు. అంతకుముందు విష్ణువుయొక్క లోకమునకు వైకుంఠమని పేరున్నదనుట అనుమానాస్పదము. ఐదవ మన్వంతరమున శుభ్రునకును వికుంఠయను పరమసాధ్వికిని విష్ణువు వైకుంఠుడన బుట్టి ఎల్లలోకములును మ్రొక్కగా వైకుంఠలోకమును కల్పించెను. మూలములో నీసందర్భమున

వైకుంఠః కల్పితో యేన లోకో లోకనమస్కృతః
రమయా ప్రార్థ్యమానేన దేవ్యా తత్ ప్రియకామ్యయా [62]

అని కలదు, దీనిని పోతన అవనిపై వైకుంఠమనియెడి లోకంబుకల్పించె[63]. అని అనువదించెను. ఏదైనను వైకుంఠముపేరు విష్ణులోకమున కైదవమన్వంతరమునకు ముందున్నను లేకున్నను ఆలోకము మాత్రము కలదనుటలో ఆస్తికున కెట్టి అవిశ్వాసమును నుండదు. విష్ణులోకము నుండి సర్వేశ్వరుడు బయలుదేరుచున్నాడని చెప్పుటలో వైకుంఠ మనుపదము సుప్రసిద్ధముగావున పోతన వాడియుండును. తానే వ్రాసిన నాల్గవమన్వంతరపు హరినిగూర్చిగాని, ఆతరువాత వ్రాయబోయెడి ఐదవ మన్వంతరపు వైకుంఠుని గూర్చిగాని ఆయన అంత పట్టించుకొనలేదు.

విష్ణుభక్తిభరితుడగు పోతన భావనలో గజేంద్రమోక్షణ ఘట్టమొక చక్కని కల్పనావకాశముగల కథగా గోచరించియుండును. అందుకే మూలమున మూడు శ్లోకములలో తేల్చివేసినదానిని ముప్పదియైదు గద్యపద్యములలో విస్తరింపజేసినాడు. ఆయనదృష్టిలో భక్తిప్రధానములగు నిట్టిఘట్టములను పురాణభాగములుగా కంటె ప్రత్యేక ప్రబంధములుగా సంవీక్షించుటయే సముచితమైన కార్యము. పురాణకథగా దానిని సూతుడు శౌనకాదులకు చెప్పుటయో, పరీక్షిత్తునకు శుకుడు చెప్పుటయో ఏదైననేమి అదంతయు నిమిత్తమాత్రము. ఆఘట్టము నాఘట్టముగానే చూడవలెను గాని దాని పూర్వాపరసమన్వయముల నంతగా పరిశీలించుట కిదేమి వస్త్వైక్యము కలిగినకావ్యమా? ఇదియొక మహాపురాణము. మహాపురాణములన్నియు సముద్రముల వంటివి: ఒకయొడ్డుననుండి చూచిన మరియొకయొడ్డు కన్పింపదు. అట్టివానియందెక్కడి సౌందర్యమునక్కడనే సంభావింపవలయును. కాన ఈకల్పనాకథను పౌరాణికదృష్టితో గాక ప్రాబంధికదృష్టితో చూడవలయును. భారతరచనా కాలమునుండి ఆంధ్రకవితా మార్గములో వచ్చుచున్న అనేకవిధములగు మార్పులను పరిశీలించినచో పురాణకవితా

రీతి ప్రబంధకవితారీతికి దారితీయుచున్నట్లు విస్పష్టముగా కన్పట్టును. స్వతంత్ర ప్రతిభా సామగ్రీసమన్వితుడును, సహజవర్ణనాప్రియుడును నగు పోతన తాను రచించుచుండిన గ్రంథములోని వివిధఘట్టములను రసవంతములగు ప్రత్యేక ప్రబంధములుగా తీర్చిదిద్దుటకు ప్రయత్నించెను. ఆప్రయత్నఫలమే తెనుగుజాతి అదృష్టవశమున భాగవత మహాగ్రంథముగా రూపొందినది.

ఇంతకును చెప్పునదేమనగా వైకుంఠము నుండి విష్ణువువచ్చి గజేంద్రుని రక్షించినట్లుగా పోతన కల్పించుట పౌరాణిక సత్యము కాకపోవచ్చునుగాని ప్రాబంధిక సత్యము కాకపోదు. పురాణములో హరిణీహరిమేధుల పుత్రుడగు హరిచే గజేంద్రుడు రక్షింపబడినఘట్టము పోతన భావనాలోకమున నొక మహనీయదృశ్యముగా భాసించినది. ఆమహాద్భుతదర్శనముచే పులకితుడై పరవశుడైన ఆమహాకవిలేఖిని నుండి కమనీయకవితా గంగాప్రవాహము ప్రవహించినది. మూలభిన్నముగా కథ కల్పించుట తగునాతగదాయను తర్కవాదములకిచ్చుట స్థానములేదు. కవిత్వము తర్కవితర్కముల కతీతమైనది. దాని కనుభూతియే ప్రధానము. అన్వయములు, వివరణలు ద్వితీయదశలోనివి.

గజేంద్రుని రక్షించుటకై బయలుదేరిన గోవిందుని కరారవిందసమాకృష్యమాణ సంవాదచేలాంచలయై పోవుచు

తనవెంచేయు పదంబు పేర్కొనడనాథ (శ్రీ) జనాలాపముల్
వినెనో ముచ్చులుముచ్చిలించిరొఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులన్
గని చక్రాయుధుడేడి చూపుడని ధిక్కారించిరో దుర్జనుల్

వ॥ అనివితర్కింపుచు

తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్తకుచంబుతో సదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటాలేపముతో మనోహర కరాలగ్నోత్తరీయంబుతో
కోటీందుప్రభతో నురోజభర సంకోచద్విలగ్నంబుతోన్ 64

లక్ష్మీదేవి గమ్యస్థానము నడుగదలచియు సంకోచించి ఆగినది. ఆమె ఏమను కొనెనో యని కరిరక్షణానంతరము విష్ణుదేవునకు స్మరణ వచ్చినది. అప్పుడాత డామెతో నిట్లన్నాడట.

కం॥ బాలా! నా వెనువెంటను
హేలన్ వినువీథినుండి యేతెంచుచునీ
చేలాంచలంబు బట్టుట
కాలోనేమంటినన్ను నంభోజముఖీ

కం॥ ఎరుగుదు తెరవా! యెప్పుడు
మరవనుసకలంబునన్ను మరచినయెడలన్
మరతునని యెరిగి యెరగక
మరవక యెరయిడిరయేని మరియన్యములన్ 65

అనిన నామెయు మందహాసమున తన ప్రాణేశ్వరుని దీనరక్షణను ప్రశంసించి నది. విష్ణువు కరిగావచ్చునప్పుడు లక్ష్మీ స్తనోపరిచేలాంచలమును పట్టుకొన్నందు కామెకు మరల సమాధానము చెప్పి సంతృప్తిపరచుటకు ప్రయత్నించుట పూర్వపర సమన్వయాత్మకమగు చక్కని కల్పన

ఈఘట్టమున వైకుంఠమునందలి ఆబాలగోపాలమును బయలుదేరుట రమణీయ ముగా వర్ణింపబడినది.

తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్ దానివె
న్కను బక్షీంద్రుడు వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రావచ్చి రో
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్ 66

ఈదృశ్యమునంతటిని ఆకాశమున జూచి దేవతలు నమస్కరించిరట

చనుదెంచెన్ ఘను డల్లవాడె హరి పజ్జంగంటిరే లక్ష్మి శం
ఖనినాదం బదె చక్రమల్లదె భుజంగధ్వంసియున్ వాడె క్ర

స్నన నే తెంచెనటంచు వేల్పులు నమోనారాయణాయేతి ని
స్వనులై మ్రొక్కిరి మింట హాస్తిదురవస్థా వక్రికిన్ జక్రికిన్. 67

ఇట్టి కల్పనలతో ఇట్టిదృశ్యములతో ఈకథాభాగము సుమనోహరమై ఆనందముకూర్చుచున్నది. ఈఘట్టమున ముఖ్యముగా గజేంద్రుని ప్రార్థనపద్యములు **తెనుగువారు** సర్వదా స్మరించుచుందురు. ఏకష్టము కలిగినను

లావొక్కింతయు లేదు ధైర్యమువిలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెనుమూర్ఛవచ్చెతనువుండస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా! 68

అని స్తుతించుట పరిపాటియైనది. ఇట్టి భాగవతపద్యములు స్మరింపని **వాడుండడు** ఈకథలో మొత్తముమీద పోతన పరమరమణీయములుగా షుమారు డెబ్బదిపద్యములు కల్పించెను.

కూర్మావతారకథయందు మహాకూర్మవర్ణనమంతయు నమూలకము. యజ్ఞవరాహాదివర్ణనలవలెనే ఈకూర్మవిజృంభణమును అద్భుతముగా చిత్రింపబడినది.

సీ॥ నవరనై లక్షయోజనముల వెడలుపై
కడుగఠోరంబైన కర్పరమున
నదనైన బ్రహ్మాండమైన నాహరించు
ఘనతరంబగు ముఖగహ్వరంబు
సకలచరాచర జంతురాసులనెల్ల
మ్రింగి లోగొనునట్టి మేటికడుపు
విశ్వంబుపై వేరు విశ్వంబుపై బడ్డ
నాగిన గదలనియట్టికాళ్ళు

తే॥ వెలికిలోనికి జనుదెంచు విపులతుండ
మంబుజంబుల బోలెడి యక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి జెలువొంద నొకమహా కూర్మమయ్యె 69

తరువాత సురాసురులు సముద్రమును మథించు ఒక దీర్ఘవచనము[70] హాలాహలవిజృంభణమును వర్ణించు మరియొక దీర్ఘవచనము[71] అమూలకములే. ఆరెంటి మధ్య సముద్రమథనమును శబ్దార్థములు రెంటితో ప్రకాశింపజేయు రెండు సర్వలఘు కందములుగలవు. అందొక్కటి చూడుడు.

కం॥ ఎడమగుడి మునుపుదిరుగుచు
కుడినెడమను వెనుకదిరుగ కులగిరికడలన్
గడవెడల సురలునసురులు
తొడితొడిఫణిఫణము మొదలుతుదియును దిగువన్.[72]

హాలాహలభీతులగు బ్రహ్మాదులు శంకరుని సభాద్వారముచెంత బాధలుపడుట ఒక వింతదృశ్యము,

చని కైలాసముజొచ్చి శంకరునివాసద్వారముంజేరి యీా
సున దౌవారికులడ్డపెట్ట దలమంచున్‌జొచ్చి కుయ్యో మొరో
వినుమాలింపుము చిత్తగింపుము దయన్వీక్షింపుమం చంబుజా
సనముఖ్యుల్ గనిరార్తరక్షణ కళాసంరంభునిన్ శంభునిన్.[73]

బ్రహ్మాదులకుకూడ రాజశేఖరుని సభాద్వారమున ద్వారపాలకుల ఆటంకములు తప్పలేదని వర్ణించుటలో రాజాలయములచెంత ఎట్టిఇబ్బందులు కలుగునో సూచించినట్లైనది.

పార్వతీదేవి హాలాహలభక్షణమునకు శివుని ప్రోత్సహించుట చక్కని కల్పనములలో నొకటి.

తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్
ఘనగంభీరరవంబుతో శివుడు లోకద్రోహి హుం పోకు ర
మ్మని కెంగేలదెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బన...[74]...

సర్వంకషమగు మహావిషము నాహరించుట చూడదగిన గంభీరదృశ్యములలో నొకటి.

తరువాత శ్రీదేవి ఉదయించిన సందర్భమున షుమారిరువది కమనీయకల్పనాత్మక గద్యపద్యము లుదయించినవి. ఇతరదేవతలకంటె విష్ణువధికుడని లక్ష్మీదేవి ఎట్లుభావించినదో చూడుడు.

సీ॥ అమరము త్తైదువనై యుండవచ్చును
వరునకు సవతులెవ్వరును లేరు
వెలయంగనల్కాంత విభవమీతనియిల్లు
శృంగారచందన శీతలుండు
కలగడెన్నడు శుద్ధ కారుణ్యమయమూర్తి
విమలుండుగదిసి సేవించవచ్చు
నెరినాడితిరుగడు నిలుకడగలవాడు
సకలకార్యములందు జడతలేదు
ఆ॥ సాధురక్షకుండు షడ్వర్గరహితుండు
నాథుడయ్యెనేని నడపనోపు
నితడెభర్తయనుచు నింతిసరోజాక్షు
పుష్పదామకమున బూజసేసె. [74]

లక్ష్మీనారాయణుల వివాహసమయ ప్రథమప్రణయ వీక్షణసౌందర్యము నీ క్రిందిపద్యమున గాంచవచ్చును.

కం॥ హరిసూచిన సిరిసూడదు
సిరిచూచిన హరియుజూడ సిగ్గునుబొందున్
హరియును సిరియును దమలో
సరిచూపుల జూడ మరుడు సందడిపెట్టెన్. [76]

తదనంతరము వామనచరిత్రమొకటి అనేకకల్పనములుగల భాగము. అదితి తనబిడ్డలగు దేవతలబాధలను భర్తయగు కశ్యపమునీంద్రునితో పలికినవిధము మిగుల కరుణరసాస్పదము.

సీ॥ ఎండకన్నెరుగని యింద్రునియిల్లాలు
పలుపంచలను జాలిపడియె నేడు
త్రిభువనసామ్రాజ్య విభవంబుగోల్పోయి
దేవేంద్రుడడవుల దిరిగె నేడు
కలిమిగారాపుబిడ్డలు జయంతాదులు
శబరార్భకులవెంట జనిరి నేడు
నమరుల కాధారమా నమరావతి
యసురుల కొటపట్టయ్యె నేడు

ఆ॥ బలిజగములనెల్ల బలియుచున్నాడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతడాహరించెను
ఖలుడు సురలకొక్క కడియునీడు.[77]

దేవతలకొఱకై బలిని వామనుడు యాచించుటను పోతన యెట్లు సమర్థించెనో చూడుడు.

కం॥ హరిహరి సిరియురమునగల
హరి హరిహయుకొఱకు దనుజునడుగంజనియెన్
బరహితరతమతియుతులగు
దొరలకునడుగుటలు నొడలితొడవులువుడమిన్.[78]

ఈసర్వ లఘుకందమువలెనే శబ్దాలంకారసమన్వితమగు బలి యజ్ఞవాటికా వర్ణనము చూడుడు.

చండస్ఫూర్తి వటుండుగాంచె బహుధాజల్పన్నిశాటంబు నుద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు వేదండాశ్వధ్వజినీకవాటము మహోద్యద్ధూమసంఛన్న మార్తాండస్యందనఘోటమున్ బలిమఖాంతర్వేదికావాటమున్.[79]

అంత్యప్రాసయుతమగు నీపద్యముదాత్తగంభీరమై పోతన రచనా పాటవమును ప్రదర్శించుచున్నది. బలిచక్రవర్తి పల్కినవాక్కులలో సుమనోజ్ఞమైన ఈ క్రిందిపద్యమొకటి.

ఆదిన్ శ్రీసతికొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై గపోలతటిపై పాలిండ్లపై నూత్నమ
ర్యాదంజెందు కరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మేల్
గాదే! రాజ్యముగీజ్యమున్ సతతమే కాయంబునాపాయమే! [80]

లక్ష్మీ విష్ణువుల శృంగారక్రీడారహస్యము నభివర్ణించు నీపద్యము భావచాలనమునకును శైలికిని మకుటాయమానమైనది.

ఇట్లే ఇంకను బలివామన సంవాదమున చాల నమూలకములు కలవు.

చెలియేమృత్యువు చుట్టమేయముడు నంసేవార్థులేకింకరుల్
శిలలంజేసెనెబ్రహ్మతన్ను దృఢమేజీవంబు నో చెల్లరే!
చలితంబౌట యెఱుంగ రీకపటసంసారంబు నిక్కంబుగా
దలచున్ మూఢుడు సత్యదానకరుణా ధర్మాదినిర్ముక్తుడై [81]

జీవితపరమసత్యమును బోధించు నిట్టిపద్యములను సందర్భము కల్పించుకొనియైన ఏపాత్రముఖముననో పోతన పల్కించుచుండును. ఏలన జగత్తుమిథ్యయనియు విష్ణుభక్తి యొక్కటియే జీవులను తరింపజేయుననియు ఆయన విశ్వాసము

పైవిధముగా వామనచరిత్రలో అత్యంతసుందరమగు నమూలకపద్యములెన్నో రసపోషకములై పాండిత్యప్రజ్ఞానిదర్శనములై అలరారుచున్నవి.

పిదప మత్స్యావతారకథయొకటి అధికములగు నమూలకములను కలిగియున్నది. మహాకూర్మవర్ణనవంటిదే ఇక్కడి మత్స్యావతారవర్ణన సీసపద్యముకూడ.[82] అచటనే బ్రహ్మను గూర్చి చెప్పినపద్యము.[83] మొదలగునవి పోతనార్యుని నైపుణ్యమునకు దార్కాణములు.

నవమస్కంధము రాజవంశానుచరితములు కలది. అందు విష్ణుభక్తిప్రాధాన్యముగల కథలు అంబరీష రంతిదేవులవి. వానిలోమాత్రము కొంత అధికతరము అగు నమూలకవర్ణనములు కన్పించుచున్నవి. ఈ సందర్భమున గమనింపవలసిన

విశేష మొక్కటిగలదు. భాగవతములోని వివిధఘట్టములను విస్తరించి రచించుటలో పోతన విష్ణుభక్తి ప్రధానములైనవానికే ప్రాముఖ్యము నొసగెను. అందుకే యయాతి చరిత్ర, దుష్యంతోపాఖ్యానము మొదలగువానిలో గజేంద్రమోక్షణాదులలోవలె ఎక్కువగా కల్పనములు కావించుట కానరాదు. యాదృచ్ఛికముగా నటనట కొలది పద్యములు మాత్ర మమూలకములుగా కన్పించును. అంబరీషోపాఖ్యానములోని ఈక్రిందిపద్యము పోతనదృష్టిలో భగవంతుడెంత భక్తప్రియుడో తెలుపుచున్నది.

ఆ॥ నాకుమేలుగోరు నాభక్తుడగువాడు
భక్తజనులకేన పరమగతిని
భక్తుడెందుజనిన పరతెంతువెనువెంట
గోవువెంటదగులు కోడెభంగి 84

అత్యంత గ్రామీణుడును, ప్రకృతికి సమీపతముడునునగు పోతనకాక మరి యొక డిట్టి ఉపమానమును ప్రయోగింపజాలడు. నాగరికతాపరివేషములేని స్వచ్ఛ మగు కవిత్వమన నిట్టిదే.

నవమస్కంధములో శ్రీరామచరిత్రము మిక్కిలి ముఖ్యమైనది. ఈఘట్ట మున వాడినన్ని అంత్యప్రాసలను మరియెచ్చటను పోతన రచింపలేదేమో అని పించును. అట్టి పద్యములలో నొక్కటి ఈక్రింద నుదాహృతము.

శోషితవారిపుంజుడు నృపసోముడు రాముడు రాక్షసేంద్రతా
శేషవిభూతి గప్పసమజీవిని గప్పని నిల్పె నర్థి సం
తోషణు పాపశోషణు సదూషణు శత్రుదరోషణున్ మితా
భాషణు నార్యతోషణు కృపాగుణభూషణు నవ్విభీషణున్. 85

శ్రీరామకథచివర రామునిస్తుతించు మనోహర పద్యములలో మరొక అంత్య ప్రాస సమన్విత చంపకము చూడుడు

వశుడుగ్రమొక్కెదన్ లవణవార్ధి విజృంభణతానివర్తికిన్
దశదిగధీశ మౌళిమణిదర్పణ మండితదివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్

దశరథరాజుపట్టికిని దైత్యపతింబోరిగొన్న జెట్టికిన్.[86]

దీనికితోడైనది ఈక్రింది ఉత్పలము.

నల్లనివాడు పద్మనయనంబులవాడు మహాశుగంబులన్
విల్లునుదాల్చువాడు కడువిప్పగువక్షమువాడు మేలుపై
జల్లెడువాడు నిక్కినభుజంబులవాడు యశంబుదిక్కులన్
జల్లెడువాడు నైన రఘుసత్తము డీవుత మాకభీష్టముల్.[87]

ఈపద్యము పఠింపగనే దశమస్కంధములోని నల్లనివాడు పద్మనయనంబుల వాడు[88] అను ప్రఖ్యాతపద్యము గుర్తునకువచ్చును. ఈరామవర్ణనాత్మకము ముందరి దగుటచే ఇదిరెండవదగు కృష్ణవర్ణనాత్మకపద్యమునకు దారితీసినదని చెప్పవచ్చును.

దశమస్కంధము భాగవతములో నొక ప్రత్యేకస్థానము కలది సంస్కృత మున దీనియందు తొంబది అధ్యాయములుగలవు. తెనుగున మూడువేలకుపైగా గద్య పద్యములు గలవు. అనగా పోతనరచనలో దాదాపు సగమీదశమస్కంధమొకటే నన్నమాట. ఒకేస్కంధ మింతపెద్దదిగా నుండుట స్కంధవిభాగదృష్టితో సముచిత ముగా నుండదనికాబోలును పోతన పూర్వోత్తరములుగా విభజించెను. రుక్మిణీ కళ్యాణమువరకు నొకభాగము మిగిలినది తరువాతిభాగము.

ఇతరస్కంధములన్నియు వస్త్వైక్యమును నేకనాయకా శ్రయత్వమును కలిగి నవికావు. అందు భక్తులకథలు అవతారములకథలు, రాజవంశచరిత్రలు, ఇత్యాదిగా ఎన్నో వచ్చినవి. దశమస్కంధమట్లుకాక భాగవతనాయకుడు కృష్ణుడు కథానాయకు డుగా గల ఒకమహాప్రబంధము కృష్ణుని జననమునుండి చివరివరకు (ఒకమృతితప్ప) గల స్వవిశేషములను నిందు విశదముగా నభివర్ణితమైనవి. ఇవి శృంగారవీర రసా శ్రయమగు నొక ప్రౌఢకావ్యము.

భాగవతమున నాయువుపట్టయిన ఈకృష్ణ ప్రబంధమును మూలకర్తయే మహా మహితముగా తీర్చిదిద్దినాడు తెనుగున పోతనామాత్యుడును దశమస్కంధమే తన కవితా సర్వస్వకేంద్రముగా భావించి అత్యంత భక్తిశ్రద్ధలతో రచించినట్లు స్పష్టముగా కన్పించును. ఇందలి వివిధఘట్టములలో భావపరవశుడై ఆయన కావించిన అమూల కల్పనము లాంధ్రశారద కమూల్యాలంకారములైనవి. అక్కడక్కడ అట్టి సుమనో హరసువర్ణ సూక్తిపంక్తులను కొన్నింటిని ప్రదర్శించుటకు ప్రయత్నించెదను.

కృష్ణజననమున పరమేశ్వరుడు భూలోకమున నవతరించుచున్నాడని కాబోలును ప్రకృతియంతయును పులకించినది. ఆసమయమున వ్రేపల్లెలోని ఒకసుందరదృశ్యము చూడుడు.

కం॥ క్రేళ్ళురికి మసలెతెలేగలు
మల్లడిగొని రంకెలిడియె మదవృషభంబుల్
పెల్లుగ మొదవుల పొదుగుల
జల్లించెం బాలు బాలు సంభవవేళన్ [89]

నందాంగనాడింభకుని జూచుటకై గోపికలుల్లాసము చెందుట ఒక సుందర దృశ్యము. శ్రవణానందకరమగు వారి మధురభాషణమిది.

ఆ॥ ఏమినోముఫలమొ ఇంత ప్రొద్దొకవార్త
వింటి మబలలార వీనులలర
మనయశోద చిన్నిమగవాని గనెనట
చూచివత్తమమ్మ సుదతులార. [90]

ఈపద్యము వ్రాసిన పిదప చిన్నిమగవాని అనుపద ప్రయోగములోని మాధుర్యమునకు పోతన ఒకటిరెండుసార్లు తనకుతానై పఠించుకొని మురిసియుండునని నావిశ్వాసము. ఈచిన్ని అనుపదమును పోతనముద్దుగా నెన్నోసార్లు ప్రయోగించియున్నాడు.

1. చిన్నకుమారకుని రవ్వసేయుందగునే [91]

2. చిన్నకుమారుండె యితడుశీతాంశుముఖీ [92]

3. చిన్నియన్నలార శీతాంశుముఖులార [93]

కృష్ణుని నిదురపుచ్చుట కువిదలుపాడిన జోలపాట మిక్కిలి లలితమైనది

కం॥ జోజో కమలదళేక్షణ!
జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!
జోజో పల్లవకరపద!
జోజో పూర్ణేందువదన! జోజో యనుచున్.

వారు జోకొట్టగా కృష్ణుడు నిరంతరనిర్నిద్రుడయ్యును నిదురనటించెడివాడట.

కం॥ లోకములు నిదురవోవను
జోకొట్టుచు నిదురవోని సుభగుడు రమణుల్
జోకొట్టిపాడ నిదురన్
గైకొనుక్రియ నూరకుండె కనుదెరవకయున్ [95]

నిజము ! లోకేశ్వరునకు నిదురఎక్కడిది ? సంయములే సర్వభూత నిద్రావేళల మేల్కొనియుందురట 'యానిద్రాసర్వభూతానాంతస్యాంజాగర్తిసంయమీ' అని కదా ఆర్యోక్తి ఇక సంయమీశ్వరుడగు కృష్ణుని విషయము చెప్పవలసిన పనియేమున్నది.

గోపికలు శ్రీకృష్ణుని దుడుకుచేతలు యశోదాదేవికి తెల్పుఘట్టమున రసభరితములగు ఇరువదియైదు పద్యములు పోతన రచించెను. మూలమున వ్యాసు డీ సందర్భమున మూడు నాలుగు శ్లోకములు మాత్రము నిర్మించెను. అందలి ఏవం ధార్ష్ట్యాన్యుశతికురు తేమేహనాదీనివాస్తౌ [96] అనుదానిలోని అర్థము జుగుప్సావహముగా నుండెననికాబోలును.

కం॥ వేలుపులలెు నాకంటెను
వేలుపు మరి యెవ్వడనుచు వికవికనగి మా
వేలుపులగోడపైనో
హేలావతి! నీతనూజు డెంగిలిసేసెన్ [97]

అనిమాత్రముచెప్పి పోతనవదలెను. మూలముతోపోల్చిన ఎంగిలిసేసెనను టలో గల సౌకుమార్యము మనోహరము. మొదటిరెండుపాదములలో ఆకార్యము నకై కల్పించిన కారణమధికతరమనోజ్ఞము. ఈసందర్భములోని పద్యములన్నియు నిట్లే చిలిపితనమునకు చిహ్నములయ్యును మేరమీరక సుకుమారసుందరములై యున్నవి.

కం॥ ఇచ్చెలువ జూచి ప్రముచ్చిలి
అచ్చుగ నురికించుకొనుచు నరిగెద నాతో
వచ్చెదవా ? అని యన్నా
డిచ్చిరుతడు సుదతి ! చిత్ర మిట్టిది గలదే ? [98]

నాతోవచ్చెదవా అనుటలోని గూఢశృంగారార్థము తెనుగుపలుకుబడిలోని ఒక తియ్యదనపుకానుక.

ఆ॥ తరుణి యొకతె పెరుగు తరచుచు తుది వంగి
వెన్నదియ్య నొదిగి వెనుక గదివి
మగువ నీసుతుండు మగపోడుములు సేయ
సాగినాడు తగదె చక్కజేయ. [99]

అనుటతో ఈశృంగారపు చేష్టలకొక పరాకాష్ఠవచ్చినది. ఆదృశ్యములను వర్ణించుటలోను, ఆసంభాషణములు చెప్పుటలోను పోతన పదప్రయోగమెక్కడను నౌచిత్యము నతిక్రమింపకుండుట గమనార్హము.

కం॥ ఓయమ్మ నీకుమారుడు
మాయిండ్లను పాలు పెరుగు మననీడమ్మా!
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ! [100]

అను ముద్దులుమూటగట్టు నీఘట్టమునందలి పద్యము చిన్నతనమునే తెనుగు దేశమున బాలబాలికలకు నేర్పుట అందరెరిగినదే.

గోపకులతో కృష్ణుడు కలసి చల్దులారగించు ఘట్టమునగల అచ్చపు తెనుగు దనము నీక్రింది పద్యమున కాంచవచ్చును.

సీ॥ మాటిమాటికి వ్రేలుసుడిచి యూరించుచు
నూరుగాయలు దినుచుండునొక్క
డొకని కంచములోని దొడిసి చయ్యనమ్రింగి
చూడు లేదని నోరు సూపునొక్క
డేగురార్గుర చల్దులెలమి బన్నిదమాడి
కూరొక్కొని కూరొక్కొని కుడుచునొక్క
డిన్నియు దగబంచి యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు లాడు నొకడు

ఆ॥ కృష్ణు జూడు మనుచు గికురించి పరుమోలి
మేలి భక్ష్యరాశి మెసగు నొకడు
నవ్వునొకడు సఖుల నవ్వించు నొక్కడు
ముచ్చటాడు నొకడు మురియు నొకడు. 101

ఈదృశ్యమును పద్యరూపమున చిత్రించు సమయమున కృష్ణునితో చద్దులారగించిన ఆగోపకులలో తానుగూడ నొక్కడై ఆక్రీడామాధుర్యమును భావసమాధిలో పోతన తప్పకదర్శించి అనుభవించియుండును. మహాభక్తులందరును ప్రాయికముగా కొన్నివేళల శిశువులవలె ప్రవర్తింతురు. శిశుసహజమగు ముగ్ధత్వము అమాయకత్వము వారికి సహజమగుటయే అందులకు కారణము. అట్టి భగవత్సన్నిహితమగు స్వచ్ఛహృదయముండుట చేతనే

ఎన్నడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయున్
గన్నులగాన రట్టిహరి గౌగిటజేర్చుచు జెట్టబట్టుచున్
దన్నుచు గ్రుద్దుచు న్నగుచు దద్దయు పైబడి కూడియాడుచున్
మన్ననసేయు వల్లవకుమారుల భాగ్యములింత యొప్పునే. 102

అని రచింపగలిగినాడు. ఈశ్వరున కత్యంతాప్తులు, అమాయిక భక్తులు నగు వారుమాత్రమే భగవంతుని తన్నుటకును గ్రుద్దుటకును స్వాతంత్ర్యము కలిగియుందురు. భగవంతునితో సమానముగా క్రీడించి ఆనందమును పొందు నదృష్టమపూర్వమని భావించినాడు గనుకనే ఆగోపకులను ఇట్టి పుణ్యులు గలరే 103 అని పోతన మెచ్చుకొనినాడు.

గోపకులు కృష్ణునితో కలసి చద్దులారగించుచుండగా దూరమున పచ్చికమేయుచున్న గోవులను బ్రహ్మదాచినాడు. ఆవి ఏమైనవవి వెదకుటకై కృష్ణుడు బయలుదేరినాడట. మూలమున నిచ్చట సపాణికబళోయయౌ104 అని మాత్రమే కలదు. దానిని పెంచి పోతన ఇట్లోకసుందరదృశ్యమును మన కన్నులముందు మూర్తీభవింపజేసెను.

కర్ణాలంబితకాకపక్షములతో గ్రైవేయహారాళితో
స్వర్ణభ్రాజితవేత్రదండకముతో సత్పింఛదామంబుతో
పూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతో
దూర్ణత్వంబుననేగె లేగలకునై దూరాటవీవీథికిన్. 105

అట్లుబయలుదేరిన కృష్ణుడు నేర్పరియై పశువుల అడుగుజాడలను పరిశోధించి నాడు.

కం॥ ఇచ్చో పచ్చికమేసిన
విచ్చో త్రావినవి తోయమేగిన విచ్చో
ఇచ్చోటమందగొన్నవి
ఇచ్చో బాసినవిజాడ యిదె యిదె యనుచున్ 106

వానికొఱకు వెదకుటకు గోపాలురు మాయమైనారు. అప్పటికిది యాతడు బ్రహ్మమాయగా గుర్తించినాడు. మూలములో నిక్కడ నిట్లుకలదు.

సర్వం విధికృతం జ్ఞాత్వా సహసాభిజగామహ
తతః కృష్ణో ముదంకర్తుం తన్మాతౄణాంచ కస్యచ
ఉభయాయిత మాత్మానం చక్రే విశ్వదృగీశ్వరః 107

బ్రహ్మచేష్టితమును గుర్తించి గోగోపరూపములు కృష్ణుడు వెంటనే ధరించుట పోతనకు నచ్చలేదు. బ్రహ్మమాయను గుర్తించిన వెంటనే కృష్ణుడు ఒకనవ్వు నవ్వి నాడని పోతన కల్పించెను. అది తనలో తాను నవ్వుకొన్న ఒక చిరునవ్వు.

వంచింపం బనిలేదు బ్రహ్మకిచటన్ వత్సంబులన్ బాలురన్
వంచించెన్ గను బ్రాము తన్ను సురలన్ వంచించుటాశ్చర్యమే
వంచింపన్ దనకేల తెచ్చుటకునై వల్గించు బ్రహ్మాండముల్
వంచింపన్ మరలింప నేర్చు హరిలీలన్ మందహాసాస్యుడై. 108

ఇక్కడ వంచింపన్ అనుశబ్దముపై పోతన ఒకచిన్న గారడీ చేసినాడు. కృష్ణుడు తాను కావలెననుకొన్నచో బ్రహ్మను వంచించి ఆయనదాచిన చోటినుండి మరల నా గోగోపకులను తేగలడు. కానీ అట్లుచేయదలపలేదు. ఆకార్యము కృష్ణున కొక చిన్నపని. ఆయన బ్రహ్మండములనే వంచించి మరలించు నేర్పుగలవాడు. అందుకే లీలన్ మందహాసాస్యుడై చిన్నమాయను గాక పెద్దమాయను ప్రయోగించెను. అదిఏమి పెద్దఆశ్చర్యముగాదని పోతన ఇట్లు సమర్థించినాడు.

కం॥ రూపంబులెల్లనగు బహు
రూపకుడిట బాలవత్సరూపంబులతో

నేపారు టేమి చోద్యము
రూపింపగ నతని కితరరూపముగలదే! [109]

తుదకీమాయ బ్రహ్మనే తలక్రిందులు చేసినది.

కం॥ పుట్టితి బుద్ధి యెరింగితి
పుట్టించితి జగము సగము పోయెను ప్రాయం
బిట్టి వినూతన సృష్టులు
పుట్టుట లేదార! యిట్టి బూమెలు భూమిన్ [110]

అని 'తలవాకిటవాడిమిగల వాణిపోడిమిచే నాడికెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు'[111] గజిబిజిపడుట ఒక చమత్కారదృశ్యము.

కాళియమర్దన ఘట్టమున అమూలకపద్యములు చాల కన్పించుచున్నవి. సర్పముచే చుట్టబడిన కృష్ణునిజూచి దుఃఖితులైన యశోదానందుల విలాపమును చూడుడు.

కం॥ పన్నగము మమ్ముగరువక
నిన్నేటికిగరచె గుఱ్ఱ? నెమ్మిగలిగి నీ
వున్నను మమురక్షింతువు
నిన్నున్ రక్షింప వేము నేరముతండ్రీ! [112]

కృష్ణుని చిన్నారి చేష్టలను స్మరించువారు దుఃఖించుటలో ఈక్రిందిసీసములో కరుణరసకల్లోలిని ఉప్పొంగుచున్నది. ఇందలి ఒక్కొక్కపాదమును ఒక్కొక్క మహావేదనాతరంగమగుట వీక్షింపవచ్చును.

సీ॥ శ్రవణరంధ్రంబులు సఫలతబొందంగ
నెలమి భాషించు వారెవ్వరింక
కరచరణాదుల కలిమి ధన్యతనొంద
నెగిరి పై బ్రాకు వారెవ్వరింక
నయనయుగ్మంబు లున్నతి కృతార్థములుగా
నవ్వులు చూపు వారెవ్వరింక
జిహ్వలు గౌరవశ్రీ జేర బాటల
యెడ బరికించు వారెవ్వరింక

ఆ॥ తండ్రి నీవు సర్వద్రష్టుండవై యున్న
నిచట మాకు ప్రభువు లెవ్వరింక
మరగిపాయలేమి మాకునీతోడిద
లోక మీవు లేని లోకమేల! 113

కాళియుని ఫణామండపముపై కృష్ణుడు నర్తించు దృశ్యము పరమాద్భుతమైనది. మూలమున నిది యిట్లుగలదు.

ఏవం పరిభ్రమహతౌజస మున్నతాంస
మానస్య తత్ప్రథుశిరస్స్వధిరూఢ ఆద్యః
తన్మూర్ధరత్ననికరస్పర్శాతితామ్ర
పాదంబుజోఽఖిలకలాదిగురు ర్ననర్త 114

ఈ సందర్భమున పోతన రచనమిది-

సీ॥ ఘనయమునానదీ కల్లోలఘోషంబు
సరసమృదంగ ఘోషంబుగాఁగ
సాధుబృందావన చరచ్చంచరీకగా
నంబు గాయక సుగానంబుగాఁగ
కలహంస సారస కమనీయ మంజు శ
బ్దంబులు తాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది
జనులు సభాసీన జనులుగాఁగ

తే॥ పద్మరాగాది రత్నప్రభాసమాన
మహితకాళియ ఫణిఫణా మంటపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
నిత్యనైపుణ్యమున బేర్చి నృత్యమాడె. 115

గీతపద్యములోని కొంతభాగము దప్ప చిత్రలేఖనమునకు దిగియున్న సీస పాదములు నాల్గును పోతన భావనలోనివే. ఒకచక్కని నృత్యగోష్ఠి కవసరమైన

హంగులన్నియు కృష్ణునకెట్లు సహజముగా వమరెనో ఈపద్యమున హృద్యముగా విద్యోతితమగుచున్నది.

ఆతరువాత వివిధఋతువర్ణనములు బహుకల్పన సమన్వితములై గోచరించు చున్నవి. వానిలో నొకటిరెండమూలకములు.

గ్రీష్మఋతువర్ణన—

ఆ॥ వాడిరుచులుగలుగు వానివేడిమి గ్రీష్మ
కాలమందు జగము గలయబడియె
బ్రహ్మ జనుల కొఱకు బ్రహ్మాండఘటమున
నుష్ణరసము దెచ్చి యునిచెననగ. 116

వర్షఋతువర్ణన—

కం॥ చెలువుడు ప్రావృట్కాలుడు
పొలసిన పులకించు భూమిపులకము లనగా
మొలచి తలలెత్తి నిక్కుచు
నలలితగతి జాలువారె సస్యములధిపా? 117

శరదృతువర్ణన—

కం॥ జొంపములు గొనియె వనములు
రొంపులిగిరె నెమలిగముల రొదలుడిగె నదుల్
పెంపులకుబాసె నురుముల
శంపల సంపదలు మానె శారదవేళన్. 118

హేమంత ఋతువర్ణన—

కం॥ ఉత్తరపు గాలివిసరె వి
యత్తలమున తుహినకిరణు డహితుండయ్యెన్
బొత్తుజరిగె మిధునములకు
నెత్తమ్ములుదరిగె హిమము నెలకొనియెన్నృపా! 119

ఈవిధముగా హృదయంగమ భావసమన్వితమగు ఋతువర్ణనల పిదప గోపికా వస్త్రాపహరణఘట్టము సర్వులకును మిక్కిలి ప్రీతిపాత్రమైనది. అందలి ప్రతి పదమును నొక మధుకలశము. కృష్ణుని గోపికలు ప్రార్థించుటను చూడుడు.

ఇంతుల్ తోయములాడుచుండ మగవారేతెంతురే? వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ నీతలబుట్టెగాక మరియేవీకృష్ణ! యోచెల్ల నీ
చెంతన్ దాసులమై చరించెదము మాచేలంబు లిప్పింపవే.[120]

కృష్ణుని క్రీడావిలాసములు వర్ణించుటలో ఇట్టి సుందర సుమనోహరదృశ్యముల నెన్నో కాంచగలము. సంస్కృతములో నిట్టిఘట్టములను మధురమంజులముగా లీలా శుకజయదేవులు చిత్రించినారు. వారి భావదర్శనమనన్య సామాన్యమైనది. తెనుగున నంతవాడొక్క పోతనయే. అడుగడుగునను ప్రతిఘట్టమునను ఆయనకల్పించిన ప్రతి పద్యమును నొక దివ్యదర్శనముగా కన్పించును. మదనగోపాల చింతామణి మంత్ర సిద్ధుడగు లీలాశుకునకు కృష్ణలీలలన్నియు కంటిముందు కన్పించుచుండెడివట. ఆ కని పించిన ప్రతి దృశ్యమును ఆయన శ్లోకరూపమున వర్ణింపగా అవియే కృష్ణకర్ణామృత ముగా రూపొందెనని ఆర్యులు చెప్పుదురు. ఆంధ్రభాగవతము చదువుచున్న సమయ మున అట్టి దివ్యదర్శనములను పొందియే పోతన భాగవతమును వ్రాసెనా అని పించును. వీనినిగూర్చిన కథలలోని సత్యాసత్యము లెట్లున్నను వారి రచనలలో హృద యాకర్షకమహాద్భుతదృశ్యములను కన్నులగట్టినట్లు చిత్రించు మహత్తరపాటవము గోచరించునని మాత్ర మంగీకరింపకతప్పదు. ఆశక్తి వారికవిత్వముల కుండుటచేతనే ఇంతకాలముగా నవి ఆరాధితములైనవి.

ఈవిధముగా దర్శనీయ దర్శనదర్శకుడగు పోతన భావుక హృదయము హిమాలయోన్నతము. అటనుండి ప్రవహించు కవితాగంగానది మహితోజ్జ్వలభావ తరంగ సముత్తుంగమై ఆంధ్రమహాజనమనఃక్షేత్రములలో మధురసములు నింపి ఆనంద సస్యములను భక్తిప్రసూనములను రసరసాలఫలములను నందించుచున్నది. ఆయన రచనలలోని సుందరసుమనోహర సుగంధములను సహృదయులనుభవింపజేయు పద్య ములు లెక్కింపతరముగాదు.

కృష్ణుని గూర్చిన మరియొక సుందరఘట్టము పరిశీలింతము. పోతనకు కృష్ణుని మందహాసమనిన ఎంతోయిష్టము. దాని ననేకసమయములలో వర్ణించుటకై ఆయన

ఎన్నోఅవకాశములు కల్పించుకొనెను. రాక్షససముదాయము తనను బాధింపవచ్చి నప్పు డించుకకోపించునేమోకాని బ్రహ్మేంద్రాదులు తనమహత్త్వమునెరుగక బాధింప వచ్చినప్పుడు కృష్ణుడు చిరునవ్వు నవ్వునట. తాను సురపక్షపాతి అయెను. అసురలే తన్నెరుగక తనపైకి వచ్చిరాయెను. వారిని శిక్షించుట తన యుద్దేశముకాదు. తన శక్తిని వారిచే గుర్తింపజేయుటయే ప్రధానము. బ్రహ్మంతవాడు తనను వంచింపదలచి నప్పుడు మందహాసాస్యుడైన కృష్ణునకింద్రుడు శిలావర్షము కురిపించినప్పుడును నట్టి చిరునవ్వేవచ్చినది.

బాలుం డాడుచు నాతపత్రమని సంభావించి పూగుత్తికెం
గేలన్ దాల్చిన లీల లేనగవుతో కృష్ణుండు తానమ్మహా
శైలంబున్ వలకేలదాల్చి విపులచ్ఛత్రంబుగా బట్టె నా
భీలాభ్రచ్యుత దుశ్శిలాచకిత గోపీగోప గోపంక్తికిన్ [121]

కృష్ణుడు గోవర్ధన పర్వతము నెత్తిపట్టుకొనిన దృశ్యము జగదాశ్చర్యకర మైనది. దానిని పోతన ఎట్లువర్ణించెనో చూడుడు.

హరిదోర్దండము కామగుబ్బశిఖరంబాలంబి ముక్తావళుల్
పరగంజారెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగ హా
సరుచుల్ రత్నచయంబుగాగ నచలచ్ఛత్రంబుశోభిల్లె న
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్నప్రజారంజియై. [122]

ఇక్కడి ఛత్రము మామూలు గొడుగుకాదు. ముత్యాలుప్రేలాడు నియ్యది రాజులుపయోగించు గౌరవచిహ్నము. దానితో పర్వతమును పోల్చుట మిక్కిలి రమ్య ముగా నలరుచున్నది.

గోపికలతో కృష్ణుని బృందావనవిహారము భాగవతమంతటిలో సుందరతమ ఘట్టము. దశమస్కంధ ప్రబంధనాయకుడగు కృష్ణుని లీలావిహారములు శిఖరాయ మాణమైన స్థలమిది. భాగవతములో భక్తిప్రధానము భక్తిలో మధురము ప్రధా నాధారము. ఆప్రేమ గోపికలలో మూర్తీభవించినది. అందుచే వారిశృంగారము సుర భిళమైనది. అది భగవదర్పితమగుటచే మోక్షమునకు దారితీసినది. ఈ మహనీయ ప్రణయానుభవమును శృంగారదివ్యదర్శనవిశిష్టముగా పోతన చిత్రించెను. మూల కర్తయే ఇచ్చట శృంగారరసధునులు ప్రవహింపజేసినాడు. ఆప్రవాహ జలములను

పోతన గోపీస్తన కస్తూరికాఘుమంఘుమిత మొనరించెను. ఆయన ఈభాగమ్మును ప్రత్యేకాభినివేశముతో అత్యంతదీక్షతో నిరంతరభావసమాధి మగ్నుడై బహుదివ్య దర్శనానుభూతుల కాంచుచు రచించినట్లు కన్పించును. మూలమునకు తోడుగా నిందాయన ఎన్నో అనుపమాన కల్పనలను జోడించినాడు. ద్రాక్షాసవపానముచే నేపారవశ్యము కలుగునో అంతకు వేయిరెట్లెక్కువ పారవశ్యము ఇచ్చట కవితాపానముచే కలుగును. ఆపారవశ్యములో నేభావములైన నుండునో యుండవోకాని దీనిలో మాత్రము పాఠకుడు మేలుకొనియే కలలుగాంచును. స్థూల శరీరమిచ్చట నుండగానే మనశరీరము బృందావనమునకు పరుగెత్తును. భావపరవశుడైన పాఠకుడు తాను నొకగోపికయై బృందావన పులినములలో కృష్ణునితో విహరించును. భక్తివివశుడై పోతన తానొక్కడే అదృశ్యములను దర్శించి అందలి ఆనందముననుభవించిన తానొక భాగవతుడుమాత్రమే అయ్యేడివాడు. సహృదయపాఠకలోకమంతటిని తనతోబాటు యమునాతీరమునకుతీసికొని వెళ్ళుటచే ఆయన లోకారాధ్యుడగు మహాకవి యైనాడు. ఆనాడు ద్వాపరయుగాంతమున కాళిందీతీరమున జరిగిన గోపీకృష్ణవిహారము లీనాడనుభవించు భాగ్యము పోతనామాత్యుని అనుగ్రహవశమున మనకుకలిగినది.

విరహవేదనావశలైన గోపకాంతలు కృష్ణునికొరకై ఎట్లువెదకుచున్నారో చూడుడు.

నల్లనివాడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళిపరిసర్పితపింఛమువాడు నవ్వురా
జిల్లెడు మోమువాఁ డొకడు చెల్వలమానధనంబుదెచ్చెనో
మల్లియలార! మీపొదలమాటున లేడుగదమ్మ చెప్పరే.[128]

అంగజునైనజూడ హృదయంగముడై కరగించువాడు శ్రీ
రంగదురంబువాడు మధురంబగు వేణురవంబువాడు మ
మ్మంగజు పువ్వుదూపులకు నగ్గముచేసె లవంగలుంగనా
రంగములార! మీకడకురాడుగదా కృపనున్నజూపరే.[124]

ఈపద్యముల మధురమంజుల శైలీవిశేషము సుప్రసిద్ధము. కృష్ణుని భువనమోహనరూప మిందత్యంతసుందరముగా చిత్రితమైనది. ఏకాగ్ర దృష్టితో ప్రపంచమును మరచిన గోపికల విరహబాధ ఇందు సువ్యక్తమగుచున్నది. ఆ వ్యథను వ్యక్తము జేయు కృష్ణాన్వేషణ పద్యము మరియొకటి చూడుడు.

సీ॥ మానినీమన్మథు మాధవు గానరే
సలలితోదార వత్సకములార!
సలలితోదార వత్సకవైరి గానరే
సుందరోన్నత లతార్జునములార!
సుందరోన్నత లతార్జునభంజు గానరే
ఘనతర లసదశోకంబులార!
ఘనతర లసదశోకస్ఫూర్తి గానరే
నవ్యరుచిర కాంచనంబులార!

ఆ॥ నవ్యరుచిర కాంచన కిరీటు గానరే
గహనపదవి కురువకంబులార!
గహనపదవి కురువకనివాసి గానరే
గణికలార! చారుగణికలార! [128]

ముక్తపద గ్రస్తాలంకార సహితమగు నీసీసము మిగుల చాతుర్యాన్వితమై రసస్ఫోరకమై అలరారుచున్నది. లలితోదారశైలికిని హృదయావర్జక భావమునకును మనికిపట్టగు మరియొక సీసమును చూడుడు.

సీ॥ అదె నందనందనుం డంతర్హితుండయ్యె
పాటలీతరులార! పట్టరమ్మ
హేలావతులగృష్ణ! యేలపాసితివని
మైలేయలతలార! యడుగరమ్మ!
వనజాక్షుడిచటికి వచ్చి డాగడుగదా
చూతమంజరులార చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిగించి
మాధవీలతలార! మనుపరమ్మ!

ఆ॥ జాతిసతులబాయ నీతియొహారికని
జాతులార దిశలజాటరమ్మ

కదళులార వోయికదలించి శిఖిపింఛ
జూటుదెచ్చి కరుణ జూపరమ్మ![126]

లోకోత్తరములగు నీపద్యములు చదివి ద్రవీభూతులు కానివారు వానసుదతి యనివారు, భానునికిరణములు మీద బారనివారు.

మూలమునను నీసందర్భమున గొప్పశిల్పముకలదు. దాని నాధారముచేసియే పోతన పురోగమించెను. వ్యాసుడొక్క అడుగువేసినచో అట్టిదో లేక నంతకంటె నందమైనదో మరియొక అడుగువేయుటకు పోతన ప్రయత్నించును. కావున అట్టిఅడుగు మొదటవేసి ఆభంగిమను మొదట ప్రదర్శించిన మహామహుడగు పారాశర్యునకు తలవంచి నమస్కరించియే రెండవ అడుగువేయవలెను. పోతనలో నావినయము కల దనుట అందరెరిగిన సత్యము.

శ్లో॥ అత్రావరూపితా కాంతా పుష్పహేతో ర్మహాత్మనా
అత్ర ప్రసూనాపచయః ప్రీత్యర్థే ప్రేయసేకృతః
ప్రపదాక్రమణే హ్యేతే పశ్యతా సకలే పదే
కేశప్రసాధనం త్వత్ర కామిన్యాః కామినాకృతం.[127]

ఇత్యాది మధురశ్లోకములను 'కొమ్మకు పువ్వులు గోసి నాడిక్కడ మోనవి పాదాగ్రంబు మోపినాడు'[128] వంటి చక్కని సీసములో అనువదించి అంతతో సంతృప్తిపడక ఆభావమునే పెంపొందించి 'ఒకయెలనాగ చెయ్యూదినాడిక్కడ సరస నున్నవి వాల్గుచరణములును'[129] అనెడు మరియొక మోహనసీసము వ్రాసెను. ఇచ్చట సనకాదిమునియోగ పరణినొప్పచు శ్రుతివధూసీమంతవీధుల చెన్నుమిగులుచు పాలేటిరాచూలి పట్టుకొమ్మయగుచు[130] విలసిల్లు దేవదేవుని పాదాబ్జములను పోతన భక్తితో వర్ణించినాడు.

తదనంతరము జరిగిన రాసక్రీడా, జలక్రీడావర్ణనములు శృంగారరసపేవధులు. వానిలో చాలభాగ మమూలకము. ఆక్రీడలు చూచిన ఎవరైనను భావపారవశ్యము నొందుటలో నాశ్చర్యములేదు. నిరంతర శృంగారానుభవనిలయులగు వియచ్చరరామలే మనోరాములమీద మూర్ఛిల్లిపడిరని దివ్యదర్శనుడగు పోతన వర్ణించెను.[131]

కాలము విచిత్రమైనది. దాని ప్రభావము గుర్తించుట అసాధ్యము. దానివేగ మెల్లవేళల సమానమైనను మానవుడు తన మనఃస్థితినిబట్టి దానినొకప్పుడు శీఘ్రముగా

మరియొకప్పుడు మందముగా భావించును. కాలములోని ఈరహస్యమును కవితాదృష్టితో పరిశీలించిన పోతన గోపికాముఖమున నొక కమ్మని భావమును వెలువరించెను. కృష్ణుడు తనను బాసి వనములోనున్న క్షణములు గోపికకు ప్రహరములై, దినములై, పక్షస్వరూపములై, నెలలై, అబ్దములై, మహాయుగములై చిట్టచివరకు నిండారు కల్పంబులై[132] తోచునట. ఈభావస్ఫురణమునకు పోతన మిక్కిలి ప్రశంసార్హుడు

చాణూరముష్టికయుద్ధఘట్టమున మల్లవిద్యాపాండిత్య సూచకములగు అమూలక విశేషముల నెన్నింటినో పోతన ప్రవేశపెట్టెను. ఇంతకుముందు కవులు వర్ణించినవే కాక స్వయందర్శనమునగాని తెలియని కొన్నిమల్ల యుద్ధవిశేషములను పోతన పలికినాడు, ఆయన ఓరుగల్లులో అట్టి మల్లుపోరులు చూచియుండవచ్చును. ఆయన శిష్యప్రాయుడును షష్ఠస్కంధరచయితయునగు సింగన శారీరక విద్యాప్రియుడగుట ఇట స్మరింపదగిన విషయము.

ఉద్ధవునకు గోపికలు తమకృష్ణవిరహబాధను చెప్పుచు పురారహోగాధలు స్మరించుట పోతన బాగుగా పెంచెను. బంధనియతితో కృష్ణుడు తమతో క్రీడించిన విధమును[133] అతనితో వారు ప్రస్తావించుట ఔచిత్యదూరమేమో యని సామాన్యదృష్టి కనిపించినను ఉద్ధవుని కృష్ణభక్తిని, ఆతనియందు గోపికలకు కలిగిన విశ్వాసమును వీనినన్నింటిని మించి గోపికల అమాయికప్రేమ భక్తియు సంస్మరించిన యెడల పోతన ఇచ్చట కల్పించిన ఐదారుపద్యములును రసవంతములేయని విశదము కాగలదు.

కథామధ్యమున వచ్చిన ద్వారకాపురవర్ణనమున షుమారిరువది పద్యములు పోతన అమూలకముగా కల్పించెను. ఇవి ప్రబంధమార్గపరిణతములై తరువాతికవులకు మిగుల నాదర్శప్రాయమైనవి.

రుక్మిణీకళ్యాణకథ తెనుగుదేశమున సుప్రఖ్యాతమైన వానిలో నొక్కటి. దీనియందు పోతన లేఖిని స్వైరవిహారము చేసినది. రుక్మిణి కృష్ణునకుపంపిన సందేశములో ప్రతిబింబించునామె భావోద్వేగము చూడుడు.

సీ॥ ప్రాణేశ ! నీమంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమియేల ?
పురుషరత్నమ ! నీవు భోగింపగాలేని
తనులతవలని సౌందర్యమేల ?

భువనమోహన ! నిన్ను బొడగానగలేని
చక్షురింద్రియముల సత్త్వమేల ?
దయిత ! నీయధరామృతం బానగాలేని
జిహ్వకు ఫలరససిద్ధియేల ?

ఆ॥ నీరజాతనయన ! నీవనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల ?
ధన్యచరిత ! నీకు దాస్యంబుసేయని
జన్మమేల ? యెన్నిజన్మములకు. 134

కృష్ణుడు వచ్చులోపల రుక్మిణిచెందినకల్లోలమును ఆరు అమూలకపద్యము లలో పోతన వర్ణించినాడు. అందులో నొక్కటి.

తుడువదు కన్నులన్ వెడలుతోయకణంబులు కొప్పుచక్కగా
ముడువదు నెచ్చెలింగదిసి ముచ్చటకున్ జన దన్నమేమియున్
గుడువదు నీరమున్ గొనదు కూరిమి కీరముజేరి పద్యమున్
నొడువదు వల్లకీగుణవినోదముసేయదు డాయదన్యులన్. 135

రుక్మిణి గౌరీదేవికిమ్రొక్కి మనఃపూర్వకముగా చేసిన ఈక్రింది ప్రార్థన పద్య మత్యుత్తమ స్తుతులలో నొకటి.

నమ్మితినామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము పురాణదంపతుల మేలుభజింతుగదమ్మ ! మేటి పె
ద్దమ్మ ! దయాంబురాశివిగదమ్మ ! హరిం బతిసేయుమమ్మ ! నిన్
నమ్మినవారి కెన్నటికినాశములేదుగదమ్మ ! ఈశ్వరీ ! 136

దశమోత్తరస్కంధమున నరకాసురవధ ఘట్టము మిక్కిలి రసవంతమైనది. సత్యభామ నరకాసురునితో యుద్ధముచేయుట పోతన అత్యద్భుతముగా వర్ణించినాడు.

జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ సారంగయుధంబుగా !
నావిల్లింద్రశరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగా

చావిద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని నుగ్రంబుగా
ప్రావృట్కాలము నేసె బాణచయమంభ శ్శీకరశ్రేణిగాన్. [137]

సత్యభామ ప్రావృట్కాలముపేసినట్లుగానే పోతనయు నిచ్చట కవితాప్రావృట్కాలముచేసి ఇంచుమించు ముప్పది అమూలకపద్యములను మనోహరముగా రసాంభశ్శీకరశ్రేణులు గావించెను. ఇందలి ప్రతిపద్యములోను సత్యభామాసౌవర్ణ కంకణ ఝణఝణనినదములు తాటంకమణిగణధగధగదీప్తులు ధవళతరాపాంగధళధళరోచులు శరపాతఘుమఘుమ శబ్దములు [138] లసితోల్లసితములై పాఠకుని అడుగు ముందుకు వేయనీయక ఆకట్టుచునేయున్నవి.

ఆతరువాత పోతనకల్పనాశక్తి విజృంభించినవిశిష్టప్రదేశములలో ఉషాపరిణయ కథ యొకటి. ఇందులో ముప్పదిపద్యములకు పైగా అమూలకములను పోతన రచించెను. సామాన్యముగానప్పటికే ప్రబంధములలో స్వయంవరఘట్టము కల్పించుటయు అందు వివిధదేశాధిపతులను వర్ణించుటయు కన్పించును. వీని అన్నింటికిని మూలము కాళిదాసు రఘువంశములో రచించిన ఇందుమతీ స్వయంవరము.

ఉషాకథలో నట్టి స్వయంవరమునకు తగిన పరిస్థితిలేకపోయినను ఆమెస్వప్నమున కనిపించిన సుందరాంగుడెవ్వడో కనుగొనుటకై చెలికత్తెయగు చిత్రరేఖ సర్వ భువనములలోని సౌందర్యవంతులను చిత్రించి చూపినది. వారిని గూర్చి ఆమె ఉషకు వర్ణించి చెప్పుటను విన్నచోనదియును నొక స్వయంవర దృశ్యమువలె భాసించును. అందొకపద్యము చూడుడు.

సింధురవైరివిక్రముఁడు శీతమయూఖమరాళికా పయ
స్సింధుపటీరనిర్మల విశేషయశోవిభవుండు శౌర్యదు
ర్వాంధరిపుక్షితీశనికరాంధతమఃపటలార్కుఁ డీజరా
సంధునిజూడు మాగధుని సద్బృహదశ్వసుతున్ గృశోదరీ! [139]

ఇచ్చట కృష్ణునివర్ణించిన కమనీయ శుభగాత్రు కంజాతదళనేత్రు వసుధాకళత్రు పావనచరిత్రు[140] అనుసీసము అంత్య ప్రాసయుక్తమగు పోతన సహజరచనాపద్ధతికి నిదర్శనము ఇట్టిదే కుచేలోపాఖ్యానమునను మరియొకటి 'ఇందీవరశ్యాము వందిత స్త్రుతాము కరుణాలవాలు భాసురకపోలు'[141] అనునది కలదు.

కృష్ణబాణాసురయుద్ధములో వివిధవర్ణనలను పోతన పెంచుట కాంచవచ్చును. రణరంగ వర్ణనాత్మకమగు నొక దీర్ఘవచనము[142] కడు ప్రశంసనీయమైనది. ఈ సందర్భమునగల మూడుసీసపద్యములు 'కమనీయకింకిణీఘంటికాసాహస్ర ఘణఘణ ధ్వనిచేతగగనముగల'[143] మొదలగునవి వీరభయానకరసస్ఫోరకములై అలరారు చున్నవి

ఆవిధముగానే యుద్ధవర్ణనల నత్యద్భుతముగా గావించిన యాదవసాల్వరణ వర్ణనము చూడుడు.

వితతజ్యాచయటంకృతుల్ మదజలావిర్భూతశుండాల ఘీం
కృతు లుద్యద్భటహుంకృతుల్ మహితభేరీభాంకృతుల్ భీషణో
ద్ధత నిస్సాణధణంకృతుల్ ప్రకటయోధవ్రాతసాహంకృతుల్
క్షితలంబున్ దివినిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా![144]

ఇందలి ధ్వన్యనుకరణశబ్దములు సమయస్థానోచితములై అర్థముకంటెమిుందే రసస్ఫురణము గావించుచున్నవి.

అపిదవ కుచేలోపాఖ్యానము ప్రసిద్ధకల్పనాసమన్విత ఘట్టము శబ్దసౌందర్య మునకంటె శైలికంటె అర్థమాధుర్యమునకు జాత్యముగునుడికారమునకు ప్రాధాన్య మిచ్చిన శబ్దక్రిందిసీసము చక్కని కల్పనలలో నొక్కటి.

సీ॥ లలితపతివ్రతా తిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దుస్సహ దరిద్ర
పీడచే కడునొచ్చి పెదవులు తడుపుచు
శిశువులాకటిచిచ్చుచే గృశించి
మలమలమాడుచు మానసంబెరియంగ
పట్టెడన్నము మాకు బెట్టుమనుచు
పత్రభాజనధృతపాణులై తనుజేరి
వేడిన పీనులు సూడినట్లు

తే॥ యైన నొకనాడు వగచి నిజాధినాథు
జేరి యిట్లనిపల్కెఁనో జీవితేశ!
తట్టుముట్టాడునట్టి పేదరికమిట్లు
నొంప దీనికుపాయ మూహింపవైతి [145]

కృష్ణదర్శనముచే పరవశుడైన ఒకభక్తుడుచేసినస్తుతి ఉత్తమభావభరితముగా మన్నది. మత్తకోకిలాస్వనమువలె మృదుమనోహరమైన ఆమత్తకోకిల చూడుడు.

కంటిగఁటిభవాబ్ధిదాటగగంటిముక్తినిధానమున్
గంటినీకరుణావలోకముగంటిపాపమువీడ ము
క్కంటితామరచూడ్కులన్ బొడగానన్నట్టిమహాత్మనా
యింటికిన్ జనుదెంచితీశ్వరయేగ్కృతార్థతబొందితిన్. [146]

ఈసందర్భమునే రచింపబడిన

ధీయుతుడై సమో భగవతేహరయేపరమాత్మనేముకుం
దాయనమస్తభక్తవరదాయనమః పురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్రవంద్యచరణాయసురారిహరాయసాంఖ్యయో
గాయువినీలభాస్వదలకాయరథాంగధరాయవేధసే [147]

అను సంస్కృతభాషాసహితపద్యమును హృదయంగమమై భక్తిపూరితమై విలసిల్లుచున్నది స్కంధాంతమున శ్రీకృష్ణుడానందరసాబ్ధి నోలలాడుటనుగూర్చి చారు ఘనసార పటీరసురభిళగా, రసాలరసాలవాలముగా నొకమృదుమధుర వచనము చిత్రితమైనది.

ఈవిధముగా భాగవతము మొత్తముమీద పోతనవెన్నో అమూలక కల్పన ములుగావించెను. పైనవానిలో కొలది భాగముమాత్రమే ఉదాహరింపబడినవి. స్థూల దృష్టికి పోతన రచించిన ఎనిమిదిస్కంధములలోను షుమారొకవేయి అమూలక గద్యపద్యములు గోచరించుచున్నవి. పురాణకవులలో ఇంత అత్యధికమగు స్వాతం

త్ర్యము గ్రహించినవారులేరు. కవితావేశపరవశుడగుకవి అవసరమగుచోట్ల స్వతంత్రింపక తప్పదు మూలవిధేయుడైనను నాతడు నిరంకుశుడే. ఆతని భావవిజృంభణమునకు, కవితామహోదయమునకు ఆమూలా భాషాగ్రంథమొక ఆలంబనము మాత్రమే. దానినాధారముచేసికొని ఆతడు భువినుండి దివికి సోపానములు నిర్మించును. ప్రాచీనాంధ్రకవులెల్లరును ఈదివ్యవిద్యలో నిష్ణాతులు. వారిలో పోతనామాత్యుడు రత్నములలో పద్మరాగమువంటివాడు. దివ్యావేశపరవశుడగు ఆయనవాక్కులో సుందర కల్పనాలోకములు మూర్తీభవించి దర్శనమొసగినవి. వ్యాసనిర్మితమైన మహాభాగవత దివ్యసీమలో పోతన కల్పించిన ప్రతిపద్యమును నొకరసవత్తర ప్రకృతిదృశ్యము. ప్రతిదృశ్యము నొక విలాసినీనృత్యము. ప్రతిభావమును మధురమందాకినీ సుమనోహర సుగంధవీచిక, ఆమూలగ్రంథమనెడు దివ్యలోకములో ఇవి అత్యంతసహజములై అధికతర సౌందర్యాధాయకములై ఇమిడి పోయినవి.



# భాగవతానువాదవైఖరి – గంగన

బొప్పనామాత్య పుత్రుడైన గంగన భాగవతములో పంచమస్కంధము నాంధ్రీకరించెను దీనినీతడు రెండాశ్వాసములుగా విభజించినట్లు కన్పడుచున్నది. ఈ ప్రథమాశ్వాసాంత పద్యములను గద్యయు ద్వితీయాశ్వాసాది పద్యమును తాళపత్ర ప్రతులలో లేవనియు దీనినిబట్టి ఇందాశ్వాసవిభజన లేదనియే భావింపవలెననియు అకాడమీపీఠికాకారులు వ్రాసియున్నారు.[1] షష్ఠస్కంధ రచయితవలె కృత్యవతరణిక గానీ షష్ఠ్యంతములనుగానీ ఈతడు చెప్పలేదు. అశ్వాసాంత గద్యలో ఇది శ్రీసకల సుకవిజనానందకర బొప్పనామాత్య పుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవతమహా పురాణమునందు అనికలదు. ఈస్కంధమునకు పోతన రచితములుకాని ఇతర స్కంధములవలె ఇతరానువాదములు లేవు. షష్ఠస్కంధము శృంగారవీరకరుణ ప్రధానములగు కథాఘట్టములతో వృత్రవధాదిముఖ్యగాధలతో సుప్రఖ్యాతముకాగా ఏకాదశ ద్వాదశస్కంధములు వేదాంతతత్వప్రకటనమునకు ప్రశస్తి వహించినవి అట్టిప్రత్యేకత ఏదియు పంచమస్కంధమునకు లేదు. అందుకేకాబోలు ప్రాచీనులెవ్వరును దీనిజోలికి పోయియుండలేదు.

పోతనవలెనే గంగనకూడ శ్రీధరవ్యాఖ్య ననుసరించి అద్వైతపరముగానే అనువదించెను. ఈతడు పెక్కుచోట్ల మూలమును సన్నిహితముగా ననుసరించుటయే కాక అందలి పదములనే యథాతథముగా వాడియుండెననియు మూలభావములను పోతనవలె భక్తిభావభరితుడై పెంపొందించిన భాగము అంతగా కాన్పింపవనియు సంగ్రహించిన భాగము లచ్చలచ్చటగలవనియు, అట్లే మూలార్థమును న్యూనపరచిన భాగములును, ఔచిత్యమునకై స్వతంత్రించి మార్చిన భాగములునుకూడ కాన్పించు ననియు అకాడమీపీఠికలో కలదు.[2] గంగన కవనమంత రసవంతముకాదనియు, దానిని సింగన కవనముకంటె తక్కువని చెప్పవచ్చుననియు రసోత్పత్తికొరకు చేసిన రచనలంతగా శ్రమపడకకుదిరినవిగా దోపమిచే పోతన వానివలె నవి స్వభావసుభగములుగా కాన్పింపవనియు, ఐనను మొత్తమున కీతని కవిత్వము కొంత లలితముగాను, సింగనదానికంటె సుకుమారముగాను ఉండుననియు ఇతని తెనిగింపు సింగన దానివలె మూలమునకు మిక్కిలిసరిగా నుండదనియు వర్ణనసందర్భములయందిది మూలముకంటె చాల న్యూనముగాను, కొన్నియెడల భిన్నముగాను ఉండుననియు తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు వ్రాసియున్నారు.[3] గంగనకవిత్వము మిగిలిన

భాగవతకవులందరికంటె కొరత వడియుండునని రాయదుర్గం నరసయ్యశాస్త్రిగా రభిప్రాయపడినారు.[4] ఏదైనను మొత్తముమీద గంగన భాగవతరచనలో పాల్గొనుట కదృష్టమున్నంతగా సమర్థతలేదు. పోతనామాత్యుని అనుగ్రహముచే ఇతని కాసిరి పట్టినది. అది ఆతని పూర్వపుణ్యవిశేషము.

సంస్కృతమూలము ననువదించుటలో పోతనవలెనే గంగనయు వివిధ పద్ధతుల ననుసరించినాడు. ఆయాసందర్భములకు కొన్ని ఉదాహరణము లీక్రింద చూపబడుచున్నవి. మూలమునకు సన్నిహితముగా ననువదించుట ఈతని రచనలో తరచుగా కానసగును.

1. భగవదుపాసనోపచితాతిపురుషప్రభావః తమభినందన్ సమజవేన రథేన జ్యోతిర్మయేన రజనీమపి దివంకరిష్యామీతి సప్తకృత్వః తరణిమనుపర్యక్రామ ద్ద్వితీయఇవపతంగః[5]

వ॥ భగవదుపాసనాజనితాతిపురుషప్రభావుండై సవితృరథ సదృక్షవేగంబుకలిగి తేజోమయంబైన రథంబు నారోహణంబుసేసి రాత్రులనెల్ల దివంబులోనర్తుసని సప్తవారంబులు ద్వితీయతపనుండుబోలె నరదంబు వరపుటయు.[6]

2. తేషు జంబ్వాదిషు ద్విరిష్మతీపతి రనువృత్తా నాత్మజా నాగ్నీద్రేధ్మజిహ్వ యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృత వృష్ఠమేధాతిధి వీతిహోత్ర సంజ్ఞాన్ యథాసంఖ్యేనైకైకస్మి న్నేకమేక మేవాధిపతింవిదధే.[7]

వ॥ అట్టి ద్వీపంబులందు హరిపాలనంబునకుం బ్రియవ్రతుండాత్మభవులు, నాత్మసమాన శీలురునైన యాగ్నీద్రేధ్మ జిహ్వాయజ్ఞబాహు హిరణ్యరేతోఘృతపృష్ఠమేధాతిథివీతి హోత్రుల నొక్కొకని నొక్కొక ద్వీపంబునకుఁ బట్టంబుగట్టె.[8]

3. తస్యహవా ఇత్థంవర్ష్మణావరీయసాబృహచ్ఛ్లోకేనౌజసా బలేనశ్రియాయశసా వీర్యశౌర్యాభ్యాంచపితాఋషభఇతీదం నామచకార.[9]

ఆ॥ ధవళకాంతి యుక్తి దనరుదేహం బును
మహిత బలపరాక్రమంబు వీర్య

మును దలంచి చూచి జనకుండు పేరిడె
సుతుని ఋషభుడనుచు సొంపుతోడ.[10]

4. నబ్రాహ్మణై స్తులయే భూత మన్యత్
పశ్యామి విప్రాః కిమతః పరంతు
యస్మిన్ నృభిః ప్రహుతం శ్రద్ధయాహ
మశ్నామి కామం నతథాగ్నిహోత్రే.[11]

కం॥ భూసురులకు సరిదైవం
బీసచరాచరమునందు నెరుగను నాకున్
భూసురులు గుడుచునప్పటి
యాసంతోషంబు తోచదగ్నులయందున్.[12]

5. సచ ప్రాకృతై ర్ద్విపదపశుభి రున్మత్త జడ బధి రేత్యభి భాష్యమాణో యదా
తదనురూపాణి ప్రభాషతే కర్మాణిచ కార్యమాణః పరేచ్ఛయా కరోతి విష్టితో
వేతనతో వా యాచ్ఞయా వా యదృచ్ఛయా వోపసాదిత మల్పం బహుమృష్టం
కదన్నం వా భ్యవహరతి పరం నేంద్రియప్రీతినిమిత్తం.... ....[13]

వ॥ మూఢులగు ద్విపాత్ పశువులచే నున్మత్త! జడ! బధిర! యని యాహూయమానుండగునపుడు తదనురూపంబులగు సంభాషణంబులనొనర్చుచు, పరేచ్ఛా యదృచ్ఛలం జేసి విష్టివేతనయాచ్ఞాదుల వలన నియుక్త కర్మంబులం బ్రవర్తించుచు.[14]

తే॥ అతులమృష్టాన్నమైన శుష్కాన్నమైన
నెద్దివెట్టిన జిహ్వకు హితముగాన
తలచి భక్షించు గాకొండుదలచి మిగుల
బ్రీతిసేయడు రుచులందు బెంపుతోడ.[15]

6. శీతోష్ణవాతవర్షేషు వృషఇవానావృతాంగః పీన స్సంహననాంగః స్థండిలసంవేశనా
నున్మర్దనామజ్జనరజసా మహామణి రివానభివ్యక్త బ్రహ్మవర్చసః కుపటావృత
కటి రుపవీతే నోరుమషిణా ద్విజాతి రితి బ్రహ్మబంధురితి సంజ్ఞయా తదజ్ఞజనా
వమతోవి చచార[16]

వ. శీతోష్ణవాతవర్షాతపంబులకు నోడి పైచీరగప్పక వృషభంబు నుంబోలె పీనుండు కఠినాంగుండునగుచు స్థండిల శాయియై రజః పటలంబునంగప్పబడ్డ దివ్యమాణిక్యంబువోలె ఐబభివ్యక్త బ్రహ్మవర్చసుండై మలినాంబరపరీత కటితటుండు నతిమషీలిప్తయజ్ఞోపవీతుండునగుటజేసి యజ్ఞజనంబులతడు బ్రాహ్మణాభాసుండు మందుండు నని పలుక సంచరించుచుండన్[17]

శ్రీధరవ్యాఖ్య ననుసరించి పదముల కర్థములును శ్లోకములకు భావములును గ్రహింపబడి నందుల కుదాహరణములు.

1. భయం ప్రమత్తస్య వనేష్వపి స్యాత్
యతస్స ఆస్తే సహషట్సపత్నః
జితేంద్రియ స్యాత్మరతే ర్బుధస్య
గృహాశ్రమః కిన్నుకరో త్యవద్యం.[18]

శ్రీధరవ్యాఖ్య - భయమితిభయంసంసారః స్యాదేవప్రమత్తస్య అజితేంద్రియస్య వనేష్వపి సంగభియా.... .... .... ....

వ॥ వనవాసియైనను జితేంద్రియుండు గాకుండెనేని కామాది సహితుండగుటంజేసి సంసార బంధంబులుఁగలుగు.[19]

2. శ్లో॥ నైవంవిధః పురుషకార ఉరుక్రమస్య
పుంసాం తదంఘ్రిరజసా జితషడ్గుణానాం
చిత్రం విదూరవిగత స్సకృదాదధీత
యన్నామధేయ మధునా సజహాతి బంధం.[20]

శ్రీ.వ్యా-నైవమితి జితా షడ్గుణాః ఇంద్రియాణి షడోర్మయోవా... విదూరవిగత అంత్యజోఽపి...బంధం సంసారం తత్త్వమితి పాఠేఽవ్యయ మేవార్థః పాఠాంతరే తత్త్వం చండాలత్వం జహాతి శుద్ధోభవతీత్యర్థః

కం॥ హరిసేవ నాప్రియవ్రతు
డరయగ కైవల్యపదవి నందుట యరుదే

ధర జండాలుండైనను

హరినామస్మరణజెందు నవ్యయపదమున్. [21]

3. పరదేవతాప్రసాదాధిగతాత్మప్రత్యవమర్శనేనానుగతేభ్యః [22]

శ్రీ.వ్యా-పరదేవతాయాః శ్రీహరేః ......

సీ॥ ... ... హరికృపచే నప్పుడందిన యాత్మవి
ద్యనుగల్గి తనవెంట నరుగుదెంచు [23]

4. శ్రుతిభి రవారుంధే యత్ర పితరో మాదయంతే [24]

శ్రీ.వా- శ్రుతిభిః వేదోక్తైః కర్మభిః అవారుంధే ప్రాప్తః మాదయంతే మోదయంతే

వేదోక్తంబులగు కర్మంబులంజేసి తత్సలోకంబగు బ్రహ్మలోకంబునకుంజనియె [25]

5. సత్యముక్తం కింత్వీహవా ఏకేతు మనసో విస్రంభ మనవస్థానస్య శఠకిరాత ఇవ సంగచ్ఛంతే [26]

శ్రీ.వ్యా-సత్యమితి ఏకేతు బుద్ధిమంత అనవస్థానస్య చంచలస్యమనసః విశ్వాసం నసంగచ్ఛంతే నసమ్యక్ ప్రాప్నువంతి శఠః కిరాతో యథా మృతేష్వసి మృగేషు శఠే కిరాతే యథా మృగాఇతి సప్తమ్యంతే పాఠాంతరే శఠః వంచకః.........

ధరణీవల్లభ నీదువాక్యములు తథ్యంబింతయుందప్ప దె
ట్లరయన్ వన్యమృగంబుపట్టువడి తానావేళ నాలుబ్ధకున్
ధరవంచించిన మాడ్కి నింద్రియములం దండించి చిత్తంబు ని
ర్భరకామాదులకాసయిచ్చుకడుసంరంభంబుతోఁ గమ్మరన్. [27]

6. అథైన మఖిలలోకపాలలలామోఽపి విలక్షణై ర్జడవ దవధూత వేషభాషాచరితై రవిలక్షిత భగవత్ప్రభావో యోగినాం సాంపరాయవిధి మనుశిక్షయన్ స్వకళేబరం జిహాసురాత్మన్యాత్మాన మసంవ్యవహిత మనర్థాంతరభావే నాన్వీక్షమాణ ఉపరతానువృత్తి రుపరరామ. [28]

శ్రీ.వ్యా- అఖిలానాం లోకపాలానాం లలామో మండన భూతోఽపి ఉపరతా బాధితా. విషయానువృత్తిర్యస్మాత్స ఉపర రామ దేహాభిమానం జహౌ విలక్షణైః అనేక ప్రకారైః అవధూత వేషాదిభిః నవిలక్షితో భగవత్ప్రభావో యస్మిన్ సాంపరాయవిధిం దేహత్యాగప్రకారం......

సీ॥ అదిగాననెన్నడు నైశ్వర్యములను జే
పట్టజూడడు లోకపాలముఖ్యు
లైనవారలచేత నభినందనములొంది
వెలయుంగ నవధూతవేషభావ
ణంబుల నెరిగికొనగరాని భగవత్స్వ
రూపంబు గలిగి యారూపమందు
పరమయోగధ్యానపరులకు నెల్లదే
హత్యాగసమయంబు నంతలోన

తే॥ చూపుచుండియు దేహంబు బాప నిచ్చ
యించె నచ్చట దివ్యయోగీంద్రు డాద్యు
డతుల దివ్యప్రకాశకు డమరగురుడు
పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర![29]

7. శ్లో॥ పరోరజస్సవితు ర్జాతవేదో
దేవస్య భర్గో మనసేదం జజాన
సురేతసాదః పునః ప్రవిశ్య చష్టే
హంసం గృధ్రాణం నృషద్రింగిరామిమఇతి[30]

శ్రీ.వ్యా- పరోరజః రజసః ప్రకృతేః పరం శుద్ధసత్త్వాత్మకం సవితు ర్దేవస్య సూర్యస్య భర్గస్వరూపభూతం తేజః జాతం వేదో ధనం కర్మఫలం యస్మాత్ తత్ కర్మ ఫలద మిత్యర్థః అత్ర హేతుః యత్ మనసైవ ఇదం విశ్వం జజాన ససర్జ పునశ్చ అదశ్చ సృష్టం

విశ్వ మంతర్యామిరూపేణ ప్రవిశ్య గృధ్రాణాం శాంత్షంతం హంసం జీవం సురేతసా చిచ్ఛక్త్యా విచష్టే పశ్యతి పాలయతీత్యర్థః...

సీ॥ కర్మఫలంబుల గడకనిచ్చుచు మనో
వ్యాపారమున నిట్టి యఖిలలోక
ములజేసి యాలోకములకు నంతర్యామి
యగుచు ప్రవేశించి యంతమీద
నానందరూపమైనట్టి బ్రహ్మముగోరు
చున్న జీవుని తనయోగమహిమ
శక్తిచే దగననిశంబు బాలనసేయు
చుండి యంతటను మార్తాండమధ్య

ఆ॥ వర్తియగుచు నిట్లు వరలుచు జగముల
యందునుండి ప్రకృతిబొందకంత
నతులదివ్యమూర్తియైన యానందరూ
పమును శరణమొందె భరతవిభుడు.[31]

కొన్నిశ్లోకముల ననువదించుటలో ముఖ్యములైన కొన్ని విశేషణములను భావములను వదలుట జరిగినది. అట్టివానికి ఉదాహరణములు.

1. భగవానపి మనునాయథావదుపకల్పితాపచితిః ప్రియవ్రత నారదయోరవిషమమభి సమీక్షమాణయోరాత్మనస్సమ[33] వస్థానమవాఙ్మనసక్షయ మవ్యవహృతం ప్రవర్తయన్నగమత్[32]

ఆ॥ సరసిజాసనుండు స్వాయంభువునిచేత
నధికమైన పూజలంది నార
దుండు నాప్రియవ్రతుండును జూడంగ
జనియె తనదు పూర్వసదనమునకు.[33]

మూలములోని అవాఙ్మనసక్షయము అను విశేషణమును, అవ్యవహృతం ప్రవర్తయన్ అనుదాని భావమును వదలబడినది.

2. ....కన్యాంచ యవీయసీ మూర్జస్వతీం నామ.[34]

వ॥ ...ఊర్జస్వతి యనునొక కన్యకనుం గాంచి.[35]

ఇచ్చట మూలములోని యవీయసీ అను విశేషణము వదలబడినది.

3. ... వీతిహోత్రకవయఇతి సర్వఏవాగ్నినామానః[36]

వ॥ ...వీతిహోత్రకవు లనునామంబులుగల పుత్రదశకంబును[37]

ఇచ్చట సర్వఏవ అగ్నినామానః అనునది వదలబడినది.

4. ననూనం భగవన్నాత్మారామాణాం యోగసమీరిత జ్ఞానానలావభర్జితకర్మబీజానా మైశ్వర్యాణి పునఃక్లేశదానిభవితు మర్హంతియదృచ్ఛ యోపగతాని.[38]

క౦॥ మునివర యోగజ్ఞానం
బున జెరుపంబడ్డ కర్మములు గల పెద్దల్
గనియుండెడి యైశ్వర్యం
బునుఋషభుండెరిగి యేల పొందకయుండెన్.[39]

జ్ఞానానలావభర్జిత కర్మబీజానాం అను సమాసములోని రూపము తెనుగునకు రాలేదు.

5. నిత్యం దదాతి కామస్య ఛిద్రం కమనుయేరయః
యోగినః కృతమైత్రస్య పత్యు ర్జాయేవ పుంశ్చలీ.[40]

క౦॥ చిరకాలతపమునైనను
హరియింపగనోపు చిత్తమని పెద్దలు న
మ్మరుజారులకును జారిణి
కరణిని నడరించుమనసు కామాదులకున్.[41]

మూలమునందలి ఉపమానభావము విడువబడి మార్చబడినది. ఇచ్చట వ్యాఖ్యానమునకు కూడ భిన్నముగానే ఉన్నది.

6. అపిబత పైె కృపణ ఏణ బాలకో మృతహరిణీసుత అహోమమానార్యస్య శఠకిరాతమతే రకృతసుకృతస్య కృతవిస్రంభ ఆత్మప్రత్యయేన తదవిగణయన్ సుజన ఇవ కిమాగ మిష్యతి.[42]

తే॥ తల్లి చచ్చిన హరిణపోతంబువచ్చి
పుణ్యహీనుండనగు నన్ను బొందిపాసె
నేమిసేయుదు నేనింక నెట్లుగందు
జేరి యేరీతి గాచి రక్షించువాడ.[43]

'అనార్యస్య శఠకిరాతమతేః' మొదలగు విశేషణము లనువదింపబడలేదు.

7. అపి నవృక స్సాలావృకోఽన్యతమో వా నైకచర ఏకచరో నాభక్షయతి.[44]

కం॥ కట్టా యీ యాశ్రమమున
వుట్టిన తృణచయము మేసి పొదలినహరిణం
బిట్టట్టు దిరుగుచుండగ
పట్టి మృగేంద్రుండు కొట్టి బాధించెనొకో.[45]

ఇందు వృకః మొదలగు శబ్దములు తెనుగున ననువదింపబడలేదు.

8. ........ ఆత్మాన మహిరివాఖుబిలం దురతిక్రమః కాలః కరాళరభస ఆపద్యత.[46]

మ॥ భరతుండల్లన నంత్యకాలము వెసం బ్రాపించదా [47] ...

ఇందు 'అహిరివాఖుబిలం' అను ఉపమానము విడువ బడినది.

అనువదించుటలో ఇంకను అనేకవిధములగు పద్ధతులు గోచరించుచున్నవి. కొన్ని సందర్భములలో ఒక మూలవాక్యమే మూడుపద్యములగుటయు కలదు చూడుడు.

యస్యహీంద్రః స్పర్ధమానో భగవాన్ వర్షేనవర్ష తదవధార్యభగవాన్ ఋషభదేవో యోగీశ్వరః ప్రహస్యాత్మయోగ మాయయా స్వవర్షం అజనాభం నామాభ్యవర్షత్[48]

కం॥ పురుహూతు డతని మహిమలు
సరగున విని చిత్తమునకు సహ్యము గామిన్
బరికించి ఋషభుడేలెడి
ధరణి ననావృష్టి మిగుల దట్టము సేసెన్.[49]

ఆ॥ అదియెరింగి ఋషభుడంతట యోగమా
యాబలంబుకతన నఖిలరాజ్య

మందుగురియఁజేసె నత్యంతసంపూర్ణ
వృష్టి దినదినంబు వృద్ధిబొంద. [50]

వ. ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభంబను తనమండలంబు సుభిక్షంబుగా జేసె [51]

కొన్నిచోట్ల రెండుశ్లోకము లొకపద్యమైన సందర్భములును కలవు. చూడుడు.

శ్లో॥ కోను తత్కర్మ రాజర్షేః నాభేరన్వాచ రేత్ పుమాన్
అపత్యయ మగా ద్యస్య హరి శ్శుద్ధేన కర్మణా. [52]

శ్లో॥ బ్రహ్మణ్యోఽన్యః కుతో నాభేః విప్రా మంగళపూజితాః
యస్యబర్హిషి యజ్ఞేశం దర్శయామాసు రోజసా [53]

చం॥ నరసత నేనృపాలకుని జన్నమునందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగబ్రసన్నతజేసిన నంత మెచ్చి యీ
శ్వరుడు తనంతగర్భమునవచ్చి తనూభవుడై జనించె నా
నరపతినాభికిం సరియనందగు సే నరనాథ! యన్యులన్. [54]

కొన్నిచోట్ల మూలభావము మాత్రము గ్రహింపబడి స్వేచ్ఛగా తెనుగుచేయబడినది. చూడుడు.

అహో కష్టం భ్రష్టోఽహ మాత్మవతా మనుపథాత్ యద్విముక్తసమస్త సంగస్య విబిక్తపుణ్యారణ్య శరణ్య స్యాత్మవతఆత్మని సర్వేషా మాత్మవతాం భగవతి వాసుదేవే తదను శ్రవణమననసంకీర్తనారాధనాను స్మరణాభియోగే నాశూన్య సకలయామేన కాలేన సమావేశితం సమాహితం కార్త్స్న్యేన మన స్తత్పునర్మామబుధస్యారా న్మృగసుతమనుపరిసుస్రావ. [55]

ఉ॥ రాజులు ప్రస్తుతింప వసురాజసమానుడనై తనూజులన్
రాజులజేసి తాపసులు రాజఋషీంద్రుడటంచు బల్కగా
తేజమునొంది యీహరిణదేహమునందుల బ్రీతిజేసి నా
యోజ చెడంగ నేజెడితి యోగిజనంబులలోన బేలనై [56]

వ॥ ఇట్లు శ్రీహరి శ్రవణమననసంకీర్తనారాధనాను స్మరణాభియోగంబులంజేసి అశూన్యసకలయామంబగు కాలంబుగల నాకు

హారిణపోత స్మరణంబునంజేసి యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యె మోక్షదూరుండనైతి.[57]

కొన్నియెడల రచనాసౌందర్యమును ప్రధానముగా దృష్టిలోపెట్టుకొని అనువదించిన సందర్భములు కలవు. చూడుడు—

అథహాత మావిష్కృతభుజయుగళద్వయం హిరణ్మయం పురుషవిశేషం కనకకపిశకౌశేయాంబరధరం ఉరసి విలసచ్ఛ్రీవత్సలలామం దరవరవనరుహవనమాలాచ్ఛూర్య మృతమణిగదాభిరుపలక్షితం స్ఫురత్కిరణప్రవరమణిమయ మకుటకుండల కటకకటిసూత్రహారకేయూరనూపు రాద్యంగ భూషణవిభూషితం, ఋత్విక్సదస్య గృహపతయోఽ ధనాఇవో త్తమమ్ ధనమూలలభ్య సబహుమాన మర్హణేన అవనత శీర్షాణ ఉపతస్థు.[58]

సీ॥ అంత నావిష్కృతకాంత చతుర్భుజం
బులును పీతాంబరంబును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ శ్రీరమాచిహ్నంబు
లురమందు రమ్యమై యిరవువడగ
శంఖచక్రగదాంబుజాత ఖడ్గాదిది
వ్యాయుధంబులు చేతులందు మెరయ
నతులితనవరత్న హాటకాంకితనూత్న
ఘనకిరీటద్యుతుల్ కడలుకొనగ

తే॥ కర్ణకుండల కటిసూత్ర కనకరత్న
హారకేయూరవరనూపురాది భూష
ణములు భూషితుడైన శ్రీనాయకుండు
దంపతుల కప్పుడెదుర ప్రత్యక్షమయ్యె.[59]

తే॥ ఇట్లు ప్రత్యక్షమగు పరమేశ్వరుని
పెన్నిధానంబు గనుగొన్న పేదమాడ్కి
హర్షమున ఋత్విగాదికు లవనతాస్యు
లగుచు నభినుతి చేసి రిట్లనుచు నపుడు.[60]

కొన్ని సందర్భములందు మూలము మిక్కిలి సంగ్రహింపబడి కేవలప్రధాన భావముమాత్రము క్లుప్తముగా చెప్పబడినది. చూడుడు.

ఏవ ముపశమాయనేషు స్వతనయేష్వథ జగతీపతి ర్జగతీ మర్బుదా న్యేకా దశపరివత్సరాణా మవ్యాహతాఖిలపురుషకారసార సంభృతదోర్దండ యుగ ళాపీడిత కోదండమౌర్వీ గుణ స్తనిత విరమితధర్మప్రతిపక్షో బర్హిష్మత్యా శ్చానుదిన మేధ మావప్రమోద ప్రసవణ యౌషణ్యవ్రీడా ప్రముషిత హాసావలోకరుచిరక్ష్వేళాదిభిః పరాభూయమానవివేకో ఽనవబుధ్యమానఇవ మహామనా బుభుజే.[61]

సీ॥ వసుధేశ ఆప్రియవ్రతుడొండు కాంతయం
దధికుల మన్వంతరాధిపతుల
మరియు నుత్తముడు తామసుడు రైవతు డను
సుతులను బుట్టించె సుమహితులను
మున్ను జన్మించిన పుత్రులలో ముప్వు
రవ్యయపదవికి నరుగుటయును
నపుడు ప్రియవ్రతుడఖిల శాత్రవకోటి
దన బాహుబలముచేతను జయించి

తే॥ యతడు బర్హిష్మతీకాంతయందు ప్రీతి
కలిగి యౌవనలీలావిలాసహాస
హేలనాదుల చిత్తంబు గీలుకరచి
గతవివేకుండువోలె భోగములబొందె.[62]

2 నిత్యనివృత్త నిమిత్త స్వసిద్ధ విశుద్ధానుభవానంద స్వాత్మ లాభాతిగమః[63]

వ॥ మరియు నావిభుండు నిత్యానందసుఖలాభంబుగలిగి [64]

మూలమును మార్చుటలో కొన్నిచోట్ల చక్కని నైపుణ్యము చూపబడినది. చూడుడు.

శ్లో॥ భౌమం దివ్యం మానుషంచ మహత్వం యోగకర్మజం
యశ్చక్రే నిరయౌపమ్యం పురుషానుజనప్రియః.[65]

వ॥ ......పాతాళభూస్వర్గాదిజాతంబులగు సుఖంబులు నరక సమానంబులుగా దలంచి విరక్తిబొంది నిరంతర భగవద్ధ్యానవిమలీకృతాశయుండగుచు హరిభక్తప్రియుండైన.[66]

మూలములోని మహత్వమును రమణీయార్థయుతములుగా క్రమముమార్చబడుట స్పష్టము. కొన్నియెడల మూలభేదములు గోచరించుచున్నవి. అట్టి రచన కుదాహరణములు చూడుడు.

శ్లో॥ ప్రియవ్రతో భాగవత ఆత్మారామః కథం మునే
గృహేఽరమత యన్మూలః కర్మబంధః పరాభవః.[67]

వ॥ మునీంద్రా! పరమభాగవతుండు నాత్మారాముండునైన ప్రియవ్రతుండు గృహంబున నెట్లురమించె. కర్మబంధంబులైన పరాభవంబులుగల గృహంబులయందు ముక్తసంబంధులైన పురుషులకు సంతోషంబు కానేరదు.[68]

ఇచ్చట 'కర్మబంధః పరాభవః' అనుదానికి కర్మణాంబంధః పరాభవశ్చ అని వ్యాఖ్యానములో నుండగా కర్మబంధంబులైన పరాభవంబులు అని అనువదింపబడినది. రెండు పదములకును లేని విశేషణవిశేష్యసంబంధము తెలుగున కల్పింపబడినది. అర్థదృష్టిలో ఇది కొంచెము బాధకము.

2. తస్య హవా వ్రశ్రద్ధయా విశుద్ధభావేన యజతః ప్రవర్గ్యేషు ప్రచరత్సు ద్రవ్యదేశకాలమంత్రర్త్విగ్దక్షిణావిధానయోగో పహత్యా దురదిగమోఽపి భగవాన్ భాగవతవత్సలతయా సుప్రతీక ఆత్మానమపరాజితం నిజజనాభిప్రేతార్థవిధిత్సయా గృహీతహృదయో హృదయంగమం మనోనయనానందనావయవాభిరామ మావిశ్చకార.[69]

వ॥ మరియుం బ్రవర్గసంజ్ఞికంబులగు కర్మంబుల శ్రద్ధా విశుద్ధద్రవ్యదేశకాలమంత్ర ఋత్విగ్దక్షిణావిధానయోగంబులం బరమేశ్వరుని మెప్పించిన, నెవ్వనికిం బ్రసన్నుండుగాని పుండరీకాక్షుండు భక్తవత్సలుండై సురుచిరావయవంబులు గలిగి యజనశీలంబైన యాతనిహృదయంబునందు భాయనిరూపంబు గలిగి మనోనయనానందకరావయవంబులుగల తన స్వరూపంబు చూపదలంచి.[70]

మూలమున దక్షిణవిధానయోగములచే భగవంతుడు దురధిగముడయ్యుమ భాగవతవత్సలతచే ప్రత్యక్షమయ్యెనని ఉండగా తెనుగున ఆయాయోగంబులం బర మేశ్వరుని మెప్పించిన పుండరీకాక్షుడు ప్రత్యక్షమయ్యెనవి కలదు.

3. కింవాత్మజ విశ్లేషణ జ్వరదవదహనశిఖాభి రుపతప్యమాన హృదయస్థలనళినీకం మా ముపసృతమృగీతనయం శిశిర శాంతానురాగగుణిత నిజవదన సలిలామృత మయగభస్తిభిః స్వధయతీతవా. 71

వ॥ మున్ను పుత్రవియోగతాపంబును చంద్రకిరణంబులం బావుదు ఇపుడు హరిణపోతంబు తనశరీరస్పర్శంజేసి చంద్రకిరణం బులకన్న నధికంబగుచు పుత్రవియోగతాపంబు నివర్తింపన్ జేసె. 72...

మూలభావమునకును దీనికిని అంతగా సంబంధములేదు. అందలిపదములు కొన్ని ఇందు కలవు గాని అందలి అర్థము మాత్రములేదు.

అమూలకమగు వర్ణనలు చేయుటలో పోతనవలె గాని కనీసము సింగనవలె గాని గంగన ఔత్సుక్యమును చూపలేదు. కాన అక్కడక్కడ స్వతంత్రించి రచిం చిన పద్యములు కొన్ని రమణీయములై అతని ప్రజ్ఞను చాటుచున్నవి. చూడుడు.

గురువులు వారిబిట్టుఱికి కొమ్ముల జిమ్ముచు నంతనంత ద
గ్గరుచును గాలుద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసిసేయుచు
న్నొరుగుచు ధారుణీశ్వరుని యూరువులన్ శయనించి యంతలో
నరకడమెక్కుచుం బొదలియాడుచు నాహరిణంబులీలతోన్. 73

భరతుడు హరిణమును పెంచుసందర్భమున దాని క్రీడావిశేషములను మోహన ముగా వర్ణించు నీచంపకమాల స్వభావోక్తి రమ్యముగా నున్నది

2. కం॥ ధరలోన నెవ్వరేనియు
ధరణీసురవరుల కెగ్గుదగచలచినవా
రరయగ జెడుదురు నిక్కము
హరి ధరణీసురవరేణ్యులం దుండుటచే 74

ఇదిపోతనకు మిక్కిలి ప్రియమైన భావము. అనేక సందర్భములలో ఆయన పలికిన ఈభావమును గంగనయు ననుసరించి సమయౌచిత్యమును పాటించెను.

అచ్చట విప్రసూనుడు భయంబొకింతయు జెందకుండ దుష్టశిక్షయు నొందకయుండె సత్తరిన్.

వచ్చినవారియందు కరవాలమునందును కాళియందు దా
నచ్యుతభావముంచి హృదయంబున పద్మదళాక్షునెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానమునొందకయుండె సత్తరిన్.[78]

ధారాళమగుశైలితో విష్ణుభక్తి ప్రాతిపదికమై అత్యంత సుందరమైన ఈ పద్యము పోతనదేమో అని భ్రాంతిగొల్పునదై అలరారుచున్నది.

4. ఆ. పరగపెద్దలీప్రపంచమంతయు తథ్య
మనరు నీవు తథ్యమను బలికి
తట్లుగాన నిన్నునధింకుండవని పల్క
రాదునాకుజూడ రాజచంద్ర.[76]

ఇట్టిపద్యములు గంగనయొక్క అద్వైతమార్గాను సారిత్వమును నిరూపించు చున్నవి. 'జగత్తసత్యంబు'[77] మొదలైన ఈతనివాక్యములిట్టివే.

కావ్యశిల్పదృష్టిలో ఈస్కంధములోని ఆగ్నీధ్రుని కథ కొంతప్రస్తావింపవలసి యున్నది. ఆగ్నీధ్రుడు చిరకాలము ధర్మప్రతిపాలనుడై ప్రజలను తాత్పర్య చిత్తముతో సత్పుత్రులమాడ్కి ప్రోచెను. ఆతడు పుత్రకాముడై ఒకప్పుడు బ్రహ్మ దేవుని అర్చించెను భగవంతుడగు బ్రహ్మ తన సదస్సున సంగీతముపాడు పూర్వ చిత్తియను అప్సరసను అతనితో సంభోగించుటకు పంపెను. మూలములో నిచట అభియాపయామాస[78] అను క్రియకలదు. దానికి శ్రీధరుడు సంభోగార్థం ప్రస్థా ప్రయామాస అని అర్థము చెప్పెను. గంగన ఆ అర్థమును వదలి కేవలము పంపు టయు[79] అనిమాత్రము రచించెను. ఆపంపుట ఎందుకో మూలమున కలదు. తెను గునలేదు.

అపూర్వచిత్తి తదాశ్రమోపవనమున విహరించుచు చేయవలసిన విలాస ములు చేసినది. ఆమెధ్యేయమా నరేంద్రునాకర్షించుట. ఆమె ఆశయమదియని తెలియదుగానీ అగ్నీధ్రుడాకృష్టుడైనాడు. చిత్తచలనమునొంది మన్మధవశుడైన ఆరాజు పూర్వచిత్తితో సంభాషించినవైఖరి సంస్కృతాంధ్రములలో భిన్న ముగా నున్నది .సంస్కృతముతో 'కాత్వంచికీర్షసిచకింమునివర్యశైలే'[80] అని మొదలుపెట్టి పుంలింగాత్మకములైన సంబోధనములతో నే పలుకబడినది దీనిని 'మునివర్య ఇత్యాది పుంస్త్వేనసంబోధనానిబాడ్యానుకారార్థం' అని

శ్రీధరులు వ్యాఖ్యానించినారు. తెనుగులోను జడుని చందంబున నిట్లనియె.[81] అని కలదుగాని ఆపిదప 'సతి నీవెవ్వతెవీపర్వతమున.[82]' అని సంభాషణమంతయు స్త్రీ లింగాత్మక సంబోధనములతోనే కలదు. ఈసందర్భమున అకాడమీ భాగవతపీఠికా కారులు మూలరచనయే రమ్యతరముగా నున్నదనియు మూలమున వ్యంగ్యముగా నున్న అర్థమనువాదమున వాచ్యమైనదనియు 'అంగజుడెక్కుడించిన'.[83] అనుపద్యము నందలి అమూలకమైన ఉత్తరార్థము దానిని మరింత వాచ్యమొనర్చినదనియు వ్రాసి నారు.[84] నిజమే కావచ్చును. చమత్కారాన్వితమై పరమసుందరమైన అచ్చటి శ్లోక సముదాయమునుపఠించిన ఎవ్వరైనను పులకితులగుదురు. సందర్భానుగుణముగా ఛందస్సును వసంతకోకిలావృత్తము[85] లోనికి మార్చి అత్యద్భుతమగు రచనను కావించుట మహితాత్ముడగు మహర్షికే తగును. ఆవిభాగమును పఠించిన గంగన ఆ సంబోధనలను స్త్రీలింగమునకు మార్చుటకు కారణమేదో ఉండవలెను.

ఆగ్నీధ్రుడు మహారాజు. అతడు లోకవాసన తెలియని ఋష్యశృంగుని వంటివాడు కాడు. స్త్రీల నెరుగనివాడును కాడు. అతడు చక్రవర్తియనియు పుత్ర కాముడై తపస్సు చేయుచున్నాడనియు బ్రహ్మచే పంపబడిన పూర్వచిత్తికిని తెలి యును కాబట్టి ఇరువురును విజ్ఞులే స్త్రీపురుషవైఖరులు తెలిసినవారే. అట్టిసందర్భమున ఒకచక్రవర్తిచే లింగభేదము తెలియనివానివలె సంభాషింపజేయుట ఉచితము కాదని భావించి గంగన మూలపద్ధతిని మార్చెనని భావింపవచ్చును. దీనికి ప్రతివాదమునిట్లు చేయవచ్చును.

తాను చక్రవర్తినను విషయము ఆగ్నీధ్రుడెరుగును. కానీ తనముందునిలచిన సౌందర్యవతి ఎవ్వరో అతనికి తెలియదు. బ్రహ్మదేవుడామెను తనకోసమే పంపించినాడని తెలిసినచో అతడెట్లు ప్రవర్తించెడివాడో కాని అది ఎరుగనివాడగు టచే తనప్రజ్ఞతో ఆమెను వశీకరించుకొనదలచెను. తానెవ్వరో తనబలపరాక్రమము లేమో తనవైభవమెట్టిదో వర్ణించుకొని ఆమెసౌందర్యము నభివర్ణించి రసికత్వమును ప్రదర్శించి ఆకర్షించుట ఒకపద్ధతి. స్త్రీపురుషవిషయమే తెలియని అమాయకునివలె నటించుచు నాగరికత నెరుగని ఋషివలె కనిపించి ఏకారణముచేతనో ఎదుటివ్యక్తిచే తానాకర్షింపబడినట్లు తెల్పుచు ఏదోవిధముగా అవతలివ్యక్తి యొక్క సాన్నిహిత్య మును సంపాదించి తరువాత నెమ్మదిగా తనకార్యము నెరవేర్చుకొనుట మరియొక పద్ధతి. దీనికి గొప్పనటనాసామర్థ్యము కావలెను. లోకానుభవముగల ఆరాజర్షి కది కలదు. తనను అప్సరస ఋషిగానే తలంచుచున్నదని అతనిభ్రమ. తపను రాజుగా

ఆమెఎరుగదని ఆతని తలపు. అందుచే ఆతడపాయకుడైన ఋషికుమారుడుగా నటించి ఆమెను వశపరచుకొన ప్రయత్నించినాడు. ఈరెండవపద్ధతిని మూలకర్త అనుసరింపగా మొదటిపద్ధతిని అనువాదకర్త అనుసరించినాడు. వాని చిత్రీకరణములో రమ్యత వారివారిమనస్తత్వమునుబట్టి యుండును. ఈదృష్టితో పరిశీలించిన యెడల గంగన అవలంబించిన పద్ధతియు రమణీయముగానే కన్పడుచున్నది.

ఇకకథలో పూర్వచిత్తి ఎట్లు ప్రవర్తించినదో విమర్శింప నక్కరలేదు. బ్రహ్మదేవు డామెనొకకార్యార్థము పంపినాడు. అదినెరవేర్చుట తనకర్తవ్యము. ఆగ్నీధ్రుడు ఎట్లుప్రవర్తించినను దానిని పట్టించుకొనవలసినపని ఆమెకులేదు. పరమేష్ఠి ఆజ్ఞననుసరించి ఆతని అనునయవాక్యముల కామె సమ్మతించినది.

ఇక్కడ ప్రధానవిషయమేమనగా ఆతని రసికతకు రూపశీలవిద్యావయశ్శ్రీలకు వశురాలై ఆమెఆతనితో శతసహస్రసంవత్సరములు కలిసియున్నదట. [86]

ఆతని రసికత ఆమె చిరకాలోపస్థితి కనుకూలించినది. ఆరసికత్వమును సంస్కృతాంధ్రకవులు భిన్నదృక్పథములలో దర్శించిరి.

ఈవిధముగా గంగన భాగవతములో తానుచేపట్టిన భాగమును చేతనైనంత శ్రద్ధతో ననువదించినాడు. గ్రంథము మొత్తముమీద చెప్పవలెనన్న ఆతడత్యంత సమర్థుడునుకాడు. అట్లని అసమర్థుడును కాడు ఆతని ప్రజ్ఞ మాధ్యమికము.



# భాగవతానువాదవైఖరి – సింగన

ఏర్చూరి శాసనుడగు ఎఱ్ఱనప్రెగ్గడ వంశ్యుడు నాదయామాత్య పోలమాంబలకు పౌత్రుడు. కసువనామాత్య మమ్మడాంబలకు పుత్రుడు. ఆపస్తంబ సూత్రుడు శ్రీవత్సగోత్రుడు అగు సింగనామాత్యుడు భాగవతములోని షష్ఠస్కంధము నాంధ్రీకరించెను. పోతనవలెనే తాను రచించిన ఒక్కస్కంధమునకును ఇతడు కృత్యవతరణిక రచించెను. ఆ రచించుటలో కూడ పోతనవ్రాసిన ఒక్కొక్క పద్యమునకు ప్రతిపద్యము వ్రాయుటకై ఈతడు ప్రయత్నించినట్లు కన్పించుచున్నది. చూడుడు.

శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకు కేళిలోలవిలసద్దృగ్జాల సంభూత నా
నా కంజాతభవాండకుంభకు మహానందాంగనా డింభకున్.[2]

శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురితలక్ష్మీ చారువక్షస్స్థల
శ్రీ విభ్రాజితునీలవర్ణు శుభరాజీవాక్షు గంజాతభూ
దేవేంద్రాది సమస్తదేవమకుటోద్దీప్తోరు రత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్.[3]

వాలినభక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మ మయూఖమాలికిన్
బాలశశాంకమౌళికి గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్య మనస్సరసీరుహాళికిన్.[4]

నిందుమతిం దలంతు గమనీయభుజంగమరాజమండలీ
మండను జంద్రఖండపరిమండితమస్తకు దారమల్లికా
పాండురవర్ణు జండతరభండను హేమగిరీంద్రచారుకో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తిరంజనున్.[5]

ఆతతసేవ సేసెద సమస్తచరాచరభూతసృష్టి వి
జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికరనేతకు గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోక శుభప్రదాతకున్.[6]

హంసతురంగముం బరమహంసము నంచితదేవతాకులో
త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్య రమావతంసముం
గంసజిఘాంసునంశమును గర్బురసూత్రసమావృతాంసమున్
హింసనడంచుబ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్.[7]

ఇత్యాదులు. వీనినిబట్టి పోతన భాగవతము వ్రాయుచుండగా అంధలిఘట్టము లను సింగన బహుపర్యాయములు పఠించి యుండునను తోచుచున్నది.

సింగన వ్యక్తిత్వమాతని రచనలో విస్పష్టముగా గోచరించును. పోతనవలె కాక ఆతడు ధనకనకవస్తువాహనములందు మిక్కిలి ప్రీతిగలవాడు. కేవలము ప్రీతియే కాదు దానికి తగినసంపన్నత కూడ ఆతనికున్నట్లు కన్పించును. తొలుదొల్తనే తన కవిత్వము మహాలక్ష్మియని యాతడు చెప్పుకొనినాడు. (మదీయకవితామహాలక్ష్మికి[8]) ఒకనాడు దివంబున

కలితవిశేషవస్త్రములుగట్టి హిమాంబుసుగంధచందనం
బలది వినూత్నభూషణములారయదాల్చి వినోదలీల నిం
పులమృదుశయ్య నిద్రదగఁబొందినచో గనుపట్టె పల్మరుం
గలయ దటిద్విలాసములు గట్టిగ నొక్కట నిల్చుపోలికిన్.[9]

ఈతని కల తిక్కన స్వప్నవృత్తాంతమును స్ఫురింపజేయుటయేగాక ఆతడు ధనవంతుడను విషయమునుగూడ తెలుపుచున్నది. అంతేకాదు తాను సంపన్నుడని అందరు తెలిసికొనవలెనను కోరిక కూడ ఆతనికున్నట్లు పైపద్యముచే భావింప వచ్చును. ధనముపై, కనకభూషణములపై, వజ్రవైడూర్యములపై ఆతనికిగల ఆసక్తి అంతింతకాదు. ఈతని గ్రంథాది పద్యమే దీనికి ప్రధాన నిరూపణము. పోతన ప్రథమపద్యమును ఈతని ప్రథమపద్యమును సూక్ష్మముగా పరిశీలించిన వారి ఇద్దరిమనస్తత్వములలోనుకల కొండంత భేదము మనకు కళ్ళకుకట్టినట్లు కన్పించును.

పోతన కృష్ణుని శ్రీకైవల్యపదము చేరుటకై చింతించెను. సింగన కేవలము ప్రశంసించెను. తనవాంఛితమేమో అతడు చెప్పలేదు. ఆపదప్రయోగములోనే ఇద్దరి తత్త్వములును వ్యక్తమగుచున్నవి.

పోతన కృష్ణుడు లోకరక్షైకారంభుడు. భక్తపాలన కళాసంరంభుడు. దానవోద్రేకస్తంభకుడు. కేళిలోలవిలసద్వీక్షణములయందు బ్రహ్మాండములు పుట్టించినవాడు. ఇక సింగనవర్ణించిన కృష్ణుడో ఒకమహాచక్రవర్తివలె కన్పించును. శ్రీవత్సము, కౌస్తుభము, లక్ష్మీదేవి, వీనిశ్రీతో అతడు విభ్రాజితుడు. రత్నములు పొదిగిన కిరీటములుదాల్చిన బ్రహ్మ దేవేంద్రుడు మొదలగువారెందరో ఆయన పాదములకు ప్రణమిల్లుచున్నారు. ఈ వర్ణనమును చూచినయెడల సింగనకు భగవంతుని అలంకరణముల మీదనున్న దృష్టి ఆయన కళ్యాణగుణములపై నున్నట్లు తోచదు. ఇతనిపద్యములో పసిడివన్నెలు రత్నపుతళుకులు కనిపించినట్లుగా భగవంతుని భక్తవాత్సల్యలాలిత్యముల మెత్తదనము కన్పింపదు.

కవిత్వములో రెండుపద్ధతులున్నవి. ఒకటి బాహ్యచిత్రణము. మరియొకటి అంతరచిత్రణము. ఒక్కొక్కచోట ఒక్కొక్కటి రమణీయగా భాసించును. భగవత్తత్త్వము తెలుపవలసి వచ్చినప్పుడు భౌతికమూర్తి చిత్రణముకంటె అలౌకికతత్త్వ చిత్రణ మధికముగా సహృదయుల నాకర్షించును. పోతనచేసినది శ్రీకృష్ణుని అంతర చిత్రణముకాగా సింగనది బాహ్యచిత్రణము. కవితారచనలో మూర్తిచిత్రణమునకెట్టి సందర్భములందు ఎంతప్రాముఖ్యము నొసగవలయునో గ్రహింపగల పరిణతి సింగన కప్పటికిరాలేదు. దానికి కారణము భాగవతరచన కవసరమైనంత ఆధ్యాత్మికదృష్టి అతనికి ప్రబలలేదు.

ఈవిషయమును నిరూపించుటకును లౌకికములగు ధనకనకవస్తు వాహనములపై అతనికిగల ప్రీతిని చూపుటకును మరికొన్ని ఉదాహరణము లొసగబడుచున్నవి. వీనికి సంస్కృతమూలములులేవు.

1. కర్బురసూత్రసమావృతాంసమున్.[10]

2. విలసత్కంకణరవరవ.[11]

3. కమనీయవలయకరకీలితకంకాళికి.[12]

4. సొమ్ముగవాక్యసంపథలు.[13]

5. హేమాద్రిసోగ.[14]

6. ఫణిరాజఫణారాజిమణిగణవిస్ఫూర్తి.[15]

7. ఉరోభాగ కౌస్తుభప్రియమణికిన్[16]

8. బాహుకేయూరమణికిన్.[17]

సింగన భౌతికదృష్టిని కృత్యవతరణిక బట్టి మరికొంత ఊహింపవచ్చును. చూడుడు.

ఆటలుపాటలున్ చదువులద్భుతముల్ వినఁనొప్పు వాద్యముల్
సాటిదలంపరాని బలుసాములు మున్నగువిద్యలెల్ల నీ
కాటలుపాటలయ్యె.[18]

కం॥ అంగజసమ లావణ్యాశుభాంగులు[19] ...

మొదలగువానిచే సింగన సాములుచేసి వ్యాయామాది సాధనలచే పరిపుష్టమును సుందరమునునైన శరీరముకలవాడని తెలియుచున్నది. అదృష్టవశమున భాగవతభాగ రచనావకాశము లభించుటచే ఆతనికిష్టమైన విషయములన్నియు అందుప్రవేశించినవి.

శ్రీకృష్ణుని వర్ణించు షష్ఠ్యంతపద్యములలో నొకటి ఈశరీర బలప్రియత్వమును సూచించుచున్నది.

కం॥ కంసాసురసంహారుల
కంసాంచిత కర్ణకుండ లాభరణునకున్
హింసాపర పరమ స్తక
మాంసకరాళిత గదాభిమత హస్తునకున్.[20]

చక్రముతో శత్రువులను సంహరించెనని ఊహించుట చిత్రముకాదుగానీ కృష్ణుడు గదతో శత్రువుల తలలు పగులగొట్టుననుట సామాన్యముగా నెవ్వరును వర్ణింపని పద్ధతి.

అటులే వృత్రుని వర్ణించుచు దుర్దమ ప్రధనమత్తుడగు నాతడు మల్లుడని[21] వర్ణించుట ఇట్టిఅమూలక విశేషములలో నొకటి. సింగన దృష్టి ఎట్టిదనగా మృత్యువు సంభవించు వేళకూడ తన చెల్వము తప్పునేమో[22] యని అతడు సందేహించును.

స్థూలముగా తిక్కనకును నాచనసోమనకును ఏట్టిభేదముకలదో పోతన సింగనలకును ఇంచుమించుగా అట్టిభేదమే కలదు. హరిహరనాథుని చూచినచో తిక్కన కాయన శ్రీత్వ శివాత్వాలంబనతత్వమునందలి సుమనస్త్వము తలపున నిలుచును. నాచన సోమనకో శ్రీసర్వమంగళాకుచవాసంతీవకుళ గంధవద్వనమాలపై దృష్టినిల్చును. అట్లే పోతనకు శ్రీకృష్ణుడు బ్రహ్మాండముల బంతులాడించు భక్తవత్సలుడుగా కన్పించిన సింగనకు కౌస్తుభముదాల్చి మణిమకుటము పెట్టుకొని చక్రవర్తిగా కనబడును. ఇది వారి తత్వభేదము.

ఏమైనను పోతనపై మాత్రమాతని కపారమగు భక్తియున్నది. ఈ క్రింది పద్యమందుకు నిస్సంశయమగు నిదర్శనము.

ఉ॥ ఎమ్మెలుసెప్పనేల? జగమెన్నగబన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలుచేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుడై తగువాని బేర్మితో
బమ్మెరపోతరాజు కవిపట్టపురాజు దలంచి మ్రొక్కెదన్.[23]

భాగవతములోని ఇతరరచయితలగు గంగననారయల కంటె ఈతడధికతర పాండిత్యమును దానిచే లభించిన ఆత్మవిశ్వాసమును కలవాడు. వారు తమపేర్లను స్కంధాంతగద్యల యందుంచుకొనుటతో సంతృప్తిపడగా సింగన అంతమాత్రమున తుష్టినొందక ప్రత్యేకముగా నొక కృత్యవతరణిక రచించుకొని గరీయసియగు తన విశిష్టతను స్థాపించుకొనుటకు ప్రయత్నించినాడు. ధనము, విద్య, వయస్సు, వంశము అతనికాదర్పము నిచ్చినవి.

అనువాదపద్ధతిలో ప్రాయికముగా నాతడు పోతననే అనుసరించెను. కానీ వయస్సును, అనుభవమును, పాండిత్యమును చాలకపోవుటచే కాబోలు తదపరిణతి బహుస్థలముల గోచరించును. భాగవతమునకు పీఠికవ్రాసిన తంజనగరంతేవప్పెరుమాళ్ళయ్యగారీతని అనువాదవైఖరిని పరామర్శించుచు నీతడు పోతనవలె వ్యాఖ్యానమును గొని మూలము నన్యూనముగాను, ననతివిపులముగాను విశదీకరించువైదుష్యమునుగాని, ప్రావీణ్యమునుగాని కలవాడుకాడనియు మరియు నావ్యాఖ్యానమును చక్కగా పాటించి మూలముననను దానికి మిక్కిలిసరిగా తెనిగించినవాడు కాడనియు కొన్నియెడల తెనిగింపు మూలమునకు చాలభిన్నముగా నుండుననియు మూలమున తత్వఘట్టములలో సమాసములను పోతనవలె తేటపరుపలేక అట్లే ఉంచి రచించుట

టుండగా వానిలో కొన్నింటిఅర్థములందు సరిగా కాన్పించుటలేదనియు కొన్నియెడల అద్వైతప్రక్రియలు మాత్రము తప్పక తనకుతోచినరీతి మూలమునకు చాల విరుద్ధముగా కూడ తెనిగించియున్నాడనియు, కేవలకవిత్వమునుబట్టి చూడ అతడు గంగన నారయలకంటె నెక్కుడై పోతనవలె స్వకపోలకల్పితములగు వర్ణనలనుగూడ చేర్చి మధురముగాను మనోహరముగాను తనస్కంధమును తెనిగించినాడని చెప్పనొప్పుననియు వ్రాసియున్నారు. [24]

మరియొకపీఠికాకారులగు రాయదుర్గం నరసయ్యశాస్త్రిగారు ఇతనికవిత్వము కోమలపదగుంఫితమై అనుప్రాసభాసురమై కొంతవట్టు పోతనకవిత్వమునసుసరించియున్నదనియు ఇతడు మూలమునసుసరించి సరిగానాంధ్రీకరించినవాడు కాడనియు కొన్నిచొట్ల స్వకపోలకల్పితములగువర్ణనలంజేసి శ్రోతలకు మిక్కిలి శ్రవణానందము గావించినాడనియు కొన్నిచోట్ల మూలమునందున్న విషయము మిగుల సంక్షేపించి వ్రాసినాడనియు అభిప్రాయపడినారు. [25]

నారయాదులు పోతనామాత్యుని శైలినే అవలంబించి దాని తెరంగుననే తమ రచనలను చేసియున్నారనియు, పోతన కవనమునందుంబోలె వారికవనమునందును అంత్యనియమ ప్రాసాది శబ్దాలంకారములును ఛేకయమకాదిచిత్రరచనలును అభేదాధ్యవసాయములును కానవచ్చుచున్నవనియు, ఐనను వారికవనమెల్లవిధముల పోతన కవనముకంటె తద్దయు లోకువయనుట కెంతమాత్రమును సందియములేదనియు వీరి కవనములలో సింగనార్యుని కవనము తక్కుంగల ఇరువురి కవనములకంటె ప్రౌఢమనియు భాగవతపీఠికాకర్తలలో నొకరగు నాగపూడి కుప్పుస్వామయ్యగారు వ్రాసియున్నారు. [26]

పోతన రచించిన భాగవతమును పలుమార్లు చదివి అరచనా విధానమును జీర్ణించుకొని ఈతడట్లే వ్రాయుటకు యత్నించి కొంతవరకు కృతకృత్యుడయ్యెననియు, ఇతడును శ్రీధరవ్యాఖ్యనే అనుసరించి అనువాదము సాగించెననియు మూలమును విస్తరించుట యందీతనికి ప్రీతిమెండనియు అకాడమీపీఠికాకారులు వ్రాసియున్నారు. [27]

మూలమునసువదించుటలో ఈతడనుసరించిన వివిధ పద్ధతులకు నుదాహరణము లీక్రింద నొసగబడుచున్నవి. చాల సందర్భములలో నితడు యథామూలముగా ననువదించి యున్నాడు. చూడుడు.

1. శ్లో॥ ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణపరాఙ్ముఖైః
నవిష్పునంతి రాజేంద్ర సురాభాండ మివాపగాః[28]

కం॥ అరుదుగ నరహరిభక్తిన్
బొరయని ఆపురుషు సుకృతపుంజంబులు వే
మరు పుణ్యుఁ జేయనేరవు
నరవర మధుఘటము పెక్కునదులుం బోలెన్.[29]

2. శ్లో॥ నామోచ్చారణమాహాత్మ్యం హరేః పశ్యతపుత్రకాః
అజామిళోఽపి యేనైవ మృత్యుపాశా దముచ్యత[30]

తే॥ కంటిరే మీరు సుతులార కమలనేత్రు
భవ్యమగు నామకీర్తన ఫలమునేడు
తవిలి మృత్యువు పాశబంధముల వలన
జాణతనమున వీడె నజామిళుండు[31]

3. శ్లో॥ నమః పరాయా వితథామభూతయే
గుణత్రయాభాస నిమిత్త బంధవే
అదృష్టధామ్నే గుణతత్త్వబుద్ధిభిః
నివృత్తమానాయ దధే స్వయంభువే.[32]

తే॥ పరమునికి వందనముసేతు పరిఢవించి
మున్న వితథానుభూతికి మ్రొక్కికొందు
మెరయుగుణములదేలు నిమిత్తమాత్ర
బంధుఁడైనట్టి వానికి బ్రణుతి సేతు.[33]

ఆ॥ తవిలిగుణముచేత తత్త్వబుద్ధులచేత
నిగిడికానరాని నెలవువాని
మొదలదానగలిగి ముక్తిమానావధి
రూపమైనవాని బ్రాపుబొందు.[34]

4. శ్లో॥ ఏషా పంచజనస్యాంగదుహితా వై ప్రజాపతేః
అసిక్నీ నామ పత్నీత్వే ప్రజేశః ప్రతిగృహ్యతాం
మిధునవ్యవాయధర్మ స్త్వం ప్రజాసర్గ మిమం పునః
మిధునవ్యవాయధర్మిణ్యాం భూరిశో భావయిష్యసి.[35]

అంత పంచజనుండను ప్రజాపతితనూజయగు నసిక్నియను పేరిట వినుతి నొందియున్న యిక్కన్యకను నీకిచ్చితి దీనిం బత్నిగా గైకొని మిధునవ్యవాయ ధర్మంబు గలవాడవై మిధునవ్య వాయధర్మంబుగల యీనాతియందు ప్రజాసర్గంబు నతివిపులంబుగా గావింపగలవాడవు.[36]

కొన్నిచోట్ల మూలములోని ఒకశ్లోకభాగముగైకొని విపులీకరించుట జరిగినది. ఇట్టి పెంపున కుదాహరణములు చూడుడు.

1. శ్లో॥ రామోఽద్రికూటేషు[37]

కం॥ రాముడు రాజకులైకవి
రాముడు భృగుసత్కులాభిరాముడు సుగుణ
స్తోముడు ననురక్షించును
శ్రీమహితోన్నతుడు నద్రిశిఖరములందున్[38]

2. శ్లో॥ .... ....అథవిప్రవాసే
సలక్ష్మణోఽవ్యాత్ భరతాగ్రజో మామ్.[39]

సీ॥ తాటకమర్దించి తపసిజన్నముగాచి
హరువిల్లువిరిచి ధైర్యమున మెరసి
ప్రబలులైనట్టి విరాధకబంధోగ్ర
ఖరదూషణాది రాక్షసులదునిమి
వానరవిభునేలి వాలికూలగనేసి
జలరాశిగర్వంబు చక్కజేసి
సేతువుబంధించి చేరిరావణకుంభ
కర్ణాదివీరుల కడిమిద్రుంచి

తే॥ అలవిభీషణు లంకకు నధిపుఁజేసి
భూమిసుతఁగూడి సాకేతపురమునందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు
వరుస నన్నుఁబ్రోచుచుండుఁ బ్రవాసగతుల.[40]

3 శ్లో॥ రక్షత్వసౌ మాధ్వనియజ్ఞకల్పః
స్వదంష్ట్రి యోన్నీతధరో వరాహః.[41]

చం॥ అరయఁగ నెల్లలోకములు నంకిలినొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్నమైన ధర నుద్ధతికొమ్మన నెత్తినట్టి యా
కిరిపతి యజ్ఞకల్పుఁడురుఖేలుఁడు నూర్జితమేదినీమనో
హరుఁడు కృపావిధేయుఁడు సదాధ్వముల న్ననుఁగాచుఁగావుతన్.[42]

పై విధముగానే కొన్నిచోట్ల మూలశ్లోకము నాధారముచేసికొని వైపుల్యము నెక్కువగా కావించుట జరిగినది చూడుడు.

1 శ్లో॥ స్తేన స్సురాపో మిత్రధ్రుక్ బ్రహ్మహా గురుతల్పగః
స్త్రీరాజపితృహంతారో యేచ పాతకినోఽపరే
సర్వేషా మప్యఘవతా మిదమేవ సునిష్కృతం
నామవ్యాహరణం విష్ణో ర్యత స్తద్విషయా మతిః.[43]

సీ॥ బ్రహ్మహత్యానేకపాపాటవులకగ్ని
కీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మష క్రూరసర్పములకు
కేకులు హరినామకీర్తనములు
తపనీయచౌర్యసంతమసంబునకు సూర్య
కిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిష మదనాగసమితికి
కేసరుల్ హరినామకీర్తనములు

గీ॥ మహితయోగోగ్రనిత్యసమాధివిధుల
నలదు బ్రహ్మాదిసురులకు నందరాని

భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు.[44]

సీ॥ ముక్తికాంతైకాంత మోహనకృత్యముల్
కేలిమై హరినామకీర్తనములు
సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్
కేలిమై హరినామ కీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్
కేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనితతపః ఫలసారముల్
కేలిమై హరినామకీర్తనములు

గీ॥ పుణ్యమూలంబు లనపాయపోషకంబు
లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ
లార్త శుభములు హరినామకీర్తనములు.[45]

ఈపద్యములు పోతనశైలిని దలపింపజేయుచున్నవి. ధారాళమగు శయ్యాసౌష్ఠవము ఈపద్యముల కలంకారమై భాసించి విష్ణుభక్తిభావప్రచాలనములో సింగన నైపుణ్యము ప్రదర్శించుచున్నది.

1. దుర్గే ష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః
పాయా న్నృసింహోఽసురయూధపారిః
విముంచతో యస్య మహాట్టహాసం
దిశో వినేదు ర్న్యపతంశ్చ గర్భాః. [46]

అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరులనెల్ల నాకు నుతికెక్కఁగ దిక్కగుగాక శ్రీనృసిం
హుడు కనకాక్షరాక్షసవధోగ్రుడు విస్ఫురితాట్టహాస వ
క్త్రుడు ఘనదంష్ట్రి పావకవిధూత దిగంతరు డప్రమేయుడై.[47]

కనకాక్షరాక్షసవధోగ్రత వరాహవతారమునకు సంబంధించినది. అది ఇచ్చట నరసింహావతారమునకు చెప్పబడినది. మూలమునందలి అసురయూధపారి శబ్దమునకు చేయబడిన అనువాదము పొరపాటు.

2. పతితః స్ఖలితో భగ్నః సందష్ట స్తప్త ఆహతః
హరిరిత్యవశే నాహ పుమాన్ నార్హతి యాతనామ్.[48]

కూలినచోట కొట్టువడి కుందినచోట మహాజ్వరాదులన్
గ్రేలినచోట సర్పముఖపీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణుభవదూరుని బేర్కొని రేని మీద న
క్కాలుని యాతనా వితతి గానరు పూనరు దుఃఖభావముల్.[49]

ఇచ్చట విష్ణుస్మరణముచే పతనాదులచే కలుగుబాధలు పోవునని మూలమునందలి భావము. కాలుని యాతనావితతి కానరనుట ఈసందర్భమున ననవసరము. బాధలలో నున్నప్పుడాబాధలు తొలగుట మాత్రమే ప్రధానము.

3. గురూణాంచలఘూనాంచ గురూణిచ లఘూనిచ
ప్రాయశ్చిత్తాని పాపానాం జ్ఞాత్వోక్తాని మనీషిభిః.[50]

సీ॥ అతిపాపములకు ప్రయత్నపూర్వకముగ
తనుపాపములకు మితంబుగాగ
సన్మునివరులచే సంప్రోక్తమైయుండు
నిర్మలంబగు పాపనిష్కృతములు
క్రమరూపమున నుపశమనంబులగుగాని
తత్ క్షణంబున నవి దరువలేవు
సర్వకర్మంబుల సంహారమొనరించి
చిత్తంబునకు తత్వసిద్ధినొసగు.[51]...

ఇందలి ప్రయత్నపూర్వకముగ అనునది అధికముగ అనుభావమునకు బదులుగా వాడబడినది. క్రమరూపమున నుపసమించుట మొదలగునవి మూలమున చెప్పబడలేదు.

4. దేహోఽసవోఽక్షా మనవో భూతమాత్రా
నాత్మాన మన్యంచ విదుః పరంయత్
సర్వం పుమాన్ వేద గుణాంశ్చ తద్‌జ్ఞో
నవేద సర్వజ్ఞ మనంత మీడే.[52]

పూనిమనంబులున్ దనువుభూతములున్ మరియింద్రియంబులున్
ప్రాణములున్ వివేకగతి బాయక యన్యముదమ్మునెమ్మెయిన్
గానగనేర వా గుణనికాయములన్ బరికించునట్టి స
ర్వానుగతున్ సమస్తహితు నాదిపూరుషునాశ్రయించెదన్.[53]

ఇచ్చట మూలమునకుగల శ్రీధరవ్యాఖ్య చూడుడు. దేహఇతిదేహశ్చ అసవశ్చప్రాణాః అక్షాఃఅక్షాణి ఇంద్రియాణి ఆత్మానం స్వస్వరూపం దృశ్యం అన్య ఇంద్రియవర్గంతయోః పరందేవతా వర్గంచ నవిదుః పుమాన్ జీవస్తు సర్వ మేత త్త్రియం వేదగుణాంశ్చత త్తన్మూలభూతాన్‌వేద తదజ్ఞోఽపిసన్ యం సర్వజ్ఞం నవేద తమనంత మీడే స్తౌమి.

దీనిని గమనించిన గుణములను పరికించినది జీవుడుగాని పరమేశ్వరుడు గాదని స్పష్టమగును. కానీ సింగన ఏలో ఇందుకు భిన్నముగా అనువదించెను.

సామాన్యముగానీతడు శ్రీధరవ్యాఖ్యనే అనుసరించి తెనిగించుట చాలచోట్ల కాంచనగును. చూడుడు.

2. తదేతత్ షోడశకళం లింగం శక్తిత్రయం మహత్
ధత్తేనుసంసృతిం పుంసి హర్షశోకభయార్తిదామ్.[54]

శ్రీ.వ్యా-తదేత ల్లింగశరీరం శక్తిత్రయం గుణత్రయకార్యం మహత్ అనాది పుంసి జీవే అన్వయం సంసృతి ధత్తే.

వ॥......జీవుండు...షోడశకళలంగలిగి లింగశరీరంబనంబరగి గుణత్రయకార్యంబను నిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియింపుచుండు[55] పుంశబ్దమునకు జీవుడనియు శక్తిత్రయమునకు గుణత్రయకార్యమనియు ననువదించుట వ్యాఖ్యానుసారము.

2. ప్రతిగృహ్ణామి శాపంతే హ్యాత్మనోఽంజలి నాంబికే
దేవై ర్మర్త్యాయయత్ప్రోక్తం పూర్వదిష్టంహితస్యతత్.[56]

శ్రీ-వ్యా-పూర్వదిష్టం ప్రాచీనకర్మప్రాప్త మేవ......

వ॥ ఓజగన్మాత! భవచ్ఛాపవాక్యంబు లట్ల కైకొంటి ప్రాచీన కర్మంబులం బ్రాప్తంబైన.[57]......

ఇందలి పదార్థము శ్రీధరవ్యాఖ్యలోనిదే.

3. యదోపరామో మనసో నామరూప
రూపస్య దృష్ట స్మృతి సంప్రమోషాత్
యఈయతే కేవలయా స్వసంస్థయా
హంసాయ తస్మై శుచిషద్మనే నమః.[58]

శ్రీ. వ్యా. మనన ఉపరామః సమాధిః నతు సుషుప్తావివ లయః నతుజాగ్రత్ స్వప్నయోరివ విక్షేపః తదా నామరూపే రూప్యతేయేనత త్తథాతస్య ఉపరమే హేతుః దృష్టం దర్శనం స్మృతిశ్చ తయోఃసంప్రమోషాత్ నాశాత్ తదాయః కేవలేన స్వరూపజ్ఞానేన ప్రతీయతే తస్మై హంసాయ శుద్ధాయ శుచి శుద్ధం మనః సద్మప్రతీతి స్థానం యస్య తస్మై నమః

వ॥ మరియు బహువిధనామరూపనిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలనగలిగెడు నుపరామంబగు సమాధియందు కేవలజ్ఞానస్వరూపంబునదోచు నిర్మలప్రతీతి స్థానంబైన హంసస్వరూపికి నమస్కరింతును.[59]

వేదాంత సంబంధమగు నిట్టిఘట్టములలో శ్రీధరవ్యాఖ్య ననుసరించుట తరచుగా కానవచ్చుచునే యున్నది. అది భాగవతానువాదమున పోతనపెట్టిన ఒరవడి.

షష్ఠస్కంధము మొత్తముమీద అనువాదమును రమణీయముగా తీర్చిదిద్దవలెనను సింగన ప్రయత్నమడుగడుగునను గోచరించుచుండును. ఉదాహరణమునకు చిత్రకేతూపాఖ్యానములో చిత్రకేతుని పుత్రుడు మరణించినప్పుడు ఆతనితల్లి కృతద్యుతి పరమదుఃఖాకులయై విలపించినది. ఈసందర్భమున మూలముననిట్లు కలదు.

శ్లో॥ స్తనద్వయం కుంకుమపంకమండితం
నిషించతీ సాంజనబాష్పబిందుభిః
వికీర్యకేశాన్ విగళత్స్రజః సుతం
శుశోచ చిత్రం కురరీవ సుస్వరం.[60]

కరుణరసాత్మకమగు నీశ్లోకమునకు సింగన చక్కని అనువాదము చేసినాడు.

కుంకుమ రాగరమ్యకుచకుంభములన్ కడుకజ్జలంబుతో
సంకిలమైన బాష్పములబొల్పడ మజ్జనమాచరింపుచున్
కంకణపాణి పల్లవయుగంబున వక్షముమోదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చె పరిభావిత పంచమసుస్వరంబునన్.[61]

ఆంధ్రవాఙ్మయములోని సుప్రసిద్ధమగు విలాపపద్యముల సరసన దీనికిని స్థానమునీయవచ్చును. ఈవర్ణన మత్యంతసహజమై ప్రాణసమానుడగు పుత్రుని మరణముచే కలిగిన కృతద్యుతి దుఃఖమూర్తిని కన్నులకట్టినట్లు చూపుచున్నది. ఈ ఘట్టమున ఆమెదుఃఖముమహాద్భుతమగు నైదు శ్లోకములలో మూలమున ప్రకటింపబడినది. అందులో నొక్కటి.

శ్లో॥ అహో విధాత స్త్వమతీవ బాలిశో
యస్త్వాత్మసృష్ట్యప్రతిరూప మీహసే
పరేనుజీవ త్యపరస్యయామృతి
ర్విపర్యయ శ్చేత్త్వ మసి ధ్రువః పరః.[62]

ఇట్టి కరుణరసప్లావితమగు శ్లోకముల నేకవియు ననువదింపకమానడు. కానీ చిత్రముగా సింగన వీనిని వదలివేసెను. తల్లి పుత్రునికై విలపించు రసపూరిత శ్లోకములను వదలి మూలములో లేని తండ్రి విలాపవైఖరిని ఒక నీరసమగు స్రగ్విణిలో వర్ణించెను కొన్నిచోట్ల అత్యంతశ్రద్ధచూపుటయు కొన్నిచోట్ల మిక్కలి అశ్రద్ధచూపుటయు ఈకవిలోనివైలక్షణ్యము. ఒక్కొక్క తరి మూలములో అసుందరమైన దీతని రచనలో సుందరముగా నుండును. మరియొకతరి మూలములో పరమరమణీయముగా నున్న దీతనిరచనలో కడునీరసముగానుండును. ఇది అతని శక్తిహీనతనుకాక అశ్రద్ధను, అపరిణత మనఃస్థితిని సూచించుననిపించును

సామాన్యులగు ననేకకవులవలెనే శృంగారవర్ణనల కవకాశము వచ్చినచోట అమూలకముగా విజృంభించుటకీతడును వెనుదీయలేదు. అజామిళుని కథ ఇందుకు తార్కాణము. నైతికదృష్టినివదలినచో అందలి రతివర్ణన విశేషములు కొంత ఆకర్షకముగా తోపవచ్చును. నిజమునకది అధమశృంగారము. ఉత్తమపాత్ర నిష్ఠమైనది కాదు. సింగన ఈఘట్టము నత్యంత ప్రీతితో పెంపుజేసి తీర్చిదిద్దెను. అజామిళునకు వైరాగ్యము కలిగిన తరువాత కూడ అతనినోట

కం॥ చక్కని చిక్కని చన్నుల
మక్కువ యిల్లాలివిడిచి మాయలు గల యీ
వెక్కసపు మద్యపానపు
డొక్క పసందగిలి దుర్విటుడనై చెడితిన్.[63]

అని అనిపించుటలో సింగనకుగల అధికశృంగారప్రీతి వ్యక్తమగుచున్నది. మూలమున ఈశృంగారవాసన ఏమియును లేదు. అచ్చటి శ్లోకమిది.

శ్లో॥ ధిఙ్మాం విరహితం సద్భి ర్దుష్కృతం కులకజ్జలం
హిత్వాబాలాం సతీం యోఽహం సురాపామసతీమగాం[64]

ఈవిధముగా అనువాదసమయమున నీతడనుసరించిన మార్గమును పరిశీలించినచో ఒక్క విషయము స్పష్టముగా చెప్పవచ్చును. కవికి కావలసినంత ప్రతిభ ఈతనిలో కలదు. కానీ వయస్సుచే అనుభవముచే కలుగు తాత్వికసముపస్థితి ఈతని కింకనూ సరిపోలేదు-అని.

పోతనపై అపారమగుభక్తి గౌరవములు గల యీరచయిత ఒక కృత్యవతర్ణికలోనే కాక ఇతర సందర్భములలో కూడ ఆయనననుసరించుటకు చేసిన ప్రయత్నములు గోచరించుచున్నవి. చూడుడు.

కనియెన్ బ్రాహ్మణుడంత్యకాలమున వీకన్ రోమనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠవికారవక్త్రవిలసద్దంష్ట్రేక్షణోపేతులన్
జనసంత్రాసకరోద్యతాయత సుపాశశ్రేణికాహేతులన్
హననవ్యాప్తివిభీతులన్ మువురనాత్మానేతలన్ దూతలన్.[65]

ఈవిధమగు అంత్యప్రాససమన్వితపద్యములు ఈతని రచనలో ఎన్నో చూపింపవచ్చును.

కందడు భీతిగుందడు ప్రకంపితమొందడు పెద్దనిద్దురన్
జెందడు తత్తరింపడు విశేషముచెప్పడు వైష్ణవీజయా
నంద పరైకవిద్యయు మనంబునదాల్చుచు నుండె గాని సం
క్రందనుడా నిశాచరుని గర్భములో పరిరక్షితాంగుడై[66]

ఇది ప్రహ్లాదచరిత్రలోని

పారడు లేచి దిక్కులకు బాహువులొడ్డడు బంధురాజిలో
దూరడు ఘోరకృత్యమనిదూరడు[67]......

అనుపద్యమును పోలియున్నది.

ఈరచయిత పోతన భాగవతమును రచించుచుండగా బహూపర్యాయము లందలి భిన్నఘట్టములను విని పఠించి ఆనందించి యుండును. అందుచేతనే ఆయన రచనకను కరణములు షష్ఠస్కంధములో కనిపించుచున్నవని తోచును.

మొత్తముమీద పోతనవలెనే స్వకపోలకల్పనలతో గ్రంథమును పెంపొందించ వలెనని ఈతడు ప్రయత్నించినట్లు కానిపించుచున్నది చూడుడు.

ఆలీలావతి గండపాళికలపై హాసప్రసాదంబుపై
నాలోలాలక పంక్తిపై నొసలిపై నాకర్ణదృగ్భాతిపై
హేలాపాదికుచద్వయోరుకటిపై నిచ్చల్ పిసాళింపగా
జాలింబొందుచు నాత్మగుందుచు మనోజాతానలోపేతుడై[68]

అజామిళుని కామోద్రేకమును వర్ణించు నీపద్యము చక్కని ధారాళమగు శైలితో నలరుచున్నది. ఆదిన్ శ్రీసతికొప్పుపై.[69].... అనుపద్యగమనమునిది తల పింపజేయుచున్నది

కురులళికంబుపై నెగయ క్రొమ్ముడివీడగ గుబ్బదోయిపై
సరములు చౌకళింప కటిసంగతిమేఖల తాళగింప స
త్కారవరకంకణావళులు గల్లిల గౌనసియాడ మీదుగా
మరుని వినోదముల్ సలిపె మానిని యౌవన గర్వరేఖతోన్.[70]

ఇందు పురుషాయితరతి వర్ణన మత్యంతస్వభావసుందరముగా ప్రకాశించు చున్నది.

దారుణపాశబంధనవిధానములన్ నరకార్ణవంబులో
గూరినవాని నన్ను జెడకుండ నొనర్చిన పుణ్యవంతులం
భోరుహనేత్రు లుజ్జ్వలనభోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయాసమంచిత విచారులు నల్వురు నెందుబోయిరో[71]

తనను రక్షించిన విష్ణుదూతలకొఱకై అజామిళుడు వ్యగ్రుడగుట ఇందు రమణీయముగా వర్ణితమైనది.

ఇట్టి అమూలకములగు పద్యములనెన్నో వివిధఘట్టములలో సింగన కల్పించి రచించినాడు.[72] శృంగారరస ప్రధానమగు అజామిళోపాఖ్యానముననే కాక వీరరస ప్రధానమగు వృత్రవధను కూడ ఈతడు మిక్కిలి ప్రతిభతో తీర్చిదిద్దినాడు. మొత్తముమీద ఈతడు ప్రజ్ఞావంతుడగు యువకుడు. మహోదాత్తమగు భాగవత రచనకు కావలసిన అధ్యాత్మికసమున్నతియు, మానసిక పరిణతియు అప్పటికతనికి రాలేదనుటయే ఆతనిలో లోటు.

భాగవతమున షష్ఠస్కంధము మిక్కిలి ప్రధానమైనది. భాగవత లక్షణములలో నొకటిగా ప్రశంసింపబడిన వృత్రవధ ఈ స్కంధములోనిదే. పోతనమీదగల భక్తిగౌరవములు సింగనమీద లేకుండుటయు సింగనను మించి రచించగలమను విశ్వాసముండుటయు, అజామిళోపాఖ్యానసందర్భమున శృంగార రసమును, వృత్రవధలో వీరరసమును, కృతద్యుతివిలాపాదులయందు కరుణరసమును వెల్లివిరియింపజేయు అవకాశముండుటయు మానవజీవితములో రాజ్యముచేయు రసత్రయమును ఒక్కగ్రంథమున అనుభవింపజేయు వీలు లభించుటయు ఇత్యాద్యనేక కారణము లితరకవుల నీషష్ఠస్కంధమును తెనిగింప ప్రేరేపించినవి.



# భాగవతానువాదవైఖరి – నారయ

భాగవతములో చివరివగు ఏకాదశ, ద్వాదశ స్కంధములు రెండింటిని వెలిగందల నారయ రచించినట్లు స్కంధాంత గద్యలచే తెలియుచున్నది. పోతన వలెనే యితడు తానురచించిన రెండుస్కంధములను రామాంకిత మొనర్చినాడు. రెండు స్కంధముల ఆదిపద్యములను తాను స్వయముగా రచించినను స్కంధాంత పద్యములను మాత్రము పోతనవే గ్రహించినాడు. (1-11, 9-12 స్కంధాంత పద్యములొక్కటే) ఇది పోతనయందలి భక్తిచేతనే యై యుండును. అంతేకాక స్కంధాంతగద్యలలో పోతనామాత్య ప్రియశిష్య అను విశేషణము తననుగురించి వేసికొనుటయు గమనింపవలసిన అంశము.

ఈ చివరి రెండు స్కంధములేకాక మిగిలిన స్కంధములలోకూడ అక్కడక్కడ ఈతని రచన కలదను కొందరు పండితుల అభిప్రాయములు పొరపాటని ఇంతకుముందే నిరూపింపబడినది. ఇక ఈరెండుస్కంధములకును భాగవతరచయితగా ఈతని అర్హతను పరిశీలించినచో పోతన ప్రియశిష్యుడనుట తప్ప ఈతని కెట్టి అర్హతయు లేదనిన అది కఠినోక్తిగా నుండునేమోకాని అసత్యోక్తిమాత్రము కానేరదు. కారణమేమైనను సుప్రసిద్ధ వేదాంతతత్వప్రాతిపదికమగు అనేకఘట్టములతో పండితజనారాధ్యమగు ఈ రెండుస్కంధములను అతడు విపరీతముగా క్లుప్తీకరించెను; సంస్కృతమున 11వ స్కంధమున 31 అధ్యాయములును 1373 శ్లోకములును కలవు; దీనిని నారయ 125 గద్యపద్యములుగా అనువదించెను. ద్వాదశస్కంధములో సంస్కృతమున 13 అధ్యాయములును, 566 శ్లోకములు కలవు. దీనిని నారయ 53 గద్యపద్యములుగా ననువదించెను. ఈరెంటిలోని వచనములు కొన్ని మిక్కిలి సుదీర్ఘములై ఇంచుమించు డెబ్బదిపంక్తులవరకు విస్తరించియున్నవి. భాగవతమున వేదాంతఘట్టములు వచ్చినపుడును ఇతరములగు అరణ్యాదివర్ణన సందర్భములందును పోతన సుదీర్ఘవచనములు వాడియున్నాడు. నారయయు తన గురువుగారి మార్గమునే ఈవిషయమున ననుకరించినట్లు తోచును. ఏకాదశస్కంధము మొత్తము 800 పంక్తులలోను 140 పంక్తులు మాత్రమే పద్యములన్నియు మిగిలినదంతయు వచనములనియు ద్వాదశస్కంధమున మొత్తము 560 పంక్తులలోను 80 పంక్తులు మాత్రమే పద్యములనియు, తక్కినదంతయు వచనములనియు చాగంటి శేషయ్యగారు గణనము చేసియున్నారు.[2] ఈలెక్కలు చూచిన నారయ పద్యరచన అత్యల్పమని తేలును.

కాని ఇట్లుండ నారయ కించుమించు సమకాలికుడును మంచిసమర్థుడును, విద్వాంసుడునునగు హరిభట్టు తానును ఏకాదశ ద్వాదశస్కంధముల నాంధ్రీకరింపగా ఆతని పద్యములెన్నో లేఖకుల ప్రమాదముచే నారయ రచనలో ప్రవేశించినవి. రాజమహేంద్రవర గౌతమీగ్రంథాలయములోనున్న హరిభట్టు రచనాప్రతితో పోల్చి చూచి నారయ భాగములో ప్రవేశించిన ఆయన పద్యములు కొన్నింటిని చాగంటి శేషయ్యగారు చూపియున్నారు.[4] అట్టివాని నన్నింటిని తొలగించినచో సారవంత మగు పద్యములు చాలవరకు పోయినట్లే అగును.

ఈతని అనువాదవైఖరిని పరిశీలించిన పండితులందరును ఈతని అసమర్థతను స్పష్టముగా ప్రకటించియున్నారు. ఈ 11, 12 స్కంధముల తెనిగింపు మొత్తమునకు మూలమునకుసరిగానుండదనియు, తత్త్వఘట్టములందుగాని కథాంశములందుగాని ఇది మూలముకంటె పెక్కుచోట్ల న్యూనముగాను, కొన్నియెడల మిగుల విరుద్ధముగాను నుండుననియు తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు వ్రాసినారు.[5] నారయ అంతిలాక్షణికుడు, ప్రౌఢకవికాడనియు, అతని కవితాధార పదపూరణములతోడను రచనా వ్యత్యస్తములతోడను వ్యాకరణ దోషములతోడను నిండియుండుననియు శేషాద్రి రమణకవులు ప్రకటించియున్నారు.[6] నారయ ఏకాదశ ద్వాదశస్కంధ రచనము మూలమునకంటె చాలచోట్ల న్యూనముగను, కొన్నిచోట్ల మూలాభిప్రాయములకు విరుద్ధముగాను నున్నదని నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసినారు[7] నారయ పోతన శిష్యుడనని చెప్పుకొన్నను అతనివలెగాక మూలమును చాల సంగ్రహించియు కొన్నిచోట్ల అధ్యాయములను విడిచివైచియు రచన సాగించెననియు అందు మూల భిన్నములైన పట్టులును పెక్కు కానవచ్చుననియు, అయ్యును పెక్కు తాళపత్ర ప్రతులలో పోతన రచన తరువాత ఈతని రచనయే చేర్చబడియుండుట కితడతని శిష్యుడగుటయే కారణమై యుండుననియు అకాడమీపీఠికాకారులు వ్రాసియున్నారు.[8]

అనువాదము ప్రారంభించిన ప్రథమోత్సాహములో మూలమును పెంపొందించు వాంఛతోనే నారయ ఉన్నట్లు తోచును. ఏకాదశస్కంధమున మొదటి శ్లోకమిది.

> కృత్వా దైత్యవధం కృష్ణః సరామో యదుభిర్వృతః
> భువోఽవతారయద్భారం జవిష్ఠం జనయన్ కలిం.[9]

దీనిని నారయ ఇట్లాంధ్రీకరించెను.

బలవత్సైన్యముతోడ కృష్ణుడు మహాబాహాబలోపేతుడై
కలనన్ రాక్షసవీరవర్యుల వడిన్ ఖండించి భూభారము
జ్జ్వలమైయుండగ నక్షకేళికతనన్ గౌరవ్యుతోడ్తోన త
ద్బలముల్ పాండవసైన్యమున్నడచె భూభాగంబు కంపింపగన్.[13]

ఇందులో చివరిరెండుపాదములును అమూలకములు. దానితరువాత 'అంత' అనువచనమును

కం॥ మునివరులు సంతసిల్లిరి
యనయము నందాదులకును హర్షంబయ్యెన్
దననిజభక్తులు యాదవ
ఘనవీరసమూహమపుడు కడునొప్పెసగెన్.[11]

తరువాత మూలములో శ్లోకములివి.

శ్లో॥ యే కోపితా స్సుబహుపాండుసుతా స్సపత్నైః
దుర్ద్యూత హేళన కచగ్రహణాదిభి స్తాన్
కృత్వా నిమిత్త మితరేతరత స్సమేతాన్
హత్వా నృపా న్నిరహరత్ క్షితిభార మీశః

శ్లో॥ భూభారరాజపృతనా యదుభి ర్నిరస్య
గుప్తైః స్వబాహుభి రచింతయ దప్రమేయః
మన్యేఽవనే ర్ననుగతోఽప్యగతోహి భారో
యద్యాదవం కులమహో అవిషహ్య మాస్తే[12]

ఇవి ఒక పద్యముగా సంగ్రహింపబడినవి. చూడుడు.

విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారమున్ మాన్పి దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదిముట్టన్ వధియించి కృష్ణుడతిసంతుష్టాత్ముడై యున్నచో
యదుసైన్యంబులు భూమిమోవగనసహ్యంబయ్యె వత్యుగ్రమై[13]

ఆతరువాత పద్యమిది.

సీ॥ ఈరీతి కృష్ణుండు నేపారపూతనా
శకటతృణావర్త సాల్వవత్స
చాణూరముష్టిక ధేనుప్రలంబక
దైత్యౌఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి
యటమీఁదఁ గురుబలంబణఁచి మరియు
ధర్మజునభిషిక్తు దనరగా జేసిన
నతఁడు భూపాలనంబమర జేసె

తే॥ భక్తులగు యాదవేంద్రుల బరగ జూచి
అన్యపరిభవమెరుగరీ యదవులనుచు
వీరిబరిమార్పనే దక్క వేరొకండు
దైవమిక లేదు త్రిభువనాంతరమునందు.[18]

ఇందలి సీసపాదములు నాలుగును అమూలకములు. ఎత్తుగీతికిమాత్రము ఈ క్రిందిశ్లోకము యొక్క భాగము మూలము.

శ్లో॥ నైవాన్యతః పరిభవోఽస్య భవేత్కథంచిత్
మత్సంశ్రయస్య విభవోన్నహనస్య నిత్యం
అంతఃకలిం యదుకులస్య విధాయ వేణు
స్తంబస్య వహ్నిమివ శాంతముపైమి ధామ.[15]

ఈశ్లోకము చివరిరెండుపాదములును "అత్యున్నత వేణుకాననంబు వాయువశంబున నొరసికొన ననలంబుద్భవంబై దహించుచందంబున యదుబలంబుల కన్యోన్యవైరానుబంధంబులు గల్పించి హతంబొనర్చెద.[16] ననిరచింపబడినది. మూలమున ఉపమానములోగల సూటిదనము తెనుగున రాలేదు. ఇల్లే నారయ అనువాదవైఖరికి మరియొక ఉదాహరణము చూడుడు.

శ్లో॥ బ్రహ్మణ్యానాం వదాన్యానాం నిత్యం వృద్ధోపసేవినాం
విప్రశాపః కథమభూత్ వృష్ణీనాం కృష్ణచేతసాం.[17]

కం॥ హరిపాదకమలసేవా
పరులగు యాదవుల కెట్లు బ్రాహ్మణశాప
స్ఫురణంబు సంభవించెనో
అరయఁగ సంయమివరేణ్య! ఆనతియీవే.[18]

మూలములోని బ్రాహ్మణ్య, వదాన్య, నిత్యవృద్ధోపసేవి విశేషణములను వదలి కేవలము 'కృష్ణచేతసాం' అనుపదమునకు 'హరిపాదకమలసేవాపరులగు' అని మాత్రమే ఈతడనువదించెను. అఘట్టమున నిరుపమసుందరంబైన[19] ఇత్యాది వచనము నుండి 'అని అనేకవిధంబుల ప్రస్తుతించిన'[20] అనువచనమువరకు మధ్యలో గల 6పద్యములును అమూలకములు. ఈహరిభక్తి వర్ణనాత్మక పద్యములు నారయ ప్రారంభోత్సాహమును సూచించుచున్నవి. ఈఉత్సాహమెక్కువదూరము నిలువలేదు. అమూలకములుగా వర్ణనాదులు పెంచుట అటుంచి చాలవరకు మూలమున వదలుట జరిగినది.

మూలమున ఏకాదశ స్కంధమునందలి షష్ఠాధ్యాయమున కృష్ణస్తుతి ఇరువది శ్లోకములున్నవి. నారయ వానిని ఇంచుమించు పూర్తిగావదలి

కం॥ కని పరమేశుని యాదవ
వనశోభిత పారిజాతు వనరుహనేత్రున్
జనకామిత ఫలదాయకు
వినుతించిరి దివిజులపుడు వేదోక్తులతోన్.[21]

అని ఒకపద్యము మాత్రము వ్రాసెను.

శ్లో॥ యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం ప్రభో.[22] ....

శ్లో॥ తతస్స్వధామ పరమం విశస్వ యది మన్యసే.[23] ....

అను బ్రహ్మస్తుత్యాత్మకభాగములు మాత్రము

తే॥ అఖిలలోకేశ సర్వేశ అభవనీవు
నుదయమందుట భూభారముడుపుకొఱకు

పంచవింశోత్తరశతాబ్ద పరిమితంబు
నయ్యె విచ్ఛేయు వైకుంఠ వార్మ్యమునకు.[24]

అనుపద్యముగా ననువదింపబడినది. కృష్ణుడు యదువృద్ధులతో చెప్పినమాటలు మూలమున నైదుశ్లోకములు కలవు.[25] నారయ వానిని సంగ్రహించి

తే॥ కానను త్పాతములు చాలకానబడియె
నరయనిందుండ వలవదు యదువులార
తడయకిపుడు ప్రభాసతీర్థమునకరుగు
డనుచు శ్రీకృష్ణుడెంతయు నానతిచ్చె.[26]

అను పద్యమునను వ్రాసెను. ఇది ఒకసీసమునకెత్తు గీతి. సీసమునాల్గు పాదములలోని దుర్నిమిత్తముల వర్ణన నారయ కల్పనము.

ఉద్ధవకృతకృష్ణస్తుతి మూలమున తొమ్మిదిశ్లోకములు.[27] నారయవీనిని

కం॥ జ్ఞానమున నుద్ధవుడు దన
మానసమున నెరిగి శ్రీరమాధిప! హరి! యో
దీనజనకల్ప భూజమ!
శ్రీనాయక! దిక్కునీవె శ్రితభయహరణా.[28]

అను చిన్న కందపద్యమున సరిపెట్టెను.

7,8,9 అధ్యాయములందలి అవధూతయందుసంవాదమును తదంతర్గతములైన కపోతపింగళాదుల ఇతిహాసములను ఈతడు చాలసంగ్రహించెను. కృష్ణబోధాత్మకములగు ననేకాధ్యాయములు త్యక్తములైనవి. 10,11,14,15 అధ్యాయములు అల్పముగా స్పృశింపబడినవి. 20,21,22,23,24,25 అధ్యాయములు వదలబడినవి. మిగిలినవి సంగ్రహింపబడినవి 30,31 అధ్యాయములందు యాదవప్రళయము, కృష్ణబలరాముల వైకుంఠగమనము, చాలసంక్షేపింపబడినవి. నారాయణ విగ్రహంబు జలధిప్రాంతంబున జగన్నాథస్వరూపంబై యుండెనని[29] అమూలకమగు విశేషమొకటి కలుపబడినది. దీనికి జగన్నాథ క్షేత్రమహాత్మ్య విజ్ఞానము నారయకుండుట హేతువై యుండును. 31వఅధ్యాయమున యాదవుల అపరకర్మలును వజ్రపట్టాభిషేకమును తెనిగింపబడలేదు. 17,18 అధ్యాయములలో 105శ్లోకములలో చెప్పిన ధర్మాది విశేషములను ఒక చిన్న కందములోను[30] వచనములోను[31] తేల్చివేయుట జరిగినది.

13వఅధ్యాయమున హంసరూపియైవిష్ణుడుచేసిన తత్త్వోపదేశము 17శ్లోకములును తెనుగున ఐదారుపంక్తులైనవి.[32] ఈసందర్భమున తేవప్పెరుమాళ్ళయ్యగారి ఒక వాక్యము గమనింపదగినది.[33]

"14 వ అధ్యాయములో చెప్పబడిన భక్తిపారమ్య జ్ఞానయోగములను పదిపంక్తులలో అరకొరగా తెనిగించి 16 వ అధ్యాయములోని విభూతులను చెప్పి అవ్వలి మూడధ్యాయముల విషయములను మూడుపంక్తులతో సూచించి 12 వ అధ్యాయమునకు మరలి అందుగల తస్మాత్త్వ.... ....ఇత్యాది శ్లోకములకు సర్వ ధర్మాన్.... ....మొదలగు నాలుగుపంక్తులు చెప్పి పిదప 19 వ అధ్యాయములోని శిష్టాంశమును కొంతయు 24వ అధ్యాయములోని సాంఖ్యవిద్యయు 27 వ అధ్యాయము లోని అర్చనాప్రకారము కొంతయు తెనిగించి 29వ అధ్యాయములోని 'గచ్ఛోద్ధవమ యాదిష్టోబదర్యాఖ్యంమమాశ్రమం' ఇత్యాదులను, అవ్వలి రెండధ్యాయములగల యాదవక్షయబలరామ నిర్యాణములను తెనిగించి యున్నాడు,"

12వ స్కంధముకూడ ఈవిధముగానే సంక్షేపింపబడినది. భాగవత సారాంశ మును చెప్పు 12 వ అధ్యాయము పూర్తిగా వదలివేయబడినది. మిగిలినవియు స్పృశింపబడుటయే జరిగినది.

ఇక ఈ రెండు స్కంధములలో అనేక సందర్భములందు పూర్వాపర సమన్వయము కుదురుటలేదు.

1. వసుదేవునకు నారదుడు విదేహఋషభసంవాదమను పురాతన పుణ్యకథను దెల్పు సందర్భమున పరీక్షిత్తు శుకుని "చిత్తంబేక్రియనిలుచున్,"[34] ఇత్యాదిగా ప్రశ్నించెను. దానికి శుకయోగి "వినుమున్నృపాలక : చెప్పెద ఘనమై విలసిల్లు పూర్వకథకలదు."[35] అని వసుదేవనారద సంభాషణము నెత్తుకొనెను. అడిగిన ప్రశ్నకును చెప్పిన సమాధానమునకును సంబంధములేదు. ఆ ప్రశ్నాత్మకమగు కందపద్యమమూలకము.

2. ఋషభకుమారులగు హరియు నంతరిక్షుడును చేసెడు భాగవతస్వరూపోప దేశ సందర్భమున విదేహభూపాలుండు భాగవతధర్మంబెద్ది ? ఏప్రకారంబునం బ్రవర్తించు ? అట్టి భాగవత చిహ్నంబులెవ్వి ?[36] అని ప్రశ్నించెను. వాని అన్నిం టికిని సరియగు ప్రత్యుత్తరములు లేవు.

3. ఉ॥ పంకజనాభు డుద్ధవునిపైగల కూర్మిని జెప్పెనొప్పనెం
దంకిలిలేక యన్నిదిశలందు జరింపుచు నిత్యతృప్తుడై
శంకరవేషధారి యొకసంయమి యాయదురాజు జేర నే
వంకనునుండివచ్చి తనవానికి నిట్లనె సద్గిసేర్పడన్.[37]

కం॥ అవధూత పల్కెనంతట
ప్రవిమలవిజ్ఞాననిపుణభవ్యులు గురువుల్
తవిలిననిరువదినలువురు
నవనిన్ విజ్ఞానినైతినని వల్కుటయున్.[38]

వ॥ అంత యదుప్రవరుండిట్లనియె. దేహి లోభమోహాదుల వర్జించిజనార్దనుని నేవిధంబున జేరవచ్చు? నెరిగింపుము. అనిన నతం డిట్లనియె.[39] ఈమూడును అవధూతయదుసంవాదములో మొదటివి. వీవిలో ప్రశ్నోత్తరముల పొందికగాని అన్వయ సౌలభ్యముగాని లేదు. మూలమున సప్తమాధ్యాయమున నిదివిపులముగా గలదు. ఈప్రాంత మందలి అనువాదమంతయు విపరీతమైన తొందరపాటునకు లోనైనది.

ఇట్టి అనువాదములతో, అనన్వయములతో, ఈరెండుస్కంధములు నతిక్లిష్టీ కరణము నొందినవి అక్కడక్కడ నామమాత్రముగా పెంపుజేయుటయు, ఒకటి రెండ మూలకముగా పద్యములు రచించుటయు లేకపోలేదు. చూడుడు.

1. అథ తస్యాం మహోత్పాతాన్ ద్వారకాయాంసముత్థితాన్
విలోక్య భగవానాహ యదువృద్ధాన్ సమాగతాన్.[40]

ఇచట నున్న మహోత్పాతను లనుదానికి తెనుగున విపులీకరణము చేయ బడినది

సీ॥ కాకఘూకంబులు కనకసౌధములలో
పగలు వాపోయెడి బహువిధముల
నశ్వవాలంబుల ననలముద్భవమయ్యె
నన్నంబు మొలిచె మహాద్భుతముగ

శుకశారికలు రాత్రిసాగసె విస్వరమున
జంతువు వేరొక్క జంతుగనియె
నొగిపౌరగృహముల నుల్కలు నుదయించె
బెరసె కావిరి రవిబింబమపుడు.[41]

వ. ......అవ్వనంబు సాలరసాలబిల్వకదళీఖర్జూర జంబూ జంబీర చందన పున్నాగమందారాది వివిధవృక్షనిబిడంబును, పుష్పఫల భరితశాఖావనమ్రతరులతా బృందంబును, మాధవీ కుంజమంజరీ పుంజమకరందపానమత్తమధుకరనికర ఝుంకారరవముఖరితహరి దంతరంబును.[42]

.... ఇత్యాది వచనము నారాయణాశ్రమవర్ణనమును సముచితముగా భావింప జేయుచున్నది. ఇది పోతనార్యుని వనవర్ణనరచనముతో పోల్చుటకు తగియున్నది.

వ. మదనుని బాణజాలమున మగ్నతబొందక ధైర్యవంతుడై
ముదితల వాడిచూపులకు మోహము నొందక నిశ్చలాత్ముడై
హృదయమునందు నచ్యుతు రమేశు ననంతు జగన్నివాసునిన్
వదలక భక్తినిల్పుకొని వారికి నిట్లనె మాని పెంపునన్.[43]

నారాయణ మహర్షిని వర్ణించు నీపద్యము నారయ కల్పనకొక ఉదాహరణము

4. నవవికచ సరసిరుహ! నయనయుగ నిజచరణ
గగనచరనది నిఖిల నిగమ వినుత
జలధిసుత కుచకలశ లలిత మృగమద రుచిర
పరిమళిత నిజహృదయ! ధరణిభరణ!
ద్రుహిణముఖ సురనికర విహితనుతి కలితగుణ
కటిఘటిత రుచిరతర కనకవసన!
భుజగరిపు వరగమన! రజతగిరిపతి వినుత
సతతకృతజ పనియమ సరణిచరిత!

తే॥ తిమి! కమఠ! కిటి! నృహరి ముదితబలినిహి
తపద! పరశుధర! దశవదనవిదళన!

మురమథన కలికలుషసుముదపహారణ
కరివరద! ముని నరసుర! గరుడ వినుత![44]

ఈసర్వలఘుసీసము నాల్గుపాదములు సమూలకము. ఎత్తుగీతి దశావతార నామములను సంబోధనాత్మకముగా చెప్పుచున్నది. మూలములో దశావతారకథనము విడివిడిగా ఒక్కొక్క శ్లోకములోనో శ్లోకార్థములోనో కలదు.[45] అదంతయు వదల బడి కేవలము స్తుతిరూపమగు ఈ పద్య మొక్కటి వ్రాయబడినది.

ఇత్యాది గద్యపద్యములటనట అమూలకముగా గోచరించుచున్నను వాని సంఖ్య అల్పము. సంగ్రహీకరణమే ప్రధానముగా నీరెండు స్కంధములలో అడుగడుగున కానిపించుపద్ధతి.

ఇక ప్రధానముగా చర్చింపవలసిన విషయమొక్కటి కలదు. అది నారయ అనువాదములోని మతసిద్ధాంతమునకు సంబంధించినది. భాగవత పీఠికాకారులలో నొకరగు తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు ఏకాదశ ద్వాదశ స్కంధములలో నారయతెనిగింపు పోతనగారి అనువాదమువలె అద్వైతపరముగాక విశిష్టా ద్వైత పరమని సోదాహరణముగా వ్రాసిరి.[46] గతానుగతికముగా విమర్శకలోకమంతయు నటులే భావించెను, సుప్రఖ్యాత పండితులగు తేవప్పెరుమాళ్ళయ్యగారి యందలి ప్రమాణబుద్ధిచేతను, వారుచూపిన ఉపపత్తులు స్థూలదృష్టికి సముచితముగా కన్పించుట చేతను, భాగవత విషయశోధకులగు పండితులందరును ఈ విషయము నంగీకరించి ప్రచారముచేసిరి. ఆయాపండితులు తాము స్వయముగా నీవిషయము పరిశీలించి యున్నచో ఆయభిప్రాయమును తప్పక మార్చుకొనెడివారని నా విశ్వాసము.

భాగవతము ననువదించు సందర్భమున పోతన అద్వైతపరమగు మార్గమునే అనుసరించెననుట సువిదితాంశము. ఆయన యందు భక్తికలిగిన గంగన సింగన లిరువురును అద్వైతపరముగానే తమభాగములను తెనిగించినారు. అట్టిచో పోతనా మాత్య ప్రియశిష్యుడనని చెప్పుకొన్న నారయ గురుమార్గముననుసరించి అద్వైత పద్ధతినిగాక విశిష్టాద్వైతపద్ధతి ననుసరించి తద్భిన్నముగా తెనిగించుట ఎట్లు జరుగు ననుప్రశ్న ఉదయింపక తప్పదు సునిశితపరిశీలనచే తేలు సత్యమిది. భాగవత మంతయును ఒకేప్రణాళిక. గంగన సింగనల వలెనే నారయకూడ అద్వైతపద్ధతినే అనుసరించెను. అతడు ప్రత్యేకముగా విశిష్టాద్వైతపద్ధతి ననుసరించిన దేమియులేదు.

మరి తేవప్పెరుమాళ్ళయ్యగారును, మరికొందరు పండితులును[47] ఈవిధముగా భావించుటకేమి కారణమై యుండును ? అన్నచో వీరికంటికికన్పించిన కొన్నివాక్యము లట్టి భ్రాంతిని కలిగించినవి. ఆ వాక్యములు చదివినచో నెవరికైన నట్టి తలపు వచ్చుట ఆశ్చర్యముకాదు. వానిని జాగరూకతతో పరిశీలించిన సత్యము గమనింప గలము.

1. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ'అను నుపనిషత్తుల్యంబగు గీతావచనప్రకారంబున నెవ్వఁడేనియు నాయందుల మతిదగిలి వర్తించు వాడు నేననిపలుకంబడు.[48] ....

ఈ శ్లోకమునకు విశిష్టాద్వైతులవలె కవిమిక్కిలి ప్రాధాన్యము చూపించి యున్నాడని తేవప్పెరుమాళయ్యగారి అభిప్రాయము.[49] ఇక్కడ ప్రధానముగా గుర్తింపవలసినవిషయమిది అమూలకమను మాట మూలములోని ఒక శ్లోకమును విశిష్టాద్వైతపరముగా ననువదించిన అప్పుడు దానిని విశిష్టాద్వైతపరానువాధమని అనవలసియుండును ఇది అనువాదమేకాదాయెను. అయినచో నొకవేళ విశిష్టాద్వైత పరమగు స్వతంత్ర వాక్యము కావచ్చును. కాని ఇక్కడ నట్టిదియు లేదు. పై శ్లోక భాగము భగవద్గీతలోనిది. గీతకు త్రిమతవ్యాఖ్యలును గలవనుట సుప్రసిద్ధము. అందలి ఒక శ్లోకమునకు ప్రాధాన్య మిచ్చినంత మాత్రమున నది విశిష్టాద్వైతపర మనుట అంగీకార్యముకాదు. అంతేకాదు. ఆ వాక్యము చివర "ఎవ్వఁడేనియు నాయందుల మతిదగిలి వర్తించువాడు నేనని పలుకంబడు"-అని కలదు. దీనికి మూలము కలదు. చూడుడు-

శ్లో॥ ఏతత్తేఽభిహితం సాధో భవాన్ పృచ్ఛతి యచ్చ మాం
యథా స్వధర్మసంయుక్తో భక్తోమాం సమియాత్ పరం.[50]

'మాంసమియాత్' అని మూలముననుండ నేననివలుకబడును అని తెనుగున ననువదింపబడినది. నిజము చెప్పిన నారయ రచించిన వాక్యమే ఎక్కువ అద్వైతపరముగా నున్నది.

2. మహాత్మా ! నారాయణకథాప్రపంచంబును, తద్గుణంబులుమ ఆచారవిధియు, జీవాత్మభేదంబును, హరిపూజా విధానంబును, జ్ఞానయోగ ప్రకారంబును, మొదలైనవి ఎరింగింభి జ్ఞానవంతుంగా జేసి మన్నించితివి.[51]

ఇట జీవాత్మభేదము ప్రతిపాదితమైనదని తేవప్పెరుమాళ్ళయ్యాగారి అభిప్రాయము.[52] అంతకు ముందెరిగించిన విషయములను గూర్చి ఒసగబడిన యీ పట్టికలో జీవాత్మభేదమను సమాసము చేర్చబడినది, ఇదిమూలములో లేదు. ఏ అధ్యాయములోను ఇది ప్రతిపాదింపబడలేదు. ఆ పదము నొక్కసారి ప్రయోగించినంతమాత్రమున దానిని ప్రతిపాదించి యున్నాడనుట సత్యముకాదు. గ్రంథములో నెక్కడను దాని ప్రస్తావనయే లేక మొదటనో చివరనో ఎక్కడనో ఇచ్చిన ఒక చిన్న పట్టికలో అప్రతిపాదితమును, అమూలకమును నయిన ఒక పదము చేర్చబడినంత మాత్రమున ఆసిద్ధాంతమును సంభావితమైనట్లుగా భావించుట తగదు, ఆ పదమును నారయయే రచించెనో తరువాత లేఖకు లెవరైన చేర్చిరో, ఏదైననేమి గాని దాని కన్వయము లేదు.

3. "హరిపరాయణుండగు భాగవతుండు దేవతాంతర, మంత్రాంతర, సాధనాంతరంబులు వర్జించి దుర్జనులం గూడక నిరంతరంబు నారాయణగోవిందాది నామస్మరణంబు సేయుచుండెనేని అట్టి పుణ్యపురుషుండు వైకుంఠంబున వసియించు"[53] ఇది వీరవైష్ణవత్వ సూచకమనియు, ఈ వాక్యము వ్రాతప్రతులయందును, అచ్చుప్రతులందును కాన్పించుచున్నదనియు, ఇది నిస్సందేహముగా విశిష్టాద్వైతపరమనియు తేవప్పెరుమాళ్ళయ్యాగారు వ్రాసియున్నారు.[54] ఈవాక్యమునకు మూలము సంస్కృతములోలేదు. ఉన్నను లేకున్నను ఇందద్వైత విరోధమేమియులేదు భక్తిసిద్ధాంతమును ప్రతిపాదించినంత మాత్రమున అది అద్వైత విరుద్ధమనుకొనుట పొరపాటు. భక్తి జ్ఞానమున కంగమని శంకరాచార్యులు తెలిపియే ఉన్నారు. భక్తి మార్గముననక దేవతనారాధించు వ్యక్తి మధ్యలో నటు నిటు సంచలింపక ఆదేవతనే నమ్మకొన్నచో అభక్తి మోక్షమునకు దారితీయును. అనగా శివభక్తుడు శివుని, విష్ణుభక్తుడు విష్ణుని విడువక సేవింపవలెననుట సిద్ధాంతము. విష్ణుభక్తుడగువాడు మధ్యలో కొంతసేపు విష్ణువును వదలి మరొక దేవతను చేపట్టుటయో, అటులే శివభక్తుడగువాడు శివుని వదలి అన్యదేవతను చేపట్టుటయో భక్తిమార్గమునకు విరుద్ధము. జ్ఞానికి మాత్రము శివుడైనను, విష్ణువైనను మరెవ్వరైనను నొక్కటియే. నారయవ్రాసిన వాక్యములో హరిపరాయణుడగు భక్తుడు దేవతాంతర, మంత్రాంతర, సాధనాంతరముల వర్జింపవలెనని కదా కలదు. అనగా ఏకాగ్రముగా ఆవిష్ణుభక్తుడు విష్ణువునే ధ్యానింపవలెనని అర్థము. అట్లు ధ్యానించిన కల్గు ఫలమేమి ? అట్టి పుణ్యపురుషుండు వైకుంఠంబున వసించునని సమా

ధానము. ఇతర దేవతామంత్ర, సాధనములను వర్ణించినవిష్ణుభక్తుడు వైకుంఠము నకు పోవుననుటలో నాశ్చర్యమేమున్నది? అట్లే ఏదేవతల నారాధించుభక్తుడై నను ఏకదీక్షతో అన్యదృష్టివదలి ఆరాధించిన ఆదేవతా లోకమునకు పోవును. ఇందేదియు నద్వైతవిరుద్ధముకాదు. సగుణస్థితిలో నిట్టివన్నియు సాధ్యములేయని అద్వైత మంగీకరించును.

ఈవిధముగా ఏకాదశ, ద్వాదశస్కంధములలో తేవప్పెరుమాళ్ళయ్యగారు విశిష్టాద్వైతపరములని చూపిన వాక్యములు సరియైనవికావని చెప్పకతప్పదు అది యునుగాక వారు 11, 12 స్కంధములలో అద్వైతపరమగు వాక్యములెక్కువ లేవనియు ఒకవేళనున్నను అవి అచ్చుప్రతులలో లేవనియు ప్రతిపాదించి మూడు వాక్యములుదాహరించిరి.

ప్రత్యగాత్మయందు నానాప్రకారంబులందోచు నీదృశ ప్రపంచంబంతయు మిథ్యయని తెలియుము.[55]

2. ఇట్లాత్మ స్వరూపునిగా హరిని నిరంతరంబు భావించుచుండుట విశేషంబు.[56]

3. నిర్గుణ బ్రహ్మైక్యాను సంధానంబుచేసి శుద్ధచైతన్య స్వరూపుండై ఇతరంబు గానక ఏకాగ్రచిత్తుండగు నమ్మునింగని[57] ....

ఇందు 1, 3 వ్రాతప్రతులందు లేవనియు, రెండవ దానికి వ్రాతప్రతులందెల్ల 'ఇట్లాత్మ నాత్మస్థునిగాజేసి హరినిజాకారంబు మనంబునందలంచుచుండు' అని కల దనియు, కాబట్టి ఈవాక్యము లంతగా నవలంబనీయములు కావనియు వారు వ్రాసి యున్నారు. వారు గమనింపని అద్వైతపరములగు వాక్యములెన్నో ఈ రెండు స్కంధములలో కలవు. చూడుడు.

1. ఈజగంబంతయు నాత్మాశ్రితంబుగా నెరింగి.[58]

2. పంచేంద్రియంబులకు దృష్టంబైన పదార్థం బనిత్యంబు నిత్యదృష్టి బ్రహ్మము.[59]

3. ఇంద్రియ నిరసనుండును కృపణగుణవిరక్తుండునైనవాడే ఈశ్వరుండు.[60]

4. ఇది యంతయు మిథ్యగాన సర్వంబునుం బరిత్యజించి.[61]

6. ఆత్మనభంబుమాడ్కి ధ్రువంబై, అనంతంబై, వ్యక్తావ్యక్తంబులకు పరంబై యుండు.[62]

ఇత్యాదులు.

ఇంతకును నారయ రచనలో విశిష్టాద్వైత పరవాక్యములు లేవని చెప్పబోవుట లేదు. అట్టి వెన్నో ఉండవచ్చును. ఏలయనగా భాగవత గ్రంథమే అట్టిది. అది భక్తిని ప్రబోధించునదికదా! భగవంతుడు, ననగానే అద్వైతమున కొక మెట్టు దిగినట్లే. కావున భాగవతమువంటి భక్తిరస ప్రధానమగు గ్రంథములో విశిష్టాద్వైత పరవాక్యములటనట ఉండుట తప్పదు. అట్టివెన్నో కలవు. చూడుడు.

1. మోక్షార్థులైన వారలు ఘోరరూపులైన భూతపతుల విడిచి దేవతాంతర నిందసేయక శాంతులై నారాయణ కథలయందే ప్రవర్తించుదురు.[63]

2. నిర్విఘ్నయు, నిర్హేతుకయు నైన హరిభక్తి ఏరూపంబునం గలుగు నది పురుషులకు పరమధర్మంబగు.[64]

3. ఆతత్త్వం బౌపనిషదులచేత బ్రహ్మమనియు హైరణ్యగర్భులచేతం బరమాత్ముండనియు, సాత్వతులచేత భగవంతుండనియు పలుకంబడు.[65]

4. వేదాంతశ్రవణంబున గ్రహింపంబడి జ్ఞానవైరాగ్యముల తోడం గూడిన భక్తిచేత తత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన ఆత్మ యందు పరమాత్మం బొడగందురు.[66]

5. నిర్గత కర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు కల్గినను హరిభక్తి లేకున్న శోభితంబుకాదు . . . భక్తిహీనంబులైన జ్ఞాన వాచాకర్మ కౌశలంబులు నిరకర్థంబులు.[67]

6. విష్ణుండు విశ్వంబు, విష్ణుని కంటెను వేరేమియును లేదు.[68]

ఈవాక్యములు నిర్వివాదమగు పోతన రచనలోనివి. తేవప్పెరుమాళ్ళయ్య గారు 2, 3 స్కంధములలోను, దశమ స్కంధోత్తరభాగమునను విశిష్టాద్వైతపర

వాక్యములున్నవని ఎత్తిచూపించి అందుచే నవి పోతన రచితములుకావనియు నారయ రచితములనియు వ్రాసిరి.[69] పైన నుదాహరించిన వాక్యములు స్పష్టముగా పోతన రచనలోనివి. ప్రథమస్కంధములో నారయరచన కలదని తేవప్పెరుమాళ్ళయ్యగారును చెప్పలేదు. దీనినంతటిని పరిశీలించిన గోచరించు సత్యమిది.

భాగవతమును పోతన అద్వైతపరముగానే తెనిగించెను. కానీ ఆ గ్రంథము యొక్క సహజతత్త్వముచే అందచ్చటచ్చట విశిష్టాద్వైతపర వాక్యములు వచ్చినవి. అంతమాత్రమున మొత్తముమీద దాని అద్వైతప్రణాళికకేమియును భంగములేదు. భాగవతరచనలో పాల్గొన్న మిగిలినకవులందరును పోతన మార్గమునే అనుసరించిరి. ఈవిషయమున నారయ ప్రత్యేకత ఏమియునులేదు. నారయరచనలోని కొన్ని వాక్యములను చూచి తేవప్పెరుమాళ్ళయ్యగారు పొరపాటుపడి అతడు విశిష్టాద్వైత పరానువాది యనిభావించి పోతన రచితములైన స్కంధములలో విశిష్టాద్వైతపరము లుగా వారికికన్పించిన భాగములెల్ల నారయకృతములని చెప్పుటకు ప్రయత్నించిరి. పోతన అద్వైతపరముగా ననువదించుటచే విశిష్టాద్వైతపరవాక్య మొక్కటికూడ ఉండనే ఉండకూడదని వారుతలచుటచే జరిగిన పొరపాటిది. పోతన మతవిషయక ముగా ఎట్టి వీరకఠోరభావ నిష్ఠితుడును కాడు. అద్వైతమును సిద్ధాంతరీత్యా అంగీక రించినను విశిష్టాద్వైతపరవాక్యమే దొరలగూడదన్నంత కఠినపథము కాదాయనది. అసలు భాగవతగ్రంథమే అట్టిదికాదని గుర్తింపవలసిన ప్రధానాంశము. జాగరూక తతో చూచిన తేవప్పెరుమాళ్ళయ్యగారు విశిష్టాద్వైతపరములుగా వర్ణించిన విష్ణు లీలావిభూతి నిత్యవిభూతులును లక్ష్మీనిత్యాన పాయినీత్వమును భగవత్సమాకార ప్రాప్తి రూపముక్తియు ఇత్యాదివిశేషములన్నియు తెనుగుకవులు కల్పించినవికావు. మూలమున భాగవత ద్వాదశస్కంధమున నవమాధ్యాయములోను ఇంకను అనేక స్థలములందును అట్టివిశేషాంశములు వర్ణింపబడినవి అంతేకాక విష్ణుభక్తి ప్రబోధకము లును తదీయ లీలావిశేషసమన్వితములును అగు కథలే భాగవతభాగములు కదా!

ఈవిధముగా పరిశీలించిన యెడల నారయ పోతనవలెనే అద్వైతపరముగా ఏకాదశద్వాదశస్కంధములను రచించెననియు, పోతనలో వలెనే ఇతనిలోను భాగ వత గ్రంథసహజ తత్త్వానుగుణముగా విశిష్టాద్వైతపరవాక్యములు కలవనియు నిర్ధారణ చేయవచ్చును.

# 4. భాగవతతత్త్వము-వేదాంతము

విద్యావతాం భాగవతే పరీక్షా
విపత్తికాలే గృహిణీ పరీక్షా
రణాంగణే శస్త్రభృతాం పరీక్షా
ధనంజయే హాటక సంపరీక్షా

విద్యావంతులకు భాగవతము పరీక్షాగ్రంథము. కష్టములు గృహిణులకు పరీక్షాసమయములు. ఆయుధధారులకు యుద్ధరంగము పరీక్షాస్థానము బంగారమున కగ్ని పరీక్షాసాధనము. ప్రాచీనులలో భాగవతమనిన విద్యాదృష్టిలో నెంత ఉన్నత స్థానముండెడిదో పైచాటుశ్లోకముచే తెలియగలదు. ఇతర పురాణములలో వలెనే భాగవతములోనుకథలు గాథలు నీతులు, ధర్మములు మొదలగునవి ఎన్నియో కలవు. భక్తిరస పూరితములై పారవశ్యమును కలిగించు భాగములును చాలగలవు. అవి అన్నియును సులభపఠనసాధ్యములే, సులభబోధన సాధ్యములే. మరి మిగతపురాణాదులకంటె విద్యావంతులకు భాగవతములో పరీక్షాఘట్టములేవి ? అని ప్రశ్నించినచో దానికి సమాధానము చెప్పుటకై ఎక్కువగా వెదకుకొనవలసిన పనిలేదు. భాగవతములో వేదాంతతత్వ ప్రతిపాదకఘట్టములు బహుధా క్లిష్టమైనవి, అర్థగ్రహణ కష్టమైనవని పండితులందరెరుగుదురు. భాగవతములోని వేదాంతపరమగు శ్లోకములను సమర్థతతో వ్యాఖ్యానింపగలవాడన్నచో ఆతడున్నత పాండితీ సముపేతుడన్నమాట. పైశ్లోకములోని మొదటి పాదమునకు భావమిదియే.

భగవద్గీతాబ్రహ్మసూత్రాదులకు వలెనే భాగవతమునకును భిన్నమతప్రతిపాదకములగు వ్యాఖ్యానములు రచింపబడినవి. దానికిగల పూజ్యస్థానమే అందుకు కారణము. దీని నాంధ్రీకరించిన పోతనామాత్యుడు ప్రధానమతములగు నద్వైతద్వైత్వవిశిష్టాద్వైతములలో ఏశాఖకుచెందినవాడో తెలియదు మతవిషయమున నాతని అభిప్రాయములేమియో తెలిసికొనుటకు గ్రంథమే ఆధారము. అందును ఇచ్చట పరిశీలన స్థానమున నిల్చినది ఆంధ్రమహాభాగవతమే అగుటచే దానిని సంస్కృత మూలముతో పోల్చిచూచిన తన్మత సిద్ధాంతములు తెలిసికొనుట కవకాశము కలుగును. ఈసందర్భమున ఆయాఘట్టములలో ఏమతమునకు సంబంధించిన భావములు వ్యక్తీ

కరింపబడినవో ఏసిద్ధాంతమున కనుకూలముగా రచనప్రకాశితమైనదో నిర్ధారణ కావించుటకు ముందాయామతద్ధాంతముల నిర్వచనమెంతైన నవసరము.

భారతీయ వేదాంతవీధులలో కర్కశతర్క వాదములకు నిలబడి యుక్తిప్రయుక్తి ఝంఝామారుతములకు తట్టుకొని నేటికిని నిలిచియున్నవి ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు మూడుమాత్రమే. చాలవరకితర మతములన్నియు పై ప్రధానత్రయములో లీనమైనవి.

భాగవతమున తృతీయస్కంధములో కపిలునికథ కలదు. కపిలుడు సాంఖ్య మతప్రవక్త. ఐనను సాంఖ్యావాదములో నేటికిని నిలిచిన ప్రమాణగ్రంథ మీశ్వర కృష్ణుని సాంఖ్యకారికలు. సాంఖ్యవాదముగా ప్రసిద్ధమైన భావధోరణికిని భాగవతములోని కపిలుడు బోధించిన భక్తియోగాదులకును సంబంధ మంతగా కన్పింపదు. ప్రత్యేకమత ప్రవక్తయగు కపిలుని విష్ణ్వంశ సంభూతునిగాచేసి బుద్ధునకువలెనే అతనికిని ఒక అవతారస్థానమునిచ్చి వేదమతానుయాయులు పురాణములలో నాతని కథలను వ్రాసిరని చారిత్రకుల అభిప్రాయము. అదేవిధముగా జైన, తీర్థంకరులలో మొదటివానిగా చెప్పబడు ఋషభనాథుడు అవతారపురుషునిగా భాగవతములోని కెక్కినాడని వారి అభిప్రాయము. ఈ ఘట్టములలో మూలము ననువదించుటలో పోతనచేసిన మతసంబంధమగు మార్పు లేవియులేవు.

ఇక వివాదాస్పదమైనది ప్రధానముగా త్రిమతములకు సంబంధించిన సిద్ధాంత ప్రతిపాదనము. స్థూలముగా వాని ముఖ్యవిశేషము లీక్రింద వివరింపబడుచున్నవి.[1]

అద్వైతము :- సామాన్యముగా శంకరాచార్యు లద్వైత మతస్థాపకులని చారిత్రకులు లిఖింతురు. ఔపనిషదుల దృష్టిలో శంకరుడు తన్మతోద్ధారకుడు మాత్రమే. గౌడపాద గోవిందాచార్యుల సంప్రదాయములోనివాడగు నాతడు సమస్త భారతావని సంచారముచేసి అద్వైతమతజయధ్వజము నెగురవేసెను.

అద్వైతములో సత్యమొక్కటే. అది బ్రహ్మము. జగత్తంతయును మిథ్య. సత్యము మూడువిధములు–పారమార్థికము, వ్యావహారికము, ప్రాతిభాసికము. బ్రహ్మ పదార్థము పారమార్థికసత్యము. దేశకాల నిమిత్తబద్ధమగు జగత్తు వ్యావహారిక సత్యము. శుక్తిలో రజతభ్రాంతి ప్రాతిభాసిక సత్యము. ఈ భ్రాంతి కర్థసిద్ధిలేదు. భ్రాంతిజనకమైన వస్తుస్వరూప విజ్ఞానము భాసించినంతనే భ్రాంతి తొలగిపోవును. బ్రహ్మజ్ఞానము ప్రాప్తించిన వెంటనే అనగా సత్యసందర్శనము కలుగగానే

వ్యావహారికజగత్తు మిథ్యయని తెలియును. కలలోను, ఊహాలోను, భాసించెడి ప్రపంచమునకంటె వ్యావహారికజగత్తున కధికతరమగు యాథార్థ్యము కలదు. దీనిలో జీవరాశి, ప్రకృతి ఈశ్వరుడు నుండును. కాని నిజమునకది బ్రహ్మమూలము.

జీవుడెట్లో ఈశ్వరుడును అట్లే వ్యావహారిక సత్యము. సాకారుడును, సగుణుడును అగు సృష్టికర్తను ప్రజలు శాస్త్రోక్తమార్గమున ఆరాధింపవచ్చును. కానీ ఇది వ్యావహారిక దృష్టి మాత్రమే. బ్రహ్మమునకు సచ్చిదానందములు స్వరూప లక్షణములు. సృష్టికర్తృత్వాదికములు తటస్థలక్షణములు మాత్రమే. 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ' అనునది బ్రహ్మమును గూర్చిన ఉపనిషద్వాక్యము. ఈ వాక్యమునకు బ్రహ్మమే జ్ఞానమునకాధారమని రామానుజుడును, నైయాయికులును చెప్పిరి. అద్వైతదృష్టిలో ఇది అంగీకార్యముకాదు. జ్ఞానము బ్రహ్మముయొక్క స్వస్వరూపమేగాని గుణముకాదు. వ్యావహారిక జ్ఞానమంతఃకరణవికారముకాగా పారమార్థిక జ్ఞాన చైతన్యమే బ్రహ్మము. బ్రహ్మమానందస్వరూపము.[2] అది సూక్ష్మమును కాదు స్థూలమును కాదు. దీర్ఘమును కాదు, హ్రస్వమును కాదు[3] అది అశ్రుతము, అస్మృతము.[4]

ఆత్మ ఒక్కటే. భిన్నముకాదు. తేజస్సు, ఆకాశము, సూర్యుడు, అవిప్రకాశించు స్థలములనుబట్టి భిన్నములై తోచును కాని వాని ఏకత్వమెన్నడును చెడదు. అదేరీతిగా ఉపాధిభేదమువలన ఆత్మభిన్నత కన్పించునుగాని అది ఏకమగుటయే సహజమును, మూలభూతమును నగుసత్యము.[5] ఆత్మకును బ్రహ్మమునకును, సచ్చిదానంద విభుత్వ లక్షణములు సమానములే. ఆత్మయే బ్రహ్మము. దిగ్దేశగుణగమన ఫలభేదరహితమును, అద్వితీయ పరమాత్మస్వరూపమును నగు పరబ్రహ్మము మందబుద్ధుల కసత్తుగా ప్రతిభాసించును.

సృష్టి పరబ్రహ్మముయొక్క మాయ.[6] ఇది యంతయు సత్యమని సామాన్యులు భ్రమింతురు. పరబ్రహ్మమున కాభ్రమ యుండదు. అంధకారమున రజ్జువును చూచి సర్పమని భ్రమించినట్లు ఈభావభ్రమ కలుగుచున్నది. ఇదియే అవిద్య. రజ్జుజ్ఞానము కలిగినంతనే సర్పభ్రాంతి నశించినట్లుగా అవిద్యతొలగినంతనే బ్రహ్మానుభవమగును. అదియే సత్యదర్శనము.[7]

అగ్నిని దహనశక్తిని వేరుచేయుట సాధ్యముకానట్లే బ్రహ్మమును మాయను, వేరుచేయుట సాధ్యముకాదు. మాయ ప్రపంచహేతువు. నామరూపసముచ్చయముచే

నది బ్రహ్మము నాచ్ఛాదించును. అచలము శుద్ధమునగు ఏకబ్రహ్మము తనమాయా శక్తిచే సృష్టికర్త యయ్యెను.

మాయ ఈశ్వరుని నిత్యశక్తి. ఈశ్వరుడనగా పరపురుషునిగా గ్రహింపదగిన సగుణ బ్రహ్మరూపము. అతడు స్వీయమాయోపహతుడుకాడు. అతడు సర్వ వ్యాపకుడు. సర్వతంత్ర స్వతంత్రుడు. మాయతోగూడి అతడు హిరణ్యగర్భు డగు చున్నాడు. చరాచర జీవప్రపంచముతో గూడిన పరబ్రహ్మము వైశ్వానరుడు లేక విరాట్ పురుషుడు. దీనినే భంగ్యంతరమున జెప్పిన పరబ్రహ్మము సృష్టి పూర్వమీశ్వ రుడు. సృష్టిసమయమున హిరణ్యగర్భుడు. సృష్టి అనంతరము విరాట్పురుషుడు. మొద టిది కారణశరీరము, రెండవది సమిష్టిసూక్ష్మశరీరము. మూడవది సమిష్టిస్థూలశరీరము సృష్టికి కారణమగు నంతవరకు మాయ యథార్థమేకాని బ్రహ్మకు పరిచ్ఛిన్నత కల్పిం చుటలో మాత్రమది యథార్థముకాదు. అది బ్రహ్మమువలె సత్యమును గాదు. గగనకు సుమమువలె అసత్యమును గాదు మాయచే నేర్పడిన ఈసృష్టిలో పుణ్యపాపకర్మలచే జీవి జన్మించుచున్నాడు. కర్మలేక జన్మలేదు. జన్మలేక కర్మలేదు. కనుక నవి అనాదులు. అనాదియు, అనంతము నగు ఈసృష్టిలో పరబ్రహ్మమును గుర్తించుటయే మానవ జీవితలక్ష్యము. వానిచే ముక్తి లభించును.

ముక్తి రెండువిధములు. జీవన్ముక్తి. విదేహముక్తి, జీవబ్రహ్మైక్య సిద్ధియే మోక్షము. ముక్తపురుషుడు కామక్రోధాద్యరిషడ్వర్గముల కతీతుడు. అవిద్యతొలగిన జ్ఞానము కలుగును. జ్ఞానముచేత మాత్రమే కైవల్యము లభించును. ఈకేవలముక్తి సారూప్య, సాలోక్యసాయుజ్యాదులకంటె అతీతమైనది. అస్థితిలో తానే బ్రహ్మము నని జీవుడు గుర్తించును.

మాయ ఈశ్వరోపాధి. అవిద్య జీవోపాధి. మాయయందు బ్రహ్మము యొక్క ప్రతిబింబమే శుద్ధసత్వస్వరూపియగు ఈశ్వరుడు లేక పరమాత్మ. అవిద్య యందు బ్రహ్మప్రతిరూపమే రజస్తమోగుణ సహిత సత్వరూపమగు జీవాత్మ. సర్వోపాధి నిర్మూలనమే మోక్షము. దానిని మించినది మరి యొక్కటి లేదు. అది పారమార్థికము. కూటస్థము. నిత్యము. వ్యోమము వలె సర్వవ్యాపి. సర్వవిక్రియా రహితము. నిత్య తృప్తము, నిరవయవము. స్వయంజ్యోతి స్స్వభావము. ధర్మాధర్మములును కార్యముతో సహా కాలత్రయమును దానియందు వర్తింపవు. అది అశరీరము.[8]

అవిద్యాబద్ధుడగు మనుష్యునాకర్షించు ప్రపంచములోని నశ్యమగు దృశ్యము లేవియు ముక్తపురుషుని వికారపరుపజాలవు. దృష్టవిషయములన్నియు అసత్యము లనియు, ద్రష్టయు అదృష్టమునుఅగు ఆత్మ సత్యమనియు ఆతడెరుగును. దుఃఖ కారణమగు ఈమిథ్యా జ్ఞానము యొక్క వినాశముతో ఆనందానుభవమగును. దృగ్దృశ్యభేదనాశనమే మోక్షము. అది సర్వాత్మభావము.

విశిష్టాద్వైతము :- ఈమత ప్రవర్తకుడు రామానుజాచార్యులు. ప్రధాన సూత్రము లన్నిటిలోను ఈయన అద్వైతమును ఖండించెను. శంకరుడు కేవలము తాత్త్వికుడు. రామానుజునకు తాత్త్వికతకంటె భక్తిభావము హెచ్చు. ఇంద్రియజ్ఞానము సత్యప్రమాణముకాదని శంకరుడు వచించెను. సర్వవిజ్ఞానమును యథార్థమేయని రామానుజుని అభిప్రాయము. సర్పరజ్జు భ్రాంతిలో భ్రమకొన్నివంతులు మాత్రమే యనియు, త్రాడు, పాము అను రెండువాస్తవిక మూలపదార్థముల ఉనికివి గుర్తించుట అందు కలదనియు రామానుజుడు చెప్పినాడు. మాయాసిద్ధాంతమును, జగన్మిథ్యాత్వ మును శంకరుడు ప్రతిపాదించెను. రామానుజుడు దాని నంగీకరింపలేదు. జీవుల నానాత్వము మరుమరీచిక కాదని ఆతని విశ్వాసము. నిత్యము కావు గావున దృశ్యము లసత్యములనుట తప్పని ఆతడు భావించినాడు. సత్యమగు ఏకత్వము భేదరహితమని శంకరుడు చెప్పగా భేదసహితత్వమే సత్యలక్షణమని రామానుజుడు భావించెను. ప్రపంచములో వస్తువులకు కల పరిణామము వాని అసత్యత్వమును నిరూపించుచున్న దని శంకరుడనగా పరిణామమే వాస్తవికతా లక్షణమని రామానుజుడు పలికెను. మడచినట్టియు విప్పినట్టియు పటమొకటేయైనట్లే కారణకార్యము లభిన్నము లనియు కారణమే నిజమైన వస్తుస్వరూపమనియు; కార్యము తదాభాసయనియు శంకరుడ నన్యత్వవాదమును ప్రతిపాదించెను.[10] సత్యమునకును అసత్యమునకును అన న్యత్వవాదము నంగీకరించిన బ్రహ్మమసత్యమనుటయు జగత్తు సత్యమనుటయు అంగీకరింపవలెనుగాన అది తప్పని రామానుజుడు విమర్శించెను.[11]

విశిష్టాద్వైత సిద్ధాంతము ననుసరించి ఆత్మలు భిన్నములు. ఇవి పరబ్రహ్మ అంశవలన ఏర్పడినవి. అద్వితీయమగు పరబ్రహ్మముయొక్క భ్రమారూపములే వ్యక్తులనుట తప్పు. జీవాత్మ యథార్థము. అనన్యము. నిత్యము బుద్ధి జ్ఞాన సహితము. నిరవయవము. నిర్వికారము అగోచరము అణుస్వరూపము.[12] అది దేహేంద్రియ ప్రాణి బుద్ధి భిన్నము జ్ఞాతృత్వ కర్తృత్వ భోక్తృత్వములు దానికి కలవు. మోక్షసిద్ధి వరకు జీవులు ప్రకృతి బద్ధములు. అశ్వికున కశ్వమువలె జీవు

నకు ప్రకృతివాహనము. అది దీపకళిక వంటిది. దీపము వెలుగు అంతటను వ్యాపించియుండునట్లే జీవాత్మ దేహములోని అన్ని భాగములనుండి సుఖదుఃఖము లను గ్రహించును.

జీవుడు దేవుడుకాడు. సూర్యాగ్నులనుండి వెలువడు వెలుగు తదంశమైనట్లే జీవాత్మ పరమాత్మలో అంశ. జీవులు నిత్య ముక్త బద్ధ భేదమున త్రివిధములు. అవి బ్రహ్మములో నెన్నడును కలియవు. సృష్టి రెండువిధములు శుద్ధము, స్థూలము. వైకుంఠాదులు శుద్ధ సృష్టిలోనివి. ప్రకృతి స్థూలసృష్టి ఈశ్వరునకు సృష్టిలీల. ఈశ్వరుడు స్వతంత్రుడు ప్రకృతి జీవులాయన క్రీడావస్తువులు.

బ్రహ్మమనంతము. తద్భిన్నములేదు. అది చిదచిద్విశిష్ట సంపూర్ణస్వరూపము. నిర్గుణ నిరంజన పరబ్రహ్మమునకును, సాకార సగుణాత్మలకు స్వగత భేదము కంటె ఏకత్వమే బలవత్తరము. ఏకమైన పరమాత్మ అనేకత్వమునంగీకరించి జీవజగత్తులనెడి విశేషములతో కలసియుండుటచే అది విశిష్టాద్వైతమైనది.

విష్ణువైన బ్రహ్మముయొక్క స్వరూపము పంచాత్మకము. విగ్రహాదికము లర్చారూపములు. విభవము లవతారములు. సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపములు చతుర్వ్యూహములు. పరస్వరూపమగు నారాయణుడు శుద్ధసత్వ దేహముతో వైకుంఠమున లక్ష్మీసమేతుడై శేషశయనమున నుండును. జీవులను నుద్ధరించుటకై ఆయన లోకమున నవతరించుచుండును. విష్ణునివలెనే అవతారములును అర్చ్యార్హములే. జ్ఞానముచేత మాత్రమే ముక్తి కలుగునని శంకరుడువలుకగా భక్తిచే మోక్షము లభించునని రామానుజుడు ప్రవచించెను. మోక్షమునకు ప్రపత్తికంటె మరి యొక ప్రయత్న మక్కరలేదని ఆయన యభిప్రాయము. శంకరునిముక్తికిని రామానుజుని ముక్తికిని భేదమున్నది. శంకరు ననుసరించి ముక్తుడగు జీవుడు పరబ్రహ్మమే. రామానుజుడు చెప్పిన ముక్తావస్థలో జీవులు పరమేశ్వరుని వలె సర్వవ్యాపిత్వము లేక అణురూపులై యుందురు. వారికి సృష్టి శక్తి యుండదు. వారీశ్వర సేవాతత్పరులో లేక నిరతాత్మజ్ఞానకృతార్థులో అయియుందురు. శంకరుని సగుణబ్రహ్మమును బ్రహ్మలోకమును రామానుజుని విష్ణువు వైకుంఠములకు తుల్యముగా చెప్పవచ్చును. ఈశ్వరునిలో అంతర్భాగములగు జీవులను రామానుజుడు ప్రకారములనియు నియామ్యములనియు శేషములనియు పిలిచెను. ఈశ్వరుడు ప్రకారి, నియంత, శేషి.

జీవుల దుఃఖములకు కర్మమే కారణముకాని భగవంతుడు బాధ్యుడు కాడు. ఆయన అనుగ్రహము మాత్రమే ఈజన్మచక్రమునుండి జీవిని తప్పింపగలదు.

ద్వైతము :- ఈమత ప్రవర్తకుడు మధ్వాచార్యులు. మధ్వమత సిద్ధాంతమునననుసరించి పరబ్రహ్మ, ఆత్మ, జగత్తు-అనాదులు. పరబ్రహ్మపై మిగతరెండు నాధారపడియుండును. బ్రహ్మమే అనంత కళ్యాణపరిపూర్ణుడగు విష్ణువు. అతడు సర్వాంతర్యామి. జీవుల కర్మలననుసరించి అతడు ఫలములనిచ్చును. జీవులు లేక ఆత్మలు అసంఖ్యాకములు. జీవబ్రహ్మ భేదము సత్యము. జగత్తున భిన్నులగు జీవేశ్వరులు మోక్షమున నొక్కటే యనుట తప్పు. రెండు భిన్నవస్తువులు భేదాభేదసంబంధము కలిగియుండజాలవు. అణువు జీవుని ప్రమాణము.[13] అణురూపియయ్యును చిచ్ఛక్తిచే జీవుడు శరీరమంతయు వ్యాపించి యుండును. ఏరెండుజీవులు నొక్కటికావు మోక్షానంతరమున అందరకును సమానసంకల్పములుండును.[14] పరబ్రహ్మమును చూచువాడు పరబ్రహ్మమగునను వాక్యమునకు ఈశ్వరసంకల్పమే జీవసంకల్పమని గాని జీవబ్రహ్మైక్య మర్థము గాదు.[15] ముక్తిలభించువరకు జీవుడు జన్మపరంపర నందుచుండును. ముక్తులుముత్త్రివిధములు. నిత్యముక్తులు లక్ష్మి మున్నగువారు. సంసారముక్తులు ఋష్యాదులు, బద్ధజీవులు, తదితరులు: బద్ధాత్మలలో. మోక్షమున కర్హులు ననర్హులు నుందురు.

విష్ణువు సర్వాధికుడు. బ్రహ్మ వాయువు తరువాతివారు ద్వైతతత్వ ప్రథమ ప్రతిపాదకాచార్యులు బ్రహ్మ. జీవేశ్వరుల కేకైక మధ్యవర్తి వాయువు. జీవేశ్వరులకు, ఈశ్వరపదార్థములకు జీవాన్యజీవులకు పదార్థగత భిన్నభాగములకు కల భేదమైదు విధములు. బ్రహ్మ ముపాదాన కారణ మెన్నడునుకాదు. మంత్రబ్రాహ్మణములుపనిషత్తులతో సమానప్రమాణములు. జగత్తు మిథ్యకాదు. ప్రకృతి వివిధవస్తువుల సముదాయము. పదార్థములు పది. ద్రవ్యగుణ కర్మ సామాన్యవిశేష విశిష్టాంశ శక్తి సాదృశ్యా భావములు. మహదహంకార బుద్ధిమనోదశేంద్రియ పంచతన్మాత్ర పంచభూతము లిరువది నాలుగును సృష్టి పరిణామదశలు. జీవజగత్తులకధిపతియగు నీశ్వరుడు లోకరక్షణకై అవతారములు తాల్చును. పవిత్రములగు విగ్రహములలో నాతడు గూఢముగా నుండును. అతని భార్యలక్ష్మి తన్మహత్వ సాక్షిణియై అనాద్యనంత కాలముండును: విష్ణువునకామెకంటె అధికతర చిచ్ఛక్తి వరిష్ఠగుణగణములు కలవు.[15]

'సఆత్మ తత్త్వమసి' అనుదానిని సఆత్మా అతత్ త్వమసి అని విడదీయవలెను ఆత్మ నీవుకావని దానిఅర్థము.[17] అయమాత్మా బ్రహ్మ అనునది కేవల జీవాత్మస్తుతి వాక్యము. లేదా ధ్యానోపయోగార్థమంత్రముగా భావింపవచ్చును.

బ్రహ్మపదార్థము స్వతంత్రము, ఆత్మపదార్థము పరతంత్రము. వర్ధనశీలమును అటనశీలనమును ఉండుటచే ఆత్మను వ్యుత్పత్తిననుసరించి బ్రహ్మమనవచ్చును. భక్తి చేతనే మోక్షమువచ్చును. జ్ఞానము భక్తినొసగును. ఈశ్వరప్రేమను బోధించునదే జ్ఞానము.[18] మానవుని కృషిచేతనే మోక్షమురాదు. ఈశ్వరానుగ్రహము ప్రధానము.

ఈవిధమగు సిద్ధాంతములు కలిగిన త్రిమతములేకాక భారతీయతాత్త్విక చింతనలో భేదాభేదాది మతములు మరికొన్ని యున్నను భాగవతమునకు సంబంధించినంతవరకు తాత్త్వికదృక్పథపరిశీలనయందు మతత్రయమునకే ప్రాధాన్యము తత్సంబంధమగు వివిధవ్యాఖ్యానములలో అద్వైతపరమగు శ్రీధరవ్యాఖ్యనే భాగవతాంధ్రీకర్తయగు పోతన తన అనువాదమున ప్రధానముగా అనుసరించినాడు. భాగవత గ్రంథమునకు ప్రాణాస్పదములగు ఘట్టములలో బహుస్థలముల నాతడనుసరించిన పద్ధతిని పరిశీలించినయెడల ఆయన అద్వైతపరముగానే రచించెనని స్పష్టము కాగలదు. అందులకై కొన్ని ఉదాహరణములు మూలముతో[19] పోల్చి చూపబడుచున్నవి.

1. భీష్ముడు నిర్యాణముచెందు ఘట్టమున మూలమున నిట్లున్నది.

శ్లో॥ సంపద్యమాన మాజ్ఞాయ భీష్మం బ్రహ్మణి నిష్కలే
సర్వే బభూవస్తే తూష్ణీం వయాంసీవ దినాత్యయే.[20]

ఇందు భీష్ముని జీవునకు నిష్కలబ్రహ్మసంపత్తిరూపమగు సాయుజ్యము చెప్పబడినది. ఇది స్ఫుటమగునద్వైతముగా గోచరించును. దీనికి పోతన అనువాదమిది

అని ఇట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్మయగు కృష్ణుని హృదయంబున నిలుపుకొని విశ్వాసంబులుమాని నిరుపాధికంబైన వాసుదేవ బ్రహ్మంబునందుం గలిసిన భీష్మునింజూచి సర్వజనులు దినావసానంబున విహంగంబు లూరకయుండు తెరంగున నుండిరి.[21]

నిష్కల శబ్దమునకు నిరుపాధికమనునది శ్రీధరులిచ్చిన అర్థమే. ఇది అంతయు నద్వైతపరమగుట స్పష్టము.

2. శ్రీకృష్ణుడు ద్వారకానగరమున కరిగినప్పుడు పౌరసుందరులు ప్రాసాదశిఖర భాగంబుల నిలిచి గోపాలసుందరుని సందర్శించి ఇట్లు పలికిరి.

శ్లో॥ సవై కిలాయం పురుషః పురాతనో
యఏక ఆసీ దవిశేష ఆత్మని

అగ్రే గుణేభ్యో జగదాత్మ నీశ్వరే
నిమీలితాత్మ న్నిశి సుప్తశక్తిషు[22]

పరబ్రహ్మము నిర్విశేషమనుట ఇచ్చట కలదు. దీనికి తెనుగు—

వ॥ తొల్లిటం బ్రళయంబున గుణంబులంగూడక జీవులు లీన రూపంబులై యుండన్ బ్రపంచంబు బ్రవర్తించని సమయంబున బ్రపంచాత్మకుండు నద్వితీయుండు నగుచుమేలై దీపించు పురాణ పురుషుండితండనువారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట ఎట్లనువారును జీవోపాధి భూతంబులైన సత్త్వాదిశక్తుల లయము జీవలయమను వారును.[23] ......

ఇచ్చట అవిశేషమను పదమును వదలినను తత్సందర్భమున శ్రీధరవాఖ్యలోని వాక్యములనే తెనిగించుట గమనార్హము.

శ్రీ.వ్యా-నను జీవానాం బ్రహ్మత్వాత్ కథం లయ స్తత్రాహ సుప్తాసు శక్తిషు తీషు జీవోపాధిభూతసత్త్వాదిశక్తిలయఏవ జీవలయ ఇవ లక్ష్యత ఇత్యర్థః

జీవుడే బ్రహ్మమను శ్రీధరవాక్యము ననుసరించిన పోతన భావము విస్పష్టము.

3. నారదుడు ధర్మరాజునకు తత్వబోధనచేయుచు నిట్లనెను.

శ్లో॥ తదిదం భగవాన్ రాజ న్నేక ఆత్మాత్మనాం స్వదృక్
అంతరోఽనంతరో భాతి పశ్యత్వం మాయయోరుధాః[24]

వ॥ నిజమాయా విశేషంబున మాయావియై జాతిభేదరహితుండైన ఈశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్య రూపంబుల నంతరంగ బహిరంగంబుల దీపించు.[25] సంస్కృతాంధ్రములు రెండింటిలోను ఆత్మైకత్వము స్ఫుటము.

4. బ్రహ్మ నారదునకు ప్రపంచప్రకార ముపదేశించుచు పలికినది

శ్లో॥ సఏష ఆద్యః పురుషః కల్పే కల్పే సృజత్యజః
ఆత్మన్యేవాత్మ నాత్మానం సంయచ్ఛతిచ పాతిచ

విశుద్ధం కేవలజ్ఞానం ప్రత్యక్ సమ్యగవస్థితం
సత్యం పూర్ణమనాద్యంతం నిర్గుణం నిత్యమద్వయం.[26]

ఇచ్చట ప్రత్యగాత్మయొక్క పూర్ణత్వము ఏకత్వము మొదలగునవి పలుకబడినవి.

పరమాత్ముం డజుఁడీజగంబు ప్రతికల్పంబందు కల్పించు దా
బరిరక్షించును ద్రుంచునట్టి యనఘున్ బ్రహ్మాత్మ నిత్యున్ జగ
ద్భరితున్ కేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్మునీ
శ్వరు నాద్యంత విహీను నిర్గుణునిశశ్వన్మూర్తిఁ జింతించెదన్.[27]

తెనుగు పద్యము మూలానుసారిగానే కలదు.

తాను తనయందు తననే సృష్టించుకొనునను భావము మాత్రము వదలబడినది.

5. హరి బ్రహ్మకుపదేశించిన ఘట్టములో నాల్గుశ్లోకములత్యంత ప్రధానమైనవి. భాగవతతత్త్వప్రకటనమున వీనికిగల ప్రాముఖ్యము శ్రీధరాదివ్యాఖ్యాతలును పోతనయు గుర్తించియేయున్నారు. ఆనాల్గుశ్లోకములివి.

శ్లో॥ అహ మేవాసమేకోఽగ్రే నాన్యద్య త్సదసత్పరం
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహం
ఋతేఽర్థం యత్ప్రతీయేత నప్రతీయేత చాత్మని
తద్విద్యా దాత్మనో మాయాం యథాభాసో యథాతమః

యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను
ప్రవిష్టా న్యప్రవిష్టాని తథా తేషు నతేష్వహం
ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసు నాత్మనః
అన్వయవ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా.[28]

బ్రహ్మము త్రికాల సత్యమనియు, జగత్తు మాయామయమనియు ఈశ్లోకములలో సిద్ధాంతీకరింపబడినది. సాక్షాద్భగవంతుడే ఇది పరమగుహ్యమును అపూర్వమును నగు తత్త్వజ్ఞానమని పలికియున్నాడు. దీని అనువాదము చూడుడు.

సీ॥ ...సృష్టిపూర్వమున చర్చింప నేనొకరుండ
కలిగియుండుదు వీతకర్మినగుచు

సమధికస్థూలసూక్ష్మ స్వరూపమగుతత్
కారణప్రకృతియు తగమదంశ
ఆ॥ మందు లీనమైన నద్వితీయుండనై
యుండు నాకు నన్యమొకటిలేదు.
సృష్టికాలమందు సృష్టినాశంబున
జగము మత్స్వరూపమగును వత్స.[29]

వ॥ అదియునుంగాక నీవు నన్నడిగిన ఈ జగన్నిర్మాణ మాయా ప్రకారంబెరిగింతు లేనియర్థంబు శుక్తిరజతభ్రాంతియుంబోలె నేమిటి మహిమన్ దోచు క్రమ్మరన్ దోచక మాను నిదియె నామాయావిశేషం బని యెరుంగుము ఇదియునుంగాక లేనియర్థంబు దృశ్యంబగుటకును కలయర్థంబు దర్శనగోచరంబు కాకుండుటకును ద్విచంద్రాదికంబును తమఃప్రభాసంబును దృష్టాంతరంబులుగా తెలియుము. ఏ ప్రకారం బున మహాభూతంబులు భౌతికంబులైన ఘటపటాదులం బ్రవేశించి యుండు నాప్రకారంబున నేను నీభూత భౌతికంబులైన సర్వకార్యం బుల యందు సత్వాదిరూపములం బ్రవేశించియుండుదు. భౌతికం బులు భూతంబులయందు గారణావస్థం బొందు చందంబున భూత భౌతికంబులు కారణావస్థం బొందిన నాయందు నభివ్యక్తంబులై యుండవు. సర్వ దేశంబులయందు సర్వకాలంబుల యందు నేది బోధితంబై యుండునట్టిదే పరబ్రహ్మస్వరూపంబు. తత్వంబెరుంగనిచ్ఛ యించిన మిముబోటివారలీ చెప్పినది మదీయ తత్వాత్మకంబైన అర్థంబని ఎరుంగుదురు [30] ...

భాగవత సారభూతములుగా భావింపబడు పై శ్లోకములు వాని అనువాదమును అద్వైతమత ప్రతిపాదకములనుట విస్పష్టము. ఈ సందర్భమున మూలములోగాని వ్యాఖ్యానములోగాని లేని శుక్తిరజతభ్రాంతి మొదలగు వానిని ప్రస్తావించి వివరణ చేయుట చూడగా వేదాంతశాస్త్రములో పోతనకుగల అభినివేశము విశదమగుచున్నది.

6. విదురమైత్రేయ సంవాదములో వేదాంతపరమగు ననేక శ్లోకములు కలవు. అందు విదురుడు పల్కిన ఒక శ్లోకము చూడుడు.

శ్లో॥ బ్రహ్మన్ కథం భగవత శ్చిన్మాత్ర స్యావికారిణః
లీలయా వాపి యుజ్యేరన్ నిర్గుణస్య గుణాః క్రియాః.[31]

కం॥ అగుణుండగు నీశ్వరునకు
జగదవనోద్భవ వినాశ సత్కర్మములున్
దగులీలలెట్లు లాతడు
సగుణుండై యుంట యెట్లు సౌజన్యనిధీ ?[32]

ఇచ్చట బ్రహ్మము నిర్గుణమును, నిష్క్రియమును చిన్మాత్రమును అవి స్పష్టము.

విదురుడడిగినదే మరి యొకటి.

శ్లో॥ భగవానేక ఏవైష సర్వక్షేత్రే ష్వవస్థితః
అముష్యదుర్భగత్వంవా క్లేశోవా కర్మభిః కృతః[33]

సీ॥ ... తానేకమయ్యు
కోరి సమస్త శరీరంబులందును
జీవరూపమున వసించియున్న

తే॥ జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి
కర్మమున సంభవించెను.[34] ...

జీవుడే ఈశ్వరుడని ఇచ్చట విశదముగా నున్నది. విదురుడడిగిన సందేహములకు మైత్రేయుడిచ్చిన సమాధానములలో మరింత పరిస్ఫుటముగా అద్వైత ప్రబోధము గోచరించుచున్నది.

శ్లో॥ సేయం భగవతో మాయా యన్నయేన విరుద్ధ్యతే
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్య ముతబంధనం
యథార్థేనవినా పుంసో మృషై వాత్మవిపర్యయః
ప్రతీయత ఉపద్రష్టుః స్వశిరశ్ఛేదనాదినా

యథాజలే చంద్రమసః కంపాది స్తత్కృతోగుణః
దృశ్యతే సన్నపిద్రష్టు రాత్మనో నాత్మనోగుణః[35]

చం॥ వినుము వితర్కవాదములు విష్ణుని ఫుల్ల సరోజపత్ర నే
త్రుని ఘనమాయనెప్పుడు విరోధముసేయు పరేశు నిత్యశో
భనయుతు బంధనాదికవిపద్దశలున్ గృపణత్వమెప్పుడే
ననయముబొందలేవు విభుడాద్యుడనంతుడు నిత్యుడౌటచేన్[36]

వ. మరియు[37]

చం॥ పురుషుడు నిద్రవోగలలబొందు సమస్తసుఖంబులాత్మసం
హారణ శిరోవిఖండనము లాదిగ జీవునికిం ప్రబోధమం
దరయగ దోచుచున్నగతి నాదిబరేశుడు బంధనాదులన్
బొరయకతక్కనెట్లనుచుబుద్ధినిసంశయమందెదేనియున్[38]

వ. అవ్విధమతనికిం గలుగ నేరదది ఎట్లంటేని[39]

చం॥ లలితవిలోల నిర్మల జలప్రతిబింబిత పూర్ణచంద్రమం
డలముతదంబు చాలనవిడంబన హేతువునొందియున్ వియత్
తలమున కంపమొందని విధంబున సర్వశరీరధర్మముల్
కలిగి రమించు నీశునకు కల్గనేరవు కర్మబంధముల్.[40]

పైవానిలో ఈశ్వరుని జీవత్వము మాయామయమని సోదాహరణముగా వివరింపబడినది.

7. కపిలుడు తత్త్వజ్ఞానమును బోధించుట ముఖ్యఘట్టములలో నొకటి. అదియును పరిపూర్ణమగు నద్వైత సిద్ధాంతముల ననుసరించియే యుండుట గమనార్హము.

శ్లో॥ తథాపురుష ఆత్మానం కేవలం ప్రకృతేః పరం
నిరంతరం స్వయంజ్యోతి రణిమాన మఖండితం[41]

ప్రత్యగాత్మ యొక్క పరిపూర్ణత ఇచ్చట స్పష్టముగా నున్నది. దీని అనువాదమిది.

వ॥ ప్రకృతికంటె పరుండును, పరమపురుషుండును, నిర్భేద్యుండును, స్వయంజ్యోతియు, సూక్ష్మస్వరూపుండును, ఇతరవస్త్వంతరాపరిచ్ఛిన్నుండును, ఉదాసీనుండును నైన పరమాత్ముని.[42]......

కపిల బోధలోనే మదియొకచోట.

శ్లో॥ అనాది రాత్మాపురుషో నిర్గుణః ప్రకృతేః పరః
ప్రత్యగ్ధామా స్వయంజ్యోతి ర్విశ్వం యేన సమన్వితం
నజాయతే న మ్రియతే సహదేహాద్యుపాధిభిః
నిమిత్తై రాత్తతద్ధర్మా యథాస్వప్నే తదీక్షితా[43]

వ॥ అందు నాత్మస్వరూపం బెట్టిదనిన అనాదియు పురుషుండును సత్త్వాదిగుణశూన్యుండును ప్రకృతిగుణవిలక్షణుండును ప్రత్యక్ స్వరూపుండును స్వయంప్రకాశుండును నెవ్వండు నెవ్వనితోడ నీ విశ్వంబు సమన్వితంబగు నతండు.[44]......

ప్రత్యగాత్మ పరిపూర్ణమనియు, స్వయంప్రకాశమనియు విస్పష్టముగా పైవాక్యములందు గోచరించుచున్నది. ఈశ్వరున కుపాధివశమున సంసారాదికము వచ్చుట అద్వైత పద్ధతిలో పూర్ణముగా వివరింపబడినది.

చిన్మాత్రమగు బ్రహ్మమే జగజ్జీవేశ్వరులని నిరూపించు మరియొక కపిలోపదేశశ్లోకము—

శ్లో॥ జ్ఞానమాత్రం పరబ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్
దృశ్యాదిభిః పృథగ్భావై భగవానేక ఈయతే.[45]

వ॥ జ్ఞానరూపుండును పరబ్రహ్మంబును పరమాత్ముండును ఈశ్వరుండును నగు పరమపురుషుం డేకరూపంబుగలిగి యుండియు దృశ్యద్రష్ట్రుకరణంబులచేత పృథగ్భావంబును పొందుచుండును.[45]

8. శివానుగ్రహానంతరము తన అధ్వరమునకు వచ్చిన నారాయణుని దక్షుడు స్తుతించు సందర్భమున చిన్మాత్రమగు పరబ్రహ్మమునకు మాయావశమున జీవత్వము వచ్చినదను విషయము విస్పష్టముగా కన్పించుచున్నది. చూడుడు.

శ్లో॥ శుద్ధం స్వధామ్న్యుపరతాఖిలబుద్ధ్యవస్థం
చిన్మాత్ర మేక మభయం ప్రతిషిధ్య మాయాం
తిష్ఠం స్తయైవ పురుషత్వ ముపేత్య తస్యా
మాస్తే భవానపరిశుద్ధ ఇవాత్మతంత్రః[47]

వ॥ దేవా! నీవు స్వరూపమందున్న యట్ల ప్రవ డుపరతంబులుగాని రాగాద్యఖిల బుద్ధ్యవస్థలచే విముక్తుండవును నద్వితీయుండవును భయ రహితుండవునునై మాయం దిరస్కరించి మరియు నామాయననుస రించుచు లీలామానుషరూపంబుల నంగీకరించి స్వతంత్రుండవయ్యును మాయాపరతంత్రుడవై రాగాదియుక్తుం బలె రామకృష్ణాద్యవ తారంబుల గానంబడుచుందువు గావున నీలోకంబులకు నీవఈశ్వరుండ వనియు, నితరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయావిభూతులగుటం జేసి లోకంబులకు నీశ్వరులు గారనియు భేదదృష్టింగల నన్ను రక్షిం పుము. ఈవిశ్వకారణులైన ఫాలలోచనుండును బ్రహ్మయు దిక్పాలు రును సకలచరాచరజంతువులును నీవ. భవద్వ్యతిరిక్తంబు జగంబున లేదు.[48]

ఈ వాక్యములు పోతనామాత్యుని స్ఫుటమగు నద్వైత దృష్టికి ప్రమాణ నిదర్శనములు, ఇందలి రామకృష్ణాద్యవతార ప్రశంసయంతయు మూలములో లేకున్నను శ్రీధరవ్యాఖ్యలో కలదు. అందలి వాక్యములకు వాక్యములే ఇచ్చట అనువదింపబడినవి. ఆవివరణమును ఆభావమును పోతన కెంతో నచ్చినట్లు తోచును

9. రాక్షసుడగు హిరణ్యకశిపుడు వేదాంతతత్వవేత్త. తన తమ్ముడగు హిరణ్యా క్షుడు మరణించినప్పుడు దుఃఖించెడి అతని భార్యలను తనతల్లిని అతడూరడించి నాడు. ఆ ఓదార్పు మాటలలో అద్వైతవేదాంతము సముల్లసితమగుచున్నది.

శ్లో॥ నిత్య ఆత్మావ్యయ శ్శుద్ధః సర్వగ స్సర్వవిత్పరః
ధత్తేఽసావాత్మనో లింగం మాయయా విసృజన్ గుణాన్
యథాంభసా ప్రచలతా తరవోఽపి చలాఇవ
చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే చలతీవభూః[49]

సీ॥ సర్వజ్ఞుఁడీశుండు సర్వాత్ముఁడవ్యయుఁ
డమరుండు సత్యుఁడనంతుఁడాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన
మాయాప్రవర్తన మహిమవలన
గుణములఁగల్పించి గుణసంగమంబున
లింగశరీరంబు లీలఁదాల్చి
కంపితజలములో కదలెడి క్రియదోఁచు
పాదపంబుల భంగి భ్రామ్యమాణ

ఆ॥ చక్షువుల ధరిత్రి చలితయై కానంగఁ
బడిన భంగి వికల భావరహితుఁ
డాత్మమయుఁడు కంపితాంతరంగంబున
కదిలినట్లు తోఁచు కదలఁడతఁడు.[20]

ఆత్మ మాయా ప్రవర్తనచే ఏ విధముగా శరీరములను దాల్చినట్లు తోచునో ఉదాహరణ పూర్వకముగా నిచ్చట ప్రదర్శింపబడినది.

10. ప్రహ్లాదుని మాటలలో నెన్నోచోట్ల పరమజ్ఞానాత్మకములగు విశేష వాక్యములు గోచరించుచున్నవి. ఆతడు మహాభక్తుడేకాక గణనీయతత్త్వవేత్తయు నగుట గమనార్హము. తన సహపాఠులగు బాలకులకాతడు చేసిన కొన్ని ప్రబోధములు చూడుడు.

శ్లో॥ గుణేషు గుణసామ్యేచ గుణవ్యతికరే తథా
ఏక ఏవ పరోహ్యాత్మా భగవానీశ్వరోఽవ్యయః
ప్రత్యగాత్మస్వరూపేణ దృశ్యరూపేణచ స్వయం
వ్యాప్యవ్యాపకనిర్దేశ్యో హ్యనిర్దేశ్యో వికల్పితః
కేవలానుభవానందస్వరూపః పరమేశ్వరః
మాయ యాంతర్హితైశ్వర్య ఈయతే గుణసర్గయా[21]

వ॥ గుణసామ్యంబైన ప్రధానమందును గుణవ్యతికరంబైన మహత్తత్త్వాదియందును, రజస్సత్త్వతమో గుణంబుల గలిగి కేవలాను

భవానందస్వరూపకుండు ననిర్దేశ్యుండునైన పరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైన తన దివ్యమాయచేత నంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపక రూపంబులం జేసి దృశ్యుండును, ద్రష్టయు, భోగ్యుండును, భోక్తయునై నిర్దేశింపన్ దగి వికల్పితుండై యుండు.[53]

పై వాక్యములలో నిర్వికల్పమగు బ్రహ్మము మాయచే జీవజగ ద్రూపముల వికల్పితమైనదనియు, పరమాత్మ చిదానందస్వరూపుడేకాని చిదానంద గుణవంతుడు కాడనియు స్ఫుటమగుచున్నది. ఆ ప్రాంతముననే బాలకులకు ప్రహ్లాదుడు ఆత్మ యొక్క ద్వాదశలక్షణములను వివరించి తద్విభుత్వము నిట్లు విస్పష్టము చేసినాడు.

శ్లో॥ ఆత్మా నిత్యోఽవ్యయ శ్శుద్ధో హ్యేకః క్షేత్రజ్ఞ ఆశ్రయః
అవిక్రియః స్వదృగ్హేతు ర్వ్యాపకోఽసంగ్య నావృతః[53]

వ॥ ఆత్మ నిత్యుండు క్షయరహితుండు, శుద్ధుండు క్షేత్రజ్ఞుండు గగనాదులకు నాశ్రయుండు, క్రియా శూన్యుండు స్వప్రకాశుండు, సృష్టిహేతువు, వ్యాపకుండు, నిస్సంగుండు, పరిపూర్ణుండు నొక్కండు.[54]

ఇది పరిపూర్ణమగు అద్వైతమను మాట నిస్సందేహము.

11. బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుడగు నారాయణుని స్తుతించునప్పుడుద్వైతభావమే స్పష్టముగా గోచరించుచున్నది.

శ్లో॥ ననామరూపే గుణకర్మజన్మభిః
నిరూపితవ్యే తవ తస్య సాక్షిణః
మనోవచోభ్యా మనుమేయవర్త్మనో
దేవక్రియాయాం ప్రతియంత్యథాపిః[55]

సీ॥ ...సాక్షివగుచు

వాఙ్మనంబులకు నవ్వలయైన మార్గంబు
గలుగు నీగుణజన్మకర్మరహిత

తే॥ మైనరూపును పేరునత్యనఘుబుద్ధు
లెరుగుదురు నిన్ను గొల్వనూహించుకొనుచు[56]...

వ॥ ...బ్రహ్మము గుణకర్మజన్మాది విశేషరహితమని ఇక్కడ పలుకబడినది.

12. బ్రహ్మము యొక్క ఇట్టి నిర్విశేషత్వమే దేవకీకృత విష్ణుస్తుతిలో కూడ విస్పష్టముగా కన్పించుచున్నది.

శ్లో॥ రూపం యత్తత్ ప్రాహు రవ్యక్త మాద్యం
బ్రహ్మజ్యోతి ర్నిర్గుణం నిర్వికారం
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం
సత్వం సాక్షాద్విష్ణు రధ్యాత్మదీపః[57]

సీ॥ అట్టిట్టి దనరాని దై మొదలై నిండు
కొన్నదై వెలుగుచు గుణములేని
దై యొక్క చందంబుదై కలదై నిర్వి
శేషమై క్రియలేక చెప్పరాని
దీరూపమని శ్రుతులెప్పుడు నుడివెడి
యారూపమగుచు నధ్యాత్మదీపమై...[58]

13. బ్రహ్మకృత కృష్ణస్తుతిలో అతివిస్పష్టమగు నద్వైతార్థము కానవచ్చుచున్నది.

శ్లో॥ తస్మాదిదం జగదశేష మసత్స్వరూపం
స్వప్నాభ మస్తధిషణం పురుదుఃఖదుఃఖం
త్వయ్యేవ నిత్యసుఖబోధతనా వనంతే
మాయాత ఉద్యదపి యత్సదివా విభాతి.[59]

శ్లో॥ ఏక స్త్వమాత్మా పురుషః పురాణః
సత్య స్స్వయంజ్యోతి రనంత ఆద్యః
నిత్యఽక్షరోఽజస్రసుఖో నిరంజనః
పూర్ణాద్వయో ముక్తఉపాధితోఽమృతః[60]

సీ॥ అదిగాన నిజరూప మనరాదు కలవంటి
దై బహువిధదుఃఖమై విహీన

సంజ్ఞానమై యున్న జగము సత్సుఖబోధ
తనుడవై తుదిలేక తనరు నీవు
మాయచే బుట్టుచు మనుచు లేకుండుచు
నున్న చందంబున నుండుచుందు
వొకడ వాత్ముడ వితరోపాధి శూన్యుండ
వాద్యుండ వమృతుండ వక్షరుండ.

ఆ॥ వద్వయుండవును స్వయంజ్యోతి వాపూర్ణు
డవు పురాణపురుషుడవు నితాంత
సౌఖ్య నిధివి నిత్య సత్యమూర్తివి నిరం
జనుడవీవు తలపజనునెనిన్న.[61]

సృష్టికర్తయగు బ్రహ్మ వాక్కులలో అద్వైతదృష్టి పరిస్ఫుటమగుట సహజమే

భాగవతమునందంతట సామాన్యముగా ఈ విధముగానే అద్వైతమత సిద్ధాంత ప్రతిపాదకములగు వాక్యములు గోచరించుచుండును. అందాది మధ్యాంత వేదాంత ఘట్టములుగా హరిఉపదేశము శ్రుతిగీతలు, ఉద్దవగీతలు చెప్పబడును. హరి యుపదేశములో అద్వైతాత్మకత్వమే ఉండుట పై యుదాహరణములలో గమనింప బడినది. ఉద్ధవగీతలు తెనుగున నారయ రచనలోనివి. దశమస్కంధోత్తర భాగము లోని శ్రుతి గీతలనటనట విశిష్టాద్వైతపరవాక్యములు కలిగియున్నను మొత్తముమీద నద్వైతపరమే. ఈ ఘట్టము సరిగా ననువదింపబడలేదని పండితులు భావించు చున్నారు శాస్త్రీయఘట్టములు యథామూలానువాదము నపేక్షించును సహజమగు తన అనువాదపద్ధతి ననుసరించి ఇతరఘట్టములలో వలెనే వేదాంతసందర్భములలో కూడ యథామూలముగా ననువదింపవలెనను దీక్షలేని మార్గము ననుసరించుటచే పోతన వానిని సరిగా ననువదింపలేదని విద్వల్లోకమున నొక ప్రతీతి ఏర్పడినది.

ఏదైనను భాగవతములో ప్రధానఘట్టము లన్నింటిలోను అద్వైతమత ప్రతిపాదనమే కన్పించుచున్నదను విషయముపైన నిరూపింపబడినది. కాగా పోతన రచించిన వివిధ స్కంధములలో విశిష్టాద్వైత పరవాక్యములు అక్కడక్కడ కలవు. అంతమాత్రమున పోతన విశిష్టాద్వైతియనిగాని భాగవతములో నతడు విశిష్టాద్వైత

సిద్ధాంతములు ప్రతిపాదించెనని గాని చెప్పవలనుకాదు మరి అట్టివాక్యములీ గ్రంథమున నేల ప్రవేశించినవను ప్రశ్న వచ్చును. దాని సమాధానమిది.

భక్తిప్రధానమగు భాగవత గ్రంథతత్త్వమే అట్టిది. భక్తిమార్గము నత్యంత ప్రచురముచేసిన రామానుజుల విశిష్టాద్వైత సిద్ధాంతములు భక్తిపథప్రస్థానములగు గ్రంథములపై ప్రభావముచూపుట అత్యంత సహజము. అందును భగవల్లీలా విలాసములు వర్ణించుచు భక్తిప్రభావమును బహుముఖముల ప్రసారముచేయు భాగవతమువంటి దాని ననువదించునప్పుడు తత్సంబధములగు భావములు వచ్చుట ఆశ్చర్యముకాదు. కావుననే తానద్వైతియయ్యును జ్ఞానముయొక్క పరమోత్కృష్టత నెరిగినవాడయ్యును ఆయాసిద్ధాంతములను విస్పష్టముగా తన గ్రంథమున ప్రకటించియును భక్తిపరవశుడై రచించిన కొన్ని సమయములందు భక్తియే సర్వాధికమని పోతన రచించినాడు.[62] అట్టి రచనా సమయములలో కొన్ని విశిష్టాద్వైతపరవాక్యములు కన్పించిన కన్పింపవచ్చును. పోతనయు మతసామరస్యము కలిగిన శాంతిపురుషుడేకాని వీరమార్గనిష్ఠుడుకాడు. అదియునుగాక మతదీక్ష కవిత్వ లక్షణము కాదు. కవిత్వములో అన్యమతదృష్టి రారాదను తర్కదృష్టి అంగీకార్యము కాదు అందుచేతనే అద్వైతపరముగా పోతన రచించిన వివిధ స్కంధములలో భాగవత మార్గానుగుణముగా అటనట విశిష్టాద్వైతపర వాక్యములు కన్పించుచుండును.



# భాగవత తత్త్వము - భక్తి

'భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా నటీకయా' భాగవతము నర్థము చేసికొనుటకు పాండిత్యముగానీ, వ్యాఖ్యానసాహాయ్యముగానీ సరిపోదు. భక్తి మాత్రమే భాగవతము నెరుక పరచగలదు. అని సంప్రదాయవేత్తలగు విబుధుల అభిప్రాయము.

అనంత సౌందర్యసముపేతమగు సూర్యోదయ, సూర్యాస్తమయములను చూచి. అఖండోల్లాసము నిచ్చు చల్లని వెలుగును చూచి, భువన భయంకరమగు కార్చిచ్చును జూచి, ఆకాశమునుండి ఎవరో క్రుమ్మరించినట్లుగా కురియు మహా వర్షములను వీక్షించి, మహోన్నత పర్వతములనుకాంచి, అంతులేని సముద్రమును కన్గొని ఆనందపరవశుడై భయసంచకితుడై ఆశ్చర్యోద్విగ్నుడైన ఆదిమమానవుడు ఈ మహత్తర కార్యములన్నింటికిని ఎవరో ఒక కర్త ఉండి ఉండునని ఊహించుటకు మొదలుపెట్టిననాడే సృష్టిలో భక్తిభావ ముదయించినది. సూర్యుని చూచి వికసించు పద్మములో, చంద్రునిచూచి రేకులువిప్పుకొను కలువలో. వెన్నెలను చూచి ఉప్పొంగు సముద్రములో ఆ భక్తిభావమునే ఆతడు దర్శించెను. సృష్టిలోని అనంత విశేషములకు మూలకారణమైన ఆమహాశక్తి సంపన్నున కంజలిగావించుటకై ఉదయించిన తలపే భక్తియొక్క ప్రాథమిక స్వరూపము. అపారతమోమగ్నమైన భయంకర ప్రకృతిలో వెలుగుబాటలు చూపింపుమని ప్రాచీనార్యఋషులు కావించిన ప్రార్థనలు వేదఋక్కులలో శాశ్వతముగా నిలిచి చరిత్రకందని ప్రాచీనుల భక్తి భావనలను మనకు తెలియ జేయుచున్నవి.

కం॥ లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగినతుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్.[1]

అని పోతన భావించినది - కొన్నివేల సంవత్సరముల క్రింద వ్యాసుడు భావించినది ఆ ఆర్షమగు భక్తిభావననే.

అనంతమహిమాన్వితమును, బహువిశేష సంయుతమును నగు సృష్టినిచూచి దీనికి మూలకారకుడగు సర్వేశ్వరుని దర్శింపవలెనని ఒక మహోత్కంఠ మానవుని మస్తిష్కములో బయలుదేరిన నాటినుండి దానికొరకై అనేక విధములగు ఆరాధనా విధానములు బయలుదేరినవి. ఈ అఖండ భూమండలములోని వివిధ భాగములలో వెలసిన మానవజాతులలో కాలక్రమమున వచ్చిన మార్పుల కనుగుణముగా ఎందరో దేవతలు ఎన్నో అర్చన పద్ధతులు రూపొందినవి. ఐనను వీని అన్నింటి కిని వెనుక మానవ హృదయములో నుప్పొంగెడి భక్తియే అనుస్యూతమగు సమాన లక్షణము.

ప్రతి మతములోను భగవత్ప్రీతికై యజ్ఞయాగములవంటి కర్మకాండలు నెలవుచేసికొన్నవి. భారతీయ సిద్ధాంతము ననుసరించి ఇవి అన్నియును సగుణ కర్మలు. వీని అన్నింటిలోను భక్తి సుతిమెత్తనిది. భగవంతునకును, తదాశ్రితు నకును మధ్య వెలసిన అత్యంత సుకుమార సంబంధమది.

భక్తి స్వరూపమును గూర్చి మహాపురుషు లనేకవిధములుగ తమకు తోచిన నిర్వచనములు కావించిరి,[2] సర్వమత గ్రంథములలో భగవద్భక్తియొక్క తత్వము మిక్కిలి ప్రధానముగా ప్రస్తావింపబడినది.

శ్లో॥ మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతా.

ద్వంద్వరహితుడై నిత్యమును అపారశ్రద్ధతో అన్యచింతమాని ఉపాసించు టయే భక్తియని భగవద్గీతవలన తెలియుచున్నది.

శ్లో॥ అనన్యమమతా విష్ణౌ మమతా ప్రేమసంగతా
భక్తి రిత్యుచ్యతే భీష్మ ప్రహ్లాదోద్ధవనారదైః

విష్ణునియందు ప్రేమసంగతమగు అనన్యమమతయే భక్తియని భీష్మ ప్రహ్లాదదోద్ధవనారదులు పలికిరని పై నారద పాంచరాత్ర శ్లోక నిర్వచనము

శ్లో॥ ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తిః భక్తి రిత్య భిధీయతే.

సర్వేశ్వరునియందలి ధారావాహికమగు మానసిక వృత్తియే భక్తియని భక్తి రసాయన గ్రంథము తెల్పుచున్నది.

శ్లో॥ యా ప్రీతిరస్తి విషయేష్వవివేకభాజాం
సైవాచ్యుతే భవతి భక్తిపదాభిధేయా

అవివేకులకు విషయవాంఛలయందే ప్రీతియుండునో అదియే అచ్యుతునియందైనచో భక్తియని పిలువబడునని ద్రవిడోపనిషత్సార సంగ్రహము భావించుచున్నది.

వ. భక్తిరస్య భజనం; ఏత దిహాముత్రోపాధినైరాశ్యే నాముష్మిన్ మనః కల్పం-భక్తియనగ భగవత్సేవ ఇహపరసుఖానపేక్షముగా మనస్సు భగవంతునియందు లయింపజేయుటయే అది అని గోపాలపూర్వతాపన్యుపనిషత్తు నిర్వచించినది.

శ్లో॥ అన్యాభిలషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతం
ఆనుకూల్యేన కృష్ణానుశీలనా భక్తిరుత్తమా.

వేరుకోరికలు లేక జ్ఞానకర్మాదులేవియును ఆవరింపక అనుకూలముగా కృష్ణననుశీలించుటయే ఉత్తమ భక్తియని భక్తిసారామృత సింధువు నిర్వచించినది.

ఇంకను ఋషులు, ఋషితుల్యులును నగు మహానుభావులెందరో భక్తిని తమ హృదయములలో భావించి నిర్వచించినారు. భగవంతుని యెడ పరమ ప్రేమనుండుటయే భక్తియని భక్తిమీమాంసయందు శాండిల్యమహర్షి పల్కియున్నారు. ఆత్మరత్యవిరోధముగా కాయికవాచికాదిపూజలు సేయుట శాండిల్య మతభక్తియని నారదభక్తి సూత్రములు[3] తెల్పుచున్నవి. భగవన్మహిమానుభూతి వలన కలుగు ప్రీతియే భక్తియని స్వప్నేశ్వరుడు వక్కాణించియున్నాడు. భగవంతుని పూజించుటమున్నగువానియందలి అనురాగమే భక్తియని పారాశర్యమతము.[4] భగవత్కథాదులను వినుటయే భక్తియని గర్గమతము. జ్ఞానకర్మ రూపావరణములను తొలగించి అనన్య కాంక్షారూపముగా భగవదనుభూతి నొందుటయే భక్తియని రూపగోస్వామి భావించెను. భగవద్దర్శనమే పరభక్తియనియు పరజ్ఞానము సంగమమనియు పునర్విశ్లేషభీరుత్వమే పరమ భక్తియనియు యామునాచార్యులు సంభావించినారు

త్రిమతాచార్యులును భక్తిస్వరూపములను గూర్చి నిర్వచించి యున్నారు అందు శంకరుల నిర్వచన మిది.

శ్లో॥ స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే
స్వాత్మతత్త్వానుసంధానం భక్తి రిత్యపరే జగుః —వివేకచూడామణి

స్వస్వరూపానుసంధానమే భక్తి యని కొందరును, స్వాత్మతత్వానుసంధానమే భక్తియని మరికొందరును పల్కుచున్నారు.

రామానుజులు తమశ్రీభాష్యమున నిట్లుపల్కినారు—తత్ర భక్తిర్నామ నిరవధికానంతానవద్యకళ్యాణగుణత్వజ్ఞాన పూర్వకః స్వస్వాత్మాత్మీయ సమస్త వస్తుభ్యః అనేక గుణాధికః, అంతరాయసహస్రే ణాప్య ప్రతిబద్ధః నిరంతర ప్రేమ ప్రవాహః—కల్యాణగుణాత్మకమై బహుధావిశిష్టమైన ఎన్ని ఆటంకములచేతను కట్టువడని నిరంతర ప్రేమ ప్రవాహమే భక్తి.

మధ్వాచార్యులు మహాభారత తాత్పర్య నిర్ణయ గ్రంథమున ఇట్లు వచించినారు.

శ్లో॥ మాహాత్మ్య జ్ఞానపూర్వస్తు సుదృఢ స్సర్వతోఽధికః
స్నేహో భక్తిరితి ప్రోక్తః తయా ముక్తి ర్నచాన్యథా.

మాహాత్మ్య జ్ఞానపూర్వకమై అన్నిటికంటె గొప్పదై మిక్కిలి బలమైన స్నేహమే భక్తి. దానివలన మాత్రమే ముక్తి కలుగును.

భక్తియొక్క స్వరూప స్వభావములను గూర్చి నారద భక్తి సూత్రములు విపులముగా చర్చించినవి. వివిధ భక్తి మార్గములలోని విశేషములను ప్రస్తావించి సకలాచారములను భగవదర్పణముచేసి తద్విస్మృతిచే పరమవ్యాకులు డగుట భక్తియని అవి సిద్ధాంతీకరించినవి.[5] భగవద్వియోగ దుస్సహత్వమే భక్తి లక్షణ మనుట అందలి సర్వసూత్రసారము.

భక్తి మహోత్తమ ప్రేమరూపము[6] అది సాధనావస్థయందపరభక్తియనియు, సిద్ధావస్థయందు పరాభక్తియనియు పిలువబడును. సత్వరజస్తమోగుణ భేదములను బట్టియు, ఆర్తి జిజ్ఞాస అర్థార్థి అనువానిని బట్టియు అపరభక్తి లేక గౌణ భక్తి త్రివిధము. ఈ మూటిలో పూర్వపూర్వములు శ్రేష్ఠతరములు. ఇవి ముఖ్యభక్తికి దారితీయును. ముఖ్యభక్తి పరాభక్తిగా పరిణమించును.

భక్తి కర్హతా నర్హతలులేవు. సర్వజీవులును తత్సాధనకు తగుదురని మధుసూదన సరస్వతి నిర్వచించినాడు మన పురాణ వాఙ్మయములో భక్తులును, ముక్తులును నగు తిర్యగ్యోనుల కథలెన్నో కలవు. భగవంతునియందు భక్తి నిలుచుటకు తత్సంబంధమగు అనుస్యూత భావమొకటి మనస్సున నిలువవలెను.

భావనాత్మకమైన మనస్సు పశుపక్షి మృగాదులలో నుండుట కవకాశములేదు. సూక్ష్మమును, భాషాసహాయ్యాసాపేక్షకమును నగు ఆలోచన శక్తి వాని మెదడునకు లేదు. పురాణ కథలలోని ఆయామృగాదులు భావయుతములుగా గోచరించును. అటువంటి వున్నచో వానికి మానవుల భక్తివంటిది ఉండవచ్చును. కానీ అవి భక్తి ప్రభావమును శ్లాఘించుటకై చేయబడిన అర్థవాదములనియు మనుష్య జన్మ మాత్రమే భక్తికి యోగ్యమైనదనియు బ్రహ్మసూత్ర భాష్యములో శంకరులు సిద్ధాంతీకరించిరి (హృద్యపేక్షయాతు మనుష్యాధికారత్వాత్.[7]) మనుష్యులలో ఎవ్వరైనను ముక్తి కర్హులే. జాతిమత లింగభేదము లేవియు భక్తిముక్తులకు పనిలేదు. విదురుడు, ధర్మవ్యాధుడు మొదలగు వారిందులకు నిదర్శనమని శంకరులు పల్కి యున్నారు.[8]

మనోవాక్క్రియాభేదముల భక్తి త్రివిధము. కవిత్వము వాగ్రూపమగు నారాధనము క్రిందికి వచ్చును. ఈశ్వరస్తుతులు వాఙ్మయాధ్వరార్చనములని తిక్కన భారతమున వృషాకపిస్తుతిలో పలికియున్నాడు.[9]

భక్తి యోగమునకు వివేకము, విమోహము, అభ్యాసము, క్రియ, కళ్యాణము, అనవసాదము, అనుద్ధర్షత ఈ ఏడును ముఖ్య పూర్వాంగము లని రామానుజమతము. ఇది మంచి, ఇది చెడు అని తెలిసికొనుట వివేకము. దేని యందును కోరిక లేకుండుట విమోహము. నిత్యానుష్ఠానమే అభ్యాసము. స్వపర భేదములేక సహాయము చేయుట క్రియ. అహింస, సత్యము, సద్వర్తనము. భూత దయ, మొదలగు గుణములు కలిగియుండుట కళ్యాణము. సంతోషముతో నుండుట అనవసాదము. ఉద్వేగములేమి అనుద్ధర్షము.

మహాత్ములసేవ, తద్దయాపాత్రత, ధర్మశ్రద్ధ హరిగుణ శ్రవణము, రత్యంకురోత్పత్తి, స్వరూపాధిగతి, పరానంద ప్రేమవృద్ధి, భగవత్ స్ఫురణము, భగవద్ధర్మనిష్ఠ, భగవద్గుణ శాలిత్వము, పరాకాష్ఠప్రేమ-భక్తి భూమికలని భక్తి రసాయన గ్రంథము పలికినది వీనినే శాస్త్రీయోపాయములని కొందరందురు. శ్రద్ధా సంగము, భజనక్రియ, అనర్థనివృత్తి, నిష్ఠారుచి, ఆసక్తి, భావము, ప్రేమ, భక్తి భూమికలని భక్తిరసామృత సింధువు తెలిపినది పూర్వరాగము, మిళనము, సంభోగము, విరహము, భావసమ్మేళనము అనునవి భక్తిభూమికలని వంగదేశ వైష్ణవసంప్రదాయజ్ఞుల అభిప్రాయము. సుఖేచ్ఛ, విచారణ, తనుమానసికత్వము,

సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థభావన తురీయగ అనునవి భక్తిభూమికలని యోగ వాసిష్ఠ వరాహోపనిషత్తులు చెప్పినవి జైనమతములోని చతుర్దశ గుణస్థానములును, మహాయానబౌద్ధములోని దశపారమితలును మన భక్తి భూమికలవంటివే యని కొందరు విద్వాంసుల తలపు.

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము—భక్తి యొక్క నవలక్షణములని భాగవత మతము. మూలములోని[10] దీనిని పోతన ఇట్లు రమ్యముగా భావించెను.

తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయునాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం
బనునీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచుదలతున్సత్యంబుదైత్యోత్తమా[11]

ఆసక్తినిబట్టి భక్తిని పదునొకండు విధములుగా నారద భక్తిసూత్రములు విభాగించినవి.[12] 1, గుణమాహాత్మ్యాసక్తి - నారద, భీష్మాదులు. 2. రూపాసక్తి-బృందావనాదిస్త్రీలు. 3. పూజాసక్తి – అంబరీషాదులు. 4. స్మరణాసక్తి – ప్రహ్లాదాదులు. 5. దాస్యాసక్తి – హనుమదాదులు. 6. సఖ్యాసక్తి – ఉద్ధవార్జునాదులు. 7. వాత్సల్యాసక్తి – యశోదా దేవకీ కౌసల్యాదులు. 8. కాంతాసక్తి – రుక్మిణీ సత్యభామాదులు. 9. ఆత్మనివేదనాసక్తి – బలి విభీషణాదులు. 10. తన్మయతాసక్తి – సనత్కుమారయాజ్ఞవల్క్యాదులు. 11. పరమ విరహాసక్తి – గోపికాది మధురభావుకజనములు.

భక్తిరసమా భావమా అను అంశమును గూర్చి ప్రాచీనాలంకారికులెన్నో రీతుల తర్కించిరి.[13] పరమేశ్వర విషయిక రతి హర్షోత్సాహాదివ్యభిచారి భావముల లోనే చేరును. కావున స్థాయిభావస్థితినందుకొనక పోవుటచే భక్తిరసత్వమును పొందదని ధనంజయుడు దశరూపకమున పలికెను హేమచంద్ర మమ్మటులును భక్తికి రసత్వమును నిరాకరించిరి. భక్తికి విభావానుభావాది సామగ్రిని నిర్దేశించిన జగన్నాథ పండితరాయలును వాదప్రతివాదములు ప్రదర్శించి తుదకు దానికి రసత్వ మును తిరస్కరించెను. ఈవిధముగా నించుమించలంకారశాస్త్రజ్ఞులందరును భక్తి రసము కాదనియు, భావమే యనియు నిర్ధారణ చేసిరి. ఉజ్జ్వలనీలమణి కర్తయగు రూపగో

స్వామియు, భక్తిరసాయన కర్త యగు మధుసూదనసరస్వతియు భక్తికి రసత్వ మును ప్రతిపాదించిరి. కేవలము గోపికాకృష్ణ శృంగారమును మాత్రమే భావించిన గోస్వామిసిద్ధాంతము భక్తిలో నేకదేశమును మాత్రమే స్పృశించినది. మహాపండితు డును పరివ్రాజక శిరోమణియునగు మధుసూదనసరస్వతి సమగ్రమును, సర్వాం గీణమును తర్కసహమునునగు భక్తిరసమును సంస్థాపించెను. ఈయన ప్రతిపాదిం చిన భక్తిరసమునకు ఆలంబనవిభావము భగవంతుడు. తచ్చరిత్ర లుద్దీపన విభావము తత్స్మయసంజాతములగు ఆంగికవికారములు అనుభావములు. నిర్వేదశంకాహర్షా దులు వ్యభిచారులు. భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావము. అప్పుడే ఆనంద స్వరూపమగు రసముదయించును. ఈవిధముగా భక్తి రసస్వరూపమును వివరించి ఆతడు కాంతాదివిషయికమగు లౌకికరతియందు పూర్ణసుఖములేదనియు కాన శృంగా రాదులు క్షుద్రరసములనియు, భగవద్రతిమాత్రమే పూర్ణరసమనియు, మిణుగురు పురుగులకన్న ఆదిత్యప్రభ ఎట్లు బలవత్తరమో మిగిలిన రసములకన్న భక్తి అట్లు శ్రేష్ఠతరమనియు వాదించెను.

భక్తి, జ్ఞాన, కర్మయోగములు మూడును ముక్తికి మార్గములని భగవద్గీత మనకు తెలుపుచున్నది. భక్తికిని జ్ఞానమునకును అవినాభావసంబంధము కలదనువిషయ మును విద్వాంసులు గుర్తించియున్నారు. వృత్తిస్తంభనమైన ఏకాంతభక్తినే పరా భక్తియని కొందరును జ్ఞానమని కొందరును భావించిరి. రెంటికిని నామభేదమేకాని స్థితిభేదములేదని పలువుర అభిప్రాయము. భగవద్గీతలోని భక్తియోగ జ్ఞానయోగ సంబంధములగు శ్లోకములను పరిశీలించినయెడల ఈవిషయము స్పష్టముగా నిరూపిత మగుచున్నది. రెండుస్థితుల వర్ణనలకును తాత్పర్యభేదమంతగా కన్పట్టదు. అద్వైత మత ప్రస్థాపనాచార్యులగు ఆదిశంకరులు ఏమార్గమున సాధనచేసినను జ్ఞానము లేక ముక్తిరాదని సిద్ధాంతీకరించుటచే భక్తి యనునది జ్ఞానమునకు పూర్వాంగమని కొందరి అభిప్రాయము. భక్తికిని, బ్రహ్మవిద్యకును కల భేదసాదృశ్యములను తర్కించిన వారిలో పరివ్రాజక శిరోమణియగు మధుసూదన సరస్వతి అగ్రగణ్యుడు. అయన తన భక్తిరసాయన గ్రంథమందు భక్తియు, బ్రహ్మవిద్యయు ఒక్కటియైనను వాని స్వరూపసాధనఫలాధికారములందు భేదమున్నదని ఈక్రిందివిధముగా నిరూపించెను.

1. భక్తియందు చిత్తము ద్రవీభూతమై ప్రేమాకారమును దాల్చుచున్నది. బ్రహ్మ విద్యయందట్టిది కాక ఏకాగ్రవృత్తితో అవ్యక్తమందు నిలుచుచున్నది.

2. మనస్సు భక్తియందు సవికల్పము. బ్రహ్మవిద్యయందు నిర్వికల్పము
3. భక్తికి భగవల్లీలావిశేషజ్ఞానము సాధనము. బ్రహ్మవిద్యకు తత్వమస్యాది ఉపనిషద్వాక్యజ్ఞానము సాధనము.
4. భక్తికి భగవత్ప్రీతి ఫలము. బ్రహ్మవిద్యకు అజ్ఞాననాశనము ఫలము
5. భక్తియందు ప్రాణిలోకమునకెల్ల అధికారము కలదు. బ్రహ్మవిద్యకు సాధనచతుష్టయాది సంపన్నులకే అధికారము

ఈభేదమెల్ల సాధనక్రమసంబంధమేకాని అనుభూతి సంబంధము కాదనియు గంతవ్యము సమానమేయనియు కొందరిసమన్వయము. ఏదైనను భక్తిలో ఒక దేవతను ప్రార్థించుట కలదు. ఆదేవత అనుగ్రహముచే తత్సాక్షాత్కారము పొందిన భక్తుడు ఆదేవత నివసించు లోకమునకు చేరుటో, తత్సమానరూపమును పొందుటో. ఆ దేవతయందు లీనమగుటో జరుగును. ఆదేవత ఉన్నంతకాలముండి ఆజీవి తదనంతరము ముక్తికిపోవును. ఆజీవుడు పునర్జన్మ పొందకపోయినను ఆదేవునిలోనో. తల్లోకములోనో ఉండుట తప్పదు. శంకరుడు బోధించిన ముక్తివీనికతీతమైనది. తానే బ్రహ్మస్వరూపుడగుట (ఇది బ్రహ్మముకాని బ్రహ్మకాదు) దాని లక్ష్యము. సారూప్యసాలోక్యాది సర్వవిధముక్తులకంటె అది అతీతమైనది

భాగవతము ప్రాయికముగా నద్వైతమత సిద్ధాంతము నంగీకరించి జ్ఞానము యొక్క సర్వాధికతను బోధించుగ్రంథమే; అయినను విష్ణుభక్తి ప్రకటనము దాని రచనోద్దేశమగుటచే అడుగడుగునను తత్ప్రాధాన్యమే గోచరించును వాసుదేవ భక్తి ప్రధానమగు ఈ భాగవతమునకు సంబంధించిన మతము మనదేశమున నొకప్పుడు బాగుగా నెలకొనియున్నట్లు చరిత్రపుటలలో కానిపించుకున్నది. ఇటీవల దొరకిన బెస్‌నగర శాసనములో హెలియోడోరా అను యవనరాయబారి తాను భాగవతుడనని చెప్పుకొన్నాడు. వాసుదేవుని గౌరవించుటకై అతడు గరుడధ్వజాత్మకమగు నొక స్తంభమును స్థాపించెను. ఈ శాసనము క్రీ. పూ. 2శ. కన్న ముందుది కావున నాటికే వాసుదేవుడు దేవదేవుడుగా పూజింపబడుచున్నట్లు తెలియుచున్నది. ఈ విధముగా ఘొసుండిలోని శాసనమునుబట్టియు, సమకాలిక బౌద్ధమత గ్రంథములను బట్టియు వాసుదేవారాధన మత్యంత ప్రాచీనకాలముననే వెలసినట్లు తెలియుచున్నది. పాణిని రచించిన అష్టాధ్యాయి సూత్రములలో వృష్ణివాసుదేవశబ్దముల నిష్పత్తి చెప్పబడినది. పతంజలి ఆ ప్రాంతమున ఈ వాసుదేవ సంజ్ఞ క్షత్రియ సంబంధము

కాదనియు, భగవత్సంబంధమనియు వ్యాఖ్యానించెను. ఈవాసుదేవ ప్రసంగ మత్యంత ప్రాచీనమగు పాంచరాత్రాగమములో ప్రధానముగా చూపట్టును. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ వ్యూహములును, తదర్చావిధానములును అందు విపులముగా కలవు. చతుర్వ్యూహాత్మకమగు నీ మతములో వ్యూహత్రయమునకు ప్రాధాన్యము తొలగి వాసుదేవారాధనము మాత్రమే దేశమున పాదుకొన్న కాలములో భాగవత రచన జరిగియుండునని కొందరాధునిక పండితుల అభిప్రాయము.[14] ఈ సంగతి ఎట్లైనను వాసుదేవుడగు విష్ణుని భక్తిని ప్రబోధించుటయే భాగవతలక్ష్యము.

ప్రపంచములో నే మతములో కన్పింపనిదియు, ఒక్క భాగవతమే ప్రతిపాదించి నిరూపించునదియు అగు మహావిశేష మొకటి కలదు. అది ఏమనగా శత్రుత్వముచేతనైనను భగవంతుని చేరుకొనవచ్చుననుట. భగవదనుబంధమునకు భావతీవ్రతయే ప్రధానముగాని అది ఏ భావమనునది ప్రధానముకాదని భాగవత సిద్ధాంతము. అంతేకాక ఒకప్పుడు వైరభావముచేతనే ముక్తి త్వరగాలభించుట కలదని భాగవతము పల్కుచున్నది.

కం॥ వైరానుబంధనంబున
జేరిన చందమున విష్ణుజిరతరభక్తిన్
జేరగరాదని తోచును
నారాయణ భక్తియుక్తి నాచిత్తమునన్[15]

ఈవిధమగు వివిధభక్తి విశేషములను భిన్నపాత్రల వశమున మూలమననుసరించియు, తాను కొంత పెంచియు భక్తివైభవమును పోతన కవితారూపమున నందించినాడు. ఏభావము నాశ్రయించి యైనను ముక్తి నొందవచ్చునని ఆయన రచించిన మూలానుసారియగు పద్యమును చూడుడు.

శా॥ మోహోత్కంఠతగోపికల్ భయమునంగంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేమునిదె చక్రింగంటి మెట్లైనను
ద్దామధ్యాన గరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా![16]

భక్తి కారణములను వివరించుచు ప్రథమస్కంధములో నొక విశిష్టమగు విపులీకరణము చేయబడినది.

శ్లో॥ యదనుధ్యాసినా యుక్తాః కర్మగ్రంథి నిబంధనం
ఛిందంతి కోవిదాస్తస్య కో నకుర్యాత్ కథారతిం
శుశ్రూషోః శ్రద్ధధానస్య వాసుదేవకథారతిః
స్యాన్మహత్సేవయా విప్రాః పుణ్యతీర్థనిషేవణాత్
శృణ్వతాంస్వకథాః కృష్ణపుణ్యశ్రవణకీర్తనః
హృద్యంతస్థోహ్యభద్రాణివిధునోతిసహృత్సతామ్.
నష్టప్రాయే ష్వభద్రేషు నిత్యం భాగవతసేవయా
భగవత్యుత్తమశ్లోకే భక్తిర్భవతి నైష్ఠికీ.[17]

దీనికి పోతన అనువాదము—

వ. చక్రాయుధ ధ్యానమనుఖడ్గంబున వివేకవంతు లహంకార నిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు. భగవంతునియందు శ్రద్ధయు అపవర్గదంబగు తత్కథాశ్రవణాదు లందత్యంతాసక్తియు, పుణ్యతీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించు కర్మనిర్మూలన హేతువులైన కమలలోచన కథలందెవ్వఁడు రతిసేయు విననిచ్ఛగించువాని కితరంబులెవ్వియు రుచిపుట్టింపనేరవు. పుణ్యశ్రవణకీర్తనుండైన కృష్ణుండు తన కథలు వినువారిహృదయంబులందు నిలిచి శుభంబులాచరించు. అశుభంబులు నిరసించు. అశుభంబులు నష్టంబులైన భాగవత శాస్త్ర సేవావిశేషంబున నిశ్చలభక్తి ఉదయించు[18]

భక్తి ఉదయించిన పిదప దానివలన కలుగు ఫలము— "భక్తిగలుగ రజస్తమోగుణప్రభూతంబులైన కామలోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్వగుణంబున ప్రసన్నంబగు. ప్రసన్నమనస్కుండైన ముక్తసంగుండగు. ముక్తసంగుండైన ఈశ్వరతత్వజ్ఞానంబు దీపించు ఈశ్వరుండు కానంబడిన చిజ్జడగ్రథనరూపంబైన అహంకారంబు భిన్నంబగు. అహంకారంబు భిన్నంబైన అసంభావనాది రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు. సంశయ విచ్ఛేదంబైన అనారబ్ధ ఫలంబులైన కర్మంబులు నశించు."[19]

కావుననే గురుమతులగు తపస్వులంతఃకరణములు శుద్ధిసేయు ఘనతరమగు హరిభక్తితో పునర్జన్మరాహిత్యము నొందుదురని[20] పోతన మనకు తెలిపినాడు.

దేవతలందరిలోను భక్తి సేయుటకు విష్ణువెల్లధికుడో ఇచ్చట ప్రతిపాదింపబడినది. గుణములలో నెల్ల విశిష్టమగు సత్వమే రూపొందినవాడు గావున హరియధికుడు. విష్ణువు సర్వాధికత్వమును భాగవతమిట్లు ప్రతిపాదించుచున్నది — "తొల్లి మునులు సత్వమయుండని భగవంతు హరినధోక్షజుగొలిచిరి. కొందరు సంసారమందలి మేలు కొరకు నన్యుల సేవించుచుందురు. మోక్షార్థులైనవారలు ఘోరరూపులైన భూతపతుల విడిచి దేవతాంతర నిందసేయక శాంతులై నారాయణ కథలయందే ప్రవర్తించుదురు. కొందరు రాజస తామసులై సిరియు నైశ్వర్యంబును ప్రజలనుంగోరి పితృభూత ప్రజేశాదుల నారాధించుదురు మోక్షమిచ్చుటంజేసి నారాయణుండు సేవ్యుండు. వేద యాగయోగక్రియా జ్ఞానతపోగతిధర్మంబులు వాసుదేవపరంబులు."[21]

జ్ఞానకర్మభక్తియోగములు మూడును మోక్షము నిచ్చునను సిద్ధాంతమును భాగవతమంగీకరించుచునే అందుభక్తియోగము ప్రధానమని నొక్కిచెప్పును. భగవంతుడుద్ధవునకు చేసిన బోధలో భక్తియోగవిశిష్టత ఇట్లు పలుకబడినది.

శ్లో॥ యత్కర్మభి ర్యత్తపసా జ్ఞానవైరాగ్యతశ్చ యత్
యోగేన దానధర్మేణ శ్రేయోభి రితరైరపి
సర్వం మద్భక్తియోగేన మద్భక్తో లభతేఽంజసా[22]

భక్తియోగము ననుసరించి భాగవతములో విష్ణువు నారాధించిన కొందరు విశిష్టజీవుల కథలుగలవు. వానిలో ధ్రువోపాఖ్యానము చతుర్థస్కంధములోనిది. ధ్రువునిది నిష్కామభక్తిగాదు. సుఖదుఃఖముల కతీతుడై ద్వంద్వరహితుడగు యోగి కాడతడు. సవతితల్లియగు సురుచి దురుక్తబాణ వినిర్భిన్నమగు నాతని చిత్తములో శాంతి లేదు. ఆతని పట్టుదలకు, మానభంగమును సహింపని ఆతని క్షాత్రధర్మ విశిష్టతకు, మనసున మెచ్చువచ్చి నారదుడతనికి వాసుదేవమంత్రము నుపదేశించెను. సకామమైనను ధ్రువుని భక్తి ఏకాగ్రమైనది. భక్తియుక్తమగు నతని తపస్తీవ్రత యెట్టిదో పోతన ఇట్లు వర్ణించెను.

చం॥ అతడు ననన్యదృష్టిని చరాచరదేహి శరీరధారణ
స్థితిగలయీశునందు తనజీవితమున్ ఘటియింపజేసి యే
కతగనదన్నిరోధమునగ్గి కొని కంపమునొందె నీశ్వరుం
డతడు చలింపనిజ్జగములన్నియుజంచలమయ్యె భూవరా![23]

తపస్సుఫలించి విష్ణుసాక్షాత్కారము కలిగి వరములనొందినను ధ్రువునకు సంతృప్తి కలగలేదట ! ఏలనగా పినతల్లి తన్ను బల్కిన దురుక్తులు మనసులో నుండుటచే నాతడు ముక్తిని కోరలేక పోయెనట.[24] తాను షణ్మాసములు భజించియు, తత్పాదపద్మచ్ఛాయం బ్రాపించియు, భేదదర్శనుడనై తిననని ఆతడు విలపించెను. దీనిచే నాతనిమనఃపరిణతి గోచరమగుచున్నది. భక్తవర్యుడగు నీతని విశిష్టతను ప్రచేత స్సత్రమున నారదుడు వీణపై పాడినాడట

భీష్ముడు జ్ఞానభక్తుడు. నారాయణుడు యాదవులందు గూఢుండై తనమాయ చేత లోకంబుల మోహాతిరేకము నొందించుచున్నాడని ఆతడెరుగును. జగదీశ్వరుడగు కృష్ణుడు పాండవుల పక్షమున నుండుటచే అటువైపు జయము తథ్యమని ఎరిగియు తనకర్తవ్యము తాను నిర్వహించుకొనుటకై కౌరవులవైపు యుద్ధము చేసిన కర్మ యోగి ఆతడు. అందుకే

మ॥ నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలో
పరులీక్షింప రథంబునిల్పి పరభూపాలావళిన్ జూపుచున్
పరభూపాయువులెల్ల జూపులన శుంభత్కేళివంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడు మనఃపద్మాసనాసీనుడై [25]

అని కృష్ణతత్వమును భావించినాడు. భక్తిపూరితుడై స్తుతించు భీష్మనిదృష్టిలో కృష్ణుని లీలావిలాసముల నద్భుతముగా భావింపజేయుచు, మూలమునకు వన్నెలు తీర్చి పోతన ప్రదర్శించిన పార్థసారధి మూర్తిని చూడుడు.

సీ॥ కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ
ఉరికిననోర్వక యుదరంబులోనున్న
జగముల వ్రేగున జగతికదల
చక్రంబు చేపట్టిచనుదెంచు రయమున
పైనున్న పచ్చనిపటము జార
నమ్మితి నాలావు నగుబాటు సేయక
మన్నింపుమని క్రీడి మరలదిగువ.

తే. కరికిలంఘించు సింహంబు కరణిమెరసి
నేడు భీష్మునిజంపుదు నిన్నుగాతు
విడువుమర్జున యనుచు మద్విశిఖవృష్టి
దెరలిచను దెంచుదేవుండు దిక్కునాకు,[26]

మనోవాగ్దర్శనంబులం బరమాత్మయగు కృష్ణుని హృదయంబున నిలుపుకొని తరించిపోయిన మహానుభావుడతడు.

భక్తురాండ్రలో కుంతీదేవి ఒక విశిష్టతకలవ్యక్తి. కృష్ణుని మహామహిమలను వీక్షించి అతడు సర్వసమర్థుడని ఎరిగి భగవంతుడని తెలిసికొని విశ్వసించినది. ఆమె యోగిని కాదు. తపస్విని కాదు. శ్రద్ధతో కృష్ణు నాశ్రయించిన భక్తిపూరిత హృదయ. "మునులకు నదృశ్యమానుండవై పరిచ్ఛిన్నుండవుగాని నీవు మూఢదృక్కులు, కుటుంబనీయులు నగు మాకునెట్లు దర్శనీయుండవయ్యెదు."[27]

"మనుష్యుల విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింపనెవ్వండు సమర్థుండు? నీకుం బ్రియాప్రియులు లేరు.[28]

"దేవానిరాశ్రయులమై భవదీయచరణారవిందంబుల నాశ్రయించి నీవారలమైన మమ్ము విడిచి విచ్చేయనేల? నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవసహితులైన పాండవులు జీవునింబాసిన యింద్రియంబుల చందంబుల కీర్తి సంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు.[29]

ఆమె పలికిన ఈవాక్యములలో వైరాగ్యరహితమగు నిష్కల్మషభక్తి ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. తన జీవితమెల్ల అనేకకష్టము లనుభవించిన ఆమె కృష్ణుని చిట్టచివర కోరినది సిరిసంపదలు రాజ్యభోగములుకావు. కనీసము తన కుమారుల శ్రేయోభివృద్ధియును కాదు నిష్కామచిత్తముతో యాదవపాండవులందు మమతా విచ్ఛేదమును, నిరంతర కృష్ణభక్తియు ఆమె అర్థించెను.

ఉ॥ యాదవులందుపాండుసుతులందు నధీశ్వర! నాకు మోహవి
చ్ఛేదముసేయుమయ్య ఘన సింధువుజేరెడి గంగ భంగి నీ
పాదసరోజచింతనముపై ననిశంబు మదీయ బుద్ధి న
త్యాదరవృత్తితోగదియునట్లుగజేయగదయ్యయీశ్వరా[30]

ఈతీవ్రవైరాగ్యభావము—త్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ![31] యను టతో పరాకాష్ఠనొందినది.

భారతపాత్రలలో ధర్మజార్జునాదిపాండవులును. మరికొందరు తదితరులును కృష్ణ భక్తులు కలరు వారిలో కొందరు కథావశమున భాగవతములో కన్పించినను భక్తి మార్గ సాధకులుగా వారికి భాగవతమున ప్రత్యేక స్థానములేదు. సఖ్యభక్తికి పరమో దాహరణమగు అర్జునుని భక్తిభావము మాత్రము ప్రథమస్కంధమున కొంత ప్రదర్శింపబడినది. తత్సఖ్యస్మరణము నర్జునుడిట్లు కావించుచున్నాడు.

సీ॥ చెలికాడ రమ్మని చీరు నన్నొకవేళ
మన్నించు నొకవేళ మరదియనుచు
బంధుభావంబును బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనములిచ్చు
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు
బోధయై యొకవేళ బుద్ధిసెప్పు
సారథ్య మొనరించు చనవిచ్చు నొకవేళ
క్రీడించు నొకవేళ గేలిసేయు

తే॥ ఒక్కశయ్యాసనంబున నుండుగన్న
తండ్రికైవడి చేసిన తప్పుగాచు
హస్తములుపట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ! మాధవు మరువరాదు.[32]

కృష్ణుడర్జునుని తొడలమీద విచ్చేసి ప్రియకాంతలు తనతోనాడు మాటలు మెల్లగా చెప్పెడివాడట. తనకాంతలమధ్య ప్రణయకలహములు తీర్చుటకై పార్థుని పంపించెడివాడట. తత్సఖుడై అర్జునుడత్యంతభక్తితో నాతడు చెప్పిన వెల్ల చేసి తన సర్వకార్యములలో తోడ్పాటు నొంది జీవితమున విజయము నొంది తరించెను. అతడంత ఉత్తమసఖ్య భక్తుడుకావుననే వేదాంతసారమగు గీతను కృష్ణుడాతని కుప దేశించెను.

సఖ్యభక్తులలో అర్జునుని వలెనే ఉద్ధవుడును నగ్రగణ్యుడు. ప్రణయినుల కలహమును తీర్చుటకై కృష్ణుడు పార్థునెట్లుపంపించెడివాడో అట్లే ఉద్ధవునిగూడ

గోపికల నోదార్చుటకై వ్రేపల్లెకు పంపెను. కృష్ణునకెంతో ఆత్మీయుడును, ప్రాణసఖుడును అగుటచేతనే గోపికలకు ప్రణయసందేశమాతని ద్వారా పంపబడినది. ఉద్ధవునకు కృష్ణుని దగ్గరగల చనవునకు గోపికలనోట పోతన పల్కించిన ఈ క్రింది పద్యము తార్కాణము.

ఏకాంతంబున నీవు పైనొరగి తానేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే రవిసుతామధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా రాసంబుమాతోడనం
గీకారంబొనరించి బంధనితతిం గ్రీడించు విన్నాణముల్.[33]

స్నేహితుడై భక్తుడై తనమాట జవదాటని ఉద్ధవునకు తన అంత్యదశలో కృష్ణుడు జ్ఞానోపదేశము చేసినాడు. ఈవిధముగా సఖ్యభక్తిలో చరితార్థమైన జీవితము గలవా డుద్ధవుడు.

హరికేకాంత భక్తుడై తరించిన వారిలో అంబరీషుడొకడు. అతడు రాజయోగి. సర్వమును హరికర్పించిన ఆ మహారాజే స్వాయత్త చిత్తముగలవాడై అల్లనల్లన రాజ్యము చేసెడివాడట.[34]

హరియందాతని సర్వార్పకత్వమెట్లు భాసించినదో ఈ క్రిందిపద్యము తెలుపుచున్నది.

సీ॥ చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద
  పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణుమందిర మార్జనములంద
  శ్రవములు హరికథా శ్రవణమంద
చూపులు గోవింద రూపవీక్షణమంద
  శిరము కేశవ నమస్కృతులయంద
పదములీశ్వర గేహ పరిసర్పణములంద
  కామము చక్రికైంకర్యమంద

తే॥ సంగమచ్యుత జనగుణ సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రి కమలమంద

రసనతులసీదళములంద రతులుపుణ్య
సంగతులయుంద ఆరాజచంద్రమునకు.[35]

భక్తుడు కోపించిన భగవంతుడు రక్షింపలేడట. భగవంతుడు కోపించినచో భక్తుడు రక్షించునట. ఇది వీరశైవుల సిద్ధాంతము. భక్తునియందు ప్రేమగల భగవంతుడాతని మాట నిలుపుటకు ప్రాధాన్యమిచ్చునని ఇందలి తాత్పర్యము. దీనినాధారము చేసికొనియే మనదేశములో రామాంజనేయ, కృష్ణార్జునయుద్ధ కథలు వెలసినవి. భక్తుని మహిమ భగవంతుని మహిమకంటె తక్కువకాదని నిరూపించుటయు వీని ఆశయము. వీని అన్నింటిలోను చివరకు మిగులునది భక్తియొక్క పరమాధిక్యము

ఇంతకును అంబరీషుని కథలో ఆతడు కోపింపలేదు. ఆతనికి కోపమేలేదు విష్ణుభక్తులు కోపమును జయించినవారు. అతనిని రక్షించుటకై చక్రమును ప్రయోగించినాడు విష్ణువు. భగవంతుడు కోపింపగా భక్తుడిచ్చట రక్షించెను. ఇది ఆ భగవంతుడు చేసినలీల. అట్లుచేసినకాని దుర్వాసుడు తన భక్తులమహిమను గుర్తింపడు. భగవంతునికిని, భక్తునికిని గల అపూర్వసంబంధమీకథలో సునిరూపితమైనది. రాజత్వమును భక్తియు రెండునుగల అంబరీషుడు చివరకు రాజత్వమును వదలుకొనుటతో కథముగియును. భక్తి సర్వాధికమని రాజభోగములకంటె అది అత్యున్నతమైనదని భాగవతమిట్లు తెల్పినది.

కం॥ హరిగొల్చుచుండు వారికి
పరమేష్ఠిపదంబు మొదలు పరభోగంబుల్
నరకసమంబని తలపున
ధరణీరాజ్యంబుతోడి తగులముమానెన్.[36]

రంతిదేవునిభక్తిలో నొకవిశిష్టత కలదు. ఆతనికెట్టి వాంఛలును లేవు. త్యాగమతన జీవితమార్గము. ఇతరులకెట్టి ఆపదలు వచ్చినను వానినాదుకొనుట కాతడు ప్రయత్నించెను. ఆపనిలో ఆతడు తనకెట్టి ప్రమాదమువచ్చినను సంకోచింపలేదు. తనకు దిక్కు పురుషోత్తముడున్నాడని అతని విశ్వాసము ఆకలి, దప్పిక ఎక్కువగానున్న సమయమున అన్నమంతయు నితరులకు దానముచేసి చివరకు మిగిలిన మంచినీరుకూడ దాహార్తుడగు చండాలునకు నిజప్రాణాంతమైనను అలయక దానముచేసిన భక్తవరుడాతడు.

ఉ॥ అన్నము లేదుకొన్ని మధురాంబులున్నవి త్రావుమన్నరా
వన్నశరీరధారులకు నాపదవచ్చిన వారియాపదల్
క్రన్నన దాల్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే
లున్నదె నాకుదిక్కు పురుషోత్తముడొక్కడసుమ్ము పుల్కసా![37]

అనుపద్యమున ఆతవిత్యాగభక్తి సుప్రకటితమగు చున్నది. తనను పరీక్షించిన బ్రహ్మాదిదేవతలు మేలుసేయందలంచిన వారలనేమియు నడుగక నమస్కరించి నారాయణభక్తి తనమనసున వెలుగగా ఆతడు పరమపదమును బొందెను. ఆతని భక్తి విజ్ఞానగర్భిణి యని భాగవతము తెలిపినది.[38]

భాగవతములో గజేంద్రమోక్షణఘట్టము భక్తికి మిక్కిలి ప్రఖ్యాతి వహించినది. గజేంద్రుడు పూర్వజన్మలోను విష్ణుభక్తుడే. అప్పుడింద్రద్యుమ్నుడను ద్రవిడాధీశుడతడు. అతడొకనాడు మౌనియైసర్వాత్మ్మకగునారాయణు నారాధించుచుండగా అగస్త్యుడక్కడకు వచ్చెను. రాజతనిని లేచి పూజింపలేదు. మహర్షికి కోపమువచ్చి ఏనుగవై పుట్టుమని శపించెను. ఈసందర్భమున పోతన అమూలకముగా నిట్లొక నీతిని బోధించెను.

కం॥ మునిపతి నవమానించిన
ఘను డింద్రద్యుమ్న విభుడు కౌంజరయోనిన్
జననంబందెను విప్రుల
గని యవమానింపదగదు ఘనపుణ్యులకున్.[39]

ఒకవిష్ణుభక్తుడు మౌనియై నారాయణుని భావించుచున్న సమయమున ఒక మహర్షివచ్చి మర్యాదచేయలేదని శపించుట, విప్రుల నవమానింపదగదని కవిదానిని సమర్థించుట స్థూలదృష్టితో చూచినపుడు విపరీతముగా తోచవచ్చును. కానీ ఇచట నీతిరహస్యమొకటి కలదు. మహర్షి వచ్చినప్పుడు రాజు సమాధిస్థితిలో లేడు. అతని రాక నెరుగును. ఎవరికైనను మౌనము, ధ్యానము మొదలగునవి వ్యక్తిగత వ్రతములు. పూజ్యులను పూజించుట మొదలగునవి సామాజిక ధర్మములు. తన వ్యక్తిగతనియమము కొరకై సామాజికధర్మము నతిక్రమించినచో దానిఫలము నెవరైన అనుభవింపక తప్పదు. ఇది పూజ్యాపూజావ్యతిక్రమమను దోషము. దిలీపుడాలోచనామగ్నుడై పోవుచు కామధేనువునకు ప్రదక్షిణాది గౌరవము నెరపమిచే శప్తుడగుట సువిశ్రుతమే. తెలియకచేసిన నేరమునకే అతడు శిక్షితుడైనాడు. తెలిసిచేసిన ఇంద్ర

ద్యుమ్నుడు శప్తుడగుటలో నాశ్చర్యములేదు. ఈభావమే భంగ్యంతరముగా పై పద్యములో పలుకబడినది

ఇంద్రద్యుమ్నుని జన్మాంతరమగు గజేంద్రుడు గ్రాహబద్ధుడై పెక్కేండ్లు పోరాడి తనలావు శిథిలమై జయముపొందలేనని నిశ్చయించుకొని జగదీశ్వరుని ప్రార్థించినాడు. ఆ విధముగా ప్రార్థించుటకాతని పూర్వజన్మవాసన తోడ్పడినది. మూఢలుబ్ధకరీంద్రయోనిలోపుట్టిన అజ్ఞానియైన ఆశాపగ్రస్తుడు భగవంతుని స్మరించుటలో మొదట

కం॥ కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి గణములపాలన్
కలడందు రన్నిదిశలను
కలడుకలండనెడివాడు కలడో లేడో.[40]

అని సందేహించెను. ఆ సందేహమున్నంతవరకు నాతనికి భగత్సాక్షాత్కారము లభింపలేదు. చివరకు సర్వార్పణ బుద్ధితో నీవేతప్పనితఃపరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ అని ఆక్రోశించుటతో భగవంతుడు కదలి వచ్చినాడు. ఈశ్వరుని చేరుటకై జీవుడు పడు నారాటములోని దశాభేదముల నీ ఘట్టములో కన్గొనవచ్చును.

గజేంద్ర స్తుతి రూపమున పోతన రచించిన పద్యములు మహోన్నత భక్తి నిలయములు. అందు ప్రఖ్యాతములైన ఒకటి రెండుఉదాహరణములు చూడుడు.

ఉ॥ ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయుడెవ్వడు సర్వముదానయైనవా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్..[41]

ఉ॥ ఓకమలాప్త యోవరద! యోప్రతిపక్షవిపక్షదూర! కు
య్యోకవియోగివంద్య! సుగుణోత్తమ! యోశరణాగతామరా
నోకహ! యోమునీశ్వరమనోహర! యోవిపులప్రభావ! రా
వే! కరుణింపవే తలపవే శరణార్థిని నన్నుగావవే.[42]

పరమభాగవతులలో ప్రహ్లాదు డగ్రగణ్యుడు. అతడు భగవత్స్మరణమాత్రము చేతనే పరవశుడయ్యెడి మహనీయుడు. కర్మనిష్ఠలు, దానధర్మములు, త్యాగవైరాగ్యములు మానవుని ఉత్తమ సంస్కారమునకు చిహ్నములు. భక్తి వాని అన్నింటికంటె

అతీతమైనది. ప్రభుడు తలపున నిలచినంతనే భక్తుడు కంఠావరోధ రోమాంచాశ్రువు లను పొందును. దీనినే నారద భక్తిసూత్రము లీక్రింది విధముగా నిర్వచించినవి.

1. కంఠావరోధరోమాంచాశ్రుభిః పరస్పరంలపమానాః
పావయ తికులాని పృథివీంచ.[43]

2. తీర్థీకుర్వంతి తీర్థాని సుకర్మీకుర్వంతి కర్మాణి సచ్ఛాస్త్రీ
కుర్వంతి శాస్త్రాణి.[44]

3. మోదంతే పితరో నృత్యంతి దేవతాః
సనాథాచేయంభూర్భవతి.[45]

4. నాస్తితేషుజాతివిద్యా రూపకులధనక్రియాదిభేదః

పారవశ్యముతో గాద్గద్యముతో కన్నుల నీరుజార పరమేశ్వరునికై విలపించు వారు ప్రపంచమునే పవిత్రము చేయుదురు. వారి ఒక్కొక్కకన్నీటిబొట్టు ఈజగత్తు లోని కలుషాగ్ని నంతటిని చల్లార్పగలదు. వారిమాటలే మంత్రములు. వారడుగు పెట్టినచోట్లే తీర్థములు. జాతివిద్యారూపకులాదిభేదములేవియు వారిలో లేవు వారు అన్నింటికి నతీతులు.

ప్రహ్లాదుడట్టివాడు. పోతన చిత్రించిన ఆతని మూర్తిని చూడుడు.

సీ॥ అడుగడుగునకు మాధవాను చింతన సుధా
మాధుర్యమున మేను మరచువాని
అంభోజగర్భాదు లభ్యసింపగలేని
హరిభక్తి పుంభావ మైనవాని
మాతృగర్భమునం జొచ్చి మన్నది మొదలుగా
చిత్తమచ్యుతు మీద జేర్చువాని
అంకించి తనలోన నఖిల ప్రపంచంబు
శ్రీవిష్ణుమయమని చెలగువాని

తే॥ వినయ కారుణ్య బుద్ధి వివేకలక్ష
ణాది గుణముల కాటపట్టయినవాని...[47]

ప్రహ్లాదుని - వీక్షించినచో ఎవరికి కన్నుల కరువుదీరదు ? హరిభావామృత పానముచే మేనుమరచుట భక్తిలక్షణము. భగవంతునికై ఒకవేళఏడ్చుచు, మరియొక సమయమున నవ్వుచు భజనానందమున గంతులువేయు వారి ప్రవర్తన లోకమునక సహజముగా నుండును. లోకము వారి నున్మత్తులుగా పరిగణించిన ఆశ్చర్యములేదు. ప్రహ్లాదుని అట్టిస్థితులను చూడుడు.

సీ॥ వైకుంఠచింతా వివర్జిత చేష్టుడై
ఒక్కడు నేడుచు నొక్కచోట
అశ్రాంత హరిభావనారూఢ చిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణు డింతియకాని వేరొండులేదని
యొత్తిలి పగుచుండు నొక్కచోట
నళినాక్షుడను నిధానముగంటి నేడని
యుబ్బి గంతులువైచు నొక్కచోట

ఆ॥ పలుకునొక్కచోట పరమేశు గేశవు
ప్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు.[48]

ప్రహ్లాదుని జడోన్మత్త ప్రవర్తనకు విష్ణుచింతన పారవశ్యమున లోకమును మరచి నడయాడు తీరునకు మరియొక పద్యమును కూడ పరికింపుడు.

సీ॥ శ్రీవల్లభుడుదన్ను జేరినయట్లైన
చెలికాండ్ర నెవ్వరి చేరమరచు
అసురారి తనమ్రోల నాడినయట్లైన
అసురబాలురతోడ నాడమరచు
భక్తవత్సలుడు సంభాషించి నట్లైన
పరభాషలకు మారుపలుకమరచు

సురవంద్యు దనలోన జూచినయట్లైన
చొక్కి సమస్తంబు జూడమరచు

తే॥ హరిపదాంభోజయుగ చింతనామృతమున
అంతరంగంబు నిండినట్లైన నతడు
నిత్యపరిపూర్ణుడగుచు నన్నియునుమరచి
జడత లేకయు నుండును జడుని భంగి[49]

భక్తులు వివిధదశలలో కాంచెడి దివ్యానుభవములిట్లుండునని ఈపద్యము తెలుపుచున్నది. భగవంతుడు తనతో మాటాడినట్లు, తనకు దర్శనమిచ్చినట్లు, తన లీలలను చూపినట్లు, భక్తులనుభూతులను పొందుచుందురు. వానిని విన్నవారెవ్వరును సామాన్యముగా నమ్మజాలరు. అవి వైయక్తికములగుటయే దానికి కారణము. కృష్ణ కర్ణామృతాది గ్రంథములలోని అనేకవర్ణనము లిట్టి దర్శనముల ఫలమే యనిపించును.

ప్రహ్లాదుని సంస్కారము ఈజన్మలోనిది కాదట. అది పూర్వజన్మ పరమభాగవత సంసర్గసమాగతంబైన ముకుంద చరణారవిందసేవాతిరేకమని పోతన మనకు తెలిపి నాడు.[50]

అందుచేతనే ప్రహ్లాదుడు భగవంతుడైన వాసుదేవునియందు సహజ సంవర్ధ మాన నిరంతరధ్యానరతుడగుట తటస్థించినది.[51]

గజేంద్రునితో పోల్చిచూచినయెడల ప్రహ్లాదుని భక్తిలోని విశిష్టత గోచ రించును. గజేంద్రుడు పురుషకారము వ్యర్థమైనపిదప ఆర్తుడై భగవంతుని ప్రార్థిం చెను. ప్రహ్లాదుడెన్నడును ఆర్తుడు కాడు. అతడు పురుషకారరహితుడు. నిత్యప్రప న్నుడు. విధిసంకల్పమే ఆతని సంకల్పము. గజేంద్రునకు ఒకస్థితిలో భగవంతుని ఉనికిని గూర్చియే సందేహము కలిగినది.[52] ఆ తరువాత ఆర్తులను రక్షించు విషయ మున కూడ సంశయగ్రస్తుడయ్యెను.[53] ప్రహ్లాదునికిట్టి సందేహములేవియు లేవు, భగ వంతుని నిత్యప్రసన్నభావమును చూరగొన్న మహితాత్ముడాతడు. గజేంద్రుడు శాప గ్రస్తుడైన సాధకుడు. ప్రహ్లాదుని సాధనము పూర్వజన్మలోనే పూర్తియై ఈజన్మలో హిరణ్యకశిపుని శిక్షింపనెంచిన భగవత్సంకల్పమునకు సాధనభూతుడైనాడు. కనుక నేవిధముగా చూచినను ప్రహ్లాదుని భక్తి మహోన్నతమైనది.

భక్తిని చిత్రించిన భాగవతఘట్టములన్నింటిలోను, గోపికాప్రణయ కథా భాగము లత్యుత్తమమైనవి. సర్వవిధ భక్తివిశేషములలోను గోపికాభక్తి శిఖరాయమాణమైనదగుటయే దానికి మూలకారణము. భీష్మునికంటె, ప్రహ్లాదునికంటె తదితరులగు ననేకమహామహులకంటె గోపికలెక్కువ భక్తిగలవారా యని సందేహము రావచ్చును. దానికి సమాధాన మీక్రింది చర్చలో విశదమగును

నారదభక్తిసూత్రముల ననుసరించి ఆసక్తిభేదములనుబట్టి భక్తిని పదునొకండు రీతుల విభజించుట ఇంతకుముందే చూపబడియున్నది. భగవంతుని కళ్యాణగుణములను వర్ణించి ఆయన మహిమలను నిరంతరము పరవశచిత్తముతో గానముచేయుచు సంకీర్తనము గావించుట ఒకవిధమగు భక్తి. నారదాదు లట్టివారు స్మరణమాత్రమువ వివశులగుచు నిరంతరభక్తి రసపానమున ఉన్మత్తులవలె చరించు ప్రహ్లాదాదులు మరియొకరకము. అంబరీష రంతిదేవాదులది ఆరాధనావిశేషసంబంధమగు వేరొకమార్గము. ఈ మార్గము లన్నింటిలోను భగవంతునితో కొంత చనవున్నను భక్తులందరు నాయునను మహాప్రభువుగా, జగదీశ్వరునిగా దూరమునుండి నమస్కరించి పూజింపతగిన మహాపురుషునిగా భావింతురు ఇందు కేవల దాస్యభావముతో నుత్తీర్ణుడైన వాడు హనుమంతుడు. రాముని ఆజ్ఞానుసారము వర్తించి ఆయనకు తృప్తి కలుగునట్లుగా ప్రవర్తించి తదనుగ్రహమును బొందుట ఆంజనేయుడు సాధించిన మహాకార్యము. భగవంతునితో కలిసి మెలిసి ఆడుచు పాడుచు సహాసనవిహారసౌఖ్యము లొందుచు తత్సమానముగా వర్తించుచున్నను, భక్తినెట్టిస్థితిలోను ఏమరక వర్తించుట సఖ్యభక్తి. తనతో సమానుడుగానున్న వ్యక్తిని భగవంతునిగా కొలుచుట, లేదా భగవంతుడని ఎరిగిన వ్యక్తిని స్నేహితునిగా భావించి వర్తించుట మిక్కిలికష్టము. ఐనను భగవంతుడిచ్చిన చనువుతో మైత్రీభావమున మెలగి ఎంతవరకు చనవు తీసికొనవలెనో అంతవరకే తీసికొని అసిధారావ్రతముగా పాటింపవలసిన నియమమును తదనుగ్రహముచే సులభముగా పాటించి ఉత్తీర్ణులైనవా రుద్ధవార్జునాదులు అతిపరిచయమున అవజ్ఞ ఏర్పడకుండుటయే దీనిలో జాగ్రత్తగా నేర్పరచుకొనవలసిన నియమము. ఇక కౌసల్యాదేవకీ యశోదాదులు భగవంతుని వాత్సల్యభావముతో లాలించి తరించిరి బలి విభీషణాదులు జ్ఞానులై మానుషరూపముననున్న వ్యక్తులను భగవదవతారములుగా గుర్తించి ఆరాధించిరి. భగవంతుని తల్లిగా, తండ్రిగా సంభావించుకొని తల్లిదండ్రుల చెంత బిడ్డ ఎట్టి గారాబమును చూపునో ఎట్టి వాత్సల్యమును బొందునో అట్లు బొందుటకు ప్రయత్నించినవారును భక్తులలో కలరు. అసురవరుడగు బాణుడు

శివపార్వతుల చెంత నిట్టి వాత్సల్యమును పడసెనట. ఈ విధముగా తల్లిగా, తండ్రిగా, బిడ్డగా, ప్రభువుగా అనేక భావములతో భగవంతుని భావించినట్లే ప్రియునిగా కూడ భావించి ఆరాధింపవచ్చును. స్త్రీయైనను పురుషుడైనను తనను స్త్రీగానే భావించుకొని భగవంతుని పురుషునిగా భావించి తత్సాధనలో ముక్తినందవచ్చును. ఇతర విధములగు భక్తిమార్గములన్నింటిలోను లభించుట కష్టమగు సాయుజ్యముక్తి దీనిచే సులభముగా లభించును. జీవికిగల సర్వభావములలోను రతిభావమత్యుత్కటమైనది. సాధ్యసిద్ధికై దానిలో కలిగెడునంత వాంఛాతీవ్రత ప్రాణికోటికి మరిదేనియందును కలుగదు. తానారాధించెడి వ్యక్తిలో సంపూర్ణసంయోగము శృంగారభావములోనే సంభవింపగలదు తలిదండ్రులు పుత్రీపుత్రులతోగాని మిత్రులుపరస్పరముగాని సన్నిహిత భావస్పందితులగుట లోకమున సహజమే. ఐనను ఆ సాన్నిహిత్యము ప్రేయసీ ప్రియులకు వలె ఐక్యమును కలిగింపజాలదు. దాస్యవాత్సల్యాదులన్నింటిలోను పరమాత్మ జీవాత్మలమధ్య కొంతఎడమెసగుచునే యుండును. ప్రియభావముతో ఈశ్వరు నారాధించిన జీవి ప్రియుని పరిష్వంగములో ఆత్మార్పణము చేసికొను ప్రేయసివలె భగవదైక్యము నొందగలదు. దీనినే మధురభక్తి యందురు. భాగవతమున గోపికలది ఇట్టి మధురభావమున సిద్ధిపొందిన భక్తియగుటచే సర్వోత్తమమైనది.

భాగవతములోని గోపికాప్రేమ జగత్ప్రసిద్ధమైనది. లౌకికదృష్టితో చూచిన ఈ గోపకాంతలందరు ననేకుల భార్యలు. వారందరును తమభర్తలను కాదని కృష్ణుని వెంటపడుట సామాన్యధర్మమునకు విరుద్ధముగా తోచును. యోగవాసిష్ఠములో నొకకథగలదు. ఒకరాజుభార్య ఎవరితోనో వ్యభిచరించినది. ఆమెయును, విటుడును పట్టువడిరి. రాజు వారినిద్దరిని తప్తతైల కటాహమున త్రోయించెను వారినదేమియు చేయలేకపోయెను. చూచువారంద రాశ్చర్యపడిరి. అప్పుడా రాణినవ్విఇట్లనెను. "మేము చేసినది లోకదృష్టిలో అధర్మమే. పాపమే. కానీ ఈ అధర్మపాప భావన నధిగమించి మాఇద్దరి మనస్సులును గాఢప్రేమపూరితమై అఖండమగు నేకాగ్రస్థితినొందినవి. మా ఐక్యభావనలోని తీవ్రత మమ్ము శరీరభావన కతీతులను గావించినది. అందుచేతనే నీ శిక్ష మమ్మేమియు చేయజాలకపోయినది.

దీనిచే తేలునదేమనగా ఏభావమైనను అతితీవ్రమై, అత్యుత్కటమై, సర్వార్పకమై, పరమైకాగ్రస్థితిని పొందినచో అది దివ్యసిద్ధి ప్రదాయకము కాగలదు ఆ తీవ్రభావన లౌకికధర్మమున కతీతమైనది. ప్రాపంచికనియమము లామహాతపస్సును నియమింపజాలవు. ఆభావతపఃఫలితముగా అది అలౌకిక ధర్మమగును. గోపికలట్టి

వంటి ఏకాగ్రభావపరమావధి నొందిరి. సిద్ధాంతరీత్యాపల్కినచో కృష్ణుడు భగవంతుడైనను కాకున్నను, లేక ఏసామాన్యవ్యక్తియందైనను గోపికలకట్టిప్రేమ కుదిరినను అది పైసూత్రము క్రిందికే వచ్చును. లోకధర్మము నతిక్రమించిన ప్రేమధర్మఫలితముగా వారిని పాపపుణ్యములంటజాలవు. ఇంక కృష్ణుడు భగవంతుడగుటచే ఈసందర్భమునుగూర్చి ఆలోచించవలసిన పనియేలేదు. అందుకే

ఆ॥ గోపజనములందు గోపికలందును
సకలజంతులందు సంచరించు
ఆమహాత్మునకు పరాంగనలెవ్వరు
సర్వమయుడు లీలసలిపెగాక.[54]

భావతీవ్రత ప్రధానముగానీ అదిఏభావమో ఆభావము ధర్మబద్ధమైనదగునో కాదో ప్రధానముకాదని సందేహాస్పదచిత్తుడగు పరీక్షిత్తును శుకుడు పదేపదే హెచ్చరించినాడు.[55]

ఆ గోపికల భక్తి ఎంతటి తీవ్రమైనదో ఈక్రిందిపద్యమున కాంచవచ్చును.

సీ॥ నీపాదకమలంబు నెమ్మిడగ్గరగాని
తరలిపోవంగ పాదములురావు
నీకరాబ్జంబులు నెరినంటితివగాని
తక్కినపనికి హస్తములుచొరవు
నీవాగమృతధార నిండగ్రోలగగాని
చెవు లన్యభామల జేరనీవు
నీసుందరాకృతి నియతి జూడగగాని
చూడవన్యంబుల చూడ్కికనులు

ఆ॥ నిన్నెకాని పలుకనేరవు మాజిహ్వ
లొల్లననుచు బలుక నోడనీవు
మామనంబులేల మరపిదొంగిలితివి
యేమిసేయువార మింక కృష్ణ![56]

భక్తిచే కలుగు నేకాగ్రపారవశ్యము దివ్యానందము నీ క్రింది పద్యమున సంభావితమైనది.

ఒక్కల తాంగిమాధవుని యుజ్జ్వల రూపము చూడ్కితీగెలం
జిక్కగబట్టి హృద్గతము జేసి వెలింజనకుండ నేత్రముల్
గ్రక్కునమూసి మేనవులకంబులు గ్రమ్మగకౌగిలించుచున్
చొక్కములైనలోచవులజొక్కుచునుండెను యోగికైవడిన్.[57]

ఇట్టి వివశభావనలో అద్వైతస్థితినందుట మహోత్తమదశ. అనగా ఈభావ తీవ్రతలో ఒకసమయమున భక్తుడు భగవంతుడగును. ఇది తాత్త్వికులెరిగిన అంశమే. భారతీయ భావనలోనేకాక ఇతర దేశీయతాత్త్విక చింతనలోకూడ ఇట్టిదికలదు. ప్రఖ్యాత తాత్త్వికుడగుప్లేటో ఊహకందని జీవబ్రహ్మైక్యానుభూతిలో ప్రత్యగాత్మ బుద్ధి తత్త్వమును దాటి పరమాత్మతోనైక్యము నొందునని పలికినాడు. ప్రేమమానవుని తద్భావగత మూర్తిరూపముగా మార్చు నైజము కలదియని డియోనైసియస్ పండితుడు వక్కాణించెను. ప్రేమ అత్యధికమైనపుడు జీవాత్మ తనపరిచ్ఛిన్నతను దాటి అజ్ఞాత దివ్యావస్థనొంది తుదకు పరమాత్మతో నైక్యమొందునని బొనవెంటురా పలికెను. భక్తి నిండారగనే భక్తుడు దేవదూత స్థితిని బాసి భగవంతునియందు లీనమగునని జలా లుద్దీన్‌రుమీ వచించినాడు. నాకునునీకును నిందు తావులేదు. మన మిరువురమును మిథ్యామూర్తులమని జూమీమతము తెలిపినది. ప్రత్యగాత్మలో నైక్యమగుటను స్పెయిన్‌దేశీయ మూరిష్‌జాతి తత్త్వజ్ఞుడు అవిరోయిన్ వక్కాణించెను. తలుపుతట్టిన ఒకకాముకుని ఎవరునీవని ప్రశ్నించిన ప్రియురాలు ఆతడు నేనే అన్నంతకాలము తలుపుతీయక నీవే నేనని అన్నప్పుడు తెరచెనని ప్రేమలోని అభేదావస్థను గూర్చి ఒక సూఫీమతకవి వర్ణించినాడు. ఈవిధముగానే క్రైస్తవ మహమ్మదీయాది మతముల లోను పైభావముల కనుకూలమగు సూక్తులు కలవు.[58]

భాగవతములోని గోపికల భక్తి పైవిధముగా ఈశ్వరైక్యమును సాధించిన మహోన్నతదశ. దివ్యోన్మాదపరవశమగు వారి కృష్ణైక్యస్థితిని పోతన ఇట్లు వర్ణించి నాడు.

వ॥ ఉన్మత్త చిత్తలై తదాత్మకత్వంబున కృష్ణులీలలననుకరింపుచు[59]

సీ॥ పూతనయై యొక్కపొలతి చరింపంగ
శౌరియై యొకకాంత చన్నుగుడుచు

బాలుడై యొకభామ పాలకునేడ్చుచో
బండినేనను లేమ పారదన్ను
సుడిగాలిననియొక్క సుందరిగొనిపోవ
హరినని వర్తించు నబ్జముఖియు
బకుడనేనని యొక్క పడతి సంరంభింప
పద్మాక్షుడను కొమ్మపరిభవించు

ఆ॥ ఎలమి రామకృష్ణులింతు లిద్దరుగాగ
గోపవత్సగణము కొందరగుదు
రసురవైరిననుచు నబలయొక్కతె చీరు
బసుల మనెడి సతుల భరతముఖ్య!60

ఈవిధముగా గోపికల శృంగరాత్మకమగు సర్వాధిక భక్తిని వర్ణించుటలో మహాకవియగు పోతనచూపిన నేర్పునితరసాధ్యము.

భాగవత నాయకుడు విష్ణువు. ఆజగదీశ్వరుని వివిధావతారవిశేషములే వివిధ స్కంధములలో కథలు అనేకములగు భక్తిమార్గములలో ఆపరమాత్మునినారాధించిన భక్తుల జీవితములందు గోచరించుచుండును వానినన్నింటిని రసవత్తరమగు తన కవితాసుధతో సంప్లుతముచేసి భక్తిభావ మహౌన్నత్యము తెనుగుదేశము నాల్గుచెరగులను విస్తరించునట్లు మహాకవియగు పోతన అత్యద్భుతమగు రచనము కావించినాడు అంతకు మించి రచింపగల వాడింతవరకు పుట్టలేదు.

# 5. పోతన కవిత్వము - రసపోషణ

'రసో వై సః' అని యోగులు దేనిని బ్రహ్మానందస్వరూపముగా భావించిరో దానినే సాహితీయులు కావ్యానందముగా దర్శించినారు. నేటి పరిశోధనలకందినంత వరకు నాట్యశాస్త్రము వ్రాసిన భరతుడు ప్రప్రథమరససిద్ధాంతకర్త. ఆతడు రచించిన 'విభావానుభావ వ్యభిచారీ సంయోగాద్రసనిష్పత్తిః' అనుసూత్రము తరువాత రసచర్చ లన్నింటికిని ఆధారమైనది. భట్టలోల్లటుడను పండితుడు సంయోగమనిన ఉత్పాద్య-ఉత్పాదక భావమనియు, నిష్పత్తియనిన ఉత్పత్తి యనియు పలికెను. ఈతని మత మున రసము నాయకనిష్ఠము. దీనినుత్పత్తి వాదమందురు. శ్రీశంకుకుడను మరియొక విద్వాంసుడు సంయోగమనిన జ్ఞాప్య, జ్ఞాపక భావమనియు, నిష్పత్తియనిన అనుమితి యనియు చెప్పెను దీనిననుమతి వాదమందురు. ఈమతమున రసమునట నిష్ఠము. భట్టనాయకుడను నాతడు సంయోగమనిన భోజ్య భోజకత్వమనియు, నిష్పత్తియనగా భుక్తియనియు పలికెను. దీనిని భుక్తి వాదమందురు. ఈతని మతమున రసము సామాజికనిష్ఠము. ఈవాదములన్నియులోప భూయిష్ఠములు. వీనినన్నింటిని త్రోసి రాజని అభినవగుప్తుడు ప్రతిపాదించిన అభివ్యక్తివాదము ప్రామాణికమై నిలిచినది. పూర్వజన్మ సంస్కారవశమున వాసనారూపమున మానవుని హృదయమున నున్న రత్యాది స్థాయిభావములు విభావాదుల సాహాయ్యముచే వ్యక్తమగుననియు అప్పుడు రససిద్ధి కలుగుననియు ఆతని సిద్ధాంతము. భట్టనాయకుని వలెనే ఈతడును రసము సామాజికనిష్ఠమని అంగీకరించినను ఆతడు చెప్పని వాసననీతడు ప్రవేశ పెట్టెను. వాసనారూపమున రత్యాదుల సంస్కారములేకున్న రసమనుభూతముకాదని ఆయనపలికెను.

భరతుడెనిమిది రసములను పేర్కొనెను. అవి శృంగార హాస్యకరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుతములు. ప్రత్యక్షముగా కాకపోయినను పరోక్షముగా భరతుడు శాంతరసము నంగీకరించెనని తరువాతి ఆలంకారికులు కొందరు పలికినారు. ఆనందవర్ధనాభినవగుప్తాదులు శాంతరసము నంగీకరించిరి. రుద్రటుడు ప్రేయోరస మును, విశ్వనాథుడు వత్సలరసమును, భానుదత్తుడు మాయారసమును, మధుసూదన సరస్వతి భక్తి రసమును ప్రతిపాదించినారు. కానీ ఇవేవియు తరువాతికాలపు విద్వాం సుల విమర్శలకు నిలువలేదు.

కొందరు పండితులొక్కొక్కరసమును ప్రత్యేకముగా నభిమానించి అదొక్కటే రసమని ప్రతిపాదించిరి. శృంగారరసమునకు భోజుడును, కరుణరసమునకు భవభూతియు, శాంతరసమున కభినవగుప్తుడును, అద్భుతరసమునకు నారాయణ ధర్మదత్తులును ప్రధాన ప్రతిపాదకులు

## 1. శృంగారరసము

వీరాద్భుతాదులు రసములే కావను భోజుని వాదమంగీకరింపకపోయినను శృంగారమురసరాజమని ఒప్పుకొనకతీరదు. ఈ చరాచరజగత్తు శృంగారములేక వృద్ధి పొందదు. సృష్టిహేతువగు మైథునకర్మకు మూలము శృంగారభావమే. కనుక నది జగత్కారణమును, జగదానందహేతువును నగు రసము. రెండుజీవుల పరమైక్యము దీనిలో తప్ప మరియొకదానిలో సాధ్యము కాదు

శృంగారములో ప్రేమ కామము రెండుభావములు. స్థాయిభావమగు రతిలో లౌకికమగు కామవాసన కొంత ఉండకతప్పదు. అది ప్రక్షాళితమైన కాని రసానంద మనుభూతముకాదు. లౌకికరతిలో సుఖమేకాని ఆనందములేదు. ఆనందము తదతీతమైనది. కావ్యగతశృంగార రసానుభవవేళ అది కామకాలుష్యరహితమై లౌకిక వాసనాతీతమై అత్యంతస్వచ్ఛమై బ్రహ్మానందసహోదరమై అలరారునని విబుధులు పల్కియున్నారు. ఆశృంగారము భగవత్పరమైనచో కామవాసన వచ్చుటకే అవకాశములేదు భక్తిభావాన్వితమగు శృంగారము అతిమానుషభావలహరీ సమన్వితము. దివ్యప్రేమపరిమళభరితము.

భాగవతములోని శృంగారరసమునకు శిఖరాయమాణమగు గోపికాకృష్ణ క్రీడాఘట్టము భక్తిభావాశ్రితము భక్తి భావరహితమగు శృంగారమునకు భాగవతమున స్థానములేదు. భాగవత శృంగారము లౌకికమగు దాంపత్య శృంగారము కాదు. అది భగవన్నిష్ఠమగు ప్రేమ శృంగారము మాత్రమే. భగవంతుడే నాయకుడై యుండు పురాణములో ఏరసమైనను పరమేశ్వరపరమావధిగా పోషింపబడవలసి యుండును. కావుననే పోతన కృష్ణాశ్రితమగు దివ్యశృంగారమును ప్రధానముగా పోషించి ఆనుషంగికముగా వచ్చు నితర శృంగారకథలను స్పర్శించి విడిచిపెట్టినాడు. అందుచేతనే యయాతిచరిత్ర పురూరవునికథ పురంజనోపాఖ్యానము శకుంతలా పరిణయము మొదలగు ఘట్టములలో శృంగారరసపోషణకై ప్రత్యేక శ్రద్ధతీసికొనబడలేదు.

భారతాదులలోవలె భాగవతమున ఈ కథలకు ప్రాధాన్యములేదు. కావున తలచినచో వానిని ప్రత్యేక ప్రబంధములుగా తీర్చిదిద్దగల సామర్థ్యము కలవాడయ్యును పోతన శ్రద్ధవహింపలేదు.

కృష్ణ సమర్పిత మధురభక్తి సమన్వితమగు కొన్ని శృంగారభావవిశేషములు పూర్వ్వాసమున పరామర్శింపబడినవి. మహాద్భుతమగు భాగవతశృంగారమును ఎంతమనోహరముగా తీర్చిదిద్దెనో అనుశీలనము చేయుటకు మరికొన్నిసందర్భము లిందు ఉదాహరింపబడుచున్నవి. గోపికల విరహతీవ్రతను చూడుడు

సీ॥ నీయధరామృత నిర్ఝరంబులునేడు
చేరి వాతెరలపై జిలుకకున్న
నీవిశాలాంచిత నిర్మలవక్షంబు
కుచకుట్మలంబుల గూర్పకున్న
నీరమ్యతరహస్త నీరజాతంబులు
చికురబంధంబుల జేర్పకున్న
నీకృపాలోకన నివహంబుమెల్లన
నెమ్మొగంబుల మీద నెరపకున్న

ఆ॥ నీనవీనమాననీయ సల్లాపంబు
కర్ణరంధ్రదిశల గప్పకున్న
నెట్లుబ్రతుకువార మెందు జేరెడివార
మధిప వినగదగదె ఆడుకుయులు![1]

కృష్ణునకు సర్వసమర్పణము కావించుకొని ఆప్రేమతీవ్రతచే విరహమున మరణమును పొందుస్థితికివచ్చిన గోపికల భావౌత్కట్యమును పోతన పైపద్యములో సమగ్రముగా తీర్చిదిద్దినాడు.

యోగివలె బ్రహ్మానందానుభవమును పొందు గోపిక పారవశ్యమును చిత్రించు ఈక్రింది పద్యము పునఃపునరుదాహరణీయము.

ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము చూడ్కితీగలన్
జిక్కగబట్టి హృద్గతముజేసి వెలింజనకుండ నేత్రముల్

క్రక్కనఁ జూసి మేనఁ బులకల్ బలుగ్రమ్మఁగఁ గౌగిలించుచున్
చొక్కములైన లోచనముల జొక్కుచునుండెను యోగికైవడిన్.[2]

ఈపద్యము మూలమున నాధారము కలిగియున్నను చొక్కములైన లోచనముల జొక్కుటఅను చొక్కపు కల్పనతో అధికతర సౌందర్యమునకు నిలయమైనది.

రతియనిన శారీరకమగు సంయోగమే అర్థముకాదు. పైపద్యములోని బ్రహ్మానందానుభవము గోపికలు కాంచిన శృంగారరసానుభూతికి సముచిత నిదర్శనము. ఇదియే నిజమైన రత్యనుభవము.

కామశాస్త్ర పారంగతులకు గాని సాధ్యపడని బహువిధ శృంగారక్రీడా విలాసములను పోతన అమూలకముగా ఎట్లువర్ణించెనో చూడుడు.

సీ॥ చెలువయొక్కతె చెక్కుచెక్కుతో మోపిన
విభుడు తాంబూలచర్వితము పెట్టె
ఆడుచు నొకలేమ యలసిన ప్రాణేశు
డున్నతదోః స్తంభమూతసేసె
చెమరించి యొకభామ జేరినగడగోర
చతురుడు కుచఘర్మ జలముబాపె
అలకంబు లొకయింతి కలికచిత్రకరేఖ
నంటిన ప్రియుడు పాయంగ దువ్వె

ఆ॥ పడతియొకతె పాడిపాడి డస్సినయధ
రామృతమున నాథుడాదరించె
హారమొక్క సతికి నంసావృతంబైన
గాంతుడురముజేర్చి కౌగిలించె.

ఇందులోని ప్రతిపాదమును ఒకరమణీయదృశ్యము. ఒకమనోహర ప్రణయభావము.

గోపికా శృంగారము తరువాత అటువంటి దివ్య శృంగారభావము మరల రుక్మిణీకళ్యాణములో కనిపించును శృంగారసిద్ధికై రుక్మిణిపడిన వేదనాదశలను పోతన అత్యద్భుతముగా వర్ణించినాడు. రుక్మిణీకృష్ణ సంయోగవర్ణన లేకుండుటచే

శాస్త్రరీత్యా శృంగారరసమీ కథయందు సిద్ధిపొందినదని చెప్పజాలముకాని కృష్ణునకై రుక్మిణిపొందిన విరహవేదన గోపికావిరహవేదనకు తుల్యమైనదని పలుకవచ్చును. కానీ రాసక్రీడకుముందు గోపికలనుభవించిన వేదన శాస్త్రీయపదజాలములో అయోగ శృంగారమేకాని వియోగశృంగారము కాజాలదు. అట్లే రుక్మిణీదేవిది కూడ అయోగమే అయినను దానిలోని పరమవేదన మహాభక్తుల దివ్యోన్మాదస్థితికి చెందినది. ఆమె హృదయనివేదనమును పోతన ఇట్లు వర్ణించినాడు.

ఘనులాత్మీయ తమోనివృత్తికొరకై గౌరీశు మర్యాదనె
వ్వనిపాదాంబుజతోయమందు మునుగన్ వాంఛింతురే నట్టినీ
యనుకంపన్ విలసింప నేను వ్రతచర్యన్ నూరుజన్మంబులన్
నినుజింతించుచు ప్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!

నిజమగు వియోగ శృంగారము భ్రమరగీతలలో గోచరించును. శ్రీకృష్ణునితో శృంగారానుభవములను పొందిన పిదప గోపకాంతల వియోగవేదనలను వర్ణించిన ఘట్టమిది యొక్కటియే. ఉద్ధవునితో తమ వియోగదుఃఖమును గోపికలు వెళ్ళబోసికొనిన ఈసందర్భము పోతనరచనలో అమూలకమగు నపార శృంగారభావపరమావధి నందినది ఆ గోపకాంతల విప్రలంభ తీవ్రత చూడుడు.

సీ॥ తనుబాసియొక్కింత తడవైననిటమీద
నేలపై మేనులు నిలువవనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబులొక్కట తలగుననుము
ధైర్యంబులొక్కట దలగిన పిమ్మట
చిత్తంబులిక్కడ జిక్కవనుము
చిత్తంబులిక్కడ జిక్కకవచ్చిన
ప్రాణంబులుండక పాయుననుము

తే॥ ప్రాణములు పోవ మరివచ్చి ప్రాణవిభుడు
ప్రాణరక్షకుడగు తన్ను ప్రాణులెల్ల
చేరి దూరంగ మరియేమి సేయువాడు
వేగవిన్నప మొనరింపవే మహాత్మ![5]

కృష్ణుని చూచుటకు కృష్ణుని నర్మభాషలు వినుటకు, డాసి కౌగిలించుటకు ప్రణయకలహము లాడుటకు వారనుక్షణమును ఎదురుచూచుచుందురు ఈ విధముగ వగచెడి గోపికలకు కృష్ణసందేశముచే వియోగబాధ తొలగినదట. ఇంతకును ఆ సందేశములో వారివిరహమును తీర్ప కృష్ణుడు తానక్కడకు మరల వచ్చెదనని అన్నటులెట్టి మాటయు లేకపోగా అదియొక వేదాంతబోధవలె కనబడుచున్నది. కాని అందులోనే తదుద్ధరణ రహస్యమున్నది.

> చెలువల్ దవ్వులనున్న వల్లభులపై చిత్తంబులన్ గూర్తురు
> త్కలికన్ జేరువవారికంటె వదియుంగా కెవ్వడున్ నన్ను మీ
> రలు చింతింపుచు నుండగోరి ఇటు దూరస్థత్వమున్ బొందితిన్
> దలకంబోలదు నన్ను బొందెదరు నిత్యధ్యాన పారీణలై.[6]

గోపికలు తన్ను నిరంతరము చింతించుచుండవలెనని కృష్ణుడు తానుదూరమైనాడట. దూరమగుటచే తద్దర్శనాపేక్ష వలన నిరంతర భావన వారికి నిలిచి అది యోగ సిద్ధికి దారితీయును. నిరంతరాలోచనమే తపస్సుగదా.

శృంగారరససాధనమున భగవంతుని చేరుకొనుటకు మార్గము తీసిన గౌరవము సృష్టిలో మొట్టమొదట గోపికలదే. లౌకికమైన దర్శనస్పర్శనములవలన ఎట్టి అనుభూతి కలుగునో అట్టి మధురపారవశ్యము నిత్యధ్యానములో వారికి లభించునని కృష్ణ సందేశము. అనగా వారి శృంగారము లౌకికస్థితినుండి అలౌకికస్థితిలోనికి పయనించు నన్నమాట. ఆ అలౌకిక శృంగారమున నిరంతరధ్యానముచే ఎట్టి దివ్యానుభవము కలుగునో వారికొక్కసారి రాసలీలలలో కృష్ణుడనుభవమిచ్చినాడు అ మహానుభవము ఇతర సుఖములను వాంఛింపనీయనిది. తత్స్మృతిలో గోపికలు దాని పునస్సిద్ధికై తపస్సు కావించుట సులభము. లోకాతీతమగు పరమానంద మెట్లుండునో ఒకసారి తెలిసి అనుభవించినదానిని పోగొట్టుకొన్నవ్యక్తి దానికై కృషిచేయుట వేరు. అది ఎట్లుండునో తెలియక ఏదో ఊహించుకొని దానికై సాధనచేయుట వేరు. మొదటి దానిలో గురికుదిరినట్లు రెండవదానిలో కుదరదు. గోపికల పూర్వపుణ్య పరిపాకముచే ఆ గురి కుదురగల అవకాశము వారికి లభించినది. రాసక్రీడలోని పరమరహస్యమిది.

ఈ విధముగా భాగవతశృంగారము మనోహరముగా తీర్చిదిద్దుటయేగాక ఇతర రసప్రధానములగు ఘట్టములలోకూడ శృంగారచిత్రణలెన్నింటినో పోతన కావించినాడు. గజేంద్రమోక్షణ ఘట్టములో గజేంద్రుని రక్షించుటకై బయలుదేరిన విష్ణు

దేవుని వర్ణించుటలో పోతన చూపిన శిల్పము మరపురానిది. అమూలకములగు నిట్టి సందర్భములలోనే కవిస్వీయంవ్యక్తిత్వమధికముగా భాసించును. ఎక్కడనో వైకుంఠములో అంతఃపురములోపల కలువపూల పాన్పుపై రమాదేవితో వినోదించు నారాయణుని ఒకచక్కని కవితాచిత్రములో పోతన చిత్రించినాడు.[7] గజేంద్రుని రక్షించుటకై ఆయనపడిన తొందర మరియొక ఆకర్షణీయ దృశ్యము నొసగినది[8]. వివాదప్రోత్థిత శ్రీకుచోపరిచేలాంచమును వీడకయే విష్ణువు బయలుదేరెనట. ఆయన బయలుదేరుటకేమిగాని వైకుంఠములో జరుగు ప్రణయకలహములను భక్తులు చూచెడి అదృష్టమును పోతన కల్పించినాడు. లక్ష్మీనారాయణులమధ్య ఏదో వివాదము వచ్చినదట. ఆ పోట్లాటలో ఆమెకుచోపరిచేలాంచలమును ఆయన లాగుకొనినాడట. ఆ తరువాత ఆయన కరివరదుడై పరువెత్తుటయు ఈమె ఆయనవెంట నుండుటయు ఆకాశములో చూడగల వారికొక కన్నులవిందు చేసెడి దృశ్యము. గజరక్షణముకాదుగాని పోతనగారు లక్ష్మీదేవిని పెట్టిన ఇబ్బంది తలచుకొన్నచో ఇంచుకనవ్వు రాకపోదు. ఆమె ఆకాశమున వచ్చుచున్నంతసేపును ముఖసరోజముపై ముసిరెడి తుమ్మెదలను, ఓష్ఠబింబముపై దూకు చిలుకలను, చక్షుర్మీనములకెగసెడి పాఠీనములను, కుచయుగము దాకెడి చక్రవాకములను తోలుకొనలేక[9] ఎంత బాధపడెనో యని చదివెడివారికి జాలి కలుగక తప్పదు.

భాగవతము చదువుచున్నచో అప్పుడప్పుడొక కొంచెం సందేహము కలుగును. ఏ భక్తుడు ప్రమాదములో నున్నను ఎప్పుడు పిలిచినను ఆ విష్ణువు వైకుంఠములో మూలసౌధములో (ప్రధానరాజభవనము) ఏ కొలనునొద్దుననో పూలసెజ్జపై ప్రాలి లక్ష్మీదేవితో విలాసక్రీడలననుభవించుచుండును. గజేంద్రుని రక్షించుటకు ముందు విష్ణువెట్లుండెనో దుర్వాసుడు చక్రమువెంటబడగా వైకుంఠమునకు బోవునప్పటికిని అట్లే ఉన్నాడు.

ఆ వైకుంఠములోని భర్మమణిసౌధాగ్రంబుపై లక్ష్మిదా
గ్రేవన్ మెల్లన నర్మభాషణములన్ క్రీడించు పుణ్యున్ హరిన్.[10]

విష్ణువెల్లప్పుడును వైకుంఠములో ఇట్లేయుండునా? అని ఎవరైనను అడుగవచ్చును. దాని అర్థమది కాదు పోతనకాదృశ్యము మిక్కిలి ఇష్టమైనదని దానిభావము. ఎప్పుడు విష్ణుస్మరణ చేసినను పోతన మనోవీధిలో ఆ దృశ్యము సాక్షాత్కరించు నన్నమాట. అందుకే మూలములో లేకపోయినను ఆయన అట్లు వర్ణించినాడు. దివ్యశృంగారమనిన పోతనకెంత ఇష్టమో ఇట్టివర్ణనలే నిరూపింపగలవు.

ఇక వీరరసాత్మకమగు నరకాసురవధ ఘట్టమున సత్యభామా శృంగారసముల్ల సనము సుప్రసిద్ధము. వీరశృంగార రసాధి దేవతయగు సత్యభామాదేవి విలాసమును సూచనప్రాయముగా నాచనసోమునినుండి గ్రహించిన పోతన ఆమెయందలి రస ద్వయసమ్మేళనమును పరమాద్భుతముగా ప్రదర్శించినాడు.

సీ॥ రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరు పూఁబోడి చేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కుపరిధియై
మెరయు నాకృష్టమై మెలఁతచాప
మమృతప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ॥ హర్షదాయియై మహారోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికి జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల.[11]

ఏకసమయమున ఏకపాత్రయందలి అంగికవాచిక వైఖరులలో రసద్వయాను భవము కలిగించుట అత్యద్భుత పాత్రచిత్రణము. అందుసిద్ధహస్తుడై పోతన సమగ్రమగుశృంగార వీరమూర్తిని తెనుగుసాహిత్యమున నిలిపినాడు.

ప్రణయమనిన పోతనకెట్టిమధురోహలుకలవో అమాయిక జంతువుల ఆటపాట లను సుకుమారముగా ఆయనవర్ణించిన వైఖరినిబట్టి తెలియగలదు.

సీ॥ పల్వలంబుల లేతపచ్చిక మచ్చిక
చెలులకందించు నచ్చికము లేక
ఇవురు జొంపముల క్రొవ్వేలయు పూగొమ్మల
ప్రాణవల్లభలకు పాలువెట్టు

ఘనదాన శీతల కర్ణతాళంబుల
దయితల చెమటార్చు తనువులరసి
మృదువుగా కొమ్ముల మెల్లన గళములు
నివురుచు ప్రేమతో నెరవువలవు

తే॥ పిరుదుచక్కట్ల డగ్గరి ప్రేమతోడ
డాసి మూర్కొని దివికి తొండంబుసావు
వెదవివేకించు క్రీడించు విశ్రమించు
మత్తమాతంగ మల్లంబు మహిమతోడ.[12]

గజరాజు శృంగారక్రీడావిలాసములతో పాటు భ్రమర వల్లభుని ప్రణయవిభ్రమము పరికింపుడు.

కం॥ తేటియొకటి యొరుప్రియకును
మాటికిమాటికిని నాగమదజలగంధం
బేటికని తన్నుపొందెడి
బోటికి సందిచ్చు నిండుబోటుదనమునన్.[13]

తుమ్మెదలలో లలితమధుర ప్రణయభావమును హృదయంగముగా నిట్లు చిత్రింపగలిగిన ఒక మహాకవి శృంగారభావన మెంత సుకుమారసుందరమో చెప్ప వలసిన పనిలేదు. ఇంత భావౌన్నత్యశిఖరము నందుకొనగలిగిన కవి సంస్కృతములో నొక్క కాళిదాసు మాత్రమే కామవాసనలేని దివ్యప్రణయజీవిత మెట్లుండునో పైని చ్చిన ఉదాహరణములచే విస్పష్టము కాగలదు. ఆటపాటలతో సరససల్లాపములతో హృదయములిచ్చిపుచ్చుకొను లలితకళాసముల్లసితమగు మధురభావజలధిలో మలయ మారుత మృదుస్పర్శననుభవించుచు జీవితనౌకను నడపుకొనుచు పోవుటయే శృంగారములోని దివ్యరహస్యముగా పోతన దర్శించినట్లు తోచును.

కావ్యదృష్టితో చూచిన భాగవతములో శృంగార సంబంధమగు మరికొన్ని విశేషములు గోచరించుచుండును. అత్యున్నతమగు దివ్యశృంగారమును సముదాత్తముగా నిర్వహించుటతో బాటు ప్రబంధాదర్శములగు వివిధశృంగారవర్ణనలను కూడ పోతన కావించినాడు. ఆ విధముగా పురాణప్రబంధములకు మాధ్యమికమగు ఒకానొక

వర్ణనాత్మక శృంగారరససముపస్థితి పోతనరచనలో కన్పించుచున్నది. ఋతువర్ణనలు మొదలగు సందర్భములు దీనికుదాహరణములు కాగలవు చూడుడు.

వర్షఋతువర్ణన—

కం॥ వర్షాకాల భుజంగుడు
హర్షముతో నిడిన నవనఖాంకములని యు
త్కర్షింప భూమిసతిపై
కర్షకహల రేఖలమరె గహనాంతములన్.[14]

హేమంతఋతువర్ణన—

కం॥ శామంతికా ప్రసగంధిత
సీమంతవతీ కుచోష్మజిత శీతభయ
శ్రీమంతంబై గొబ్బున
హేమంతము దోచె మదనుడేచె విరహులన్.[15]

సూర్యాస్తమయ వర్ణన—

కం॥ తరుణుడగు శీతకరుకున్
మరిగి వియల్లక్ష్మి తన్నుమాని ముదుకడున్
ఖరకరుడునుచు ద్రొబ్బిన
కరణిన్ రవిపశ్చిమాద్రికడ గ్రుంకెన్నృపా.[16]

ఈ రీతిగా వివిధఘట్టములలో చక్కని శృంగారవర్ణనలు కావించి అపార మగు కవితాప్రావీణ్యమును పోతన సంభావింపజేసినాడు.

## II ఇతరరసములు

వీరరసము - భగవంతుని చేరుకొను మార్గములలో నున్నతమగు మధుర భక్తికాధారమగు శృంగారము తరువాత భాగవతమున ప్రధానమైనది వీరరసము. భగ వంతునిగా మహత్వమును ప్రకటించుటకై ఆయన రాక్షసాదులగు దుష్టులను నిర్మూ లించి పరాక్రమమును చూపించుట పురాణమున అత్యంత ముఖ్యమగు విషయము. అది భక్తుని విశ్వాసము నభివృద్ధి జేయుటకెంతైన నవసరము. పోతన రచనలో అట్టి

వీరరసపోషణము బాగుగా దర్శింపగలము. శ్రీకృష్ణుని రణక్రీడలన్నియు నిందుకుదా హరణములు కాగలవు.

చం॥ నుతనవ పుండరీకనయనుండన నొప్పు మురారి రోషఘూ
ర్ణిత మహితారుణాబ్జదళనేత్రుడు తానయి పంచెదైత్యుపై
దితిసుత కానన ప్రకరదీపిత శుక్రము రక్షితాంచితా
శ్రితజన చక్రమున్ సతతసేవిత శక్రము దివ్యచక్రమున్.[17]

మొదలగు పద్యములలో దైత్యసంహరణ క్షమమగు కృష్ణపరాక్రమము కాంచ వచ్చును. ఇట్టివేకాక ఇతర పాత్రల విషయమునను ఈ వీరరసస్ఫురణము వీక్షింప వచ్చును.

ఇంద్రుడు బలితో పలికిన ఒక రణోత్సాహ పూరిత పద్యము చూడుడు

శా॥ మాయల్ సేయగ రాదుపోనగవులే మాతోడిపోరాటముల్
దాయా చిక్కితి ప్రక్కలించెద కనద్దంభోళి ధారాహతిన్
నీయిష్టార్థములెల్ల జూఱుము వెసన్ నీవారలన్ గూడుకో
నీయాటోపము నిర్జరేంద్రుడడచున్ నేడాజిలో దుర్మతీ.[18]

చాణూరుడు కృష్ణునితో పలికిన ఈక్రింది పద్యములోను వీరరసము వెల్లి విరియుచున్నది

శా॥ స్థాణున్ మెచ్చడు బ్రహ్మకైకొనడు విష్వక్సేనునవ్వున్ జగత్
ప్రాణున్ రమ్మన డీడుగాడని మహాబాహాబలప్రౌఢ న
క్షీణుండాజికి నెల్లి నేడనడు సంక్రీడన్ విజృంభించు న
చ్చాణూరుండొక గోపబాలుపనికిన్ శత్రుండుగాకుండునే.[19]

ఈరసమునకు స్థాయిభావమగు మత్సాహము ఇట్టిచోట్ల ఉజ్జ్వలముగా వ్యక్త మగుచున్నది. వీరరస ప్రధానములగు నీ వర్ణనములు కావించుటలో పోతన చూపిన ప్రజ్ఞ అత్యంత ప్రశంసనీయము

కరుణరసము :- శోకము దీని స్థాయిభావము. ఆత్మీయుల మరణాది వియోగముచే కలిగిన వైక్లబ్యమను చిత్తవృత్తి విశేషమిది.

కృష్ణనిర్యాణాది ఘట్టములలో ఈరసము సముచితముగా పోషింపబడినది. కన్నీరు కరతలమున తుడుచుకొనుచు గద్గదస్వరమున మహానిధి గోలుపోయిన పేద చందంబున నిట్టూర్పులు నిగుడింపుచు, అర్జును డన్నతో పలికిన సందర్భము చూడుడు.

కం॥ మనసారథి మనసచివుడు
మనవియ్యము మన సఖుండు మన బాంధవుడున్
మనవిభుడు గురుడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా![20]

హృదయములు కదలించు నిట్టి కరుణరసభరిత పద్యములు పోతన రచనలో అడుగడుగున గోచరించుచునే ఉండును. ఉశీనరేంద్రుడు మరణింపగా ఆయన భార్యలు దుఃఖించుట చూడుడు

మ॥ అనఘా! నిన్ను నుశీనరప్రజల కర్థానంద సంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మనిర్దయత నున్మూలించెనే వీరికిన్
తనయశ్రేణికి మాకు దిక్కుగలదే ధాత్రీశ ! నీబోటికిన్
జనునేపాసిచనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులన్ పుత్రులన్.[21]

అద్భుతరసము :- విస్మయము దీని స్థాయిభావము. అపూర్వ వస్తుదర్శనమున గలుగు చిత్తవిస్తరమిది. నృసింహావిర్భావము, వామన విజృంభణము మొదలగుచోట్ల ఈరసము పోషింపబడినది. త్రివిక్రమోల్లసనములోని ఒక ఆశ్చర్యస్వరూప వర్ణనము చూడుడు.

మ॥ ఒకపాదంబున భూమిగప్పి దివి వేరొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీదిజగంబులెల్ల దాడినొండొంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహమున్ బగిలివేంద్రడంబై పగుల్ గానరా
నొకడై వాగ్గ్రగలభ్యుడై హరివిభుండొప్పారె విశ్వాకృతిన్.[22]

కూర్మావతారకథలో సర్వస్వరూపుడైన విష్ణుని లీలలనుజూచి శుకుడిట్లాశ్చర్య పడినాడట।

కం॥ తరిగాంద్రడలోన నొకడట
తరికడవకు కుదురు నొకడ్రతాడును చేరుల్
తరిగవ్వంబును తానట
హరిహరి హరిచిత్రలీల హరియే యెరుగున్.[23]

హాస్యరసము :- హాసము దీని స్థాయిభావము. వాగంగాది వికారములను చూచుటవలన ఉదయించు చిత్తవికాసమిది. రుక్మి పరాభవము ప్రలంబవధ మొదలగు చోట్ల ఇది పోషింపబడినది.

కృష్ణుని చిలిపి చేష్టలలోను గొల్లపిల్లలతో కలసి చల్దులారగించుటలోను విశ్వ సాహిత్యములోనే అద్వితీయమగు హాస్య రసోదాహరణములు కలవని శ్రీముట్నూరి సంగమేశముగారు వ్రాసియున్నారు.[24]

బ్రహ్మదేవుడు కూడ నిద్రపోవునప్పుడు గుర్రుపెట్టునని వర్ణించిన ఈక్రింది పద్యములోని హాస్యము సరసాస్వాద్యము.

మ॥ నెరినెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ మీాలింప నిర్మించి వీ
పిరియన్ నీల్గుచునావులింపుచునజుఁడేసృష్టియున్ మానిమే
నొరగన్ రెప్పలుమోసి కేల్దలగడై యుండఁగనిద్రింపుచున్
గురువెట్టన్ దొడగెన్ కలల్గనుచు నిర్ఘోషింపుచున్ భూవరా![25]

బ్రహ్మయంతవానికి కూడ తలక్రింద పెట్టుకొనుటకు దిండులేక చేతినే పెట్టు కొని నిదురపోవుట తప్పక నవ్వుపుట్టించును. ఇక పెద్ద నిర్ఘోషము చేయుచు గుర్రు పెట్ట దొడగెనన్నచో చెప్పవలసిన పనిలేదు.

వేశ్యలు ఋష్యశృంగుని గూర్చి పలికిన ఈ క్రిందిమాటలు మిక్కిలి హాస్య నిలయములు.

ఆ॥ కాంతలార! మొగము గన్నది మొదలుగ
ఆడువారి నెరుగడడవిలోన
గోచిబిగియగట్టుకొనిన యీావడుగని
మత్తికాని రతికి మరపవలయు.[26]

ఆతనిని చూచి నవ్వుచు వారుచేసిన హాస్యక్రియలు చూడుడు.

సీ॥ సేమమేయని సతుల్ చేతుల గ్రుచ్చి క
ర్కశ కుచంబులు మోపి కౌగిలించి
చిరతపోనియతి డస్సితిగదా యని మోము
కంఠంబు నాభియు గలయబుణికి
క్రొత్తదీవన లివి కొనుమని వీనుల
పొంతల నాల్కచప్పుళ్ళు జేసి
మావనంబుల పండ్లు మంచివి తినుమని
పెక్కులడ్వంబులు ప్రీతినొసగి

తే॥ చర్మవస్త్రమ్ము వదిలించి భర్మకాంతి
మించి చెలగు పీతాంబరమిచ్చి వెసను
మనము చొక్కంగ నతని జేకొనగ పారి
మరుగునకుజేరె నతడు వే మరగి వారి.[27]

పై పద్యములోని పనులు విన్నను ఏ నాటకముననో చూచినను నవ్వుపుట్టక తప్పదు.

రౌద్రరసము :- క్రోధము దీనిస్థాయిభావము. శత్రు కృతాపచారముచే కలిగిన మనః ప్రజ్వలనము దీని లక్షణము. వీరభద్ర నరసింహావిర్భావములందీరసము బాగుగా పోషింపబడినది. హిరణ్యకశిపుని ఉగ్రక్రోధమును సూచించు ఈక్రింది ఒకటి రెండుఉదాహరణములు రౌద్రరసమునకు నిదర్శనములు కాగలవు.

వ॥ పాదతాడితంబైన భుజంగంబు భంగి పవనప్రేరితంబైన దవానలంబు చందంబున, దండతాడితంబైన కంఠీరవంబు కైవడి భీషణ రసావేశ జాజ్వల్యమాన చిత్తుండును, పుత్ర సంహారోద్యోగ యుక్తుం డును కంపమాన గాత్రుండును అరుణీకృత నేత్రుండునునై.[28]

క్రోధోద్రిక్తుడగు దైత్యవల్లభుని స్వరూపమిందు భీషణముగా వర్ణించబడి నది. ప్రహ్లాదునితో నాతడు విష్ణుధిక్కారము చేయుట చూడుడు.

శా॥ నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండు నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లేడొకడు సంపూర్ణ ప్రభావుండు మ
ద్భ్రాతన్ జంపినమున్ను నే వెదకితిన్ బల్మారు నారాయణుం
డే తద్విశ్వములోన లేడు మరి వాడెందుండురా దుర్మతీ![29]

నాతోడన్ బ్రతిభాషలాడెదు. వాడెందుండురా దుర్మతీ! అనుటలో దైత్యేంద్రుని క్రోధపరమావధి ఎంత తీవ్రమైనదో సువ్యక్తమగుచున్నది.

కృష్ణుని వెంటబడిన కాలయవనుడు గిరిగుహలో జొచ్చి కృష్ణుడదృశ్యుడు కాగా తానును అందు ప్రవేశించి దీర్ఘతల్ప నిద్రితుడై గురకపెట్టుచున్న యొక మహాపురుషునిం గని కృష్ణుడే అట్లు నటించుచున్నాడని క్రోధఘూర్ణితుడైనాడు. ఆ కోపముతో అతడు పలికిన మాటలివి.

ఉ॥ ఆలము సేయలేక పురుషాధమ! దుర్లభ కంటక ద్రుమా
భీల మహాశిలా సహిత భీకర కుంజర ఖడ్గ సింహ శా
ర్దూల తరక్షు సంకలిత దుర్గపథంబున బారు దెంచి యీ
శైలగుహన్ సునిద్రిత క్రియ జాగి నటించిన బోవనిత్తునే?[30]

ఇందలి రౌద్రరసస్ఫురణము విస్పష్టము.

బీభత్సరసము :- జుగుప్స ఈ రసమునకు స్థాయిభావము. ఇది అసహ్య వస్తువులను చూచుటచే ఉదయించు గర్హణము. రుక్మిపరాభవమున బాణాసుర యుద్ధమున ఇంకననేక యుద్ధాది వర్ణనల సందర్భముల ఈ రసము పోషింప బడినది. రుక్మిని పరాభవింపబూనిన కృష్ణుని కృత్య మీక్రింది వాక్యములో చూడుడు.

వ॥ చిరునగవునగుచు వానిం బట్టి బంధించి గడ్డంబును, మీసంబునుం దలయును నొకకత్తి వాతియమ్మున రేవులు వార గొరిగి విరూపింజేసె... ...[31].

పై దృశ్యములో జుగుప్సావహమగు రుక్మిపరాభవము రసోచితముగా వర్ణింపబడినది.

ద్వివిదుడను వానరుడు చేసిన అసహ్యక్రియల వర్ణనము చూడుడు.

సీ॥ కనుగొని తత్పురోగను భూమిరుహశాఖ
లెక్కియూచుచు చాలవెక్కిరించు
కికురింతలిడు కండ్లు గీటుచు నవ్వుచు
కొమ్మకొమ్మకు నురుకుచు నదల్చు
తోకనూరక మేనుసోకగ నులివెట్టు
వెడవెడ నాలుక వెళ్ళబెట్టు
బరులనఖంబుల గిరగిర గోకుచు
బోరిబోరి ఫలములు గరచివైచు

తే॥ గోళ్ళు తెగగొర్కి యుమియును గుదము సూపు
బలిసి మర్కటజాతి అప్పగిదిజేయ...[32]

హాస్యజుగుప్స లిందు ప్రతిచేష్టలోను వ్యక్తమగుచున్నవి.

కృష్ణ బాణాసుర యుద్ధములో రణరంగ వర్ణనము పరికింపుడు.

తునిసిన శిరంబులును తునుకలైన కరంబులును తెగినకాళ్ళను, త్రెస్సిన వ్రేళ్ళను, తుమురులైన ఎముకలును, ప్రోవులైన ప్రేవులును, నులిసిన మేనులును, నలసిన జానువులును...[33]

పీనుగుపెంటలతో చూడరాని యుద్ధస్థల వర్ణనము బీభత్స రసపూరితమగుట స్పష్టము.

భయానకరసము :- ఈరసమునకు స్థాయిభావము భయము. భీషణాకారము లను చూచుట మొదలగు వానివలన హృదయమందు గలుగు మరణాదిరూపమగు మహానర్థ శంక ఇది.

నరసింహావిర్భావమున బాణాసురయుద్ధము మొదలగుచోట్ల ఈరసము దృశ్యమానమగును. స్తంభోద్భవుడగు నృసింహుని విజృంభణము చూడుడు.

దశదిశలును మిణుగురులు చెదర చిటిలిపెటిలివడి బంభజ్యమానంబగు నమ్మహాస్తంభంబువలన ప్రళయవేళాసంభూత సప్తస్కంధబంధుర సమీరణ సంఘటిత జోఘుష్యమాణ మహాబలాహకవర్గ నిర్గత నిబిడ నిష్ఠురదుస్సహ నిర్ఘాత సంఘనిర్ఘోష

నికాశంబులైన ఛటచ్ఛట స్ఫుటస్ఫుటధ్వని ప్రముఖ భయంకరారావపుంజంబులు జంజన్య మానంబులై ఎగసి ఆకాశకుహరాంతరాళంబు నిరవకాశంబుసేసి నిండినంబట్టు జాలక.[34]

ఇందలి ఒక్కొక్కదృశ్యము గుండెలు జల్లుమనిపించును. అర్థముతోబాటు శబ్దసంఘటనము కూడ ఇచ్చట రసస్ఫురణమున కెంతయును తోడ్పడుచున్నది.

గజేంద్రమోక్షణ కథలో ఏనుగుల గుంపులను చూచి ప్రాణభీతితో నితర జంతువులు పరువులుపెట్టుట భయానక రసమునకొక చక్కని ఉదాహరణము.

సీ॥ పులుల మొత్తంబులు పొదరిండ్లలోదూరు
ఘోర భల్లూకముల్ గుహలుసొచ్చు
భూదారములు నేలబొరియలలో డాగు
హరిదంతములకేగు హరిణచయము
మడుగులజొరబారు మహిషసంఘంబులు
గండశైలంబుల కపులుప్రాకు
వల్మీకములుసొచ్చు వనభుజంగంబులు
నీలకంఠంబులు నింగికెగయు

తే॥ వెరచి చమరీమృగంబుల వినరువాల
చామరంబుల విహరణ శ్రమమువాయ
భయద పరిహేల విహరించు భద్రకరుల
గాలివారినమాత్రాన జాలిబొంది.[35]

భద్రకరుల భయద క్రీడావిక్రమము శార్దూలాదులనే తల్లడిల్ల జేసినదన్న ఇంక వేరుగా చెప్పవలసిన పనిలేదు.

శాంతరసము :- శమము దీనిస్థాయి భావము. వైరాగ్యాదులచే చిత్తము నిర్వికారమై యుండుట దీని లక్షణము. బలిచరిత్ర ప్రహ్లాదచరిత్ర మొదలగు వానిలో అనేక ఘట్టములు శాంతరస ప్రధానములు.

ప్రహ్లాదుడత్యంత ప్రశాంతుడు. సుఖదుఃఖముల కతీతుడు. భక్తిభావము గోపికాకథలలో శృంగారమునకు ప్రోద్బలమగు భావముకాగా ఇతని విషయమున

శాంతమున కుపస్కారకమైనది. కథలోని రౌద్రరసము శాంతరసముల్లసనమునకు అంగభూతమైనది. భయంకర బాధా మధ్యమున ప్రహ్లాదుని భక్తిపూరిత శాంతస్థితి వర్ణనము చూడుడు.

ఉ॥ తన్నునిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికో
పన్నగశాయి! యోదనుజ భంజన యోజగదీశ! యోమహా
పన్నశరణ్య! యోనిఖిలపావన! యంచు నుతించుగాని తా
కన్నులనీరు దేడు భయకంప సమేతుడుగాడు భూవరా![36]

మాలాకారుడగు సుదాముని అభ్యర్థనలో శాంతరసోల్లసనము విస్ఫురిత మగుచున్నది చూడుడు.

కం॥ నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
తాపసమందార! నాకు దయసేయగదే[37]

ఈ విధముగానే బ్రహ్మస్తుతిలో, శ్రుతిగీతలలో ఇవియవి యననేల భాగవతములో నించుమించు ప్రతిఘట్టములోను శాంతరసమున కుదాహరణములు గోచరింపగలవు.

భాగవత పురాణమునిట్లు తనసహజ ప్రతిభావిశేషముచే నవరస భరితముగా తీర్చిదిద్ది పోతన సర్వసహృదయ ప్రశంసల నందినాడు.



# పోతన కవిత్వము - వర్ణనలు

వర్ణనా నైపుణ్యమే కవిత్వమునకు ప్రధానధర్మము వస్తుస్వరూప స్వభావము లను రెంటిని సూక్తి సుందరముగా ప్రపంచించుటయే వర్ణన లక్షణము. ఈ వ్యాసమున పోతన వస్తుస్వరూప వర్ణనమేవిధముగా గావించినాడో పరిశీలింప బడుచున్నది.

పోతన భావదర్శనము సమగ్రమైనది. మూలము ననువదించునప్పుడేదైన నొకచోట వర్ణింపవలెనను ఆలోచన వచ్చినయెడల మూలముతో సమానముగనే ఆయన ప్రజ్ఞాపాటవము వికసితోల్లసితమగును. ఔచిత్యభాసితమైన ఆ ప్రతిభ కావ్య సౌందర్యమును బహువిధముల నినుమడింపజేసినది. సమర్థులగు కవులకుమాత్రమే ప్రత్యేకమగు ఈ విశిష్ట లక్షణము పోతనలో వేయిరేకుల తమ్మివలె సురభిళమై వికసించినది.

భాగవత కథారంభములోని నైమిశారణ్య వర్ణనము పాండితీ సముద్దీపితము. శ్లేషోన్మీలితములగు నందలి ఉపమానములు రమణీయతా సన్మానములు. శైలజానిటలమువలె ఆ అడవిచందన కర్పూర తిలకాటంకృతమైనది, నిగమమువలె గాయత్రీ విరాజితమైనది. మహాకావ్యమువలె సరస మృదులతా కలితమైనది. ఇటులా విష్ణుక్షేత్ర వర్ణనములో[1] తనప్రజ్ఞా ప్రథమ సూచనమును పోతన పాఠకుల కందించినాడు.

వ్యాసునికడకు నారదుడు వచ్చినపుడు మూలమున "కృష్ణస్య నారదోఽభ్యాగాద్రాశ్రమం ప్రాగుదాహృతం"[2] అని మాత్రమేకలదు. పోతన అచ్చట నారదుని స్వరూపవర్ణనమును ఒక సీసపద్యములో పెంచివ్రాసినాడు. చూడుడు.

సీ॥ తనచేతి వల్లకీ తంత్రీచయంబున
సతత నారాయణ శబ్దమొప్ప
ఆనన సంభూత హరిగీతరవసుధా
ధారల యోగీంద్ర తతులుసొక్క
కపిల జటాభార కాంతిపుంజంబుల
దిశలు ప్రభాత దీధితి వహింప

తనులగ్నతులసికా దామగంధంబులు
గగనాంతరాళంబు గప్పికొనగ

ఆ॥ వచ్చె మింటనుండి వాసవీనందను
కడకు మాటలాడ గణకతోడ
భద్రవిమలకీర్తి పారగు డారూఢ
నయవిశారదుండు నారదుండు.[3]

నారదుని శారదనీరదేందుకాంతి సంపన్నునిగా వర్ణించుట సామాన్యముగా కవులపద్ధతి. అతని జటలు కపిల వర్ణముగానున్నవనియు, వానికాంతిచే దిశలందరుణ రాగము క్రమ్ముకొన్నదనియు, పోతన వర్ణించుట మిక్కిలి చిత్రమయినది. ఇట్టివర్ణనము మాఘుని శిశుపాలవధలో కలదు.

శ్లో॥ దధానమంభోరుహకేసరద్యుతీ
ర్జటాశ్శరచ్చంద్రమరీచి రోచిషం
విపాకపింగా స్తుహిన స్థలీరుహో
ధరాధరేంద్రం వ్రతతీతతీరివ.[4]

నారదుని ఎఱ్ఱని జటలు కలవానిగా వర్ణించుటలో పోతనపై మాఘుని రచనా ప్రభావము కొంత ఉండవచ్చును.

కౌరవ పాండవ యుద్ధానంతరము ద్వారకానగరమునకు కృష్ణుడరిగినప్పు డా పట్టణసౌందర్యమును పోతన మనోఽభి రామముగా వర్ణించెను. అందలి కలహంసావృత హేమపద్మ పరిఘాకాసారములను, మణిమయప్రాకారములను, మహోన్నత మంగళతోరణములను ప్రవాళనీలమరకత వజ్రవైడూర్యాది నిర్మిత గోపురాట్టాలకములను, పరమసుందరోద్యానవనములను[5] మహోత్సాహముతో ఆయన చిత్రించినాడు

కృష్ణునకు స్వాగతమిచ్చెడి తత్సతుల వియోగబాధాకార్శ్యమొక చక్కని కందములో అలరినది. చూడుడు.

కం॥ శిశువుల చంకలనిడి తను
కృశతలు విరహాగ్ని దెలుప గృహగేహాళులన్
రశనలు జారగ సిగ్గుల
శశిముఖులెదురేగి రపుడు జలజాక్షునకున్.[6]

ఇక్కడ సిగ్గులపెండ్లికూతురన్నట్లు సిగ్గులశశిముఖులను జాతీయమును వాడుట ఎంతయును రమణీయముగా నున్నది.

విష్ణుభక్తుల గమ్యస్థానమగు వైకుంఠము నత్యంతశ్రద్ధతో అనేకస్థలముల పోతన వర్ణించినాడు. లోకములోని మహానగర వైభవములన్నియు తానూహించుకొని దానికొక వెయ్యిరెట్లుచేసి చిత్రించెను.

సీ॥ సూర్యచంద్రానల స్ఫురణలజోరనీక
నిజదీధితిస్ఫూర్తి నివ్వటిల్ల
దివ్యమణిప్రభా దీపితసౌధవి
మాన గోపుర హర్మ్యమండపములు
ప్రసవగుచ్ఛస్వచ్ఛభరిత కామితఫల
సంతాన పాదప సముదయములు
కాంచనదండ సంగత మారుతోద్ధూత
తరళవిచిత్ర కేతన చయములు

తే॥ వికచకైరవదరదరవిందగతమ
రంద రసపాన మోదితేం దిందిరప్ర
భూత మంజుల నినదప్రబుద్ధ రాజ
హంస శోభిత వరకమలాకరములు.[7]

ఇవికాక కీరశారికాపికకేకీ మధుప సముదాయము విష్ణు సంబంధములగు వాక్యముల ననవరతమునం దుచ్చరించుచుండును. విష్ణురూపధరులగు భక్తులెందరో అందు విలసిల్లుచుందురు. పోతన రచనలో వైకుంఠమును గూర్చిన పరమావధియైన దర్శన మిది.

వర వైకుంఠము సారసాకరము దివ్యస్వర్ణశాలాంకగో
పురహర్మ్యావృతమైన తద్భవనమంభోజంబు తన్మందిరాం
తర విభ్రాజిత భోగి కర్ణిక తదుద్యద్భోగి పర్యంకమం
దిరవొందన్ వసియించుమాధవుడు తానేపారుభృంగాకృతిన్.[8]

భాగవతము విష్ణుపరమైనదిగాన విష్ణుని తల్లోకమును వర్ణింపవలసినన్ని సార్లు శివుని కైలాసమును వర్ణింపవలసిన అవసరము కలుగదుగాని అవకాశము వచ్చినచోట్ల మాత్రము అద్వైతమార్గానుయాయియగు పోతన ఉజ్జ్వలముగానే వర్ణించినాడు

భాసురలీలఁగాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో
ల్లాసము కిన్నరీజన విలాసము నిత్యవిభూతి మంగళా
వాసము సిద్ధగుహ్యక నివాసము రాజతభూవికాసికై
లాసము కాంతినిర్జిత కులక్షితిభృత్ సుమహద్విభాసమున్.[9]

ఆ కైలాసమున దాక్షాయణీ విరహక్లేశ బాధితహృదయుడగు దక్షిణామూర్తిని బ్రహ్మాదులందరును చేరి స్తుతించిరి. ఆ పరమశివుని.

తే॥ తాపసాభీష్టకరు భస్మదండలింగ
ఘనజటాజినధరుని భక్తప్రసన్ను
వితతసంధ్యాభ్రరుచి విడంబిత వినూత్న
రక్తవర్ణు సనాతను బ్రహ్మమయుని[10]

అని పోతన వర్ణించినాడు. శివుడు సామాన్యముగా ధవళవర్ణము వాడని ప్రసిద్ధి. కానీ ఇక్కడి శివుడెర్రనివాడు. దీనికి మూలమును నిటులే కలదు. చూడుడు.

శ్లో॥ లింగంచతాపసాభీష్టం భస్మదండజటాజినం
అంగేనసంధ్యాభ్రరుచా చంద్రరేఖాంచబిభ్రతం.[11]

పృథుచక్రవర్తి ప్రవృత్తుడైన ఉగ్రతపమును పోతన మిక్కిలి శ్రద్ధతో వర్ణించెను.

శ్లో॥ గ్రీష్మేపంచతపావీరో వర్షాస్వాసారషాణ్మని
ఆకంఠమగ్నశ్శిశిరే ఉదకే స్థండిలే శయః[12]

అను శ్లోకమును తెనుగు నుడికారముతో పెంచితపోదీక్షలోని మహాకష్టమెట్టిదో ఈ క్రిందిసీసములో ఆయన వ్యక్తీకరించినాడు.

సీ॥ మెండుగా మిటమిటమండు వేసవియందు
తప్తపంచాగ్ని మధ్యమున నిలిచి

మానక జడిగొన్న వానకాలంబున
పై కోకవేయక బయటనిలిచి
జనులు హాహాయను చలివేళకుత్తుక
బంటి తోయములలోపల వసించి
శిశిరంబుచాల నల్దిశలు పర్విన వేళ
వెలయ భూశయనుడై విశ్రమించి[13]

ఆ రాజర్షి చేసిన దురతిక్రమమైన తపస్సెట్టిదో కన్నుల కట్టినట్లున్నది. మిట మిటమండు వేసవియు, హాహాయను చలివేళయు ఎంతదుర్భరములో ఊహించినచో పోతన పై శ్లోకమును తెనిగించుటలో తనవర్ణనా నైపుణ్యము నెంతకలిపెనో గోచరించును.

స్తంభమున నావిర్భవించిన నరసింహుని స్వరూపమును పోతన వర్ణించిన వైఖరి నిరుపమానమైనది.

వ॥ సంధ్యారాగరక్తధారాధరమాలికా ప్రతిమ మహోద్భటకంపితంతన్యమాన పటుతర సటాజాలుండును, సటాజాలసంచాలనసంజాత వాతడోలాయమానవైమానికవిమానుండును.[14]

.... అగు నరసింహుని విజృంభణము లోకాద్భుతము. అందలి సంరంభము శబ్దముల కూర్పులోనే ప్రకటితమగుచున్నది.

అరణ్యవర్ణనములలో పోతన మిక్కిలి నిపుణుడు. చతుర్థ స్కంధములోని కైలాసప్రాంతవర్ణనములోను, గజేంద్రమోక్షణములోని త్రికూటశైలారణ్య వర్ణనములోను అసమాన శబ్దార్థసౌందర్యము నాయన ప్రకటించినాడు. వీనిని చూచి అక్కడ చెట్లపట్టికలిచ్చుట తప్ప వర్ణనాచాతుర్యమేమియులేదని కొందరు విమర్శించినారు. ఆ పట్టికలు చాలవరకు వ్యాసుడిచ్చినవేకాని పోతనవి కావు. కానీ పోతన చేసిన దొక్క-శిల్పము మాత్రముకలదు. వానిని శబ్దాలంకారమున కనుగుణముగా వరుసగా పేర్చి అవసరమైనచో మరియొక్కటి తానుచేర్చి ఒక చక్కదనము న క్కడ కూర్చినాడు. కవితాసౌందర్యము ద్వివిధము. శాబ్దికము. ఆర్థికము, కొన్నియెడల శబ్దము వినుచుండగనే ఒకఉదాత్తమగు ఆనంద స్ఫురణము కలుగుచుండును. అర్థరహితమైన సంగీత నాదము శ్రవణపేయమై హృదయంగమముగానుండునుకదా! అయినను ఆ

అరణ్యవర్ణనము లర్థరహితములు కావు రత్నస్థగితమగు నొకపానపాత్రలో మధుర రసమునందిచ్చుట వంటిది అచ్చటి సమ్మేళనము. త్రావెడి మధురసమును మణి పాత్రలోనిచ్చినను, మట్టిపాత్రలో నిచ్చినను రుచియొక్కటియే కావచ్చును. కానీ కళాకమనీయమగు హృదయము రత్నపాత్రిక సౌందర్యమును హృద్గతము చేసి కొనును. ఆఅరణ్యవర్ణనలో ముందరి శబ్ద సౌందర్యము రసహృదయమునకు ముందు కాన్పించు రత్నపాత్రవంటిది. ఆతరువాత దర్శనమిచ్చు అర్థసౌందర్యము అనంత రాస్వాద్యమానమగు మధురసము వంటిది. కుడ్యనిర్మాత శైలశిలలను ఒక్కపద్ధతిగా చెక్కి పేర్చినట్లే పోతనయు ఆవనమునందలి వృక్షములను శ్రవణపేయమగు నొక సామ్యపద్ధతిలో కూర్చి కన్నులకు మిరిమిట్లు గొలుపునొక అద్భుతదృశ్యమును మనకు చూపించినాడు. తరువాత బహుళార్థ సమన్వితమగు వివిధదృశ్యచిత్రణము లను చేసినాడు. నిరంతర వసంతసమయమో అన్నట్లక్కడపూచినపూలను, కాచిన పండ్లను, చిలుకలు ముక్కులతో కొరుకుటచే పండిన పండ్లనుండి ప్రవహించెడి రస ప్రవాహములను, కన్నులకింపుగొలుపునట్లు తనినితీర చూపినాడు. ఇంకను రసికులగు వ్యక్తులకు దేవయోనుల సంతతసరససల్లాప సంగీతప్రసంగమంగళాయతనములను తిలకింపజేసినాడు ఈవిధముగా ఒకేవనములో సర్వవిధమన స్తత్వములకు తగి నట్లుగా శబ్దార్థనిరవధిక సౌందర్య విశేషములను పోతన పాఠకుల కందించినాడు.

అట్టి అరణ్యప్రాంతమునందలి శైలగుహలలోనుండి ఏనుగులు బయటకు వెడలు దృశ్యము అద్భుతమైనది. పగలుభయపడి గుహలలోదాగి సంధ్యాసమయమున సూర్యుడు వృద్ధుడైనపిదప ఇక నీ ముసలివాడు మనలనేమిసేయులే యని కాబోలు చీకట్లు బయల్వెడలినట్లుగా ఏనుగులు గుహలనుండి బయటకువచ్చినవట.[15] అక్కడి గున్నఏనుగుల విజృంభణ మెట్టిదో పరికింపుడు.

కం॥ తలగవు కొండలకైనను
మలగవు సింగములకైన మార్కొనుకడిమిన్
కలగవు పిడుగులకైనను
ఇలబలసంపన్నవృత్తి నేనుగుగున్నల్.[16]

బయటకు వచ్చు గిరికాననాశ్రయమగు ఏనుగులలో ఒక్కయూథపునకు మాత్రమే ఇతరజంతువులన్నియు భయపడుచున్నవని మూలమున నుండగా 'భద్ర కరులనుజూచి అని దానిని పోతన బహువచనముగా మార్చినాడు- ఆ భయపడుటలో

గజములుకూడ నున్నవని మూలముననుండగా ఆయన దానిని తొలగించెను. మదమత్తమైన గజమునుచూచి ఇతర గజములు భయపడుట సహజమేఅయినను జాతి విరుద్ధముగా నుండునని కాబోలును ఆయన దానిని వదలి వేసినాడు.

కరినాథుని గంధము నాఘ్రాణించిన క్రూరజంతువులన్నియు పరువెత్తుకొని పోయినవని మూలమున నుండ[17] పోతనయు అట్లేవానిని భయపెట్టినను మరికొంత దూరమున కలభములు విహరించుచు వానిని శిక్షించుటను చమత్కారముగా వర్ణించినాడు.

కలభంబుల్ చెరలాడు పల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫలభూజంబులురాయుచున్ చివురుజొంపంబుల్ వడిన్ మేయుచున్
పులులన్ గారెనుబోతులన్ మృగములన్ బోనీక శిక్షింపుచున్
కొలకున్ సొచ్చికలంపుచున్ గిరులపై గొబ్బిళ్ళుగోరాడుచున్[18]

వప్రక్రీడాపరిణతమును, ప్రేక్షణీయమును అగువాని స్వైరవిహారము సముజ్జ్వలము. కొండలు తలక్రిందై పడునట్లుగా కుంభఘట్టనము కావించెడి ఏనుగులనుచూచి దిశలే బెండువడినవట.

గజేంద్రుని రక్షించుటకై శ్రీమహావిష్ణువు బయలుదేరిన సందర్భమును అత్యంతచతురముగా, నిరుపమానముగా పోతన ఊహించి చిత్రించినాడు. తనకుచో పరిచేలాంచలము విష్ణుని చేతిలోనుండగా లక్ష్మీదేవి, ఆమెవెంట అంతఃపురకాంతలు, వారివెనుక గరుత్మంతుడు, అతనిప్రక్క శంఖచక్రాద్యాయుధములు వచ్చుట జరిగినది. ఇక నారదుడు తప్పదుగదా! సేనాపతి విష్వక్సేనుడు కాబోలు ఇదిఏమిగందరగోళమోయని తానును విచ్చేసినాడు. ఆ కల్లోలమున కాబాలగోపాలమును వైకుంఠము వెలువడివచ్చి ఆకాశముననే ఉన్నారు. ఈ దృశ్యమును చూడుడు.

మ॥ తనవెంటన్ సిరి లచ్చి వెంటనవరోధవ్రాతమున్ దానివె
న్కనుపక్షీంద్రుడు వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజనీకాంతుడురావచ్చిరో
య్యనవైకుంఠపురంబునంగలుగువారాబాలగోపాలమున్.[19]

ఒక్క గజమును రక్షించుట కింత సంరంభము! అవును, భగవంతుని భక్తపరాయణత్వమట్టిది. అందలి ఆ ఉద్వేగమును పోతన చక్కగా భావించినాడు.

సురాసురయోధములు సముద్రమథనమును కావించుటను ఆయన మిక్కిలి విపులముగా వర్ణించెను. దేవదానవులు కవచంబులు నెట్టంబులు పెట్టికొని పుట్టంబులు పిరిచుట్లుచుట్టుకొని, కరంబులు కరంబుల నప్పళించుచు భుజంబులు భుజంబుల నొరయుచు లెండులెండు తరువందొడంగుడు, రండు[20]–అని మథనము ప్రారంభించిరట. ఆ కష్టములో అలసిన వారి శరీరములలో స్వేదము ప్రవహింపజొచ్చినది. అయినను అక్కడనున్న వారొకరికొకరు తగ్గుట ఇష్టములేనివారు. అందుచే ఒండొరులను పరిహసించుచు పేరువాడి విలపించుచు మేలుమేలని అగ్గించుచు కాదుకాదని భంగించుచు వెనుదీయక త్రచ్చిరి. వారిఅట్టహాస తర్జనగర్జన ధ్వనులు చాల లోకసహజముగా వర్ణింపబడినవి.

కీలా కోలాహలమైన హాలాహలవర్ణనము మెలకు సెగలమిడుకం జాలక నీరైన దేవతలతో, నేలకూలిన రక్కసులతో, డుల్లిన తారకములతో గీటణంగిన కిన్నర మిధునములతో, కమలిన గంధర్వవిమానములతో, చీకాకుపడ్డ సిద్ధచయములతో చిక్కువడిన గ్రహములతో విజృంభించినది[21] ఆ హాలాహలమును మ్రింగెడి శివస్వరూప వర్ణనము పోతనకావించిన మహిత కల్పనములలో నొకటి.

> కదలంబారవు పాపపేరులొడలన్ ఘర్మాంబుజాలంబు పు
> ట్టదు నేత్రంబులు నెఱ్ఱగావు నిజజూటాగ్రేందుడున్ గందడున్
> వదనాంభోజము వాడదావిషము నాహ్వానించుచో డాయుచో
> పదిలుండై కడిసేయుచో తెగుచుచో భక్షించుచో మ్రింగుచోన్[22]

ఈవర్ణనములో నొక వైశిష్ట్యమున్నది. ఈపద్యమున కర్థము క్రమాలంకారములో చెప్పినగాని పోతన ఇందిమిడించిన భావసౌందర్య మర్థముగాదు. ఇందైదు దృశ్యములున్నవి.

1. అవిషయము నాహ్వానించుచో కదలంబారవు పాపపేరులు – విషసుగ్నిజ్వాల వంటిది. అది దగ్గరకు వచ్చుచున్నచో ఆవేడికి సర్పభూషణములు కదలిపోవలెను. ఏలనగా పాములు వేడినిభరింపజాలవు. కానీ అవిశివభూషణము లగుటచే శివుని మహిమవలన వానికెట్టి బాధయు కలుగలేదు.

2. డాయుచో నొడలన్ ఘర్మాంబు జాలంబు పుట్టదు – విషముదగ్గరకు వచ్చునపుడా ఉష్ణతకు చెమటపోయుట సహజము. లేదా మనసులో భయమున్నను స్వేదముదయింపవచ్చును. ఈరెండును శివుని విషయమున లేనివైనవి.

3. పదిలుండై కదిసేయుచో నేత్రంబులు నెర్రకావు - సెగలుపొగలు గ్రక్కు వస్తువు దగ్గరనున్నచో దానితీవ్రతకు కన్నులెర్రపడుట తప్పదు. కానీ శివునకట్టిది జరుగలేదు.

4. తిరుగుచో నిజజూటార్ధేందుడున్ కందడున్ - చేతిలోనున్న ముద్దను నోటి దగ్గరకు తీసికొని వెళ్ళుటలో ... శ్రమునకు మరింత చేరువయైనది. అందుచే జటాజూటములోని చంద్రుడు కందిపోవలసినది. కానీ అదియును కాలేదు.

5. ఇక చివరిప్రయత్నము - భక్షింపుచో మ్రింగుచో వదనాంభోజము వాడదు - జ్వాలాకరాళమగు హాలాహలము శివుని వదనాంభోజమును రవ్వంతయు వసి వాళ్వాడించలేక పోయినది.

మ్రింగుచో అనుక్రియను అవసరమైనయెడల క్రింది కందపద్యముతో నన్వయింపవచ్చును. అట్లు ఒనరించుటయు సంప్రదాయ విరుద్ధముకాదు.

ఏదిఎట్లున్నను హాలాహలభక్షణ దృశ్యమును వర్ణించు ఈ శివప్రభావ నిరుపమాన సంధాన చిత్రణము కవిలోక ప్రశంసనీయము.

దానవులను మోహింపజేయుటకై శ్రీహరిధరించిన మోహినీస్వరూపము జగదేక మోహనమైనది. ఆ మోహనత్వము కేవలశిల్పము యొక్క సౌందర్యము వంటిది కాదు. విద్యుద్వల్లికవలె క్షణక్షణభ్రాంతికరము. ఒకచూపులో, ఒకకులుకులో, నొక యొయ్యారములో ఆ మోహనత్వము నిమిషనిమిషము నభివృద్ధి పొందుచున్నది. ఆ జగత్సంచలనాత్మకమగు సౌందర్యమును పోతన వర్ణించిన పద్ధతి చూడుడు.

సీ॥ పాలిండ్లపైనున్న పయ్యెద జారించు
జారించి మెల్లన చక్కనొత్తు
తళుకుతళ్కను గండఫలకమ్ము లోలయించు
నోలయించి కెంగేల నుజ్జగించు
కడుమెరుంగులువారు కడకన్నులల్లార్చు
నల్లార్చి రెప్పల నండగొలుపు
నవరని దరహాస చంద్రికో జిలికించు
చిలికించి కెమ్మోవి చిక్కపరచు

తే॥ దళిత ధమ్మిల్ల కుసుమగంధమ్ము నెరపు
కంకణాది ఝణాంకృతుల్ కడలుగొలుపు
నొడలికాంతులు పట్టలే కులుకబారు
సన్న వలిపంపు పయ్యెద చౌకళింపు[23]

కామినీవిలాస విభ్రమముల నీ పద్యము త్రిభువన వశీకరణాత్మకముగా ప్రదర్శించుచున్నది.

ఎంతముదిమి వచ్చినను ఆశపట్టుకొని వదలదు. దండముపట్టిన వృద్ధుడైనను ఆశాపిండమును వదలడని శంకరులు చక్కగా నిర్వచించినారు.

శ్లో॥ అంగం గలితం పలితం ముండం
దశనవిహీనం జాతం తుండం
వృద్ధోయాతి గృహీత్వాదండం
తదపి నముంచ త్యాశాపిండం

పోతన దానిస్వరూపము నిట్లభివర్ణించినాడు.

కం॥ ముదిసెను దంతావళియును
ముదిసెను కేశములు తనువుముదిసెన్ దనకున్
ముదియనివి రెండుచిక్కెను
బ్రదికెడి తీపియును విషయపక్షస్పృహయున్

కం॥ కడలేదాశాలతకును, కడజూడగరానరాదు...[24]

బలికథలో 'ఆశాపాశముతాగడున్ నిడుపు లేదంతంబు,[25] అని పోతన నిరూపించియే యున్నాడు. అధికాశవలన ప్రయోజనములేదనియు, తృష్ణాబద్ధుడై సమస్త ప్రపంచము సాధించినను మరణాంతమున మిగులునదేమియును లేదనియు, ఎవ్వరును సిరిమూటగట్టుకొని పోలేరనియు[26] ఆయన మానవజీవిత తత్వమును మథించిన సత్యములను బోధించినాడు.

కృష్ణుని రాముని విడిగా వర్ణించిన పద్యములెన్నో కలవు. ఇద్దరిని ఒకేవిధము లగు నుపమానములతో పోల్చి వర్ణించిన ఈ క్రిందిపద్యము ప్రత్యేక ప్రతిపాద్యము.

సీ॥ తలలెత్తి మెల్లన తడవియాడెడివేళ
పన్నగాధీశుల పగిదిదాల్చు
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల
నేనుగుగున్నల యెత్తువత్తు
రసమంబులైన జవాతి రేకంబుల
సింగంపుగోదమల సిరివహించు
రాననంబులకాంతు లంతంతకెక్కంగ
బాలార్కచంద్రుల పగిదిదోచు

తే॥ రెలమితల్లుల చన్నుబాలెల్ల ద్రావి
పరమయోగోద్భవామృతపానలీల
సోలియోగుల విధమున సొంపుగందు
రాకుమారులు జనమనోహారులగుచు.[27]

వారివిహారవైఖరులను బట్టి వివిధోపమానములతో నిందు వారిస్వరూపప్రకటనము జరిగినది. జనమనోహారులగు వారిని వర్ణించుటలోని పోతన వాక్కులు జనమనోహరులుగనే ఉన్నవి.

సృష్టిలో కృష్ణుని మించిన నటకుడు లేడు. ఆతని లీలామానుష చర్యలద్భుతములు. అంత మాయకుడమాయకునివలె నటించుటను పోతన అత్యంత నిపుణముగా పలికినాడు. గోపికలు కృష్ణుడుచేసిన దుడుకుచేతలు యశోదతో చెప్పినారు. ఆ సమయమున తనతల్లి తన్నేమైన ననునేమోయని భీతుడైనట్లుగా తానేమియు ఎరుగనివాడననియు, గోపికలు తనపై కొండెములు చెప్పిరనియు, తల్లి నమ్మునట్లుగా ఆ గోపకిశోరుడు ప్రవర్తించినాడు. ఆ యమాయికనటనము పోతనహృదయము నాకర్షించియుండును. అందుకే మనసు దీరనొక యుత్పలమాలలో ఆ లీలనుభావించినాడు.

కాంతలు తల్లితో తనవికారములెల్ల గణింపభీతుడై
శాంతునిసొంపునన్ పరమసాధుని పెంపున గోలమాడ్కి-వి
భ్రాంతునికైవడిన్ జడునిభంగి కుమారకుడూరకుండె నే
చింతయులేక తల్లికుచవేదిక నొదలమోపి యాడుచున్.[28]

పంచభూతాతీతుడగు నా పరమేశ్వరుని పంచోపమానములు ఘటించి పోతన ఉజ్జ్వలముగా తన్మహిమ ప్రపంచించినాడు.

కాళియ మర్దనఘట్టములో శ్రీకృష్ణుడు కదంబ వృక్షమునుండి దూకుటను

శ్లో॥ కృష్ణః కదంబమధిరుహ్యాతతోతితుంగ
మాస్ఫోట్యగాఢరశనో౽భ్యపతద్విషోదే [29]

అని వ్యాసుడు వర్ణింపగా దానిని పెంచి పోతన

మ॥ కటిచేలంబుబిగించి పింఛమున జక్కంగొప్పుబంధించి దో
స్తటసంస్ఫాలనమాచరించి చరణద్వంద్వంబు గీలించి తత్
కుటశాఖాగ్రమునీదినుండిఉరికెన్ గోపాలసింహంబు దిక్
తటముల్మ్రోయహ్రదంబులోఁగుభగుభధ్వానంబనూనంబుగన్ [30]

అని రచించినాడు. మూలమునగల గాఢరశనః అనుదానికి కటిచేలంబు బిగించి అని పోతన అనువాదము. దీనికి నడుముగట్టుట యని అర్థము. కార్యారంభమునకు ముందాపనిని చేయుదురు గాన కాలక్రమమున దానికి కార్యము నారంభించుట అను అర్థము వచ్చినది. ఇక పై పద్య నిర్మాణము

పాదద్వంద్వము నేలమోపి పవనుంబంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మారాకుహత్తించి... [31]

అనుదానితో తుల్యముగా నున్నది. బంధించుకీలించు హత్తించు మొదలగు క్రియలను పోతన వాడినంత శక్తిమంతముగా నొక్కతిక్కన తప్ప నేకవియును వాడియుండలేదు. ఇట్టి క్రియాప్రయోగములే నిజమగు సామర్థ్యమునకు చక్కని నిదర్శనములు.

వృకాసురుని మోసముచేయుటకై విష్ణువు ధరించిన వటురూపమును వామనుని రూపము నతిశయించెడి చాతుర్యముతో పోతన అభివర్ణించుట కాంచదగినది.

సీ॥ ఆపింఛరుచితోడ క్రత్తరించెడు మేను
పసిడిముంజియు తగుపట్టుగోడుగు
ధవళాంశురుచి జన్నిదంబును తిన్నని
దండంబు చేత కమండలంబు

పసుపుగోచియు చిన్నిపట్టె వర్ధనమును
రాజితంబైన మృగాజినంబు
తూలాడుసిగయును వ్రేలుఁ మూరటగోచి
వేలిమిబొట్టును వ్రేళ్ళదర్భ
తే॥ తనరు సందీప్తహవ్యవాహన సమాన
కాంతిజెలుఁవొంది అద్భుత క్రమమెలర్ప
చతురగతినప్డు వటుకవేషంబు దాల్చి
వచ్చి యాసీచ దానవవరుని జేరి.[32]

వామనుని శరీరవర్ణము పోతన వర్ణింపలేదు. ఈ వటువును మాత్రము తాపింఛ రుచితో నల్లనివానిగా వర్ణించెను. వామనుడు జటిలుడు కుమారసంభవమున కాళిదాసు కూడ మాయావటువగు శివుని జటిలునిగానే వర్ణించెను.[32] జటిలశబ్దమునకు జటావంతుడనియే మల్లినాథుడును అభిప్రాయపడెను. ప్రాచీనకాలమున వైదికబ్రహ్మచారులు జటాధారులయియే యుండెడివారని తెలియుచున్నది. వృకాసురుని మోసము చేసిన వటువు తూలాడుసిగగలవాడని పోతన వర్ణించెను. ఈ శిఖాధారణ మమూలకము. మరియొకచోట చాణూరుని సన్ననిసిగగలవానిగా ఆయన వర్ణించుట గమనార్హము [34] పట్టెవర్ధనముతో వట్టుగొడుగుతో పైవైష్ణవ బ్రహ్మచారి పోతన వర్ణించునటు లద్భుతక్రమమెలర్పగానే యున్నాడు.

కృష్ణచాణూరుల మల్లయుద్ధవర్ణన మపూర్వనైపుణ్యముతో చేయబడినది. భీము డొకమల్లునితో పోరాడుటను విరాటపర్వములో తిక్కనయు, అర్జునుడు శివునితో పల్లయుద్ధమును చేయుటను హరవిలాసములో శ్రీనాథుడును ఎంతో ప్రజ్ఞాపాటవములతో వర్ణించినారు. పోతన వానిని సాక్షాత్తుగా ననుకరింపకపోయినను మనసులో నుంచుకొనెనని మాత్రము చెప్పవచ్చును. అందు కఱవడము, రాటవము, డొక్కారము, రాగె, పట్టిసము, మొదలగు కుస్తీపట్లపేర్లు కన్పించుచున్నవి వాని వివరణము నేడు తెలియుటలేదు. మల్లయుద్ధాదులలోని అనేక రహస్యములకు కాలవశమున ఎన్నో మార్పులు జరిగినవి. యుద్ధములో శత్రువు చక్కగాపోరాడినప్పుడు మేలుమేలని అగ్గించుట, శత్రువుదుష్కరముగు ప్రయోగము కావించినప్పుడు చులకనగా తప్పించుకొని నవ్వుట, కోపమువచ్చినప్పుడు హుమ్మని విజృంభించుట పోతన అత్యంత రసోచితముగా వర్ణించినాడు. అందలి ఒకభాగమిది.

వ॥ కాలంగాలుగీలించి డాకరంబుగొనిన నయ్యాభ్యాసి సభ్యులు సన్నుతింప గ్రస్మరించిజడ్డనం గాలడ్డగించి రక్షించుకొనిన నారక్షోవైరి వైరికిటిచేలంబు పట్టి ఎత్తి యెత్తిన నడుమరాగెయిడి నందువెట్టి నవ్విన అవ్విరోధి కాలు కాలితో నిడి వేధించినిరోధించిన[35]

ఇటులే వివిధ యుద్ధములను వర్ణించుటలో పోతన తలస్పర్శియగు సామర్థ్యమును చూపినాడు.

ఒక రణాంగణమును చూడుడు.

వ॥ సింహనాదంబులు సేయుచు, అట్టహాసంబులిచ్చుచు, ఆహావ నమ్ములొసగుచు. అన్యోన్యతిరస్కారంబులు సేయుచు, బాహు నాదంబుల విజృంభించుచు, పెనుబొబ్బలనుబ్బి రేగుచు హుంకరింపుచు, నహంకరింపుచు...[36]

ఇట్టివీరుల విస్మయావహవిస్ఫురణము వినుత వైఖరిని బహుస్థలముల విపులీకరింపబడినది.

బాణునితో యుద్ధముచేయు అనిరుద్ధుని పరాక్రమ వర్ణనము చూడుడు.

పదములు బాహులున్ దలలు ప్రక్కలు చెక్కులు జానుయుగ్మముల్
రదములు కర్ణముల్ మెడలురంబులు మూపులు వీపులూరువుల్
చిదురుపలై ధరందొరగ చిందరవందర సేయ సైనికుల్
కదనపరాఙ్ముఖక్రమముగైకొని పారిరి కాందిశీకులై.[37]

ప్రాగ్జ్యోతిషపురముగదిసి కృష్ణుడుచూపిన పరాక్రమము సర్వలోకసన్నుతము.

ప్రాకారంబు గదాప్రహారముల నుత్పాటించి యంత్రంబులన్
నాకారాతులమానసంబులను భిన్నత్వంబునొందించి య
స్తోకాకారుడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్ర నిర్ఘాతరే
ఖాకాఠిన్యము పాంచజన్యము విముక్తప్రాణిచైతన్యమున్,[38]

ప్రకృతివర్ణనములలో పోతన నైపుణ్యము సర్వాతిశాయియైనది. దశమస్కంధములో గ్రీష్మవర్ష శరత్ హేమంత ఋతువులనాత డత్యంతసముల్లాసముతో ప్రత్యేకాభినివేశముతో వర్ణించినాడు. గ్రీష్మఋతువర్ణనలో ఆయన ప్రకృతి పరిశీలనమెట్లు గోచరించుచున్నదో చూడుడు.

సీ॥ దినములంతంతకు దీర్ఘంబులై తోచె
దిననాథు డుత్తరదిశ చరించె
నాడునాటికి నెండ నవ్యమై ఘనమయ్యె
వెచ్చనిగాడ్పులు విసరజొచ్చె
మేదినీ రేణువుల్ మింట సంకులమయ్యె
ఏరులు కొలకులు నిగిరిపోయె
పానీయశాలల పథికసంఘమునిల్చె
చప్పరంబుల భోగిచయముడాగె

ఆ॥ తరులులతలు కుసుమదళములతో వాడె
మిథునకోటికి రతిమెందుదోచె
అఖిలజంతు భీష్మమైన గ్రీష్మము రాక
కీలి అడవులందు కేలిసలిపె.[39]

మిథునకోటికి రతిమెందుదోచె అనుదానిని రచించుటలో పోతన శృంగారరసప్రియత్వము సముచితముగా స్ఫురింపగలదు. వర్ష ఋతువర్ణనములోను ప్రావృట్కాలుడను చెలువుడు పొలసిన పులకించు భూమిపులకములనగా సస్యములు మొలచి తలలెత్తి నిక్కి జాలువారినవని పలుకబడినది.[40] ఇటులే మిగిలిన ఋతువర్ణనములును శృంగారభరితములు.

సూర్యోదయసూర్యాస్తమయాది వర్ణనలలోను పోతన లేఖిని విశృంఖలముగా విజృంభించినది. గగనమను అరణ్యములో సంచరించెడి అంధకారమను గజమును పట్టుకొనుటకై కాలుడను బోయవాడు మచ్చువెట్టిన మామిడిచివుళ్ళదంతివలె సూర్యుడస్తమయ సమయమున నుండెనట.[41] పోతన లోకపరిశీలనశక్తి ఇటువంటిచోట్ల విస్పష్టముగా కన్పించును.

కస్తూరిసుగంధము బహువ్యాపక శక్తిగలది. హరిగుణ మహిమను వ్యాపింప జేయుటకై బ్రహ్మచల్లిన కస్తూరివలె తమస్సుగగనవీధుల వెల్లివిరిసినదట.[42] వీధులలో కస్తూరి కలయంపిచల్లుట మహావైభవచిహ్నము. ఇక్కడ నావిషయము స్మరింపదగినది.

ఆకాశమున నుదయించు చంద్రుడు సింధూరతిలకముతోను, దాత్రముతోను, ఖడ్గముతోను, పల్లవముతోను పోల్పబడినరీతులు చాలనందములైనవి.[43] ఆ చంద్రుడాకాశమున చల్లనివెన్నెలలు ప్రసరింపజేయగా బ్రహ్మాండమంతయు కర్పూరపు క్రోవివలె కన్పట్టినదట.[44]

రాత్రిగడచిన పిదప ఉదయసూర్యుని వర్ణనమును పోతన సామర్థ్యమునకొక మహోదయ నిదర్శనమైనది. వెన్నెలవేళ కర్పూరపు క్రోవివలె నున్న బ్రహ్మాండము ఉదయవేళ కుంకుమ సలిలపు క్రోవికొమరున నొప్పినదట.[45] లాలిత్య లాలితమగు ఆ ఉదయప్రకృతి మనోహరత్వమునొక చిన్నిపద్యములో చూడుడు.

కం॥ వచ్చెన్ జల్లనిగాడ్పులు
విచ్చెం గమలములు తమమువిరిసి బలంబుల్
జొచ్చెం బద్మమరందము
మెచ్చెం దుమ్మెదలు ప్రోలిమిహిరుడు పొడమన్.[46]

సూర్యోదయ వర్ణనలలో పోతన ఊహ ప్రసరించిన ఒక రమణీయ భావవికాసమునకు చిహ్నమీ క్రిందిసీసము.

సీ॥ పౌలోమి తనబాలు పాన్పుపై గనుపట్ట
పన్నిన పవడంపు బంతియనగ
ఆయురర్థములవ్యయంబు లొత్తిలిచాటు
కాలజాంఘికు చేతిఘంట యనగ
ఘన జంతుజీవిత కాలరాసుల విధి
కొల్వనెత్తిన హేమకుంభమనగ
పశ్చిమదిక్కాంత పరగ కై సేయుచో
ముందర నిడుకొన్న ముకురమనగ

తే॥ శోకతాపోపశమ దివ్యఘుటిక యనఁగ
పద్మినీకాంత నోముల ఫలమనంగ
మూడుమూర్తుల సారంపు ముద్దయనఁగ
మిహిరమండల ముదయాద్రి మీఁదనొప్పె.[47]

ఈ దృశ్యములను భావించుచున్నచో ప్రకృతిదేవత ఎంతదివ్యసౌందర్య స్వరూపముతో పోతనకు సాక్షాత్కరించినదో ఊహింపవచ్చును.

ఈ విధముగా భాగవతములోని అనేకఘట్టములలో తన అపారప్రతిభావిశేష మున సమయస్థానసముచితముగా బహువిధవర్ణనలను గావించి పోతన విబుధగౌరవ మునకు పాత్రుడైనాడు.



# పోతన కవిత్వము - సంభాషణవైఖరి

బహువిధ గుణశీలములుగల పాత్రలమధ్య సంభాషణములను చతురపద్ధతిలో నడపుటకు లోకానుభవమత్యంత ప్రధానము. రచనాపద్ధతిలో నాటకీయప్రజ్ఞ ఇందుకు తోడ్పడునని తద్విషయవిదులు భావింతురు. నాటకమును లోకానుకరణమే కదా! భాగవతములో వివిధపాత్రలను చిత్రించుపట్టుల తనకుగల జీవితానుభవమును పురస్కరించుకొని మూలమున కెన్నోచోట్ల మెరుగుపెట్టియు, అనేకవిధములగు చతురోక్తులను చొప్పించియు సహృదయహృదయముల కెంతయు మెప్పుకలుగునట్లుగా పోతన రచించియున్నాడు. అంతేకాక గమనింపవలసిన విశిష్టాంశము మరియొక్కటికలదు. అది ఏమనగా పోతన అత్యంతమృదుహృదయుడు. శత్రువునుగూడా కఠినముగా పలుకని, పరుషవాక్కు నుచ్చరింపలేని, మెత్తదనమాయన ప్రవృత్తి. ఈ ఆత్మ ధర్మము వివిధపాత్రల ముఖమున అనేక సందర్భముల దృశ్యమాన మగుచుండును.

భాగవతారంభములో శౌనకాదిమహర్షులు విజ్ఞానఫణిత నిఖిల పురాణవ్రాతుడగు సూతుని హరికథలను చెప్పుటకై కోరినారు. ఏ విషయమునైనను పూజ్యుడగు నొకవ్యక్తి నర్థించునప్పుడాతనిని గౌరవపురస్సరముగా స్తుతించుట కార్యసాధకుని ప్రధాన లక్షణము. ఆ లక్షణము ననుసరించి ఏవిధముగ నర్థించిన ఆ పెద్దవాని మనస్సనుకూలముగా ప్రవర్తించునో ఆపద్ధతిలో పోతన ఆ ఋషులనోట పలికించెను. "నీవు పెద్దవాడవు. చిరకాలము మనినవాడవు. పెక్కుగ్రంథార్థములు తెలిసినవాడవు. పెద్దలదగ్గర మెలగి వినదగినవన్నియు విన్నవాడవు.[1] అనిపలికి మునులు సూతుని ఆభిముఖ్యమును సంపాదించుకొనిరట.

పోతన సంభాషణలలో మరియొక్క విశేషము కలదు. ఆయాసందర్భములలో ఆయన రచించు అనేకవాక్యములు లోకవ్యవహారమున కత్యంత సన్నిహితముగా నుండును. సమర్థులగు కవులీపద్ధతి ననుసరించి తమగ్రంథములను ప్రజాహృదయ నిహితములుగా చేయుదురు. ఆ నేర్పు పోతనలో ననవద్యముగా భాసించుచుండుట పదపదమునను చూడనగు మహావిశిష్టత.

కృష్ణసహితులగు భీమార్జునులు అశ్వత్థామను పాశబద్ధునిగా చేసి తెచ్చినారు. మూలములో లేకున్నను ద్రౌపది అశ్వత్థామతో సకరుణముగా మాటలాడినట్లు పోతన కల్పించెను. అత్యంతదయామూర్తియై ఆమె "తండ్రీ నీవు దయాభాసురుడవగు

భూసురుడవే. అందును నిజమగు వీరత్వము కలిగిన శుద్ధశూరాగ్రేసరుడవే. ఈ అసుర కృత్యము ధర్మమటయ్యా" అని ప్రశ్నించినది.[2] అంతటితో నాగక 'నీవు చంపిన వారు మహావీరులా ? ప్రౌఢవయస్కులా ? వారు పసిపాపలే ! ఉద్రేకముతో వారేమియు ఎదిరింపలేదు పోనీ యుద్ధభూమియైనచో వయస్సుతో సంబంధములేదులే అనుకొందమా : అదియును కాదు. కనీసము నీకు రవ్వంతయైన ద్రోహమును చేయలేదు. అంత అందమైన పసిపిల్లలను చంపుటకునీ చేతులెట్లు వచ్చినయ్యా ?[3]' అని విషాదభావముతో నామె పల్కినది. దయామధురమగు ద్రౌపది హృదయమును వ్యక్తీకరించుటలో అంతచక్కని పిల్లలను నిదురపోవువారిని చంపుటకు నీ చేతులెట్లాడిన వనుటలో చక్కని జాత్యమగు నుడికారమును పోతన ప్రయోగించినాడు. చేతులాడుటఏమి? అవిఏమి నాట్యకత్తెలా ? అయినను ఒక చేయరాని కార్యము నొక్కడు చేసినప్పు డదిచేయుటకు నీ చేతులెట్లాడినవని తెనుగు వారందురు. ఈ నుడికారముచే ఆ భాషణమున కపూర్వ సౌందర్యము వచ్చినది.

ద్వారకాగమన ప్రయత్నమున పాండవులను వీడ్కొని రథారోహణము చేయు వాసుదేవునకు ఉత్తర అడ్డమువచ్చి తన గర్భస్థశిశువును రక్షింపుమని వేడుకొన్నది. ఆ వేడికోలులో నొక విశేషము కలదు. లోకములో నొక మహాపురుషుని దగ్గరకు కార్యార్థమై ఒక సామాన్యుడు పోయినప్పుడావ్యక్తికిని, తనకును అంతకు ముందేదైన సంబంధమున్నయెడల ఆ సంబంధమెంత ఆత్మీయతా సమన్వితమైనదో నిరూపించి అందువలన ఆ గొప్పవాని ప్రసన్నతను చూరగొనుటకు ప్రయత్నించును. ఉత్తరయు కృష్ణునిచెంత నట్లే చేసినది. ఓ భగవంతుడా ! నాబిడ్డను రక్షింపుమనుటతో ఆమె ఊరుకొనలేదు. 'నీవు సర్వేశ్వరుడవు. మహాత్ముడవు'- అని స్తుతించుచునే నేను నీచెల్లెలి కోడలిని. నీవు రక్షింపవలసినవాడు నీ మేనల్లుని కొమరుడు[4] అని గుర్తుచేసినది. ఈగుర్తుచేయుట పోతన చేసిన చమత్కారము. దీనితో మమ్ము రక్షించితీరవలసిన ఒకానొక బాధ్యత నీయందు కలదని ఆమె చెప్పకయే చెప్పినదైనది. ఈ చెప్పక చెప్పుటనే ఆలంకారికులు ధ్వనియందురు. ధ్వని ఉత్తమకవిత్వములో నొక విశేషము. ఆవిశేషమునే పోతన ఇక్కడ నిర్మించినాడు.

తీర్థయాత్రలకు పోయి ఆత్మవేత్తయై విదురుడు హస్తిపురికి తిరిగి వచ్చినాడు. సర్వబంధు సమక్షమున యుధిష్ఠిరుడాతని యాత్రావిశేషములడిగెను. మూలములో నిచ్చట.

శ్లో॥ భవద్విధాభాగవతా స్తీర్థభూతాః స్వయం ప్రభో
తీర్థీకుర్వంతితీర్థాని స్వాంత స్థేనగదాభృతా.[5]

అని కలదు. దీనిననువదించుటలో పోతన చూపిన నైపుణ్య మగణ్యము. మూలముననుసరించి 'మీవంటి భాగవతులు విష్ణువు మీయందు మెరయుకతన తీర్థ సంఘముల ధిక్కరింతురు గదా! మీరేతీర్థములు మీకంటే మిక్కిలి తీర్థములున్నవే' అనివ్రాసి తరువాత దానినే మరింత పొందుపరచి "వేరే తీర్థములవనిపై వెదకుట యేల? మిమ్ముల పొడగని భాషించు మేలే చాలును. ఇంతతిరిగి వచ్చినారుకదా! లోకములో వార్తలేమి? మీకు సర్వమును నెరిగెడి నేర్పు కలదు." అని పలికించినాడు. 'ఈ మృదుభాషణారీతి కేవలము ముఖాముఖి చెప్పినట్లుగా నుండి పోతన సంభాషణా చాతుర్యమునకు మరియొక ఉదాహరణమైనది. ఆ పద్యమిది.

తే॥ వేరెతీర్థంబు లవనిపై వెదకనేల
మిమ్ముపొడగని భాషించు మేలెచాలు
వార్తలేమండ్రు లోకులు వసుధలోన
మీకుసర్వంబు నెరిగెడి మేరకలదు.[6]

యుద్ధమున కుమారులు మరణించిన పిదప గాంధారీ ధృతరాష్ట్రులు పాండవుల ఆశ్రయమున చేరినారు. వారిపై క్రోధము కలిగిన భీముడప్పుడప్పుడు వారి నొర గొడ్డెములాడుచుండెడివాడు. వయసుదాటిపోయినను ధృతరాష్ట్రునకు వైరాగ్యము కలుగ కుండుట విదురునకు బాధకలిగించినది. అతడు విరక్తిమార్గము నుపదేశించినాడు. వృద్ధులైనను ఆశాపాశము తెగగోయజాలనప్పుడు విద్వాంసులు వారికి వేదాంతబోధచేయు పద్ధతిలో వారిమనసునకు కష్టముకలుగనీయక నెమ్మదిగా మెత్తగా చెప్పవలసినది చెప్పవలయును. అవసరమైనచో కొంతమందలించుటయు తప్పదు. అహితబోధచేసెడి చనువు వృద్ధమహారాజు దగ్గర విదురునకు కలదు.

కం॥ కనియెదవో బిడ్డల సిక
మనియెదవో తొంటికంటె మనుమలమాటల్
వినియెదవో యిచ్చెద ర
మ్మనియెదవో దానములకు నవనీసురులన్.[7]

ఇంకను పిల్లలను గందువా? వెనుకటికంటె వైభవముతో నుందువా? లేక మనుమల మాటలువిని మురిసిపోయెదవా? దానధర్మములు చేసెదవా? అనుటను ఇవే వియును వెనుకటివలె సాగవని చెప్పినట్లయినది. విదురుడు పలికిన ఆ మాటలలో మెత్తదనముతో పాటు ఎత్తిపొడుపుకూడ నున్నది. దానిలో వైరాగ్యమును కలిగించువివేక బోధ ఉన్నది. ఈ ప్రబోధము కలిగించిన కవిసామర్థ్యము నిరుపమానము.

కృష్ణనిర్యాణానంతర మర్జునుడు హస్తిపురికి వచ్చి కన్నులఅశ్రువులురాల ధర్మజుని పాదములపై బడినాడు. ధర్మజుని గుండె గుభిల్లుమన్నది. మహావీరుడగు తన తమ్ముడు కంటనీరుపెట్టుట తమజీవితములలో నెన్నడును ఎరుగనిది. ఆ ఉద్వేగముతో 'కన్నీరెన్నడు దేవుతండ్రి! చెపుమా కళ్యాణమే చక్రికిన్' అని ప్రశ్నించినాడు[8]. ఇక్కడ చెపుమా అను పదమెంత అర్థవంతమైనది. అది దానిముందు భాగమునకును, తరువాతి భాగమునకును రెంటికిని అన్వయించును. ఆ పదము నుచ్చరించెడి ఊపుపై అటునిటు కలిపి అన్వయించుటలోని విధముపై అక్కడి అర్థస్ఫురణ మాధారపడి యున్నది. ప్రాశ్నికత, అనుమానము, ఆతురత. మొదలగు భావములా చిన్నిపదములో స్ఫురించునట్లు రచించిన పోతన నైపుణ్యము మిగులప్రశంసనీయము.

బ్రహ్మను నారదుడు తత్వరహస్యముల నడిగినాడు. బ్రహ్మకు చాల సంతోషము కలిగి 'సమ్యక్ కారుణిక స్యేదం వత్సతే విచికిత్సితం'[9] అని పలికెను. బ్రహ్మచే కుమారుని కారుణికుడని అనిపించుట ఏలని పోతన దానిని విడిచివేసి- 'రారా! బుధులు విరక్తులుగారా యీరీతి అడుగగా నేరరు, నీ మతము విస్మేరావహము, ఔరా నా అసలు గుట్టడిగితివి గదరా! అని బ్రహ్మచే ననిపించినాడు[10] ఈ రారా, కారా మొదలగు పదములను వాడుటలో సంభాషణలలోని జాత్యపుసొంపు విశదమగుచున్నది.

హిరణ్యాక్షుడు వరుణునిమీదకు పోరాడ నరిగినాడు. నీ ఎదుట నిలువలేని యీ పిరికివారలతో పోరుటఏల! పోగలిగినచో శ్రీహరిమీదకు పొమ్ము అని వరుణుడాఅసురునితో అన్నాడు.

ఉ॥ నిందకు నోర్చి ఆజి మొన నిల్వగనోపక వీగిపారునీ.
పందల వెంటబడ్డ మగపంతమె[11]... అనుటలోను, చనంగనోపుదే నందులకేగు- అనుటలోను, నీకు తగిన వారితో నీవు పోరాడుము. నీ కంటె బలహీనుల వెంటబడి బాధించుట అదిఏమి పెద్దమగతనము? అను ఎత్తిపొడువు గోచరిం

చును. అవసరమైనచో నిట్టి వ్యంగ్యవైభవము చూపుట పోతనలో అపారముగా కలదు.

ప్రహ్లాద చరిత్రలో సంభాషణములను తీర్చిదిద్దిన విధము నిరుపమానము. అందడుగడుగునను పోతన కౌశలము కన్పట్టుచునే యుండును. ప్రహ్లాదుని తీర్చిదిద్దుటలో విఫలులైన భార్గవులకు రాజు తమ్మేమి చేయునో అనిభయము పుట్టినది. మా తప్పేమియునులేదు. మేముగాని ఇతరులుగాని విరోధి శాస్త్రములు చెప్పరు. ఇదంతయును మీకుమారుని నైజము- అని చెప్పుచుమధ్యలో 'మీచరణంబులాన' అనిరి.[12] హిరణ్యకశిపుడనిన వారికెంత భయమో వారుపెట్టుకొనిన ఈఒట్టుచే తెలియుచున్నది. ఉపాధ్యాయులు మీ పాదములాన అనిరన్నచో ఆ వాక్యములో నితరములగు నేవర్ణనలును పలుకలేనంతగా హిరణ్యకశిపుని భయానకత్వమును వర్ణించినట్లైనది. ఇది పోతన ఉక్తిచాతుర్యము.

హిరణ్యకశిపుడు కేవల భయంకరుడే కాడు. అతడు వాత్సల్య మూర్తికూడ. కుమారుని వత్సా ! రమ్మని చేర జీరుటలో[13] అతని ప్రేమ సువ్యక్తమగు చున్నది. పిల్లలమాటలను గురించి అతడు పలికిన వాక్కులు సుసత్యములు.

కం॥ అనుదిన సంతోషణములు
జనితశ్రమతాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్.[14]

అటులే

'అన్నా యెన్నడు నీవు నీతిమతి వాదంచున్ మహావాంఛతో
నున్నాడన్ ననుగన్నతండ్రి! భవదీయోత్కర్షమున్ జూపవే[15]

అనుటలోని లాలిత్యము హృదయంగమము. ఈ విధముగా పోతన హిరణ్యకశిపుని భయంకర మూర్తినేకాక వాత్సల్య స్వరూపమునుకూడ చిత్రించి ఆ రాక్షసేంద్రుని పితృసహజ మృదుభాషణములను రమ్యముగా ప్రకటించినాడు.

గజేంద్రుని రక్షించుటకై బయలుదేరిన విష్ణుమూర్తి ఆతొందరలో శ్రీకుచోపరిచేలాంచలమును వీడక పట్టుకొనియే గగనమున కుద్గమించినాడు. కార్యానంతర

మాతడు లక్ష్మీదేవివైపు చూడగా- ఎంతపని వచ్చినను భార్యకొంగు పట్టుకొని ఆమైన లేచి పరుగెత్తునా అనియో, ఇంత పరధ్యానపువాడేమా యనియో, ఏ కారణ ముననో ఎరుగముకాని ఆమె చిరునవ్వు నవ్వుచున్నదట. ఆ దరహాసిత ముఖకమల యగు కమలతో[16] శ్రీహరి అనునయవాక్యములు పలికినాడు. ఆత్మీయులయెడ నేదైన పొరపాటు జరిగినపుడు అయ్యో ! మరచితిని నీవేమైనా అనుకొంటివా అని అడుగు దురు. ఆవిధముగానే పోతన నీ చేలాంచలమ్ము బట్టుట కాలో నే మంటినన్ను[17] అని శ్రీవిభునిచే ననిపించినాడు. ఈ మృదులానునయము పోతన మనస్సులో నుద్భవించి నదే.

సామాన్యముగా ప్రపంచములో తమ ప్రియురాండ్రు చూచుచుండగా ప్రజ్ఞా పాటవములు ప్రదర్శించుట పురుషులకు మిక్కిలి ఇష్టము. పోతన శివుని విషయ మున కూడ అట్టి చమత్కారమునే చేసినాడు. ప్రజాపతి ముఖ్యులందరును హాలాహల విలయమునుండి తమ్ము రక్షింపుమని పరమేశ్వరుని ప్రార్థించినారు. శివుడు వారి ప్రార్థనకేమియు జవాబు చెప్పలేదు. కనీసము సరేలెండు అట్లేచేసెదనని యైన అన లేదు. పార్వతీదేవివైపు తిరిగి ఈ హాలాహలమును శిక్షించెదను. ఫలమువలె భక్షిం చెదను. ప్రాణులను రక్షించెదను-అని-అంతటితో నూరుకొనక వీక్షింపుము నేడు నీవని పలికినాడు.[18] అనగా ఈవేళ నాప్రజ్ఞ చూడుము. నేనేమో నాశక్తియేమో కాంచుము అని చెప్పినట్లయినది. ఇట్లు చెప్పించుటలోనే పోతనలౌకికప్రజ్ఞ నూహింప వచ్చును.

బలివామన సంవాదములోను చతురోక్తులు పెక్కులు కలవు. వామనుడు బలి కడకుబోయి బాగుగాపొగడి మూడడుగులనేల అడిగినాడు. ఆబలి కాశ్చర్యమువేసినది. ఇదేమయ్యా ! ఇట్లడిగితివి. ఏ అగ్రహారములో గజవాజియువతులో కాంక్షింపక ఇట్లు కోరుటేమి? నీవు పసివాడవు సరిగా అడుగలేకున్నావు. ఈ అల్పమునెట్లిచ్చెద నని నాడు.[19] దానికి సమాధానముగా ఆమ్మేధావి యిట్లనియెనట.

గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూము లెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుట దిబ్రహ్మాండ మంబునాపాలికిన్[02].

బ్రహ్మాండంబు నాపాలికిన్ అనుటలో నీవిచ్చిన మూడడుగులనే బ్రహ్మాండ మంతగా చేయుదును. సుమా యని వామనుని భావము. అదిధ్వని మదాకాంక్షామితం బైన అను సమాసములోని శ్లేష ఇందుకుపోద్బలకము. సంభాషణా నిపుణుడగు కవి రచనాచాతుర్య మిటులేఉండును.

బలి బంధనానంతరము తత్సతియగు వింధ్యావళి పతి భిక్షాంమమదేహి కోమల మతే పద్మాపతే[21] అని విష్ణుని దగ్గరకు వచ్చునది. వచ్చి ముందు స్తుతించినది. ఆ స్తుతించిన పిదప నెమ్మదిగా నొక న్యాయవాదమును మొదలుపెట్టినది.

కం॥ కాదనడు పొమ్ము లేదీ
రాదనడు జగత్త్రిమైక రాజ్యము నిచ్చెన్
నాదయితు కట్ట నేటికి
శ్రీదయితా చిత్తచోర! శ్రితమందారా![22]

కాదనక పొమ్మనక సర్వము నిచ్చిన వానిని బంధించుటేమి ధర్మమని ఆమె అడుగుచున్నది. ఆ అడుగుటలోని న్యాయార్తి పోతన సంభవింప జేసినదే.

రాచరక్కసుడగు కల్మాషపాదుడు తనభర్తను చంపబోగా బ్రాహ్మణి విలపించినది. సూర్యవంశములోని రాజువై ఇట్లుచేయుట తగునాయని వేడుకొన్నది రాజునకెవ్వని నైనను దండించు నధికారము కలదు. ఈ తప్పున కీదండనయని వివరించినచో ఆ సందర్భము వేరు. వివరంబేమియు లేక భక్షించుట అన్యాయమని బ్రాహ్మణివాదము.[23] వాదమును న్యాయమును పరిగణించుట కా అసురభావా విష్టున కవకాశము లేదు. చివరకామె నీకు తోడబుట్టువులు లేరా? నేను నీకు చెల్లెలివంటి దానను అని ఇట్లు సకరుణముగా ప్రార్థించినది.

అన్నా! చెల్లెలినయ్యెదన్ విడువు నీకన్నంబు వెట్టింతు నా
ప్రాణనాథున్ ద్విజుగంగిక్రినకటా హింసింపనేలయ్యా నీ
వెన్నండింతుల తోడబుట్టవె నిజంబిట్లైన మున్నుట్టనా
పన్నన్ నన్నుశిరంబుద్రుంచి మరిమత్ ప్రాణేశు భక్షింపవే.[24]

నన్ను ముందుచంపి తరువాత నాభర్తను చంపుమని ఆమె అడ్డముపడినది. ఇట్టి సకరుణ ప్రార్థనమే కంసుడు దేవకిని చంపబోవునప్పుడు వసుదేవుడును కావించి

నాడు. వరుసకు చెల్లెలుగాని ఆ ఉత్తమురాలు కూతురువంటిదని రక్షింపుమని కంసునకు విన్నవించుకొన్నాడు.[25] ఆ కంస వసుదేవ సంభాషణములోని కారుణ్యప్రవాహము పోతన భావతరంగిణిలోని ఒకపాయ.

మధురానగరములో కృష్ణుడు ప్రవేశించునప్పుడు పౌరసుందరులు మాటలాడుకొనిన విధములోని తియ్యదనము చూడుడు.

నందతపఃఫలంబు సుగుణంబుల పుంజము గోపకామినీ
బృందము నోముపంట సిరివిందుదయాంబుధి యోగిబృందముల్
డెందములందు గోరెడు కడింది నిధానము చేరవచ్చెనో
సుందరులార రండు చనిచూతము కన్నులకోర్కెదీరగన్.[26]

ఇంతటి ప్రసన్నకుమారపదములలో కృష్ణుని చిత్రించిన పోతననేర్పు నిరుపమానము. కృష్ణుని స్వరూపచిత్రణములో శారీరకావయవ సౌందర్యముకాక ఆయన ఆత్మసౌందర్యము నభివర్ణించెడు ఈపద్య మత్యంతహృద్యము. కృష్ణుని చూచిన పిదప ఎవరిభావములైనను మోహితములగుట ఆశ్చర్యము కాదు. ఆ గోపకుమారతిలకుని చింతింపుచు పాడుచు, అంటుచుకూడి విహరింపుచు సన్మానములను పొందుటకు గోపకాంతలు పూర్వజన్మముల నేమి నోములు నోచిరోయని పరస్పరమా నాగరస్త్రీలు సంభాషించుకొనిరట.[27] మూలములో లేని కృష్ణుని భువనమోహకత్వ ప్రశంస అత్యంత సముచితము.

గోపస్త్రీలు కాత్యాయనీ వ్రతము చేయుచుండిరి. అందు నియమభంగముగా వివస్త్రలై స్నానముచేసిరి కృష్ణుడు వారిచీరెలు దొంగిలించి దాచినాడు ఆ గోపకాంతలు కృష్ణునితో తమమానమును రక్షింపుమని వేడుకొన్నారు. ఇక్కడ పోతన గోపికాకృష్ణులమధ్య మిగుల చమత్కారయుతమగు సంభాషణమును నడిపినాడు. మగవారిట్టి చిలిపిచేష్టలు చేయుదురా అని ముందాక్షేపించి తరువాత ఆకాంతలు కృష్ణుని ప్రతిమలాడుకొనిరట. చివరకు నీవేమిచెప్పిన అది చేసెదము. వస్త్రములిచ్చి ఏలుకొమ్మన్నారు.

కం॥ వచ్చెదము నీవుపిలిచిన
ఇచ్చెదమేమైనగావి యెటుచొరుమనినన్

చొచ్చెదవము నేడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా![28]

దానికి దరహాసితవదనుడై – ఏతరుణుడు మగడౌటకు మీతపములు? అబద్ధము చెప్పిన ఒట్టుసుమా! మీకూరిమి ఎవ్వరిపైననో నాతో చెప్పరాదా? నేనేమి పరాయివాడనా, అని మృదుమధురముగా మనసునకు నచ్చునట్లుగా కృష్ణుడు పల్కినాడు కృష్ణునిచేత నావిధముగా పల్కించిన పోతన చాతుర్యమునకీ క్రింది పద్యము తార్కాణము.

కం॥ ఎవ్వనిగని మోహించితి
రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించెన్
నివ్వటిలెను మీ కూరిమి
ఎవ్వనిపై పలుకరాదె యేనన్యుడనే?[29]

ఏ నన్యుడనే అనుటలోనున్నది చమత్కారమంతయు. విరహవేదన భరింపలేక విలపించు తమముందు మన్మథ మన్మథుడై కృష్ణుడు ప్రత్యక్షము కాగా గోపికలతనితో నిట్లనిరట.

సీ॥ ఎలయించి ప్రాణేశ యెందుబోయితివని
తోరంపుటలుకతో దూరెనొకతె
జలజాక్ష! ననుబాసి చనగ నీపాదంబు
లెట్లాడెనని వగ నెయిదెనొకతె
నాథ! నీవరిగిన నా ప్రాణమున్నది
కూర్మియే యిదియని కుందెనొకతె
ఈశ్వర! నను నిన్నునిందాక బాపెనీ
పాపపువిధియని బలికెనొకతె

ఆ॥ తలగిపోవునట్టి తప్పేమిచేసితి
నధిప! పలుకధర్మ మనియె నొకతె
యేమి నోముఫలమొ హృదయేశ! నీమోము
మరలగంటిననుచు మసలెనొకతె.[30]

ప్రేమాస్పదుడగు కాంతునితో తమ విరహబాధను వెల్లడించునప్పుడు అందును ముఖ్యముగా ఆ ప్రియుడు కావలెనని తప్పించుకొనిపోయి మరల కంటబడినప్పుడు వియోగినుల భావస్థితులెట్లుండెనో ఇచ్చట వ్యక్తము చేయబడినది ఇన్ని శృంగార మధురభావములను వారి భాషణమూలమున ఒక్క సీసపద్యములో నిమిడించిన పోతననేర్పు గణనీయము.

ఉద్ధవుడు కృష్ణుని సందేశమును వినిపించిన వెనుకగోపికలు సంతసించి అతనిని కొన్నిరహస్యములడిగిరి. కృష్ణుడు వారి కౌపనిషద తత్వమును సందేశించినాడు. తనను నిత్యము ధ్యానించుచుండుటకే వారికి దూరమైతినని ఆయన చెప్పి పంపినాడు. ఎంత తాత్విక ప్రబోధము నొందినను లోకాభిరామ సౌందర్య స్వరూపుడగు కృష్ణుని చూడవలెనని ఆయన ప్రియురాండ్ర కనిపించుట సహజము. కృష్ణ దేనాటికైన తిరిగి వచ్చునా ? మరల నాతనితో వెనుకటివలె సరససల్లాప క్రీడలనాడగల్గుదుమా యని వారుద్ధవు నడిగినారు. ఉద్ధవుడు కృష్ణుని ప్రాణ సఖుడని గుర్తించిన ఆ చెలువలు ఇంకను ఇట్లు పలికినారు.

శా॥ నీతో నర్మగృహంబులం బలుకునే నేమెల్ల వంశోల్ల స
ద్గీత భ్రాంతలమై కళిందతనయాతీరంబునం జేరినన్
చేతో జాత సుఖంబులందనిపి మాచిత్తస్థితుల్ చూడ లీ
లాతంత్రజ్ఞతడాగి మెల్లనమదాలాపంబులాలించుటల్ [31]

ఈ మనోహర పురాతనగాధాస్మరణమునకు సంభాషణ రూపమగు పోతన కవితాలీలా తంత్రజ్ఞతయే హేతువు.

అహంకార పూరితుడగు నొకబలిష్ఠుడు తన్నెదిరింప గలవాడున్నట్లు విన్నచో వాని వివరములన్నియు తెలియగోరును. తనతో కయ్యమాడ ఎదిరి వాడు తగిన వాడో కాడో తెలిసికొనుట వానికి ప్రధానము. కాలయవనుడు కృష్ణునిగూర్చి నారదు నితో పైభావమునెట్లు పలికినో చూడుడు.

శా॥ ఏమినారద ! నీవు చెప్పినవరుండే రూపు వా డెంతవా
డేమేనన్ విహరించు నెవ్వడు సఖుండెందుండు ? నేపాటి ధో

స్సామర్థ్యంబునకయ్యముల్ సలుపునస్మద్బాహు శౌర్యంబు సం
గ్రామక్ష్మోణిభరించి నిల్వగలడే గర్వాఢ్యుడే చెప్పవమా ?[32]

గర్వితుడగు వ్యక్తి ఎట్లౌద్ధత్యమును చూపునో పోతన ఇక్కడ చక్కగా ప్రదర్శించినాడు.

సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుటకు ముందు కృష్ణుడామెతో నన్నట్లుగా పోతన ఒకకంద పద్యమును రచించినాడు.

కం॥ లేమా దనుజుల గెలువగ
లేమా నీవేలగణగి లేచితి విటురా
లే మానుమాన వేనిన్
లే మా ! విల్లందు కొనుము లీలన్ గేలన్.[33]

ఈపద్యములో కృష్ణుడు సత్యభామతో మాటాడిన మాటలేకాని సత్యభామ కృష్ణునకుచెప్పిన సమాధానము లేమియులేవు. లేవనగా మాటలలో లేవని అర్థము. ఆంగిక భంగిమలలో లేవనికావు. ఒకవేళ ఏమైన మాటలాడినదేమో పోతన మనకు వినిపింపలేదు. ఆమె యుద్ధమునకు తగినట్లుగా వేషము సవరించుకొని లేచి నిలుచుండగనే ఆ సంరంభమునుజూచి ఈమె పోరాటము తలపెట్టినదని కృష్ణుడు భావించినాడు. ఓ, లేమా రాక్షసులను గెలుచుటకు 'మేములేమా ! నీవేల కణగిలేచితి' వన్నాడు. 'నీ కెందుకులే ఇటురాలే. మానుకో' అనికూడ అన్నాడు. ఆమెవినలేదు. యుద్ధము చేయవలెననియే పట్టుపట్టినది. ఆ పట్టుపట్టుట నేభంగిమలలో నామె ప్రదర్శించినదో దానికై హస్తపాదసంచలనములెట్లు విన్యసించినదో వీక్షణములెట్లు పరపినదో, ముఖమునెట్లు కదలించినదో భావుకు లూహించుకొనవలెను. ఏదైననేమి? ఆమె మాను కొనునట్లు కనిపింపలేదు అప్పుడు కృష్ణుడు మానవేనిలే. మా విల్లందుకొనుమన్నాడు. అనగా ఈ పద్యము సమగ్రముగా నర్థము చేసికొనవలెనన్న రెండవపాదము చివరకు వచ్చిన దగ్గరనుండి మూడవపాదము మధ్యకువచ్చువరకు సత్యభామ ఆంగికాభినయము నూహింపవలెను. కవి తాను కొంతచెప్పి కొన్నిచోట్ల పఠితఊహకు కొంత వదలును. దానినా పఠిత తన మనశ్శక్తితో పూరించుకొనవలెను. ఇంత భావచిత్రణ

చేసికొనగలిగిన గాని ఈ పద్యసౌందర్యము పూర్తిగా సాక్షాత్కరింపదు. ఇంత చిత్రస్ఫురణము వచ్చునట్లు వ్రాయగలవాడు పోతన.

ఈవిధముగా పోతన నిర్మించిన అనేక సంభాషణలలో ఎన్నో అంతర్గత రహస్యములుండును. చిత్రభావ చిత్రణములుండును. వ్యంగ్యస్ఫురణములుండును. చమత్కార సంచలనలములుండును. తన లోకానుభవమును పురస్కరించుకొని పాత్ర నిర్మాణ వైఖరులను గుర్తెరింగి పూర్వకవిబుద్ధి వైభవమును స్మరించి సహజ ప్రతిభా విశేషముతో పాత్రలమధ్య సంభాషణములను మిక్కిలి సమర్థతతో నడపి పోతన కృతకృత్యుడైనాడు.



# పోతన కవిత్వము భావచిత్రణ

మనోధర్మ శాస్త్రముననుసరించి చిత్తవృత్తి సర్వసృష్టికిని మూలకారణము. సృష్టికి కామము బీజము. అది మనస్సులో నుద్భవించును. అదియే మానవుని ప్రప్రథమ భావము. అందులకే భారతీయ వాఙ్మయములో మనోభవుడనిన సృష్టిప్రేరకుడగు మన్మథుడని అర్థము వచ్చినది. మన్మథ శబ్దము కూడ నట్టిదే. మానవ జీవి కాలోచనాశక్తి పెరిగినకొలది సర్వజంతుసహజములగు ఆహార నిద్రాభయమైథున సంబంధములగు వాంఛలను కేవల శారీరకావసరములచే కలిగిన మానసిక ప్రేరణగా గుర్తించి వాని కనుభూతిస్థితిని మాత్రమే ఒసగుటసముచితమని తలచినాడు. ఈ అనుభూతులకు పైదశలో నుదయించు భావములన్నింటికిని భాషాసాహచర్య మవసరమగు చుండును, మానవుని ముఖయంత్రమునుండి నిర్గతమైన ధ్వనులను మాత్రమే భాషలకు మూలముగా ఆధునిక శాస్త్రజ్ఞులు పరిగణింతురు. భాషకును భావమునకుగల సంబంధమును మరొక దృష్టితో భావించిన భారతీయ శాస్త్రజ్ఞులు మానవుని ముఖయంత్రమునుండి నిర్గతమైన ధ్వని వాగ్దశలలో నాల్గవది మాత్రమేయనియు దానికి వైఖరి యని పేరనియు, అంతకుపైన పరాపశ్యంతీ మధ్యమలను మూడువాక్కులు కలవనియు అవి మూడు భిన్నదశలలో స్ఫురితములగు చుండుననియు నిర్వచించిరి. వానిలో పరావాక్కు సృష్టికి మూలమని భారతీయ సిద్ధాంతము. పాశ్చాత్యమత సిద్ధాంతములు కూడ శబ్దమే సృష్టికాదియని అంగీకరించి యున్నవి. గ్రీక్ తత్వవేత్తయగు ప్లేటో కూడ ప్రపంచమునకు లాగాస్ మూలమని పలికినాడు. లాగాస్ అనగా శబ్దమని అర్థము.

ఉపనిషత్తులలో వాగ్దేవతకును, మనోదేవతకును ఆధిక్య విషయమై జరిగిన కలహమున ప్రజాపతి వాక్కు మనస్సుననుసరించును గావున అనుసరించు వాడెప్పుడును తక్కువ వాడే కావున మనస్సునకే ఆధిక్యమును స్థిరీకరించినాడు. ఏదిఎట్లైనను మనస్సులోని ఆలోచనలన్నియు భాషారూపముననే జరుగవలయును. తద్రూపమున జరిగిన ఆలోచనలలో కొన్ని మాత్రమే బయటకు వ్యక్తమగుచుండును. వ్యక్తమైన దానినే వాక్కనుట సామాన్యపద్ధతి.

ఈ ఆలోచనలలో ఆధునిక శాస్త్రవేత్తలు ఊహ, భావన అని రెండు విభాగములు చేసిరి. స్థూలముగా వీనిని గూర్చి చెప్పవలెనన్న స్పష్టదర్శనమునకు దగ్గరగా

నున్నది భావన. దూరముగానున్నది ఊహ. అలంకారిక పదములలో చెప్పిన సాహిత్యశాస్త్రములలోని స్వభావోక్తిని భావనకును, అతిశయోక్తిని ఊహకును గొంతవరకు సమానముగా చెప్పవచ్చును. ఇదియును ఒకవిధముగా స్థూలమగు వివరణమేకాని సమగ్ర నిర్వచనముకాదు. భావనలో వస్తుదర్శనము ప్రధానము. ఊహలో వస్తుసంబంధమగు ఆలోచన ప్రధానము. భావనలోకంటె ఊహలో సృజనాత్మకత అధికము. పాశ్చాత్య దేశములలో రోమాంటిక్ కవిత్వమునకు వ్యతిరేకముగా నియతరూపకల్పనాత్మకమగు విస్పష్టభావ వ్యక్తీకరణము కావలెనని ఇరువదవ శతాబ్దిలో ఒక సాహిత్యవర్గమువారు తిరుగుబాటు చేసిరి. పంచేంద్రియములకు కన్పింపని ఒక వస్తువును స్పష్టముగా దర్శింపజేయుటయే భావనయని వారి అభిప్రాయము. ఊహలో నిది దూరముగనుండును.

కవిత్వములో ఊహకున్న స్థానము తక్కువదికాదు. భారతీయసాహిత్యములో దానికి గణనీయస్థానమే కలదు. ఈ ఊహాభావనల సమున్నతశక్తితో భాగవతకర్తయగు పోతన సుమనోహర కవితాశిల్పమును చక్కగా నిర్మించినాడు. ఆకాశమున తారకల నాయన వర్ణించినతీరు చూడుడు.

ఆ॥ భూమినిండ మింట పూర్ణమై కర్కట
మకర మీనరాశి మహితమైన
హరయశస్సుధాబ్ధి యందుల తుంపురు
లనగ చుక్కలొప్పె నాకసమున!

భూమిపైనున్న సముద్రములో కర్కట మకర మీనరాసులుండును. ఆకాశమునకు జ్యోతిశ్శాస్త్రము ప్రకారము కర్కట మకర మీనరాశులుకలవు. హరుడు తెల్లనివాడు. ఆయన యశస్సు భూమ్యాకాశముల నిండినది ఆ తెల్లని శివుని యశస్సనియెడి పాలసముద్రమునందలి తుంపురులోయను నట్లుగా ఆకాశమున చుక్కలొప్పినవి ఈ పద్యమర్థమగుటకు ఇంచుక ఖగోళపరిజ్ఞానము కావలయును. అప్పుడు పోతన చెప్పినట్లుగా భూమ్యాకాశములలో నిండి కర్కట మీనరాశి మహితమైన శివకీర్తి కలశాంబుధిలోని తుంపురులవలె చుక్కలున్నవన్నచో అది ఎంత సౌందర్యవంతమగునూహయో, అట్లూహించుట కెంతటి యున్మేషశాలినియగు ప్రజ్ఞ కావలయునో తెలిసికొనవచ్చును. ఈవిధముగా అనేక స్థలములలో పోతన ఊహ సుమహితమై సుందరమై సువ్యక్తమైనది.

ఇట్టివన్నియును వస్తుస్వరూప చిత్రణాత్మకములు ఇవియేకాక మనోజన్యము లగు నాలోచనలలో మరియొక విభాగము కలదు. అందులో రూపకల్పన మేమియు నుండ వలసినపనిలేదు. ఒక విషయమును గూర్చి అనేక విధముల నాలోచింప వచ్చును. ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క సందర్భములో ఒక్కొక్క రీతిగా నాలోచించును. ఆయాపాత్రలలో కవిలీనుడై తన ప్రతిభావిశేషముల వారివారి భావముల తీర్చిదిద్దును. రూపచిత్రణము కంటె మనోభావ చిత్రణమే రససిద్ధి కధికతరముగా తోడ్పడునని రససిద్ధాంత దృక్పథము. వస్తువాలంబనోద్దీపన విభావములకు మాత్రమే ఆధారము. ఆపైన జరుగునదంతయును మానసిక క్రియ. ఈ మానసికాలోచనలను ఎంత సమర్థతతో కవి నిర్వహింప గలడో కావ్యమున అంత సమగ్రముగా రససిద్ధి కలుగును.

బాహ్య పరిశీలనాత్మకమగు రూపచిత్రణము కంటె అంతర పరిశీలనాత్మక మగు భావచిత్రణము కష్టతరము. కాళిదాసు ఋతు సంహారమునకును, శాకుంతలము నకుగల భేదములీదృష్టితోనే పరిశీలింపవచ్చును. సర్వగ్రంధములలోను భారతము నందున్నంత పాత్రవైవిధ్యమును భావచిత్రణమును మరియొక చోట లేవు. భాగవత ములో తదంశ కొంత కలదు. పాత్రోన్మీలన వశమున పోతన స్వతంత్రముగా దాని కధికతర ప్రస్తారము కావించినాడు.

కొన్ని మనోవర్తనములు కథాకార్యమును నడపుటకు సమర్థములై యుండును. కావ్యములోనవి అత్యంత ప్రధానములు. ఉదాహరణకు బలిచరిత్రలో వామనుడు బలిని మూడడుగులు యాచించినప్పుడా వాసుని విష్ణువని యెరిగియు 'బలిదాన మొసగ సిద్ధపడినాడు ఈ సందర్భమున బలి ఆలోచనా వైఖరిని పోతన అత్యంత రసోచితముగా చిత్రించినాడు. శ్రీసతి కొప్పుపై తనువుపై, అంసోత్తరీయముపై పాదాబ్జములపై కపోలతటిపై, పాలిండ్లపై, నూత్నమర్యాదనుజెందు కరముక్రిందై తనకరము మీదగుట ఒకగొప్ప అదృష్టమని ఆ దైత్యేశ్వరుడు భావించినాడట.[2] పై చేయియగుటలోని ఒకఉన్నతి సముదాత్తముగా మధురభావయుతముగా నిందు భావింప బడినది, బలి దానము చేయుటకై ఈ భావమొక ప్రధానహేతువై ఒకఉత్తమభావ చిత్రణముగా ప్రకాశించినది.

భాగవతములో లక్ష్మిదేవి పాత్ర విచిత్రమైనది. మూలములో నామెనుగూర్చి ప్రస్తావనలంతగా కన్పింపవు. తాను చేసిన వివిధకల్పనలలో పోతన ఆమెపాత్రను

చిత్రముగా చిత్రించినాడు. ఆయన భావము ననుసరించి ఆమె ఒక అమాయకురాలైన గృహిణివలె కన్పించును. గజేంద్రుని రక్షణకై విష్ణువు లేచి పోవుచుండగా ఆతడెక్కడికి కరుగుచుండెనో ఆమె ఎరుగదు. గమనకారణము నామె పరిపరివిధముల నూహించినదేకాని గట్టిగా భర్తనడుగగల ధైర్యము చూపలేకపోయినది. ఆ తరువాత ప్రియుడు తన్ననునయించిన ఏ మాత్రమును కోపపడక ఒకనవ్వునవ్వి సంతృప్తి పడి ఊరుకున్నది. నరసింహావతార ఘట్టములో ఆయననామె శాంతునిచేయలేక సంకోచించినది. నిన్ను చూచిన నాకేమియు భయములేదని ప్రహ్లాదుడు పలుకగలిగినాడుకాని ఆమె పలుకలేకపోయినది. నృసింహుని ఉగ్రరూపమును శాంతింపజేయ బయలుదేరిన ఆమె భావమును పోతన ఇట్లు చిత్రించినాడు.

సీ॥ ప్రళయార్కబింబంబు పగిదినున్నదిగాని
నెమ్మోము పూర్ణేందు నిభముగాదు
శిఖిశిఖాసంఘంబు చెలువు జూపెడుగాని
చూడ్కి ప్రసాద భాసురముగాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుగాని
భూరికృపారస స్ఫూర్తిగాదు
భయదదంష్ట్రాంకుర ప్రభలుగప్పెడుగాని
దరహాసితాంబు జాతంబుగాదు

తే॥ కఠిననఖరనృసింహ విగ్రహముగాని
కామినీజన సులభ విగ్రహముగాదు
విన్నదియుగాదు తొల్లి నేవిష్ణువలన
కన్నదియుగాదు భీషణాకారమనుచుః

ఏఘట్టములోనైనను, మరియే ఇతరపాత్రలకన్న భక్తుడే భగవంతున కత్యంత సన్నిహితుడనునది భాగవతములో విస్పష్టముగా నిరూపితమైన అంశము. పైన లక్ష్మీదేవి వర్తనమును, ఆలోచనమును ఆ దృష్టితోనే పోతన నిర్మించెను.

ప్రహ్లాదచరిత్రలో తానెంత బాధించినను రవ్వంతయు నంచలింపక తన కుమారుడనపాయత నొందుట కాశ్చర్యపడిన హిరణ్యకశిపుడాలోచించిన పద్ధతి చూడుడు.

శూలములన్ నిశాచరులు, క్రుక్కక దేహము నిగ్రహింపగా
బాలుడు నేలపై బడడు పారడు చావడు తిండిపైన నా
పాలికివచ్చి చక్రధరు పక్షము మానితినంచు పాదముల్
ఫాలము సోక మ్రొక్కడు తనపాయత నొందుట కేమి హేతువో॥

దైత్యేంద్రుడు పరమపుత్రవాత్సల్య సమన్వితుడు ఆతనిని దుర్మార్గునిగా చూతురేకాని మృదుహృదయునిగా గుర్తింపరు. విష్ణుపక్షము మానితినని ఏదోఒక విధముగా కొడుకన్నచో క్షమింతమని ఆతనికోరిక. అదియును గాక ప్రహ్లాదుని సత్యాగ్రహమాతని హృదయమునకు వేదన కలిగించినది. తానెంతక్రూరముగా శిక్షించినను, తననొక్కసారియైన ప్రహ్లాదుడు పల్లెత్తిదూషింపలేదు. ఆ నిగ్రహము లన్నియు అనుగ్రహములుగానే ఆతడు భావించినాడు.[5] కావున ఆతడు మహాప్రభావ సంపన్నుడనియు, వానికి భయములేదనియు, తద్వియోగమున తనకు మృత్యువు సిద్ధించుననియు హిరణ్యకశిపుడు ఖిన్నుడైనాడు.[6] ఆ దైత్యేంద్రుని మనఃపరిణామ మును పోతన అత్యంత రసోచితముగా తీర్చిదిద్దినాడు.

కంసుడు మృత్యుభయముచే నిరంతర హరిచింతన తత్పరుడైనాడు. భాగవత ములో కృష్ణుని బాల్యములోని మహిమ ప్రకటనములన్నింటికిని కంసుని భయకృత కార్యములే మూలములు. ఆ భయము నిరంతర కృష్ణభావమున కెట్లు ప్రసరించినదో చూడుడు.

సీ॥ శ్రవణరంధ్రముల నేశబ్దంబు వినబడు
నది హరిపలుకని ఆలకించు
అక్షిమార్గమున నెయ్యది చూడబడునది
హరిమూర్తిగానోవు నంచుజూచు
తిరుగుచో దేహంబు తృణమైనసోకిన
హరికరాఘాతమో యనుచు కలగు
గంధంబులేమైన ఘ్రాణంబుసోకిన
హరిమాలికాగంధమనుచు నదరు

ఆ॥ పలుకులెవ్వియైన పలుకుచో హరిపేరు
పలుకబడియె ననుచు భ్రమసిపలుకు
తలఁపులెట్టివైన దలచి యాతలవులు
హరితలంపులనుచు నలుగదలచు.[7]

ఇట్టి భావచిత్రణములే భాగవతతత్వ నిరూపణమున కాధారములు. ఈ విధముగా కథాగమనమునకు రససిద్ధికి తోడ్పడు భావచిత్రణములను సముజ్జ్వలముగా చిత్రించి పోతన కవితాలోచనమార్గమున ఉన్నతాదర్శములను సంస్థాపించినాడు.



# పోతనకవిత్వము - వచన రచన

అనుభూతిసముల్లసితుడైన మానవుడు స్వీయభావప్రకటనకు శబ్దము నేనాడాశ్రయించెనో ఆనాడే వచనావిర్భావము జరిగినది. ఏ భాషలోనైనను వచనమే మొట్ట మొదటిది. దాని కనిష్ఠపరిమాణము వాక్యము. ఆ వాక్యము భావస్ఫూర్తిననుసరించి ఏకాక్షరాత్మకము లేక ఏకపదాత్మకము లేక బహుపదాత్మకము కావచ్చును. వచనాత్మకములగు నిట్టి వాక్యములలో పరస్పర భావవ్యక్తీకరణ చేసికొను మానవులుద్రేక పూరితములైన భావములను వ్యక్తీకరింపబూనుకొనినప్పుడు ఛందోబద్ధములై అవి వెలువడుననుట శాస్త్రసమ్మతము. కావున వచనము ఛందోబద్ధమై పద్యముగా పరిణమించును.

ఆధునిక పరిశోధనల మూలమున క్రీ పూ.6.శ నాటికే తెనుగు ఒక ప్రత్యేక భాషగా రూపొందినట్లు తెలియుచున్నది. భారతకర్తయగు నన్నయ రచనకు ముందు తెనుగుభాషలో దొరికినవి కొన్ని శాసనములు మాత్రమే. వానిలోకొన్ని కేవలగద్యములలోను, కొన్ని కేవలపద్యములలోను, మరికొన్ని గద్యపద్యోభయాత్మకముగాను కాన్పించుచున్నవి. ఈసందర్భమున వచనము గద్యము పర్యాయపదములుగా వాడబడుచున్న విషయము గమనింప వలసిన విశేషము. కొందరిదృష్టిలో సంస్కృతపద భూయిష్ఠమై, గంభీరతాసహితమైనదిగద్య. అందుకే ఆశ్వాసాంతాదులందు రచింపబడినది గద్యయని పలుకుట జరిగినది.

సంస్కృతములో ఈగద్యనామము సుప్రఖ్యాతము. వామనుడు కావ్యాలంకార సూత్రమున - కావ్యం గద్యంచ పద్యంచ - గద్యంవృత్త నిగంధి చూర్ణముత్కలికా ప్రాయంచ, పద్యభాగవత్ వృత్తగంధి. అనావిద్ధలలితపదం, చూర్ణం విపరీత ముత్కలికాప్రాయం - అనెను. విశ్వనాధకవిరాజు నిట్లే గద్యము నాలుగువిధములనియు, అందు సమాసరహితమైనది ముక్తకమనియు, పద్యభాగములుగలది వృత్త గంధియనియు, దీర్ఘసమాసములు కలది ఉత్కలికా ప్రాయమనియు, అల్పసమాస యుతము చూర్ణకమనియు నిర్వచించెను.

తెలుగులో నన్నయాదులందరును గ్రంథమధ్యమున పద్యేతరమైన రచనను వచనమనియే వ్యవహరించిరి. అనంతామాత్యుడు తన ఛందోదర్పణములో 'గద్య

మదితా తెనుగుకృతుల వచనమనగ దీపించు' అన్నాడు. కానీ ప్రాయికముగా గద్య యనగానే కఠిన గంభీర రచనయనియు, వచనమనగానే సులభలలిత రచనయనియు తెనుగువారి మనస్సులలో నాటుకొని పోయినది.

క్రీ. శ. 6-7 శ నాటి తెనుగుశాసనములలో అనేక స్థలములందు వాక్యముల లోని కొన్నిపదముల రూపములు తమిళకన్నడ రూపములకు దగ్గరగానుండి వాని ప్రాచీన సాన్నిహిత్యమును నిరూపించుచున్నవి. 7 శ. నాటి కలమళ్ళ, ఎఱ్ఱగుడిపాడు చిలమకూరు శాసనములేకాక సంస్కృతాత్మకమైన తురిమెళ్ళ శాసనమువంటివి కూడ నాటి తెనుగువాక్యనిర్మాణ విధానమును తెలిసికొనుటకు తోడ్పడుచున్నవి. అన్వయ శుద్ధితో విస్పష్టభావప్రకటనతో తెనుగువచనరచన బహుధాసమభివర్ధితమై నాటికే నన్నయభాషారీతులకు తీసిపోని ఉన్నతిని సంపాదించుకొన్నది.

నన్నయది చంపూరచన. సంస్కృతమున నంతకుపూర్వము బాణుని కాదంబరి వంటి వచనగ్రంథము లానాటికే వెలువడినవి. ఆఖ్యాయికా కథా ఖండకథా పరికథా కథా కథానికా నామములతో పంచశాఖాత్మకమై సంస్కృతములో గద్యకావ్యము బహు రీతుల ప్రవర్తిల్లియుండెను. తెనుగున మాత్రము ప్రత్యేకవచన గ్రంథములిటీవలి కాలము వరకు రచింపబడకపోవుట గమనార్హము.

తెనుగుసాహిత్యములో పద్యవిద్యకు వలెనే గద్యవిద్యకును నన్నయ ప్రథ మాచార్యుడు. నానా రుచిరార్థ సూక్తినిధియగు నన్నయభట్టు తన సాహిత్యగుణము లుగా చెప్పుకొనిన ప్రసన్న కథాకలితార్థయుక్తియు, అక్షర రమ్యతయు ఒక్క పద్య మునకే కాక గద్యమునకు కూడ సమానముగా చెల్లును. ఆఖ్యానోపాఖ్యానోపక్రమణ సమయములందు, అనేక విషయములను క్లుప్తీకరింపవలసిన అవసరములందు, వాదోప వాదములందు, బహువర్ణనసందర్భములందు, వచనమును రచించి నన్నయ తెనుగు సాహిత్యమున ఒక గౌరవాస్పదమగు స్థానమునది పొందుటకంకురార్పణము చేసి నాడు. తరువాతి కవులును నన్నయ ననుసరించి తమకావ్యములలో వచనమును సముచితరీతిని వాడుకొనిరి.

నన్నయ తరువాతివారిలో తిక్కనది అర్థగౌరవమును ప్రకటించు జిగిబిగి గల శైలి. చిరుతవిరుపులు గలిగి చక్కని జిలుగుదనముతో ఆయన వచన ముదాత్తగంభీ రమై ప్రకాశించుచుండును ఎఱ్ఱన సహజసరళమగు తన మానసికప్రవృత్తి వలెనే లలితసుందరమగు వచనములు రచించెను. ఉత్కళికా ప్రాయమగు స్తంభోద్భవ

వచనమును నృసింహ పురాణములో రచించి ఆయన చిత్రరచనా సంప్రదాయము నకు మార్గదర్శకుడైనాడు. ఆపైన తరువాతి వారలగు శ్రీనాథాదులు వచనము నధికముగా నలంకారభూయిష్ఠమగు గంభీరపథమున నడిపించినారు. మొత్తముమీద పదునాల్గవ శతాబ్దినుండి వచనమున పద్యములలో వలెనే ప్రబంధధోరణులు ప్రకటితము కాజొచ్చినవి. కాకతీయయుగమున కొన్నివచనములు గానాత్మకములుగా వెల్వడినవి. ఆనాటి కృష్ణమాచార్యుడను నొక పండితుడు సింహగిరి వచనములను వ్రాసెను. అట్టివే తరువాతికాలమున వేంకటేశ్వరవచనములు, శఠగోపవిన్నపములు, శంకరవచనములు మొదలగునవి ఉదయించినవి. ఇవి పేరునకు వచనములేకాని నిజమునకు పాడుట కుద్దేశింపబడినవి. ఈ జాతివి కొన్ని వేలపదములు వానిగానశరీరమును పోగొట్టుకొని కేవలము శబ్దపంజరములుగామిగిలినవని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వ్రాసియున్నారు.[1] కాకతీయుల వృత్తాంతమును తెల్పు ఏకామ్రనాథుని ప్రతాప చరిత్ర 15 శతాబ్ది ప్రథమార్థములోని వచనగ్రంథము. ఇందులోని వచనరచన నాటివ్యావహారికభాషకు సన్నిహితముగా నున్నది.

15 వ శతాబ్దమున భాగవతమును రచించిన పోతననాటి వచన సముపస్థితి ఎట్టిదో పైన పరిశీలింపబడినది. తననాటికే సముల్లసితమై వికసించిన వచనరచనా సంప్రదాయమున పద్యరచనలో వలెనే ఆయన అత్యంతసామర్థ్యమును ప్రదర్శించినాడు. ఆయా విశేషములు కొన్ని సోదాహరణముగా నీక్రింద భావింపబడుచున్నవి.

సామాన్యముగా ప్రతిపురాణములోను సూతుడు శౌనకాది మహర్షులతో చెప్పినట్లుండును. అదియొక అన్వయాత్మకమగు వాక్యమైయున్న చాలును. కాని దానికే రెండుమూడంత్యప్రాసలను జోడించి మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుండిట్లనియె; అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుక యోగీంద్రుడిట్లనియె[2] అని రచించుటలో ఎంత శాబ్దికసౌందర్య మిమిడియున్నదో సహృదయైకవేద్యము. 'సౌందర్యమలంకారః' అనికదా ఆర్యోక్తి। అందలి పదప్రయోగము విశిష్టార్థసమన్వితమని వేరుగా చెప్పనక్కరలేదు.

స్కంధాంతమున మరల పై దానివలెనే అన్వయాత్మకమగు నొక చిన్నవచనము నుండి ఆపిదప శ్రీరామచంద్రసంబోధ నాత్మకములగు పద్యములుండును. తదనంతర గద్యలో ఒక విశేషమున్నది. ఆస్కంధములో ఏయేకథలు నడిచినవో, వానిప్రధాన శీర్షికలను అన్నింటిని పేర్కొనుటయే ఆవిశేషము. దానిచే ఆస్కంధములో చెప్పబడిన కథలన్నింటిని తప్పిపోకుండ తెలిసికొను అవకాశము కలిగినది.

పోతన అంత్య ప్రాస ప్రియుడని సారస్వతేయులందరు నెరుగుదురు అదిఒక పద్యములలోనే కాదు వచనములలోను గోచరించును. ప్రథమస్కంధారంభముననే 'ప్రథమకవితా విరచనవిద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవ దనుజ కరపరిమిళిత నిగమనివహవిభాగ నిర్ణయనిపుణతాసముల్లాసుండగు వ్యాసునకు మ్రొక్కి[3] .... ....' ఈ విధముగా అంత్యప్రాసల విన్యాసముతో కదను ద్రొక్కిన గుఱ్ఱమువలె ఈ వచనము పరువెత్తుచున్నది. ఈ యలంకారమున కుదాహరణములు గ్రంథమునందడుగడుగున గోచరించును. అట్టిదే మరియొకటి. '....అప్రమత్తుండును, సంసారనివృత్తుండును, బుధజనవిధేయుండును, మహాభాగధేయుండును సుగుణమణి గణగరిష్ఠుండును, పరమభాగవతశ్రేష్ఠుండును, కర్మబంధలతా లవిత్రుండును, పవిత్రుండును....'[4]

కథాకథనమొక వింతయగు నేర్పు. కథచెప్పువాడొక చిన్నవిషయమునకే చక్కని వర్ణనలుచేసి అందమైన మాటలలో పొదిగి, ఒకసామాన్యవిషయమునే యైనను చెప్పదగురీతిలో చెప్పినప్పుడెంతటి వారిహృదయములైన నాకర్షింపబడును. పున్నమినాడు చంద్రగ్రహణమున గంగలోస్నానము చేయుటకు వెళ్ళితిని అనునది ఒకభావము. ఈ భావమును ప్రకటించు తెరగులో కథాశిల్పి ఒకచక్కని శిల్పమును చూపును. గ్రహణమునకు వెడలునాడు ఆతడు నారాయణ కథాప్రపంచవిరచన కుతూహలుడు. ఆ కుతూహలమునకు పూర్వజన్మ సహస్రసంచిత తపఃఫలము కారణము. గ్రహణ స్నానమున కాతడెట్టి మనస్థితిలో వెళ్ళెనో వర్ణించుటలోని ప్రయోజన మక్కడ కన్పింపదు. ఇది అనవసరమని కొందరు భావించవచ్చును. దీనిలోనొక రహస్యమున్నది. ముందు జరగబోవు కార్యమునకు ఈ మనోభావకారణము నేపథ్యము ఆ వాక్యమున కావాక్యము చదువునపుడు ఆ కారణము నిష్కారణమేమో అనిపించినను, తరువాత కొంతదూరమేగిన పిదప సుందరిబీజమునకు ఫలముకన్పించి ఓహో ఇదికదా కవిప్రతిభ అనిపించును.

ఇంతకును అతని కుతూహలబీజమును మొగ్గవేయించిన దాతని ధ్యానము. ఆ ధ్యానమునకు దర్శనాదులు తరువాతి ఫలములు. ఈ భావసముదాయమంతయు — అనిమదీయ పూర్వజన్మ సహస్రసంతతపఃఫలంబున[5] అనువాక్యములో నిమిడి యున్నది. ఇది పోతన వచనములను ఎంతో జాగరూకతతో అర్థము చేసికొనవలెను సుమా అని చెప్పుటకు గుర్తు.

ఎచ్చట ఎట్లు ప్రసంగింపవలెనో తెలిసిన విజ్ఞాని పోతనార్యుడు. ఆయన ఇత రులను నొప్పింపక మృదువుగా పలుక నేర్చినవాడు. అట్లని సత్యము పలుకుటకు జంకడు. ధర్మము చెప్పుటకు వెనుదీయడు. మృదువుగా పలుకుచున్నను ఆ మెత్తదన ములోనే దృఢదీక్ష కన్పించును. వెన్నవంటి మాటల వెనుక వజ్రతుల్యమగు నిశ్చ యము తొంగిచూచును. కానీ ఆయనకు సహజమైనది వినయశీలము. గంగకు పోవు నప్పుడు సజ్జనానుమతంబున[6] పోయినానని పల్కుటలోనే అది వ్యక్తమగును. ఆ మృదుత్వమే ఆయిన వచనరచనలో అడుగడుగున గోచరించును.

రాముడాయనకు ప్రత్యక్షమై భాగవతము తెనుగుసేయ నాజ్ఞయిచ్చెను ఆ అనుభవమును శ్రోతలకు వివరించునపుడు రాముడు తనకానతిచ్చిన తెరగును వర్ణిం చుచు నేను అని ఉత్తమపురుష వాడక 'తాను'[7] అని ప్రథమపురుష వాడుటలో పోతన హృదయలాలిత్యము విస్పష్టమగుచున్నది. వాక్యరచనలో ఉత్తమపురుష నెక్కడ ప్రయోగింపవలెనో ప్రథమపురుష నెక్కడ ప్రయోగింపవలెనో ఎరుగుట సులభముకాదు. మనోధర్మశాస్త్రము నెరిగిన భావనాశిల్పులుగాని అందలి రహ స్యము గ్రహింపజాలరు. పోతనవంటి వానికది సహజసిద్ధము.

సంస్కృతకవులలో అలంకారసహితమైన రచనకు బాణుడు పెట్టినదిపేరు. అతని వచనరచన గద్యంకవీనాంనికషంవదంతి అను లోకోక్తిని పుట్టించినది. వర్ణన సందర్భములలో ననేక సమయములందు పోతన కాదంబరి శైలి ననుకరించిన జాడలు కన్పించుచున్నవి చూడుడు.

> చక్రధరఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖచక్రలాంఛనః
> హరఇవ జితమన్మథః, గుహఇవాప్రతిహతశక్తిః, కమల
> యోనిరివవిమానీకృత రాజహంసమండలః, జలధిరివలక్ష్మీ
> ప్రసూతిః, గంగాప్రవాహఇవభగీరథపథప్రవృత్తః...

కాదంబరి – ప్రథమభాగము.

దీనిని పోలిన పోతన వచనములు చూడుడు.

1. మధువైరిమందిరంబునుంబోలె మాధవీమన్మథసహితంబై బ్రహ్మ గేహంబునుంబోలె శారదాన్వితంబై, నీలగళసభా నికేతనంబునుం

బోలె వహ్ని వరుణసమీరణ రుద్ర హైమవతీ కుబేరవృషభగాల శాండిల్య పాశుపత జటిపటల మండితంబై[8]...

2. రత్నాకరంబునుంబోలె అనిమిషకౌశిక వాహినీవిశ్రుతంబై, శ్రుతి వాక్యంబునుంబోలె అకల్మషసువర్ణ ప్రభూతంబై, భూతపతి కంఠంబునుంబోలె భోగిరాజకాంతంబై[9]...

3. అమరావతీపురంబునుంబోలె వసుదేవనందననివాసంబై, అనలపుట భేదనంబునుంబోలె కృష్ణమార్గసంచారపూరితంబై, సంయమనీనగ రంబునుంబోలె హరితనూభవాభిరామంబై[10]

4. లోభికరంబునుంబోలె దానసలిలధారావిరహితంబై, విరహితలం పునుంబోలె నిరంతరచిత్తవిగ్రహంబై, గ్రహణకాలంబునుంబోలె పరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుంబోలె భిన్నపుష్క రంబై[11]...

వీనిలో కొన్ని ముక్తపదగ్రస్తాలంకారయుతములు గూడనగుట గమనార్హము. తెలుగులో కాదంబరీశైలి ననుకరించియిట్టి వాక్యములకు నన్నయాదులే ప్రారంభో త్సవము చేసియున్నారు: ఆ వాక్యనిర్మాణవిధానము మిక్కిలి ప్రియమగుటచే కాబోలు పోతన చాలచోట్ల నిర్మించినాడు,

వాక్యనిర్మాణములో పరస్పరసంబంధసహితములైన వానిని కారణమాలగా గ్రుచ్చిచెప్పుట ఒకనేర్పు. ఆ నేర్పు పోతనకు చక్కగాకలదు. చూడుడు.

1. శోకహేతువహంకారమమకారాత్మకంబైన ద్వైతభ్రమంబనియు, ద్వైతభ్రమంబు నకు కారణంబు దేహంబనియు దేహంబునకు బీజము లింగంబనియును, లింగంబు నకు మూలము గుణంబులనియు, గుణములకు విదానము ప్రకృతియనియును.[12]

2. భాగవతశాస్త్రసేవావిశేషంబున నిశ్చలభక్తియుదయించును. భక్తిగలుగ రజస్తమో గుణ ప్రభూతంబులైన కామలోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్వగుణంబున ప్రసన్నంబగు. ప్రసన్నమనస్కుండైన ముక్తసంగుండగు. ముక్తసంగుండైన ఈశ్వరతత్వ జ్ఞానము దీపించు. ఈశ్వరుండు కానంబడిన చిజ్జడగ్రథనరూపంబైన అహంకారంబు భిన్నంబగు. అహంకారంబు భిన్నంబైన అసంభావనాదిరూపమ్ము

లగు సంశయంబులు విచ్ఛిన్నములగు. సంశయవిచ్ఛేదంబైన అనారబ్ధఫలంబులైన కర్మంబులు నశించు.

పై వాక్యరచనా విధానము శంకరాచార్యుని

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః
అను శ్లోకమును తలపించుచున్నది.

కవిత్వము రసభావములచే నలరారును. సౌందర్యాత్మకములగు దృశ్యముల వర్ణనచే వెలుగులు జిమ్మును. జటిల శాస్త్రీయ విషయములను తర్కవాదములను, ఛందోబద్ధము చేసినంతమాత్రమున అది కవిత్వమనిపించుకొనదు. అందుకే కేవల కవితాప్రియులును, రసపిపాసువులును నగు ప్రబంధకవులు తమకావ్యములలో శాస్త్ర చర్చలను విసర్జించిరి, కానీ పురాణములలో నట్టివిరాకుండ నుండవు. భాగవతమువంటి మతగ్రంథములో వివిధ వేదాంతచర్చలు తప్పకఉండును. ఛందోబద్ధము చేసినను అదంతయు కవిత్వమనిపించుకొనుట కష్టము. కమనీయ కల్పనాత్మకములు, రచనా రమ్యములునగు తాత్వికభావములు ఎప్పుడో ఒకప్పుడు ఎచ్చటనో ఒకచోట కవితా గౌరవమునందుకొనవచ్చునుగాని సామాన్య వేదాంతచర్చలు వాదోపవాదములు తర్క వితర్కములు, ప్రశ్నలు సమాధానములు, ఇవన్నియు ఛందోబద్ధములు చేయుట అన వసరము. అందుచేతనే భాగవతములోని వేదాంతఘట్టములలో ముప్పాతికపాలు వచన ములోనే పోతన నడిపించినాడు. దీనివలన పద్యములో కన్న అధికతరమగు స్పష్టత చేకూరినది, శాస్త్ర విషయములకది ప్రధానముకదా. ఆ విధముగా ప్రతిస్కంధము లోను ఈ సునిశిత సుప్రసన్న వేదాంత వాక్యములను కన్గొనవచ్చును.

1. మరియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబు లైన కర్మంబులును. కర్మక్షోభకంబైన కాలంబును, కాలపరిమాణహేతువైన స్వభావంబును భోక్తయైన జీవుండును వాసుదేవుండుగా నెరుంగుము. వాసుదేవ వ్యతిరిక్తంబులేదు[14]

2. వినుము. మాయావిభుండైన ఈశ్వరుండు తనమాయంజేసి దైవయోగంబునం బ్రాప్తంబులైన కాలజీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి కొనియెను[15]

3. వ్యక్తుండుగాక, గుణంబులులేక, ప్రకృతింజెందక, భవంబులనొందక, పరమేశ్వరుండు తనమాయవలననైన గుణంబుల నావేశించి బాధ్యబాధకత్వంబుల నొందు, అతండు గుణరహితుండు[16]

4. దేవా నీవు ముఖ్యప్రాణంబగుటంజేసి ప్రజాపతివి. మనోబుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు....[17]

5. వినుము. దైవమాయంజేసి దేహాభిమానులైన మానవులకున్ బగవాడు బంధుడు నుదాసీనుండు ననుమోహంబు సిద్ధంబై యుండు....[18].... ఇత్యాదులు.

సుదీర్ఘ వచనములు పాఠకులకు కొన్నిసార్లు విసుగుగొల్పును. అందుకై ఒక దీర్ఘోపన్యాసము మధ్య ఒకటిరెండు పద్యములుంచినచో అది ఒక చిన్నమార్పువలె పాఠకునకు తెరపినిచ్చును. ఈ విరామము నిచ్చుట వలన కలుగు ప్రయోజనము మానవహృదయమర్మము నెరిగిన మహాశిల్పియగు పోతనకు బాగుగా తెలియును. అందుకే భాగవత వచనములలో ఇట్టివనేకస్థలముల చూడనగును.

1. కం॥ గురుమతులు తపసులు...[19]

తరళ॥ పరమపూరుషు డొక్కడాద్యుడు[20]

2. సీ॥ మహదహంకార తన్మాత్ర సంయుక్తుడై[21]

3. కం॥ ఆయీశు డనంతుడు హరి.[22]

4. కం॥ భువనాత్మకు డాయీశుడు[23]

మ॥ బహుపాదోరు భుజానన్నేక్షణ[24]

5. కం॥ కొందరు స్వభావమందురు.[25] ఇత్యాదులు.

రసభావరహితములైన పట్టికలనేకము పురాణమధ్యములో వచ్చుచుండును. వానిని వచనములలో నిముడ్చుటయే అత్యంత సముచితము. ఆదృష్టితోనే వివిధ పురాణములలో సామాన్యముగా నుండు రాజవంశచరిత్రలను చాలవరకు పోతన వచనములోనే వ్రాసెను.

1. ఆ రామచంద్రునకు కుశుండును, కుశునకు అతిథి, అతిథికి నిషధుండును, నిషధునకు నభుండును,[26]

2. ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణున కురుక్షతుం డును, ఆతనికి వత్సప్రీతుండును.[27]

3. ఆ జనకునకు సుదావసుండును, సుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును.[28]

4. ఆ సీరధ్వజునకు కుశధ్వజుండును, కుశధ్వజునకు ధర్మధ్వజుండును.[29]

ఈవిధముగా వంశాను చరితములే కాక భగవంతుని ఏకవింశత్యవతార విశేషములన్నింటిని కూడ పోతన వచనముననే రచించెను.[30] ఇట్టివానికిగల వచన యోగ్యత వేరుగా నిరూపించవలసిన పనిలేదు.

సంస్కృతములో నిటువంటి సందర్భములు చాలవరకు ఛందోబద్ధములగు శ్లోకములే ఉపయోగింపబడియుండగా తెనుగులో కవులెక్కువగా వచనమునే అపేక్షించుటకు కారణమేమను ప్రశ్న కలుగవచ్చును. సంస్కృతమునకును తెనుగునకును ఎంతదగ్గరి సంబంధమున్నను దేశకాలపాత్రములనుబట్టి భాషానిర్మాణమునుబట్టి ఇతర సంప్రదాయములను బట్టి రచనాశిల్పములో భేదములుండుట సహజము. సంస్కృతములో శ్లోకమున్నచోటులెల్ల తెనుగున పద్యములలోనే దింపవలసిన పనిలేదు. తెనుగు కవి ఆ ఘట్టమున కేవిధమైన ఎంతస్థానము నీయదలచుకొనునో దానినిబట్టి అక్కడి సముపస్థితిని నిర్ణయింపవలసియుండును. అదియునుగాక తెనుగులో వలె అక్షరాక్షరయతి లేని అనుష్టుప్‌శ్లోకములలో పట్టికలిచ్చుట కష్టముకాదు. యతిసౌకర్యమునకై పట్టికలలోని పేర్లుకొన్ని మార్చవలసిన పరిస్థితి వచ్చును. ఏదో ఒకభావమైనచో రచనానైపుణినిబట్టి అక్షరాక్షరయతి పాటించుచు దానిచే నొకవిధమగు శాబ్దిక సౌందర్యము నినుమడింపజేసికొనుచు రచింపవచ్చునుగాని కేవలపట్టికల నిముడ్చుటకై పద్యములు వ్రాయుట తెనుగులో నంతబాగుండదు. ఆ రహస్యము నెరిగిన ఆంధ్ర మహాకవులు అట్టిపట్టికలను, వివరణలను ఒసగవలసిన చోట చాలవరకు వచనమునే అవలంబించిరి.

తాత్త్వికవిశేషములను వివరించునపుడు బోధకునకు పాండిత్యముతో బాటు తనపాండిత్యమునందు విశ్వాసముకూడ కావలెను. తాను హృదయపూర్వకముగా విశ్వసించి చెప్పినవాక్యము అనుమానరహితముగా దృఢనిశ్చయాత్మకముగా నుండును. భక్తితాత్త్వికాది విషయములలో ఆ దృఢత్వము మానవుని వ్యక్తిత్వమునకు నిదర్శనము. ఈ క్రింది వాక్యములు చూడుడు.

'నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు కలిగినను, హరిభక్తిలేకున్న శోభితంబుకాదు. ఫలంబుగోరక కర్మమీశ్వరునకు సమర్పణచేయకున్న అది ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబులైన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు.[31]

ఇంతటి దృఢనిశ్చయాత్మక వాక్యములు రచింపగల కవి కేవలశాస్త్రప్రమాణముచేకాక స్వానుభవముచేత మాత్రమే అట్టివానిని నిర్మింపగలడు కనుక వాక్యవిన్యాసవైఖరిని బట్టి ఒకభావమును వాక్యములో వెలువరించురీతినిబట్టి ఆ రచయితయొక్క వ్యక్తిత్వమును కొన్నిసందర్భములలో తెలిసికొనవచ్చుననుటకిట్టివి సాక్ష్యములు కాగలవు.

ఉపన్యాసకు డుపన్యసించునపుడు తన్మధ్యమున నొక ప్రధానవిషయము చెప్పవలసివచ్చినచో, ఆ విషయమునందలి ప్రత్యేకతచే శ్రోతలను మరింత శ్రద్ధాళువులను చేయవలసి వచ్చినచో, వారి శ్రద్ధనాకర్షించుటకై బోధకుడు తానుచెప్పు నుపన్యాసమునొక క్షణమాపి ఆపినపిదప ఆ నిశ్శబ్దముచే అందరును తనవైపు తిరిగినప్పుడు ఒక్కసారి కలయజూచి 'వినుండు' అని తాను చెప్పబోవుదానిని ప్రారంభించును. ఆ పదమును ప్రయోగించుటలో ఆ విశిష్టార్థ మనేకస్థలముల సూక్ష్మపరిశీలన కందగలదు.

1. వినుండు అరూపుండై, చిదాత్మకుండై పరగు జీవునకు—[32]

2. వినుము నీకు నేడుదివసంబులకుంగాని జీవితాంతంబుగాదు[33]

3. వినుము భగవంతుండైన హరి విరాడ్విగ్రహంబునందు భూతభవిష్యద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు.[34]

4. వినుము నీవడిగిన సద్యోముక్తియు, క్రమముక్తియు అనియెడి నీరెండుమార్గంబులు వేదగీతంబులందు వివరింపబడియె—[35]

ఈ పదప్రయోగము వలన పోతన దీని అనంతర మొక మహాప్రధానవిషయమును చెప్పబోవుచున్నాడనునది విస్పష్టముగా కాననగును. భవిష్యన్ముఖ్య భావాగమన సూచనమగు శక్తి ఆ పదమునకు పోతన ప్రయోగనైపుణ్యముచే లభించినది.

ఇదికాక పోతన వచనముల కారంభమున అధికముగావచ్చు కొన్ని పదములు కలవు. సామాన్యముగా వర్ణనానంతరమున 'ఇట్లు'[36] అనునది కన్పించును. కథతరువాత 'అంత'[37] అనుపదము తరచుగా గోచరించును. భావసంపూర్ణతచేతను, పలుకవలసిన

దానియందు తనివితీరమిచేతను ఒకవిషయము చెప్పి ఎంతో చెప్పి మరలచెప్పుటకు పూనుకొనునప్పుడు 'మరియు'[38] అనునదెక్కువగా కన్పించును.

సంభాషణానంతరము సామాన్యముగా 'అని, అనిన' అనునవి అధికముగా కానగును.[39] సంస్కృతములో 'ఇతి' అన్నట్లు 'అయ్యవసరంబున'[40] అనునది కూడ తరచుగా కన్పట్టును. 'వెండియు'[41] అనునది 'మరియు' వంటిది. ఇటువంటివే మరికొన్నిపదములుకూడ కన్గొనవచ్చును.

స్థూలదృష్టికి వచనములో నెడనెడ కానవచ్చు నివి కేవలమూతపదములుగా తోచవచ్చును. కానీ సూక్ష్మముగా పరిశీలించిన వీనికి సార్థకత తోపకపోదు. సుదీర్ఘోప న్యాసముల మధ్య నీ చిన్నిపదములు విశ్రాంతిజనకములై పఠితల చిత్తవృత్తికొక మార్పును కలిగించి వారిని సావధానులగునట్లు చేయును.

క్త్వార్థకప్రయోగముతో వాక్యములు కలిపి ఒకే సమాపకక్రియను వాడి దీర్ఘీక రించుట భావసంపూర్ణత కప్పుడప్పుడవసరమగును. ఒక మహాకార్యము లభించుటకు ముందే యేపనులు చేయబడినవో అవియన్నియు నా మహాకార్యమున కంగములై అసమాపకక్రియలతో వ్యక్తమగుచుండ, పూర్ణఫలము సమాపకక్రియలో వ్యక్త మగుట నిపుణరచనకొక తార్కాణము. చూడుడు.

1. మదముడిగనాడి, మత్సరంబువిడిచి, కామంబు జయించి, క్రోధంబు వర్జించి....[42]

2. ....పరువిడి, వెనుకజూచి, రథతురంగంబులలియుట తెలిసి, నిలిచి....[43]

అపార వర్ణనాత్మక భావనకలిగిన కవికి సర్వాంగీణ భావవ్యక్తీకరణ కొక్కొ క్కప్పుడు ఛందోబంధము చాలదు. సూక్ష్మాతి సూక్ష్మములగు బహువిధ వర్ణనల వ్యాకోచమును, వైశాల్యమును అది భరింపజాలదు. అప్పుడు కవి వచనమును నాశ్రయింపక తప్పదు. ఒక్కొక్కచోట పోతన సుదీర్ఘములైన సమాసములతో బహువిధ పట్టికలతో,ఉపమామాలికలతో విశేషణవిశేష్య సముదాయముతో, మహాదీర్ఘ వచనములను కూర్చును. కృష్ణుడు ద్వారకానగరమున ప్రవేశించుటను వర్ణించుచు ఆ పుర సౌందర్యమును స్వకపోల కల్పనలతో రమణీయ వచనమున ఆయన తీర్చిదిద్ది నాడు. రసాస్వాదనతత్పరులగు విద్యానిధులావాక్యములందలి శారికాకీరకుల కలకలము లను కలకంఠమిథునముల కోలాహలములను, కలహంస నివహక్రేంకారములను, మత్తమయూర కేకారవములను, ఆనంద పారవశ్యముతో వీనులవిందుగా వినగలరు. వచన నిర్మాణమునకిదియొక ఆదర్శప్రాయమగు నుదాహరణము. చూడుడు.

వ॥ భుజగేంద్రపాలితంబైన భోగవతీనగరంబు చందంబున, స్వసమాన బలయదుభోజదాశార్హకుకురాంధకవృష్ణి వీరపాలితంబును, సకలకాల సంపద్యమానాంకుర పల్లవకోరక కుట్మలకుసుమ ఫలమంజరీపుంజ భారవినమిత లతాపాదపరాజి విరాజితోద్యాన మహావనోపవనారామ భాసితంబును.[44]

ఇట్టివే మరికొన్ని ఉదాహరణములు ....

1. అది మరియును మందార పారిజాత సరళతమాల సాలతాల తక్కోల కోవిదార శిరీషార్జున...[45]

2. అదిమరియును మాతులుంగలవంగలుంగ చూతకేతకీ భల్లాత కామ్రాతక సరళపనస...[46]

పరమసుందరమైన ఈ రచనావైభవము ఆంధ్రసారస్వతమునకే అపూర్వాలంకారము. పై విధముగా వర్ణనలు వచ్చినప్పుడు సుదీర్ఘములగు వాక్యములనుగూర్చిన మహాకవి సునిశితమగు భావములను వ్యక్తీకరింపవలసి వచ్చినప్పుడు పొడిపొడిగా అత్యంత క్లుప్తము సుతీక్ష్ణమునగు చిన్నచిన్న వాక్యములను రచించును. ఇవి ఆతని రసౌచిత్య నిర్వహణ సామర్థ్యమునకు మనస్తత్వ వేతృతకు నిదర్శనములు.

1. అమ్మహాత్మునికి పాదమూలంబు పాతాళంబు....[47]

2. ఈశ్వరాధిష్ఠితంబైన ప్రకృతి అంశంబునమహత్తత్వంబగు మహత్తత్వాంశంబున అహంకారంబగు.[48]

3. కీలిపోలికదుర్ధర్షుండగు. సముద్రుని తెరంగున దుస్తరుండగు. మృగేంద్రుని కైవడి విక్రమశాలియగు.[49]

ఏ స్థానమున పద్యముంచవలెను, ఏ స్థానమున వచనముంచవలెను, అనునది ఒకమహా కావ్యశిల్ప రహస్యము. దానిని బాగుగా నెరిగిన పోతన వివిధఘట్టములలో ఆ నేర్పరితనమును చూపినాడు. ప్రహ్లాదుని వివిధ విధముల బాధించిన హిరణ్యకశిపుని మనస్తత్వమును వర్ణించుచు ఆలోచనా తీవ్రతయందు బహువిధ భావోన్మీలనమునందు పద్యముల నుపయోగించి అతని నిరాశాస్థితిలో వచనమునుపయోగించినాడు. చూడుడు

వ॥ కావునవీడు మహాతపః ప్రభావసంపన్నుడు వీనికెంతును భయంబులేదు. వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు[50]...

అటులేవచన స్థానౌచిత్యమునకు దక్షాధ్వరధ్వంసమున శివాజ్ఞాపద్ధతి ఒక రమణీయోదాహరణము. చూడుడు.

వ॥ దగ్ధశీర్షుండైన దక్షుండజముఖుండగు, భగుండు బర్హిస్సంబంధ భాగంబులు గలిగి మిత్రనామధేయచక్షుస్సునం బొడగాంచు...[51]

ఇందలి క్లిష్టగంభీరవైఖరి సముదాత్తము. వచనమును కథాకథనమునకును అన్వయ సమ్మేళనమునకునేకాక, రసపోషణమునకును అత్యంత సమర్థమని తన రచనా మూలమున పోతన సువ్యక్తము చేసినాడు. శృంగార రసభరితమగు రాసక్రీడా వర్ణనమంతయు వచనమే.[52] అట్టిదే అక్కడి జలక్రీడా వర్ణనమును[53]

అటులే వీర, బీభత్స, భయానకాది రసములకును ఆయాప్రదేశముల నుదాహరణములు కాంచనగును. హతసహోదరుడగు హిరణ్యకశిపుని వర్ణన భయానక రసమును,[54] ప్రహ్లాదునిపై అతడు ప్రేమవర్షమును కురిపించుఘట్టమున వత్సలరసమును,[55] వివిధ యుద్ధవర్ణనలలో[56] అద్భుత వీర బీభత్స భయానకములను సముదాత్తముగా పోషింపబడినవి.

పూతన మరణముతరువాత గోప గోపీజనములు రోహిణీ యశోదలను గూడికొని పలికిన రక్షావచనము[57] సంస్కృతములోని రక్షాసంప్రదాయమును తెలుగునకందించు శాస్త్రీయరచనగా గౌరవించదగినది

ఇక లలితసంస్కృత సమాసరచనయు మృదుమనోహర బంధమును పోతన పద్యములకువలెనే వచనములకును సామాన్యలక్షణము. చూడుడు.

1. కనకమణిమయ విమానమంటపగోపుర...[58]

2. అధరబింబారుణ సంభ్రాంత సమాగతరాజకీరంబుల—[59]

పోతన వచనములో కొన్ని అచ్చపు తెనుగుదనమును సూచించు పదజాలముతో నలరినవియు కలవు.

1. అని మరియుం జెఱకువిల్తునికోలలు మేరమీఱి తరుమనెర బిరుదు వెరగుపడన్ తెరవతురిమిన తురుము బిగి ముడివదలి కదలి...[60]

2. ఇట్లగ్గలంబగు నగ్గలిక డగ్గరిన...[61]

3. కదిసి కలికిపలుకులు వలుకుచు నులుకుచెడి జళుకుసార ఎదుర నిదురం గదిరిన...[62]

పోతన సర్వశాస్త్ర పాండిత్యమును సూచించునది గంగావతరణవచనము.[63] ఆయనకుగల అపారలోకజ్ఞత చూపునవియు,[64] రాజనీతి వైశారద్యమును ప్రకటించునవియు[65] నగువచనము లటనట హృదయాకర్షమై అలరారుచున్నవి.

ఈవిధముగా కథాకథనముననేమి, వర్ణనవైఖరిలోనేమి వేదాంతతత్వ ప్రవచనములోనేమి, పోతన వచనరచన అద్వితీయము. పాత్రముఖమున నొకచో బల్కించినట్లు పోతన వినయయుక్త వచనరచనుఁడు. అయినను ఆవినయములో పరమనిష్ఠయు, ధీరత్వమును కలవని ఆయనవాక్యములే ప్రకటించుచుండును.



# పోతనకవిత్వము - ఔచిత్యము

కావ్యములో అలంకారములు గుణములు మొదలగు విశేషములెన్నో ఉండును అవియన్నియును కావ్యమునకు సౌందర్యాపాదకములు. సౌందర్యమును సంపాదించుటకాయా గుణాలంకారాదు లౌచిత్యము ననుసరించి ఉండుట అత్యావశ్యకము. ఏది ఎచ్చట ఎట్లుండవలెనో అట్లు లేకున్న ఆయా విశేషములుండియును లేనట్లే. అంతేకాక అవి కావ్యరామణీయకతకు బాధాకరములు కాగలవు. ఆలంకారికులలో కావ్యాత్మ ఏదియను ప్రశ్న ఉదయించినప్పుడు భామహుడలంకారమును, దండిగుణమును, వామనుడురీతిని. ఆనందవర్ధనుడు ధ్వనిని, కుంతకుడు వక్రోక్తిని, ప్రతిపాదింపగా క్షేమేంద్రుడు మాత్రమౌచిత్యమే కావ్యాత్మయని ప్రకటించెను. ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమును వ్యాఖ్యానించిన అభినవగుప్తుడు రసధ్వనియే కావ్యాత్మయని నిరూపించుటచేతను తరువాతి ఆలంకారికులందరును ఆ అభిప్రాయమునే బలపరచుటచేతను ఇతరవాదములు లుప్తములైనవి.

కావ్యాత్మగా ఔచిత్య మంగీకరింపబడక పోయినను కావ్యమున దానికిగల ప్రాధాన్యము నెవ్వరును కాదనలేరు. శాస్త్రీయదృష్టితో దీనిని పరిశీలించి భారతీయాలంకారికులు బహువిధముల తర్కించిరి. నాట్యశాస్త్రమును వ్రాసిన భరతుడు ప్రత్యక్షముగా నౌచిత్యమును ప్రస్తావింపక పోనునను నటుల భూషణాదికములను యథాభావరసావస్థముగా నుండవలెనని ఇట్లు నిర్దేశించినాడు.

శ్లో॥ ఏతద్విభూషణంనార్యా ఆ కేశాదానఖాదపి
యథాభావరసావస్థం విజ్ఞాయైవం ప్రయోజయేత్

ఈవిధముగా నాతడు పరోక్షముగా ఔచిత్యమును గుర్తించినట్లే యైనది. ఇట్లే భామహుడును అగ్రామ్యమును అర్థ్యమును, న్యాయ్యమును అనాకులమును అగు రచనయే శోభించుననియు సన్నివేశ విశేషముచే దురుక్తము కూడ నొకప్పుడు శోభిల్లుననియు ఔచిత్యభావమును ప్రకటించినాడు. దండియు అపార్థ దూష్యవివక్షచే పరోక్షముగా ఇటులౌచిత్య సూచనచేసెను.

శ్లో॥ సముదాయార్థ శూన్యంతుతదపార్థ మితీష్యతే
ఉన్మత్తమత్త బాలానా ముక్తేరన్యత్ర దుష్యతి

విశ్రుతాలంకారికుడు రుద్రటుడు.

శ్లో॥ ఏతాః ప్రయత్నాదధిగమ్యసమ్యక్
ఔచిత్యమాలోచ్య తదార్థసంస్థం-

అని ఔచిత్యమునుగూర్చి ప్రముఖముగా ప్రస్తావించినాడు.

అనౌచిత్యమే రసభంగమునకు కారణమని ఆనంద వర్ధనుడు ఇటుల ప్రసంగించినాడు.

శ్లో॥ అనౌచిత్యాదృతే నాన్యద్ రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా.

ధ్వన్యాలోకవ్యాఖ్యాతయగు అభినవగుప్తుడు పై విషయమునే ప్రపంచించి "విభావాద్యౌచిత్యమేవ రసవత్తా ప్రయోజకమ్" అని సంభావించినాడు. కుంతకుడనౌచిత్యమును గూర్చి వివరించి స్వభావమహత్వపోషణమే ఔచిత్యమని నిర్వచించినాడు. మహిమభట్టు ప్రత్యక్షముగా ఔచిత్యముమ ప్రస్తావింపక తనవ్యక్తి వివేకమున ద్వివిధానౌచిత్యమును వివరించినాడు. మమ్మటుడు ఔచిత్యముచే ఒకప్పుడు దోషము కూడ గుణమగుననినాడు. భోజుడౌచిత్యానౌచిత్యములను రెండింటిని చర్చించి

శ్లో॥ యథామతి యథాశక్తి యథౌచిత్యం యథారుచి
కవేః పాత్రస్య చైతస్యాః ప్రయోగఉపపద్యతే.
అని సరస్వతీ కంఠాభరణమున పలికినాడు.

"ఉచితానుచిత వివేకోహి వ్యుత్పత్తిరితి యాయావరీయః" అని రాజశేఖరుడౌచిత్యనిర్వచనము నుపపాదించినాడు. హేమచంద్రుడు తన కావ్యానుశాసనమున "వక్తృవాచ్య ప్రబంధౌచిత్యాత్ వర్ణనాదీనామన్యథాత్వమపి" అని ఔచిత్య ప్రసంగము కావించినాడు. విశ్వనాథుడు సాహిత్యదర్పణమున గుణదోషము లెరుగుట కౌచిత్యావసరమును బాగుగా గుర్తించినాడు. జగన్నాథ పండితుడును ధ్వన్యాలోకము ననుసరించి "అనౌచిత్యంతు రసభంగ హేతుత్వాత్ పరిహరణీయమ్" అని రసగంగాధరమున ఉద్ఘాటించినాడు. ఔచిత్యమే కావ్యమునకు జీవితమని క్షేమేంద్రుడు సమగ్రమగు గ్రంథమును రచించి ఆదర్శమార్గము ననుసరించెను.

శ్లో॥ అలంకారాస్త్వలంకారాగుణా ఏవగుణాస్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరంకావ్యస్య జీవితమ్.

కావ్యమునకు రసముప్రధానము. ఔచిత్యము దానిని జీవింపజేయును. ఇతర సర్వవిశేషములచేతను రసము ప్రతీయమానమగుటకు ఔచిత్యమే ఆధారము. ఆలంకారికులలో పిడివాదము సేయువారు ఔచిత్యము కావ్యసర్వస్వమనియు, రసానపేక్షమనియు పలికిన పలుకవచ్చునుగాని సాహిత్యశాస్త్ర మర్మజ్ఞులా అనుసంధానమును అంగీకరింపరు.

ఔచిత్యమును క్షేమేంద్రుడీవిధముగా నిర్వచించినాడు.

శ్లో॥ ఉచితం ప్రాహురాచార్యాః సదృశంకిలయస్యయత్
ఉచితస్యచయోభావః తదౌచిత్యం ప్రచక్షతే.

ఏది దేనికి అనురూపముగానుండునో అది దానికి ఉచితమైయున్నదని పెద్దలందురు. ఉచితముయొక్క భావమౌచిత్యము. దీనిని పదవాక్య ప్రబంధార్థాది సప్తవింశతి విషయములలో క్షేమేంద్రుడు చూపినాడు.[1] అతనిపథము ననుసరించి పోతన భాగవతదర్శన మెట్లున్నదో పరిశీలించుట అత్యంత సముచితము. కొన్నివిధములగు ఔచిత్యములు సోదాహరణముగా నీక్రింద నొసగబడుచున్నవి.

1. పదౌచిత్యము :- కస్తూరి మోమున దాల్చిన చంద్రాస్యవలె చందనము దాల్చిన శ్యామవలె తిలకాయమానమై ఉచితపదముదాల్చిన సూక్తి శోభించును.[2] పోతన శ్రీకృష్ణుని స్తుతించుచు 'మహానందాంగనా డింభకుడని' ప్రారంభ పద్యమున వర్ణించినాడు. ఇందులో గొప్ప ఔచిత్యమున్నది. ఈపదము ప్రయోగించుట మహాప్రజ్ఞకు నిదర్శనము. లోకములో ఏ పిల్లవానినైనను ఆమె కొడుకనవచ్చును. లేదా ఆయన కొడుకనవచ్చును. అట్లే యశోదాపుత్రు డనవచ్చును. లేదా నందసుతుడనవచ్చును. కాని ఆయనభార్య కొడుకనుట అశ్లీలార్థద్యోతకము. అట్టి అర్థమునొసంగెడి నందాంగనాడింభక శబ్దమును పోతన ఇచ్చట ప్రయోగించినాడు. ఇది అనుచితముకాదా యని కొందరు సందేహింపవచ్చును. అది స్థూలదృష్టికట్లే తోచును. నందాంగనా శబ్దమును యశోదాదేవికి పర్యాయపదముగా తీసికొన్నచో ఎట్టి ఇబ్బందియులేదు. పాదారంభమున నానాకంజాత భవాండకుంభకు - అనికలదు. యతి సరిపోవుటకై 'నంద' శబ్దమును ప్రయోగించి మిగిలిన పాదపూరణకై అంగనాశబ్దమును పోతన వాడియుండునని కొందరనవచ్చును. అది అంగీకార్యము కాదు పోతన యతిప్రాసలకు శ్రద్ధవకొనెడి స్థితిలోనున్న కవికాడు. ఏ యశోదాభామినీడింభకుడనియో వ్రాసి దానికి

తగినట్లుగా ముందు యతిస్థానమునకు సరిపోవు పదములను కూర్చుకోలేనంత అశక్తుడు కాదాతడు.

ఇక్కడ నొక రహస్యమున్నది. ఆదిశక్తియగు లలితాదేవి ఆనందాంగన. ఆనందము సౌకుమార్యమునకును మాధుర్యమునకు చిహ్నము. అది స్త్రీతత్వమని శృంగార రహస్యతత్వవేత్తలగు విద్వాంసు లెరుగుదురు. సర్వసృష్టికిని ఆనందమే మూలకారణము. సర్వప్రాణుల అంతిమగమ్యమును జననమరణ రహితమగు ఆనందస్థానమే. అదియేపరబ్రహ్మము. జగదీశ్వరియగు లలితాదేవి కృష్ణ స్వరూపమును ధరించినదని మధుసూదన సరస్వతి శక్తిసంగమములోని ఈ క్రింది శ్లోకము నుద్ధరించి ఉదాహరించినాడు.

శ్లో॥ కదాచిదాద్యా లలితా పుంరూపాకృష్ణ విగ్రహా
లోక సమ్మోహనార్థాయ స్వరూపంబిభ్రతీ పరం

సర్వసృష్టిలోని ఆనందస్వరూపము అంగనాత్మకమైన ఆనందస్వరూపుడగు కృష్ణుడు ఆ అంగనయే అగును. కనుక ఆనందాంగనయే డింభకుడైన వాడా యశోదా పుత్రుడు. మహచ్ఛబ్దమును ముందు చేర్చుటతోనే ఈ అర్థము సూచితమగుచున్నది. మహానందాంగనాడింభకుడను సమాస పదములో ఇంత విశేషమున్నది దీనిని గుర్తించినప్పుడే అందలి ఔచిత్యము గ్రాహ్యమగును.

2. గుణౌచిత్యము :- సంభోగావసరమున ఉదయించిన చంద్రునివలె కావ్యమునందు ప్రస్తుతార్థోచితమును భవ్యమును సౌభాగ్యవంతమునునగు గుణమానందమును స్యందించును[3].

వ॥ కల్పాంతకాల సకల భువనగ్రసన విలసన విజృంభమాణ సప్తజిహ్వాజిహ్వాతులిత తళతళాయమాణ విభ్రాజమాన జిహ్వాంచును, మేరుమందర మహాగుహాంతరాళ విస్తార విపుల వక్త్రనాసికా వివరుండును[4] ...

నరసింహుని స్తంభావిర్భావవచనము ఓజస్సనెడి గుణముచే ఔచిత్య స్ఫూర్తి నందినది.

3. అలంకారౌచిత్యము :- పీన స్తనస్థితమగు హారముచే హరిణేక్షణ వలె అర్థౌచిత్యవంతమగు అలంకారముచే సూక్తిశోభిల్లును.[5]

వ॥ ప్రళయకాలాభీల ఫాలలోచనానల శతంబు చందంబున నమందంబై, విలయదహన సహస్రంబు కైవడి వడియై, కడపటి పట్టపగటింటి వెలుంగుల లక్ష తెరంగున దుర్లక్షితంబై [6]

హాలాహల విజృంభణమును వర్ణించు పై ఉపమాన పరంపర అత్యంత సమయోచితమై అలరారుచున్నది. అలంకారౌచిత్యము చక్కగానిందు పరిపోషితమైనది.

**4.** రసౌచిత్యము :- ఔచిత్యరుచిరమగు రసము సకలజన హృదయవ్యాపియై అశోకతరువును వసంతుడువలె మనస్సు నంకురితముచేయును.[7]

అస్మద్బాహుబలంబుగైకొనక శంఖారావమున్ మానసా
పస్మారంబుగ నెవ్వడొక్కొ నగరప్రాంతంబునం జేసె మ
ద్విస్మేరావహ రోషపావకునిచే విధ్వస్తుడై వాడు దా
భస్మంబై చెడునంచు నంతకుడు కోపప్రజ్వలన్ మూర్తియై [8]

యముని ఉద్రేకమును వర్ణించు నీ పద్యము వీరరసమునకు సరియగు నుదాహరణమై రసౌచిత్యమును నిలుపుకొన్నది.

5. కారకౌచిత్యము :- ఔదార్యచరితములచే కులాభరణమగు నైశ్వర్యమువలె, ఉచితకారకములచే వాక్యము సాన్వయమై శోభిల్లును.[9]

ఉదా:- విష్ణునందైన శ్రీకర నానాప్రకటావతారములు.... [10]

విష్ణువివలన, విష్ణునుండి మొదలగువేవైనను ఇచ్చట అర్థస్ఫురణమును కలిగింపకపోవు. 'విష్ణునందు' అని సప్తమీ విభక్తి వాడుటచే అవతారములన్నియు విష్ణునిలోని భాగములని ఝటితిస్ఫూర్తి కలిగి కారకౌచిత్యమును సంతరించుకొన్నది. అభివ్యక్త్యర్థముగల విష్ణుశబ్దప్రయోగములోని విశిష్టత పై అర్థమునకు మరింత తోడ్పడినది.

**6.** లింగౌచిత్యము :- సామ్రాజ్యసూచకమైన శుభలక్ష్మముచే శరీరమువలె ఉచితమగు లింగముచే కావ్యము భవ్యత్వమును పొందును.[11]

సీ॥ తన కుంభములపూర్ణతకుడిగ్గి యువతుల
కుచముల పయ్యెద కొంగులీగ

తనయానగంభీరతకు జాలకబలల
యానంబు లందెల నండగొనగ
తనకర శ్రీగని తలగిబాలల చిరు
తొడలుమేఖల దీప్తి దోడుబిలువ
తనదంతరుచి కోడి తరుణుల నగవులు
ముఖచంద్రదీప్తుల ముసుగుదిగువ

గీ॥ తనదు లావణ్యరూపంబుదలచి చూడ
నంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర
దయితలందరు దనవెంట దగిలినడువ
కుంభివిభుడొప్పె నొప్పుల కుప్పబోలి[12].

గజేంద్రుని స్త్రీతో బోల్చుట భిన్నలింగ దోషము. అయినను గజ శరీరము లోని వివిధావయవ విశేషములను స్త్రీ కుచయానాదులతో పోల్చుట కవి సమయ సిద్ధమగుటచే వానినన్నింటిని కలిపి గజకాంతలకు పోలిక కన్పించుట ఒక విచిత్ర సౌందర్యాస్పదమగు నాలంకారిక ప్రయోగమై ఔచిత్యవహమైనది. అటులే మరియొక ఉదాహరణము చూడుడు.

కం॥ అంగీకృత రంగన్మా
తంగీమద గంధమగుచు తద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల
భృంగీగణ మొప్పె్రమాను పెట్టెడి మాడ్కిన్[13].

ప్రతి తుమ్మెదయు పాడును. అయినను సంగీతమున కాడు వారే ప్రసిద్ధి. అందుచే పోతన కల్పించిన భృంగీగణములోని స్త్రీలింగము శబ్దాలంకారము కూర్చుటే కాక అధికతర రససంపూరకమై ఔచిత్య సుందరమైనది.

7. వచనౌచిత్యము : అదైన్య ధన్య మనస్కులగు విద్వాంసుల వదనమువలె ఉచిత వచనములచే కావ్యము చారుత్వమును పొందును[14].

సీ॥ మందారమకరంద మాధుర్యమును గ్రోలు
మధుపంబువోవునే మదనములకు

... ... ...

చిత్తమేరీతినితరంబు జేరనేర్చు[15]

సీసము నాలుగు పాదములలోను మధుపము మదనములకు పోవునా ? రాయంచ తరంగిణులకు చనునా ? కోయిల కుటజములకు చేరునా ? చకోరము నీహారముల కరుగునా ? అని కూర్పబడినది. వానిసామ్యమున చిత్తమితరములు చేర్చునా అని ఇతరశబ్దమునకు బహువచనము వాడవలెను. కానీ పోతన ఏకవచనమునే ప్రయోగించినాడు. ఇందొక అర్థ విశేషమున్నది. చిత్తమనేకములగు నితర విశేషములను కాదు, ఏయొక్క ఇతర విశేషమును చేరనీయదు అను అర్థము ఏకవచనముచే స్ఫురితమగును. ప్రక్రమ భంగమైనను ఆ ఏకవచన ప్రయోగము అధికతరౌచిత్యమునకు స్థానమైనది.

8. విశేషణౌచిత్యము :- గుణాధికులకు సుహృత్తులచే గుణోదారుడగు సజ్జనునివలె సముచిత విశేషణములచే విశేష్యార్థము ప్రకాశించును.[16]

తతమత్తద్విపయానయై కుచనిరుంధచ్చోళ సంవ్యానయై
ధృతబాష్పాంబువితానయై కరయుగాధీనాలికస్థానయై
పతిభిక్షాం మమ దేహి కోమలమతే పద్మాపతే యంచు తత్
సతివింధ్యావళి చేరవచ్చె త్రిజగద్రక్షామనునన్ వామనున్.[17]

వింధ్యావళిరాకను వర్ణించుటలో పోతన కొన్ని విశిష్ట విశేషణములు ప్రయోగించినాడు. ఆమె మదేభయానమున వచ్చినదట. కుచనిరుంధచ్చోళ సంవ్యానయైనదట ! స్థూలముగాచెప్పిన జాగ్రత్తగా పైట సర్దుకొన్నదని అర్థము. పోవునది వామనుని దగ్గరకు. అడుగునది పతిభిక్ష. ఎంత తొందరఉండవలెను. పరువెత్తిపోయి కాళ్ళపై పడవలదా ? ఆస్థితిలోకూడ మదగజయానము, స్తనోపరిచేల సంవ్యానము ఉండవలసినదేనా ? అనికొందరు విమర్శింపవచ్చును.

ఎట్టి పరిస్థితులలోను ధీరులు తమకుచితమగు రీతినే ప్రవర్తింతురు. మందయానయై నడచుట స్త్రీకుచితము. ఎట్టి ఇబ్బందివచ్చినను శీఘ్రగమనము ఉత్తమజాతి స్త్రీలక్షణముకాదు. అసలు మానవలక్షణము క్లిష్టసమయములలోనే బయల్పడును. పై పద్యములోని వింధ్యావళికిని అది క్లిష్టపరీక్షాఘట్టము. వింధ్యావళి బలిచక్రవర్తి పట్టమహిషి. రాజకాంతయగునామె ఎట్టిపరిస్థితులలోను విడువరాని కొన్ని మర్యాద

లుండును. ఆమె తన గౌరవమునకు తగినట్లు మందయానయయియే నడువవలెను. పైటసరిజేసికొనియే బయలుదేరవలెను. అట్లే చేసినది. దీనితో నాదయితు కట్టనేటికి[18] అని అడుగగలిగినది. ఆమె ధీరత్వమునకు తగినట్లుగా పై విశేషణములను పోతన ప్రయోగించినాడు: అది మహౌచిత్యము.

9. కాలౌచిత్యము :- జనావర్జన రమ్యమగు వేషముచే అవసరజ్ఞుల శరీరమువలె కాలౌచిత్యముగల అర్థముచే వాక్యము చారుత్వమును పొందును.[19]

ఏదిక్పాలురజూచి నేడలుగునో యేదేవు బంధించునో
యేదిగ్భాగము మీద దాడిచనునో యేప్రాణులం జంపునో
యీదైత్యేశ్వరుడంచు నొండొరులు దారింద్రాదు లాస్థానభూ
వేదిన్ మెల్లనిక్కి చూతురు భయావిర్భూతరోమాంచులై.[20]

హిరణ్యకశిపుడెప్పు డెవ్వలికే యపకారము తలపెట్టునోయని మెల్లగా అప్పు డప్పుడు తలయెత్తి చూచెడి ఇంద్రాదుల భావగతిని 'చూతురు' అను తద్ధర్మార్థక క్రియ బాగుగా నిరూపించుచున్నది. వారిభీతియొక్క సార్వకాలికత్వము సువ్యక్తము చేయుచు ఆక్రియ కవియొక్క కాలౌచిత్య దర్శనమునకు నిదర్శనమైనది.

10. దేశౌచిత్యము :- పరపరిచయ మాశంసించు సజ్జనుల వ్యవహారము వలె హృదయసంవాదియగు దేశౌచిత్యముచే కావ్యార్థము శోభిల్లును.[21]

మ॥ యవనవ్యాధపుళిందహూణ శకకంకాభీరచండాల సంభవులున్.[22]

శ్లో॥ కిరాతహూణాంధ్రపుళింద పుల్కసా
ఆభీరకంకాయవనాః కషాదయః[23]

ఈ మూలమునందలి హీనులపట్టికలోని ఆంధ్రశబ్దమును తొలగించి అనువదించుటలోని దేశౌచిత్యమును సర్వప్రశంసార్హము.

11. తత్త్వౌచిత్యము :- కవికావ్యము తత్త్వోచితాభిధానముచే సత్య ప్రత్యయనిశ్చయము కలిగి హృదయసంవాదియై ఉపాదేయమగును.[24]

సీ॥ ఇదినాకు నెలవని యేరీతి బలుకుదు
నొకచోటనక నిండియుండ నేర్తు

నెవ్వాని వాడనం చేమని పలుకుదు
నాయంతవాడనై నడవనేర్తు
నీనడవడియని యెట్లు వర్ణింతు
పూని ముప్పొకల బోవనేర్తు
అదినేర్తు నిదినేర్తునని యేలచెప్పంగ
నేరుపులన్నియు నేననేర్తు

ఆ॥ ఒరులుగారునాకు నొరులకు నేనౌదు
నొంటివాడ జుట్టమొకడు లేడు
సిరియు తొల్లిగలదు చెప్పెద నాకెంకి
సుజనులందు తరచు జొచ్చియుందు.[25]

ఇది బలితో వామనుడు పలికిన పద్యము. ధ్వనిసమన్వితమై వామనుని సత్యతత్వమునిది తెలియజేయుచున్నది. దీనిని కల్పించి పోతన గొప్ప తత్వౌచిత్యమును పాటించినాడు.

12. స్వభావౌచిత్యము :- స్త్రీలకకృత్రిమమును, అసామాన్యమును నగు లావణ్యమువలె సూక్తులకు స్వభావౌచిత్యము చారుభూషణమై ప్రకాశించును.[26]

ఆ॥ కూడశారి పట్టుకొని వెరపించుచు
చిన్నివెన్నదొంగ చిక్కెననుచు
నలిగి కొట్టచేతులాడక పూబోడి
కరుణతోడ బాలుగట్ట దలచి.[27]

అల్లరిచేసెనను కోపముతో కృష్ణుని శిక్షింపవలెనని వెంటబడి పట్టుకొనిన యశోదాదేవి శిక్షింతునని వెరపించినదేకాని కొట్టుటకు చేతులాడక ఊరకున్నది. ప్రేమమూర్తియగు మాతృస్వభావమత్యంత సముచితముగా నిందు ప్రదర్శితమైనది.

13. విచారౌచిత్యము :- వేద్యతత్వావబోధముచే మనీషుల విద్యవలె ఉచితవిచారముచే సూక్తులు చారుత్వమును పొందును.[28]

శా॥ పుట్టంధుండవు పెద్దవాడవు మహాభోగంబులాలేవు నీ
పట్టిల్లం జెడిపోయె దుస్సహజరాభారంబు పైగప్పె నీ

చుట్టాలెల్లనుబోయి రాలుమగడున్ శోకంబునన్ మగ్నులై
కట్టా దాయలపంచ నుండదగునే కౌరవ్య వంశాగ్రణీ![29]

విదురుడు ధృతరాష్ట్రునితో పరిస్థితుల సాధకబాధకములన్నియు వివరించి తత్వ విచారణమును కావించినాడు. సదసద్వివేక సమన్వితమగు ఈ విచారణము సమయోచిత మైనది.

14. నామౌచిత్యము :- కర్మానురూపమైన నామము పురుషునకు వలెనే కావ్యమునకును సంవాద సుందరమగు గుణ దోషాభివ్యక్తిని సంపాదించును.[30]

ఉ॥ రక్షకులు లేనివారల
రక్షించెదననుచు చక్రిరాజై యుండన్ ...[31] విష్ణువునకు పర్యాయపద మగు చక్రి యనుదానినిచట ప్రయోగించుటచే తద్రక్షకశక్తి ప్రస్ఫుట ప్రకటనము నొందినది ఇది ఉచితస్థానపతితమగు నామము.

15. ఆశీర్వచనౌచిత్యము :- సంపూర్ణార్థమునిచ్చి మనీషులను సంతోష పెట్టిన కావ్యమున కుచితాశీస్సు రాజులకువలెనే అభ్యుదయావహము కాగలదు.[32]

ఉ॥ స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్త నిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వర విధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్[33]

స్వస్తి యను పదమునకు శుభమగుగాక అనునది సామాన్యార్థము. క్రియాకలాపాంతమున స్వస్తివాచకమును బలుకుట ప్రాచీనసంప్రదాయము కాలక్రమమున ఆ పదమునకు అంతము అను అర్థము వచ్చినది. ఆ పనికి స్వస్తి చెప్పెననగా మాని వేసెనని అరము వానికి స్వస్తి చెప్పెదననగా స్థానభ్రష్టుని చేసెదనని అర్థము. ఈ యర్థములో బలికి స్వస్తిచెప్పుటకు వచ్చిన, అనగా భ్రష్టుని చేయుటకు వచ్చిన వామనుని నోట ఆ పదముపయోగింపబడుట పరమసముచితము. తెనుగుదేశమున వ్యాపించిన ఈయర్థము పోతన రచన కధికతరౌచిత్యమును సంపాదించినది.

ఈ విధముగా సమస్తౌచిత్యమార్గములలో భాగవతమును సంభావింపవచ్చును. కాని, ఇక్కడ గమనింపవలసిన ఒక ప్రధానాంశముకలదు. ఏమనగా క్షేమేంద్రుడు

సూచించిన ఈ మార్గమంతయు ఏకైకశ్లోకపరిశీలనాత్మకముగా కన్పించును. అసలు ప్రాచీనాలంకార శాస్త్రముల పద్ధతియే అంతవరకు.

వివిధములగు గద్యపద్యరచనలలోనే కాక వివిధకథాభాగ నిర్మాణములో కూడ పోతన ఎంతో ఔచిత్యమును పాటించినట్లు కన్పించును ఉదాహరణకు గజేంద్ర మోక్షణ ఘట్టములో నిర్గుణస్తుతి గావించుట గొప్ప ఔచిత్యము. మూఢలుబ్ధకరీంద్ర యోనిలో నుదయించిన ఆ ప్రాణి సగుణ దేవతావిభేదము గుర్తింపలేక సర్వాత్మక మగు ఈశ్వరతత్వమును వేడుకొన్నది. దానికి సగుణోపాసన ఫలమ్ము లభించినది. అది విచిత్రము. అది అవసరముకాన లభించినదిలే అనుకొందమన్నను కేవల సగుణాత్మకమగు వైకుంఠవర్ణనము కావింపవలసిన పనిలేదు. కానీ పోతన బహువిధకల్పనము లచ్చట కావించినాడు. దీనిలో ఒక విశేషమున్నది. గజేంద్రుడు కావించిన నిర్గుణస్తుతి ఆవేదనా ప్రేరితమేకాని జ్ఞానశిక్షితము కాదు. జ్ఞానాత్మకమగు నాత్మ ప్రబోధనమునకు గాని నిర్వికల్ప పరబ్రహ్మ సాక్షాత్కారము కలుగదు. అదియే లభించిన గజేంద్రునిమకరినుండి రక్షించినను ఒకటే. రక్షింపకపోయినను నొకటే. గజేంద్రమోక్షణమిక్కడ జరిగి తీరవలసిన ఒక మూలకథాభాగము కావున నిర్గుణ స్తుతికి నిర్గుణఫలము కాక సగుణఫలమే ఉండితీరవలయును. అందుచేతనే సగుణ మగు వైకుంఠాదివర్ణనములను పోతన కల్పించినాడు. ఔచిత్య పరిణతమగు మనస్సు కాని ఇట్టి అద్భుత కల్పనలు కావింపలేదు.

ఇటులే అనేకములగు ఘట్టములలో పోతన రచనలోని ఔచిత్యవిశిష్టత గుర్తింపవచ్చును. కృష్ణుని బాల్యక్రీడలు, రాసక్రీడలు మొదలగు సందర్భములందు శృంగారరసవిషయమున పోతన కొంత ఔచిత్యమును నతిక్రమించినాడని కొందరు విద్వాంసులు విమర్శించుచున్నారు. ఇట్టివానిని దృష్టిలో పెట్టుకొనియే కాబోలును ఔచిత్యచర్చను మానవచరితకు పరిమితము చేయుటయే సమంజసమనియు, దివ్య శృంగారాదులలో దీనిప్రసక్తి రాకూడదనియు అకాదమీభాగవతపీఠికాకారులు వ్రాసియున్నారు.

మొత్తముమీద పదప్రయోగములో, వాక్యనిర్మాణములో వివిధకల్పనములలో ఔచిత్యవిశిష్టతను సంభావించియే పోతన రచించినాడని నిస్సందేహముగా పలుకవచ్చును.

# పోతన కవిత్వము - ఆలంకారిక ప్రయోగము

వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ.

వాగర్థముల సంబంధ మెంతసన్నిహితమైనదో మహాకవియగు కాళిదాసీ శ్లోకములో భావించినాడు. శివ శబ్దమయియనియు, శివుడర్థమయుడనియు ప్రాచీనార్యుల భావన. వీనిలో శబ్దముచ్చారణకు సంబంధించినది. అర్థము మనస్సునకు సంబంధించినది. వీనిసంబంధము సహజమా సాంకేతికమా అను అంశమును గూర్చి పూర్వకాలమునబహువిధములగు భావనలు వెలసినవి. సర్వమును ఈశ్వరసృష్టిగానే భావించిన విద్వాంసులు ప్రాథమికస్థితిలో శబ్దార్థములు రెండింటిని పరమేశ్వరసృష్టిగా ఊహించి శబ్దమెట్లు పరమేశ్వరోద్భూత సంకల్పమో అర్థమును అట్లే అయియుండును కావున ఈ శబ్దమున కీ అర్థమని సృష్టికర్తయే నిర్ణయించి యుండునని భావించిరి. కాని యీనైయాయికుల వాదమెక్కువకాలము నిలువలేదు. శాస్త్రీయమగు పద్ధతులతో వ్యాకరణమభివృద్ధి చెందుకొలదిలోకానుశీలన సమర్థులగు విద్వాంసులకు శబ్దార్థసంబంధమందలి అనిత్యత గోచరింప జొచ్చినది.

అసలొక శబ్దమువినగానే దాని అర్థమెట్లు స్ఫురించుచున్నదనునది ఒకవిచిత్రమగు సమస్య. పతంజలి దీనిని తన తీక్ష్ణదృష్టితో కుశాగ్రబుద్ధితో బహువిధముల పర్యాలోచన చేసినాడు. అంతకుముందును శబ్దశాస్త్రనిధులగు స్ఫోటాయనాది మహర్షులు దీనిని గురించి చర్చింపక పోలేదు. అతని తరువాతివారగు నాగేశభట్టాదులును దీనిని గూర్చి తర్కించినవారే.

స్త్రీ అను ఒకశబ్దమును పరిశీలించిన అందు సకార, తకార, రేఫ ఈకారములు శ్రవణగోచరములగును. వెంటనే సావయవమగు నొకమూర్తి గల పదార్థము, భావమును తెలియజేయు చేష్టాదివ్యాపారము, శరీరవర్ణము ఇవన్నియు మనకు వ్యక్తమగును. ఈ పదార్థములో ఈ వ్యాపారములో ఈ వర్ణములో ఏదిశబ్దము ? పదార్థము ద్రవ్యముకాని శబ్దముకాదు; అట్లే వ్యాపారము క్రియ. వర్ణము గుణము. అవి శబ్దము కాజాలవు. స్త్రీలందరియందును నుండు సమానధర్మ మొకటి కలదు అది ఆకృతి. అది తన్నితరమునుండి వ్యవచ్ఛేదించి చూపును. ఇదిజాతియు కావచ్చును. ఈయాకృతికాని,

జాతికాని శబ్దము కానేరవు. మరింక శబ్దమేది ? దేని నుచ్చరింపగనే పై వర్ణనము కలిగిన మూర్తిస్ఫురించునో, అర్థబోధకలుగునో అది శబ్దము.

ఈ శబ్దార్థములకు నియతసంబంధము లేదు.[1] 'సిద్ధేశబ్దార్థ సంబంధే' అను పాణినిసూత్రమును వ్యాఖ్యానించుచు శబ్దార్థసంబంధము లోకమునుండియే తెలియు చున్నదని పతంజలి వ్యాఖ్యానించెను [1]

భాషనిరంతరము మారుచుండును. ఈమార్పు శాబ్దికము, ఆర్థికముకూడ శబ్ద పరిణామము వాచికావయవ సన్నివేశమునకు సంబంధించినది. అర్థపరిణామము మానసిక ప్రవృత్తికి సంబంధించినవి.

మానవుని భావనాశక్తి ఒకశబ్దము ననేకార్థములలో ప్రయోగించునట్లు చేయుచున్నది తన ప్రియురాలిని చూచి భావావేశపరుడగు నొక యువకుడు 'నీ చూపులు నాకానందమును కలిగించుచున్న'వనుటకు 'నీచూపులు నాగుండెలలో వెన్నెలలు విరజిమ్ముచున్న'వనును. ఆ వాక్యమునకర్థమేమో వినువానికి వెంటనే స్ఫురించును. ఆ అర్థస్ఫురణము లాక్షణికార్థమును బట్టి ఏర్పడినదిగాని శబ్దార్థమును బట్టికాదు. మానవుడు తనలోని భావతీవ్రతను వెలువరించుటకు అంతకుముందున్న శబ్దసామగ్రి చాలనప్పుడు నూతనార్థ ప్రతిపాదకముగా ఉన్నపదములనే ప్రయోగించుట జరుగును. దీనినే లాక్షణికార్థమందురు' దీనివలననే పదములకునానార్థములు కలుగుట సంభవించుచున్నది ఈవిధానములో ప్రధానమైనది ఉత్ప్రేక్ష. అర్థసామ్యమే దీనిమూలము

ఇట్టి ఆలంకారిక రచనాప్రయోగమే జాతీయములకు దారితీయును ప్రతిభాషలోను ఇటువంటివి వందలు వేలు నుండుట సహజము. వ్యవహారములోపడి అరిగి పోవుటచే వీనిలో ఆలంకారిక లక్షణము గుర్తింపబడక పోవచ్చును. ఉదాహరణకు

1 తడవదు పరపురుషు గుణము.[2]

2. పారముముట్టంగ తెలియబలుకు.[3]

3. దిశలెల్లను కట్టువడియె.[4]

4. సంగీత ప్రసంగంబులన్ వాలాయంబు గరంగజేయుదుము.[5]

మొదలగు వాక్యములలోని ప్రయోగములు గమనింపవచ్చును.

నూతనార్థ ప్రతిపాదనకై సంయుక్త పదరూపత్వ లక్షణము కలిగిన తెలుగు భాష సమాసరచనా విధానమును విరివిగా ప్రయోగించుకొనుచున్నది. రెండు నామపద

ములు కూడి సమాసమగును. ధాత్వాదులకు ధాతువు కూడి శబ్దపల్లవ మగును. రెండింటను సమానముగా నూతనార్థమున్నది. ఇవియు నొకవిధముగా చూచిన జాతీయప్రయోగములే. కొన్ని శబ్దపల్లవ క్రియలలో ఈ లక్షణము కొట్టవచ్చినట్లు కనబడుచుండగా (పార్వతి కన్నెరింగి మొదలగునవి) కొన్నింట ఇది అంతగా కన్పించుటలేదు. (కూర్చుండు మొదలగునవి) ఇకపైవాని కన్నింటికంటెను విలక్షణమైన జాతీయప్రయోగములు కొన్నిగలవు. ఇవి ఏక పదములుకావు. పదబంధములతో గూడిన ప్రయోగములు (Phrasal Idioms) హాకెట్ పండితుడు 'A course of modern linguistics' అను గ్రంథమున దీనినిట్లు నిర్వచించెను.

A term of expression characteristic of a language whlch is not logically or grammatically explainable

ఆంధ్రమహాభాగవతములో పోతన ఇట్టి ఆలంకారిక ప్రయోగములను ఎట్లు ప్రయోగించెనో కొన్ని ఉదాహరణముల మూలమున ఈ క్రింద పరిశీలింప బడుచున్నది.

1. తచ్ఛిరమున్ ద్రొక్కి జలంబులాడు మిచటన్ శీతాంశు బింబాననా...[6]

భీముడు ద్రౌపదితో నిట్లనుటలో తానశ్వత్థామను చంపెదననియు, తనపగ దీర్చుకొనుటకై వాని తలద్రొక్కి స్నానము చేయుమనియు: అర్థము స్ఫురించుచున్నది పగదీర్చుకొనునపుడు పల్కు ఒక చక్కని జాతీయ ప్రయోగమిది. శత్రువు తలను పాదముతో త్రొక్కి జలములాడు మనుటలో ఆద్వేషములోని తీవ్రత ఆలంకారిక రచనమూలమున సువ్యక్తమైనది.

2. బంగారువంటి ఈ బ్రతికెడికాలము...[7]

బంగారము వలెనే కాలము కూడ చాల విలువైనదని ఇచ్చట అర్థము. ఏదైన విలువైన దానిని చెప్పు సందర్భమున బంగారముతో పోలిక చెప్పుట కలదు. బంగారము వంటివాడు. బంగారము వంటిపిల్ల ఇత్యాదులు.

బ్రహ్మ నారదునితో పలుకునపుడు నాపైడి మర్మమడిగితి వత్సా[8], అనుటలోను ఇట్టి విశేషార్థమే కలదు. నాదగ్గరి అమూల్యమగు విజ్ఞానము యొక్క రహస్యము లేక నా అసలు గుట్టడిగితివని ఇక్కడి భావము.

3. గుండెలు పగిలెడినిక నెందు జొత్తు[9] ...

కలి పరీక్షిత్తును జూచి పలికిన సందర్భమిది. భయము కలిగినప్పుడు గుండెలు కొట్టుకొనుట సహజముగా కలుగు శారీరక స్థితి. దీనినే అతిశయోక్తితో గుండెలు పగులుట అని జాతీయముగా వాడుదురు.

4. గిరి వ్రాసి మాయ నంగీకరించని భంగి[10]

ఇది శుకమహర్షివర్ణనము. అతడామె గీచిన గిరి దాటడని తెలుగునాట అనుచుందురు. అనగా ఆమె మాట నెట్టిపరిస్థితులలోను నతిక్రమింపడని అర్థము. వాడు గిరిగీసికొని కూర్చున్నాడనగా తనదగ్గరకెవ్వరిని చేరనిచ్చుటలేదని అర్థము. గిరిఅనగా ఒక వలయాకారపు రేఖ. గిరిగీసికొని ఉన్నవాడు ఆ గిరిలోని కితరులనెట్లు చేర నీయడో అట్లే శుకుడును మాయను తనలో ప్రవేశింప నీయడని భావము.

5. కాంచెపరమేష్ఠి కన్నుల కరవుదీర[11] ...

ఆహారము, నీరు మొదలగు నేవస్తువైనను దొరకకపోవుట కరవు. ఏ దృశ్యము నెంతసేపు చూచిన సంతోషము కలుగునో ఆ దృశ్యము నంతసేపు చూడలేక పోవుట కరవు. అట్లే ఏ మాటలు వినిన చెవులకానందము కలుగునో అవి వినుట కవకాశము లేకుండుట చెవులకు కరవు. వానికై నిరీక్షించుట ఆ కరవుబాధ ననుభవించుట ఆకలి గొన్నవాడు విందుభోజనము లభించునప్పుడు గబగబ భుజించుచున్నచో వాడు (కడుపునకు) కరువుదీర తినుచున్నాడందురు. అట్లే ఎంతో తీవ్రముగా ఆకాంక్షించిన విష్ణు దర్శనము కలుగుటచే దానిని బ్రహ్మ తనకన్నుల కరువుదీరునట్లు కాంచెను.

6. జుట్టన వ్రేల నెవ్వారికి జూపగవచ్చును పార్థివోత్తమా[12] ...

తప్పు చేసినవానిని నీవు తప్పు చేసితివని పదిమందియు వ్రేలు పెట్టి చూపించుట ఆ తప్పు నిరూపణమైనప్పుడు జరుగును నిజమున కొకడు మంచివాడైనచో వాడు మంచివాడని వేలుపెట్టి చూపించవచ్చును. కానీ లోకముననిది తప్పుచేసినవాని విషయముననే వ్యవహారసిద్ధమైనది. వ్రేలుపెట్టి చూపించుట ఒక అపకీర్తిచిహ్నముగా వ్యాప్తివచ్చినది. ఇక్కడ పాండవుల నెవ్వరును జట్టన వ్రేలితో (తర్జనితో) చూపలేరనగా వారు దోషరహితులని అర్థము. ఇట్లే నలుగురి నోళ్ళలోబడుట అనునది దూషణార్థమున వాడబడు మరియొక జాతీయము.

7. మునుకొని తండ్రియాజ్ఞ తలమోచి...[13]

బ్రహ్మ స్వాయంభవునితో పలికిన సందర్భములోనిదిది. ఎంతో పూజ్యమైన దానిని గాని తలదాల్పరు, తండ్రియాజ్ఞ అట్టిదికావున దానిని తప్పక పాటించుటకు పూనుకొని అను అర్థమున పై ప్రయోగము చేయబడినది. శిరసావహించుట అనునది కూడ ఇదే అర్థములో నున్న మరియొక జాతీయప్రయోగము.

8. ననునట సంస్థాపించెదనని పలికితివి.[14]

విష్ణువు హిరణ్యాక్షునితో పలికిన మాటలివి. ఇక్కడ సంస్థాపించుట అనగా పూడ్చిపెట్టుట అని అర్థము. శత్రువుతో నుద్రేకముగా మాటాడుసందర్భమున త్రవ్వి పాతివేయుదు ననుబలుకుబడి తెలుగునాట కలదు. 'అద్దెస నందఱ గ్రొచ్చి పాతుదున్' అను తిక్కనప్రయోగముకూడ నిట్టిదే. భాగవత ప్రయోగము దీనికి సంస్కృతీకరణముగా తోచును.

9. రా! ఇదె యమునిపురికి కాపురమరుగన్.[15]

ఇదియును పై సందర్భములోనిదే. చచ్చుట అనుదానికి హేళనాత్మకమగు భాషణమిది.

10. దండధరుబెల్చ డాకాలదన్ని ధ్రువుడు...[16]

ఇది మైత్రేయ విదుర సంభాషణములోనిది. ఇక్కడ డాకాలదన్ని అనగా జయించి లేక లెక్కింపక అని అర్థము. ధ్రువుడు మృత్యురహితుఁడయ్యెనని భావము.

11. కనుగ్రేవన్ మిణుగురులు చాల పొడమంగ.[17]

తీవ్రముగ కోపము వచ్చినపుడు కన్నులెఱ్ఱవడును. ఆ తీవ్రత్వము వ్యక్తము చేయుటకు కన్నుల నిప్పులురాల అందురు. ఆ అర్థమే ఇచ్చట మిణుగురులు పొడమగా అను ప్రయోగమున వ్యక్తము చేయబడినది. కనుగ్రేవ కెంపులొలుక[18] అను ప్రయోగముకూడ నిట్టిదే.

12. విలోకనజాలంబుల గగనంబున పొగలెగయ[19]

నేత్రమున అగ్నులెగసినట్లు వర్ణించుట రౌద్రరసమున సహజము. హిరణ్యకశిపుని మరియొకచోట వేడి చూపులమింట మంటలెగయ అని పోతన వర్ణించెను. కానీ

ఇక్కడ పొగలెగసెనని పలుకబడినది. 'యత్ర ధూమ స్తత్ర వహ్నిః' అన్నట్లు నిప్పు లేక పొగరాజదుగదా! కనుక చూపులలో మంటలురేగ ఆమంటలనుండి ఎగసిన పొగలు ఆకాశమునంటినవని భావింపవలెను.

13. మకరితోడ బోరు మాతంగవిభుని నొక్కరుని డించిపోవ కాళ్ళు రాక[20]

ఇది గజేంద్రమోక్షణ కథలోనిది. ఒకరిని విడిచివెళ్ళిపోవుటకు మనస్సున కిష్టములేనపుడు మనస్సంకల్పము ననుసరించియే శరీరమూజ్ఞప్తి నొందుచుండునుగాన నిజమునకు కాళ్ళు కదలవు. ఆ ఇష్టములేకపోవుటనే 'వెళ్ళటానికి కాళ్ళురావటంలేదు' అందురు.దాని శారీరకవిక్రియను వర్ణించుట ఒకరచనా విశేషము. ఇది అట్టివానిలోనొకటి.

14. వాడు దిక్కునాకు[21]

ఇది గజేంద్రస్తుతి లోనిది ఇక్కడ దిక్కనగా శరణమని అర్థము. లోకమున నిది వివిధరీతుల వ్యవహారమున ప్రయుక్తమగుచున్నది. వానికి దిక్కుతోచుటలేదు. అనగా ఏమిచేయవలెనో స్ఫురించుటలేదని అర్థము. ఏ దిశకు పోవలెనో అనుఅర్థము ఏమిచేయవలెనో అనునదిగా పరిణమించినది. ఆమె దిక్కులేనిపక్షి. అనగా ఆమె నాదుకొనువారు, రక్షించువారు లేరని అర్థము. అట్లే దిక్కున్నచోట చెప్పుకో మొద లగుచోట్ల దిక్కనకు శరణమనియే అర్థము. తనకిష్టము లేనిదైనను తప్పనిసరిగా ఒకపని చేయవలసివచ్చినప్పుడు ఈ దిక్కుమాలినపని నా నెత్తిన పడింది అనుట కలదు. ఇట్లు విసుగులో, కోపములో, ఆవేదనలో, భిన్నసమయములలోనిది వాడబడు చున్నది. ఇక్కడ ఆర్తిలో దేవుడే నాకు శరణ్యమను భావమున ఉపయోగింపబడినది.

15. తిరుగన్నేరదు నాదుజిహ్వవినుమా ధీవర్య వేయేటికిన్[22]

ఇది బలిచక్రవర్తి మాటలలోనిది. ఇచ్చిన మాటను నేను తప్పను పలికిన దానికి వ్యతిరేకముగా ఆచరింపను అనుటకు నా నాలుకతిరుగదు అనుట ఒక జాతీయోక్తి.

16. ధర్మకీర్తులన్ బొగ్గులుసేసి.[23]

బృహస్పతి తారతో పలికిన సందర్భమిది. బొగ్గులు కట్టెలుకాలగా మిగిలిన నల్లని పదార్థము. మన సంప్రదాయములో తెలుపుమంచికిని, నలుపు చెడ్డకునుగురు.

బొగ్గులు చేసి అనగా పాడుచేసి అని ఇక్కడి అర్థము. అందును అది తగులబెట్టిన పిదప మిగులునదగుటచే, తగులబెట్టి పాడుచేసి అనికూడ భావింపవచ్చును.

17. నాతో వచ్చేదవా అని అన్నాడిచ్చిరుతడు[24]...

కృష్ణుని దుడుకుచేష్టలు గోపికలు యశోదతో చెప్పు సందర్భమిది. ఇచ్చట వచ్చు అనుక్రియ సంభోగాభిలాషను సూచించుట అను విశేషార్థమును కలిగియున్నది. పోవుధాతువు కూడ ఇట్లే లోకమున వాడుకలోకలదు. 'దానితో పోయినాడు' అన్నట్లు ఈ వచ్చుపోవు క్రియలు సంస్కృతమున అత్యంత ప్రాచీనకాలము నుండియే ఈ అర్థమున వాడబడుచున్నవి వేదములోని 'నపరదారాన్‌గచ్ఛేత్' అను వాక్యమిందుకొక నిదర్శనము.

ఈ విధముగా భాగవతములో ఎన్నోవందలకొలది ఆలంకారిక ప్రయోగములు లభించును. భాషావికాసమునకు బహూర్థ ప్రయోగమెపుడును చిహ్నమే. పదములనాలంకారిక దృష్టితో ప్రయోగించుట, లాక్షణికార్థములో వాని అభివృద్ధి – ఆభాషీయుల మానసిక విస్తృతికి చిహ్నము భాగవతములోనే తద్విధమగు భావ ప్రసారవైశిష్ట్యమును రచనారూపమున నందించి పోతన ఆంధ్రసారస్వతసంపదున్నతికి, పటుతర భావప్రకటన సామర్థ్యమునకు వన్నెలు తీర్చినాడు.

# పోతనకవిత్వము - మరికొన్ని విశేషములు

భాగవతము వంటి భక్తిరసప్రధాన గ్రంథమును భక్తి గౌరవములతో నాంధ్రీకరించిన పోతన కవిత్వములో నెన్నో విశేషములు కలవు. వాని నన్నింటిని ప్రత్యేకముగా సమగ్రముగా వర్ణించుట అసాధ్యము. ఇంతకు ముందరి వ్యాసములలో ప్రధాన విషయములు కొన్ని వివరింప బడినవి. ఈ వ్యాసములో మరికొన్ని విశేషములు క్లుప్తముగా ప్రస్తావింప బడుచున్నవి.

భాషావిశిష్టత :- గ్రంథారంభములోనే తన భాషావిధానమును గూర్చి పోతన ఇట్లు పల్కినాడు.

కం॥ కొందరికి తెనుగు గుణమగు
కొందరికిని సంస్కృతంబు గుణమగు రెండున్
గొందరికి గుణములగు నే
నందరి మెప్పింతు కృతుల నయ్యైయెడలన్.[1]

ఇందు కనుగుణముగానే ఆయన రచనము గోచరించును. సంస్కృత పదబద్ధమగు పద్యము వ్రాసినను, అచ్చతెనుగుతో నొప్పన పద్యము వ్రాసినను, రెంటిని సమపాళముగా మేళవించిన రచనము కావించినను పోతన ప్రధానముగా దృష్టిలో పెట్టుకొనినది నిరాఘాటగమనము కలిగిన ధారాశుద్ధి. ఆలంకారిక భాషణములలో చెప్పిన ఆయన శైలి ద్రాక్షాపాక సమన్వితమనియు, వైదర్భీరీతి సుందరమనియు, కైశికీవృత్తి మనోహరమనియు పలుకవచ్చును. రసోచితముగా నాయా స్థలములందు ఇతరరీతి వృత్తిపాకములు దర్శితమైనను సామాన్యముగా అత్యంత సరళముగా నుండుటయే పోతన శైలీవిశిష్టత. చూడుడు.

ఉ॥ అమ్మలగన్నయమ్మ ముగురమ్మలమూలపుటమ్మ చాలపె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడిపుచ్చినయమ్మ తన్నులో
నమ్మినవేల్పుటమ్మల మనమ్ములనుండెడియమ్మ దుర్గమా
యమ్మ కృపాబ్ధియిచ్చుత మహత్వకవిత్వ పటుత్వసంపదల్.[2]

పోతన సంస్కృత ప్రియత్వ మధికమైనది. ఆ అమర భాషాపద ప్రయోగ బాహుళ్యముచే ఆయన కవిత్వమునకొక అఖండమగు నాదమాధుర్యము లభించినది. అదియునుగాక పాండిత్య ప్రదర్శనకై ఏ మారుమూలపదములనో తెచ్చి ప్రయోగించెడి అలవాటాయన కెన్నడును లేదు. జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడ జొన్ప అను తిక్కనామాత్యుని వాక్కును ప్రమాణముగా ఆయన భావించి రచించినాడు.

కం॥ భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరిగుణోపచిత భాషణముల్ .[3]

ఈ పద్యములో విభక్తి ప్రత్యయములు తప్ప మిగిలినదంతయు సంస్కృతము. కానీ అందలి సారళ్యముచేత అర్థముగాని సంస్కృతశ్లోకము దేనినో చదువుచున్నట్లనిపింపదు ఇటులేకాక పోతన కేవల సంస్కృతమునే సప్రత్యయముగా తెనుగు పద్యములలో నిముడ్చుటయు కలదు బలి వామనునకు దానమునిచ్చుచు 'విప్రాయప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వేదప్రామాణ్యవిదే త్రిపాద ధరణీం దాస్యామి'[4] అని సంస్కృతమున పలికినాడు. బలిభార్యయగు వింధ్యావళియు 'పతిభిక్షాం మమదేహి కోమలమతే పద్మాపతే'[5] అని ప్రార్థించినది. గజేంద్రుడును 'పాహిపాహి'[6] యనియే కుయ్యివెట్టినాడు. రుద్రగీతాదులలోని స్తుతులు సంపూర్ణ సంస్కృతమయములే. ఇట్టివి ఆ భాషయందు పోతనకుగల ప్రీతినిమాత్రమే కాక అవి ఆస్థానమున కుచితమై యుండుటనుగూడ సూచించును. ప్రజాజీవనములో కొన్ని సంస్కృతపదములును, వాక్యములును కలిసిపోయినవి. వానినట్లే గ్రహించుట సముచితము. 'నమశ్శివాయ, నమోనారాయణాయ' వంటివి అటులు పలికిననే శక్తి మంతములుగా నుండును. అందుకే వేల్పులు నమోనారాయణయేతి నిస్వనులై మ్రొక్కిరి-[7] ఇత్యాదిగా పోతన రచించినాడు.

తెనుగుదనమనిన అచ్చతెనుగులో రచించుటకాదు. కఠిన సంస్కృతభాష అర్థము చేసికొనుట ఎంతకష్టమో అచ్చతెనుగు అంతేకష్టము. అచ్చతెనుగు కావ్యములు చదివిన అవి ఎంతసహజమగు భాషలో నుండునో సహృదయులు గుర్తింప

గలరు. అవి పాండిత్య ప్రదర్శనకేగాని హృదయస్పందనములకు పనికిరావు. పోతన తెనుగుదన మట్టిదికాదు. ఈక్రింది సుతిమెత్తని పద్యములు చూడుడు.

కం॥ తొలుకారు మెరుగుకైవడి
తళతళమని మేనుమెరయ ధగధగయనుచున్
కలువల నీనెడు చూపుల
చెలువంబుల మొదలిటెంకి సిరివుట్టెనృపా ![8]

సీ॥ పాలమున్నీటి లోపలి మీఁదిమీఁగడ
మిసిమిజిడ్డున జేసి మేనువడసి
క్రొక్కారు మెరుగుల కొనలతళుక్కుల
మేనుచేగల నిగ్గు మెరుగుచేసి
నాడునాటికి ప్రోది నవకంపుఁదీఁగల
నునుబోదె నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలకుల బొద్దున
పొలసిన వలపుల ప్రోదివెట్టి

తే॥ పసిడి చంపకదామంబు బాగుకూర్చి
వాలు క్రొన్నెల చెలువున వాడిదీర్చి
జాణతనమున చేతుల జడ్డువిడిచి
నలువ యీకొమ్మ నొగిఁచేసినాఁడు నేడు.[9]

ఒక్క చంపకదామమను పదము దొర్లినదేకాని పై పద్యమంతయు చక్కని తెనుగులో నడచినది. భాగవతములో అచ్చపువచ్చి తేనెలు కురిపించు నిట్టిపద్యము లచ్చటచ్చట తగులుచునే ఉండును.

పాండిత్యము :- స్కంధాంతగద్యలలో పరమేశ్వరకరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య అనితనను గురించి పోతన చెప్పు కొన్నాడు. ఇందలి సహజపాండిత్య అనుమాటను బట్టి కాబోలు పోతన ఏదో కమ్మగా కవిత్వము చెప్పగలవాడే కాని గురుకుల శిక్షగల పండితుడు గాడను ఒక అపప్రథలోకములో బయలుదేరినది. ఆయనభాగవతము ననువదించిన వద్ధతిని

శ్రద్ధగా పరిశీలించిన వారెవ్వరును ఆమాట అనజాలరు. కేవల శాస్త్రచర్చలను కావించి విద్వన్మూర్ధన్యుడు కావలెననుకొను వ్యక్తికి అవసరమగు పాండిత్యము వేరు, కవిత్వము చెప్పుటకు కావలసిన పాండిత్యము వేరు మహాకవియగు వ్యక్తి తప్పక శాస్త్రపండితుడై ఉండవలసినమాట వాస్తవమేకాని కేవలమదియే కవిత్వమునకు సహాయకారి కాజాలదు ఆయాశాస్త్రములలోని ప్రజ్ఞచే కలుగు సంస్కార బలము మాత్రమవసరము. మహాకవి యగు పోతనకు సర్వశాస్త్రముల స్థూలపరిచయము కల దనుట నిర్వివాదము.

భాగవతములో పోతన వివిధ శాస్త్రపరిచయము సూచించు ఘట్టములు చాల గలవు. గంగావతరణ వర్ణన మట్టి దానిలోనొకటి.[10] అందలి వాక్యభాగములు కొన్ని చూడుడు.

1. వృత్తశాస్త్రంబు విధంబున వడగలిగి సదా గురులఘు వాక్యచ్ఛటా పరిగణితంబై.
2. గణితశాస్త్రంబు కొలందిని ఘనఘనమూల వర్గమూల సంకలిత భిన్నమిశ్ర ప్రకీర్ణఖాత భీష్మంబై.
3. గీతశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతను ఘననానా శబ్దంబై
4. శబ్దశాస్త్రంబు మర్యాద నచ్చువడి హల్లుకలిగి
5. మహాభాష్య రూపావతార వృత్తి వృద్ధిగుణసమర్థంబై
6. అర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజన ప్రమాణ దృష్టాంతరంబై.
7. శేషవ్యాపారంబు కరణి సుస్థిరోద్ధరణ తత్పరంబై
8. పరబ్రహ్మంబు గరిమ నతిక్రాంతానేక నిగమంబై
9. నిగమంబు నడవడి బ్రహ్మవర్ణ పదక్రమ సంగ్రహంబై
10. గ్రహశాస్త్రంబు పరిపాటిని కర్కాట మీనమిథున మకరరాశి సుందరంబై
11. అధికమతి శాస్త్రవాదంబు సొంపున నపారసరస్వతీ విజయ విభ్రమంబై
12. వర్గగుణితంబు తెరకువను బహుదీర్ఘ బిందువిసర్గంబై
13. సర్గబంధ కావ్యంబు విన్ననువున గంభీరభావ మధురంబై
14. నయశాస్త్రంబు మార్గంబున సామభేదమాయో పాయ చతురంబై ....—....

ఇత్యాది.

భాషకు సంబంధించినంతవరకు వ్యాకరణశాస్త్ర పాండిత్యమును, ఇతరశాస్త్ర పరిచయానుగత సంస్కారమును ఆవసరము పోతనకారెండును సముచితముగా కల వనుట పై వాక్యములచే సునిరూపితమగుచున్నది.

పోతనకు తరువాత తెనుగు భాషకు వ్యాకరణము నిర్మించుటకు ప్రయత్నించిన కొందరు లాక్షణికులు పోతన దుష్ప్రయోగములు చేసినాడని ఆక్షేపించిరి. ఆయన ప్రయోగించిన రేఫఱకారములను గూర్చిన విశేషములింతకు ముందే ప్రస్తావింపబడినవి. కాగా క్త్వార్థ కేకార సంధులు, ద్రుతద్విత్వము, కుషష్ఠికిముందు నగాగము లేమి, మిశ్రసమాసములు, మొదలగు వ్యాకరణ సమ్మతములుగాని ప్రయోగములు భాగవతములో కలవు.[11] ఇట్టి ప్రయోగము లితరమార్గకవులలోను నున్నవి. వీనిని సాధించు ప్రక్రియ వ్యాకరణములలో కనబడకపోవుట వాని అసంపూర్ణత్వమునే సూచించునుగాని ఈ కవులకుదోషము నాపాదింపజాలవు. భాషాపరిణామములో వ్యాకరణరూపములు మారుచుండుటయు, శిష్టవ్యవహారములో ప్రవేశించినట్టి రూపములను కవులు పరిగ్రహించుటయు సర్వత్ర కనబడు సహజసంప్రదాయము.

ఇక పోతన సహజపాండిత్యుడను శబ్దమున కర్థముపేరు. లోకమున ఒక కవిని చూచి వీనికి కవిత్వము దానియంతటదియే వచ్చినదని అందురు. అట్లు వచ్చినదనగా శ్రమలేకుండ ఆ కళాసంబంధమగు రహస్యములు ఒకసారి విన్నంతమాత్రమున ఎప్పుడో అదివరకే తెలిసికొన్నవానివలె ప్రకాశించినవని అర్థము. పూర్వజన్మానుగతమగు వాసనారూప సంస్కారముచే నిమిత్తమాత్రముగా నభ్యసించిన విద్యలు స్వతస్సిద్ధముగా ప్రశస్తినొందును. సహజకవియనగా నెట్టిదో, సహజపండితుడనగాను నట్టిదే. అభ్యాసమువలనకంటె సంస్కారవశమున పాండిత్యము లభించిన వాడగుటచే పోతన తననుగూర్చి సహజపాండిత్య విశేషమును చెప్పుకొనియుండును.

ధ్వనిచాతుర్యము :- భాగవతములో కొన్ని సందర్భములందు పోతన రచించిన పద్యములు చదువుచున్నపుడు వాచ్యమగు నర్థముకాక మరియొక అర్థము స్ఫురించుచుండును. అదియే ధ్వని. రుక్మి కృష్ణుని నిందించు సందర్భమున పలికిన 'మా సరివాడవా మాపాపగొనిపోవ'[12] అను పద్యములో ఒకప్రక్క వాచ్యమగు నింద వ్యక్తమగుచుండగా రెండవ అర్థముగా కృష్ణుని నిర్గుణత్వమును, దేవేశ్వరత్వమును స్ఫురించును. అట్లే చాణూరుడు కృష్ణుని దూషించునప్పుడును 'చలమున ననుడాసి జలరాశి జొరరాదు'[13] అను పద్యములోను కృష్ణుని అవతార విశేషములు ధ్వనించుచున్నవి. ఇట్టి పద్యములను జూపి అకాడమీ పీఠికాకర్తలీ క్రిందివాక్యములు వ్రాసినారు.[14]

"భాగవతమున కొన్ని ఘట్టములందు దురహంకారులును గర్వితచిత్తులును నైన కృష్ణ విరోధులు కొందరు శ్రీకృష్ణుని నిందించు ఘట్టములు వచ్చుచుండును. అట్టి

వానిని గూడ భక్తిశిఖామణియగు పోతనయే రచింపవలసి యుండుటచే నాతడట్టిపట్టుల నద్భుతమైన వ్యంగ్యవిధానము నవలంబించి తనహృదయమున కూరట కలిగించు కొనెను. అట్టి ఘట్టములందలి పద్యములను పఠించుచో నందు స్తుతియు, నిందయు రెండును సమానాంతరముగా ప్రవహించుచున్నట్లు గోచరించును అందు నిందాపక్షము దుర్జనులైనపాత్రలది. స్తుతిపక్షము కవియు భక్తుడునైన పోతనది."

పై వాక్యములలోని భావములలో కొంత పొరపాటున్నట్లు కన్పించును. భాగవతము వంటి పురాణములో భగవద్విరోధులగు పాత్రలు భగవద్దూషణము చేయుట సహజము. వానిని రచించుట కేకవియును బాధపడవలసిన పనిలేదు. ఆ విధముగా బాధపడి అందుకుగాను ఆ పాత్ర కృతదూషణములలో శ్లేషలను ధ్వనులను చొప్పించుట కెవ్వరును ప్రయత్నింపలేదు. అట్లు ప్రయత్నించుట కవితా మార్గమునకు సహజము కాదు.

భాగవతములో పోతన వ్రాసిన భాగములలోనే విష్ణు దూషణాత్మకములగు ఘట్టములెన్నో కలవు. పై ఉదాహరణములలో తప్ప వానియందెచ్చటను పోతన నిందలలో ధ్వనిగా స్తుతులకు చొప్పింపలేదు ఈ వ్యంగ్య రాహిత్యమునకెన్నైన ఉదాహరణములు కావించవచ్చును.[15]

కృష్ణుని విరోధి పాత్రలచే నిందింప జేయుట తన హృదయమునకు నిజముగా నొప్పియే కలిగించినచో పోతన తన గ్రంథములోని సమస్త దూషణముల లోను అట్టివ్యంగ్యమునే చొప్పించి యుండవలెను. కానీ అట్లు చేయులేదు వైర భక్తి ఒకగొప్ప విశేషమని ప్రత్యేకాభినివేశముతో పలికిన పోతన ఆ దృష్టితో నెన్నడును వ్రాయజాలడు.

కేవలము నిందలలో మాత్రమే కాక యశోదాదేవి మొదలగు పాత్రలు పలికిన వాక్యములలో కూడ ఇట్టి వ్యంగ్య వైభవము భాసితమై యున్నది ఇట్టి చోట్ల బాధా ప్రసక్తియే లేదుకదా! కావున విరోధి పాత్రలచే కృష్ణనింద చేయించుట తన హృదయమునకు నొప్పికలుగు విషయ మగుటచే దానికూరట కలిగించుకొనుటకై అందు వ్యంగ్యము ప్రవేశ పెట్టెననుట సరికాదు మరి అట్లు రచించుటకు కారణము చమత్కార రచనాభిలాషయే! వ్యంగ్యస్ఫురణ మొక చాతుర్య విశేషము. కావ్యములో అటనట నట్టివుండుట కవిసామర్థ్యమునకు నిదర్శనము కాగలవు. అట్టి ప్రజ్ఞా విశేషమును చూపుటకై పోతన పై పద్యములను రచించి యుండునని గ్రహింపవలెనే కాని వేరుకాదు.

కృష్ణవిరోధులచే కాక సాక్షాత్తు కృష్ణునిచే పలుకబడిన వాక్యములలోను[16] వామనుని సంభాషణములలోను[17] ఈ ధ్వని ప్రయోగము గోచరించుచున్నది. బలి చక్రవర్తి పలికిన మాటలలోను నొకచోట నిట్టిధ్వని స్ఫురణము కలదు.[18] వామనుడు విష్ణువని యాతడెరిగియుండుటచే అందలి ధ్వని రసోచితము. ఇక భగవంతుడు పలికిన వానిలోని ధ్వని సార్థకమని వేరుగా చెప్పవలసిన పనిలేదు. రుక్మి చాణూరాది పాత్రలు కృష్ణమహిమ లెరిగిన వారుకారు వారినోట వెలువడిన వాక్యములలో రసదృష్టితో పరిశీలించినయెడల వ్యంగ్యమునకెట్టి అవశ్యకతయును కలుగదు. అట్టి సందర్భములలో పోతన రచనను కేవల చాతుర్యసూచకముగా మాత్రమే భావింపవలెను.

ఛందోవిశేషములు :- బ్రహ్మానందమభిలషించు యోగి హృదయమెట్లు శ్రుతిలయాత్మకమై యుండునో రసానందము నందించు కవితా హృదయమును అట్లే ఛందఆత్మకమై యుండును. ఉత్తమ కవిత్వమెప్పుడును ఛందస్సమన్వితమయియే ఉండుట సర్వభాషాసాహిత్యములకును సామాన్య సూత్రము.

సంస్కృత సాహిత్యములోని శ్లోకములకు విరామములును, తెలుగు సాహిత్యములోని పద్యములకు యతిప్రాసలును నియమములుగా నున్నవి యతులయందలి అక్షరసామ్యము చేతను, ప్రాసలయందలి అక్షరపునరావృత్తిచేతను తెనుగు పద్యముల కనన్యమగు నలంకారము చేకూరినదని సారస్వతేయులు భావింతురు. ఛందోగమనమునకు ప్రధానమగు గురు లఘువుల ఏర్పాటునకు యతిప్రాసల వలన కలుగు మార్పేమియును లేదు. ఛందస్సుగమనమునకు సంబంధించినది యతిప్రాసలాగమనగత శబ్దసౌందర్యమునకు సంబంధించినవి. సామాన్యముగా యతిప్రాసవిశేషములను ఛందశ్శాస్త్రములోని భాగములుగా భావించు నాచారమున్నది కావున గురు లఘు గమనములోని భంగమునేకాక యతిప్రాసల నియమ భంగమునుకూడ ఛందోభంగమనెడు అలవాటు కన్పట్టుచున్నది.

ఒక్కొక్క ఛంద మొక్కొక్క రసమున కనుగుణమను విషయము ప్రాచీనాలంకారికులలో బహువిధముల తర్కింపబడినది. క్షేమేంద్రుని సువృత్తతిలకములో దీనిని గూర్చిన విస్తరమగు చర్చ గోచరించును. ఈ విషయమున శాస్త్రకారులు కొన్ని నియమములు నిర్దేశించిరి కాని ఆచరణలో కవులు వానినంతగా పాటించినట్లు కన్పింపదు. ఐనను సమయానుగుణముగా అధికరసోత్పాదనకై కవులు తమకిష్టము వచ్చినట్లు ఛందస్సును మార్చుట కావ్యపరిశీలనపై గోచరించును.

సారస్వతమును ఛందోదృష్టితో పరిశీలించినయెడల ప్రసిద్ధులగు కవులలో చాలమంది ఒక్కొక్క ఛందమును ప్రత్యేకాభినివేశముతో ప్రయోగించినట్లు కాన్పించును. సంస్కృతమున మందాక్రాంతావృత్తము కాళిదాసును, శిఖరిణీ వృత్తము భవభూతిని, స్రగ్ధర మయూరుని స్ఫురింపజేయుట సుప్రఖ్యాతము. తెనుగు కవులలోను నన్నయ మనోహరమగు వృత్తరచనకు ప్రసిద్ధి అదేవిధముగా తిక్కన కందమునకును శ్రీనాథుడు సీసమునకును పేరుగాంచినారు మిగిలిన ఛందములను వారు సమర్థతతో నిర్వహించినను ఒకదానిపైగల ప్రత్యేకాభిమానము వారికాపేరు తెచ్చినది. అంతేకాక వారి చేతులలోనవి పరిణతచెంది వింతనడకలు నేర్చినవి. ఏ కవికైనను ఛందః ప్రసిద్ధి దానినధికసంఖ్యలో ప్రయోగించుటపై కాక దానిఒడివడిని తీర్చుట చేతనే కలుగును.

మందారమకరంద మాధుర్యమునుగ్రోలు, కమలాక్షునర్చించు కరములుకరములు, కంజాక్షునకుగాని కాయంబు కాయమే మొదలుగాగల పోతన సీసపద్యములకున్న ప్రసిద్ధి జనసముదాయములో శ్రీనాథుని సీసపద్యములకు లేకపోయినను వానినడకను తీర్చిదిద్దిన విశిష్టునిగా విద్వాంసులు శ్రీనాథునకే గౌరవస్థానము నొసగెదరు.

పోతనకు వృత్తరచయితగా పండితలోకమున ప్రఖ్యాతి కలదు. ఆయనకత్యంత ప్రియమగు అంత్యప్రాసాలంకారము వానిలో నెక్కువగా నిముడుట కవకాశముండుట అందుకొక కారణమై యుండవచ్చును. ఉజ్జ్వలమగు ఆయన వృత్తరచనకు భాగవతమున అడుగడుగునను ఉదాహరణములు కాంచవచ్చును.

గురులఘువులను ప్రత్యేక నియమములతో వాడి వింతనడకలు పుట్టించుట, సర్వలఘుకందములు రచించుట, ద్విత్రిచతురాది ప్రాసలచే గమన వైలక్షణ్యమును శాబ్దిక సౌందర్యమును ప్రదర్శించుట మొదలగు ఛందస్సంబంధమగు విశిష్టాంశములు పోతన రచనలో తరచుగా కాంచవచ్చును.[19]

షష్ఠ్యంతములను ఉత్పలమాలలో రచించుట పోతన కావించిన ఒక విశిష్ట నిర్మాణము. నన్నెచోడునితో ప్రారంభమైన ఈ షష్ఠ్యంతరచనము సామాన్యముగా కందపద్యములలోనే రచించుట అప్పటివరకు సంప్రదాయము.

ఆశ్వాసాంత పద్యములలో మాలినీ వృత్తము నొకదానిని తప్పక ఉంచు నియమమును భారతమున తిక్కన పాటించినాడు. పోతనవ్రాసిన స్కంధాంత పద్యములన్నింటిలోను ఒకమాలినీవృత్తము కన్పించుట తిక్కనయందలి గౌరవముచేతనే

యైయుండును. భాగవతములోని ఇతర రచయితలగు గంగన సింగన నారయలలో నారయ పోతన పద్యములనే స్కంధాంతమున గ్రహించినాడనుట ఇంతకుముందే గమనింపబడినది. గంగన, సింగనలు మాలినీవృత్త నియమము ననుసరింపలేదు. ఇంచుమించు తెలుగుకవులందరిలోను ఆశ్వాసాంతములలో నొకకందమునుంచుట సర్వసాధారణము. అది భాగవత కవులలోను గోచరించును

మహాకావ్యములో వృత్తవైవిధ్యము సహజము ఆనాటి ఇతర కవులవలెనే మానినీ కవిరాజ విరాజిత మత్తకోకిలాది వృత్తములను పోతన అత్యంతనిపుణముగా ప్రయోగించినాడు. ఏ ఛందస్సు గ్రహించినను అలంకార సమన్వితముగా శ్రవణపేయముగా రచించుట ఆయనలోని ప్రత్యేకమగు సామర్థ్యము.

అలంకార విశేషములు :- పోతన అలంకారప్రియుడు శబ్దాలంకారములును, అర్థాలంకారములును అడుగడుగున విరివిగా ఆయన రచనలో గోచరించును. ఆయన బుద్ధి పురాణ రచనమును స్వీకరించినను శైలి ప్రబంధపద్ధతినే అనుసరించినది. పురాణ కవులంతగా ప్రేమింపని శబ్దాలంకారము పోతన రచనలో మిక్కిలి ప్రాధాన్యము వహించుట విచిత్రము. కమలాక్షునర్చించు కరములుకరములువంటి పద్యములలో లాటానుప్రాసలు[20] కాంతాకుచంబునుంబోలె సువృత్తంబై, వృత్తజాలంబునుంబోలె సదాగురులఘునియమాభిరామంబై, రామచంద్రుని తేజంబునుంబోలె....[21] మొదలగుచోట్ల ముక్తపదగ్రస్తములును ఇటులే ఇతర శబ్దాలంకారములును భాగవతమున ఎన్నేని కాంచవచ్చును. కానీ ఆయన శబ్దాలంకారములలో అంత్యప్రాస అత్యంత ప్రాధాన్యము వహించినది. అది ఆయన కవిత్వములోని ఒక ప్రధాన లక్షణముగా ప్రసిద్ధిపొందినది. గ్రంథమందంతట అడుగడుగునను ఈ యలంకారమత్యంత సౌందర్యవంతముగా నిల్చి హృదయము లాకర్షించును. చూడుడు.

మ॥ వినుపీథిన్ జనుదేర గాంచి రమరుల్ విష్ణున్ సురారాతిజీ
వనసంపత్తి నిరాకరిష్ణు కరుణావర్ధిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృంద ప్రాభవాలంకరి
ష్ణు నవోత్థోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్[22]

శా॥ పూరించెన్ హరి పాంచజన్యము కృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీకృతమహాభూత ప్రపంచైతన్యమున్

సాగోదార సితప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్న దైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్[23]

ఇత్యాదులు,[24] వీనిలోని వివిధ విశేషములను రాయదుర్గం నరసయ్యశాస్త్రిగారు తమ పీఠికలో విపులముగా వివరించి యున్నారు.[25]

ఇక అర్థాలంకారములు ఉపమ, ఉత్ప్రేక్షలవంటివి వివిధస్కంధములలో ఉదాత్తసుందరముగా ప్రయోగింపబడినవి. పోతనవంటి మహాకవి వ్రాసిన వేలపద్యములలో పనివట్టి పూనుకొన్నచో అలంకారభేదములన్నింటికిని ఉదాహరణములు లభింపకపోవు. ఆ ప్రయత్నమటుంచి ఉపమాదులు కొన్నింటి విశిష్టత మాత్ర మిచ్చుట సంభావితము.

ఉపమ సర్వాలంకార బీజభూతమని వామన మతము. బ్రహ్మజ్ఞానము వలన సర్వజ్ఞానము కలిగినట్లు, ఉపమాజ్ఞానము వలన సమస్తాలంకారజ్ఞానమును లభించునని విద్వాంసుల విశ్వాసము. భాగవతము మొత్తముమీద పోతన ఇంచుమించు మాటికి పైగా అమూలకములగు నుపమానములను ప్రయోగించినాడు. తన జీవితానుభవమును బట్టియు, గ్రంథపరిచయమును బట్టియు; ప్రకృతినుండి, మానవజీవితమునుండి అనేక విధములగు వస్తువుల నుపమానములుగా ఆయన పరిగ్రహించెను.

గ్రంథారంభమున శ్రీరాముని వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలు విల్లు మూపున బరగువాడు, నీలనగాగ్రసన్నిహిత భానునిభంగి ఘనకిరీటము తల గలుగువాడు అని చక్కని ఉపమానములతో పోతన తీర్చినాడు.[26] ఆ రాముడాయన కన్నులకట్లే సాక్షాత్కరించెను.

గజేంద్రమోక్షణ కథలో కరిమకరుల అవస్థలు నిరూపించుటకు పోతన ప్రయోగించిన ఉపమానములు సాహిత్య ప్రపంచమునకే మకుటాయమానములు.

ఊహాకలంగి జీవనపుటోలమునంబడి పోరుచున్మహా
మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగలేక సం
దేహముపొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహదురంత దంతపరిఘట్టిత పాద ఖురాగ్రశల్యమై.[27]

పాదద్వంద్వము నేలమోపి పవనుంబంధించి పంచేంద్రియో
న్మాదంబున్ బరిమార్చి బుద్ధిలతకున్ మారాకుహత్తించి ని

క్షేపబ్రహ్మపదావలంబన రతిన్ గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించె కరిపాదాక్రాంతి నిర్వక్రమై.[22]

ఈ విధమగు అర్థసామ్యము కలిగిన ఉపమలనే కాక శబ్దసామ్యముగల ఉపమ లను గూడ పోతన విరివిగా ప్రయోగించినాడు. చూడుడు.

అలకాపురంబునుంబోలె ముకుందవరశంఖనుకరాంకకలితంబై
రజతాచలంబునుంబోలె నగసేనాధిపార్శ్వాలంకృతంబై నిగ
మంబునుంబోలె వివిధవర్ణక్రమవివిక్తసంచారంబై గ్రహ
మండలంబునుంబోలె గురుబుధకవిరాజమిత్రవిరాజితంబై.[29]

ఇట్టి బాణానుకరణ వచనములలో ఉపమలకు శబ్దశ్లేష ఆధారము మమ్మట మతము ననుసరించి ఇట్టివానిని కూడ ఉపమాలంకారములుగానే కొందరు భావింతురు.

1. భక్తుడెందుజనిన పరతెంతు వెనువెంట
గోవువెంట దగులు కోడెభంగి [30]

1. పృథుల గతిమున్ భగీరథు రథము వెనుక
అనుగమించు వియన్నది ననుకరించి.[31]

3. కమల భవన రక్షకుండెత్తిన జవనిక మరుగు తెరలి పొడసూ
పిన మోహినీ దేవతకై వడి.[33]

4. కుంభివిభుడొప్పె నొవ్వల కుప్పబోలి.[33]

ఇత్యాది రమణీయోపమానములను మరి కొన్నింటిని పోతన భావనాశక్తి కుదాహరణములుగా కాంచవచ్చును.

ఉపమాలంకారము వలెనే ఉత్ప్రేక్షయును పోతనకు మిక్కిలి ఇష్టమైనది.

కం॥ తరుణుడగు శీతకరునిన్
మరగి విలుల్లక్ష్మి తన్ను మాని ముదుకడున్
ఖరకరుడుననుచు ద్రోబ్బిన
కరణిన్ రవిపశ్చిమాద్రికడ గ్రుంకెనృపా.[34]

మొదలగు పద్యములను వివిధవర్ణన సందర్భములందును కాంచవచ్చును.

సీ॥ విశ్వమోహనమైన వేణునినాదంబు
సరసగంభీర గర్జనముగాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి
లలిత సౌదామినీ లతికగాఁగ
తలచుట్టు బాగున దనరుపింఛపు దండ
శైలభేదను శరాసనముగాఁగ
కరుణా కటాక్షవీక్షణ సుధావర్షంబు
సలిలధారా ప్రవర్షంబుగాఁగ

తే॥ జాడనే తెంచు గోపాల జనమునీంద్ర
చాతకంబుల దురవస్థ చక్కఁజేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె
విమల బృందావనాకాశ వీధియందు.[35]

మొదలగు పద్యములందలి రూపకాలంకార సౌందర్యమును నత్యంత మనోహరము.

ఈ విధముగా శబ్దార్థాలంకార ప్రయోగములో ఆంధ్ర సారస్వతమునకు భాగవతమాదర్శ ప్రాయమగు గ్రంథము. తద్రచయితయగు పోతన లలితాలంకారిక శైలీ మనోహర కవితాస్రష్ట.

# 6. భాగవతము - పోతనవ్యక్తిత్వము

ప్రతి కవిలోను కవిత్వముండును. ప్రతివ్యక్తిలోను వ్యక్తిత్వముండును. ప్రతి వ్యక్తిలోను కవిత్వముండదు. కాని ప్రతికవిలోను వ్యక్తిత్వముండితీరును. ప్రతి కవియు నొకవ్యక్తియే కాని ప్రతివ్యక్తియు నొకకవికాడు. ప్రతివ్యక్తిత్వమును వ్యక్తిత్వముకాదు ప్రతికవిత్వమును కవిత్వముకాదు. మనుష్యులలో ఎన్నోగుణము లుండును. కాని గుణవంతుడనగా మంచిగుణములు కలవాడనిమాత్రమే అర్థము. ఒకని కవిత్వము కవిత్వమనిపించుకొనవలెననగా దానిలో ఏదోఒక అనితరమగు విశేష ముండవలెను. అట్లే వ్యక్తిత్వమనిపించుకొనవలెననగా అదియును అనితరమగు నొక విశేషముతో భావింపవలెను.

మహాకవుల వ్యక్తిత్వములు వారి గ్రంథములలో ప్రతిఫలించుట సహజము. అట్టులే భాగవతములోను పోతనార్యుని వ్యక్తిత్వముద్ర తప్పక ఉండియుండును. సామాన్యముగా కవిత్వములో కవివ్యక్తిత్వము భిన్నరీతుల వ్యక్తమగుచుండును. కవిత్వము కేవల మాత్మాశ్రయమైనచో కవి అందు ప్రత్యక్షముగానే వ్యక్తడగు చుండును. నాటకములోనైన అతడంచవ్యక్తుడు. పాత్రముఖముననే ఆతని స్ఫురణ ముండును. కావ్యములో కవిమూర్తి వ్యక్తావ్యక్తము. అనేక సంఘటనముల కాతడు ప్రత్యక్షసాక్షివలెనే వ్యవహరించును. ఒక కథసంతను చెప్పి ఆ కథలోని గుణవిశేష ములను దాని ఫలాఫలములను వర్ణించి చెప్పునప్పుడాతని వ్యక్తిత్వమును ప్రస్ఫుట మగుచుండును. ఇతరస్థలములనాతడు పాత్రలలో లీనుడై వ్యవహరించును.

భాగవతమున పోతన వ్యక్తిత్వము నాదృష్టితో పరిశీలించినయెడల ఎన్నో విశేషములు తెలిసికొనెడి అవకాశము లభించును. గ్రంథారంభమున కృత్యవతరణిక లోనే ఆయననుగూర్చి చాలవిశేషములు కలవు.

ఆయన లక్కమాంబా కేసనామాత్యుల పుత్రుడు. కేసనార్యుడు లలిత మూర్తియు, బహుకళానిధియు నైనవాడట.[1] ఈ లాలిత్యసౌందర్యములు వారి వంశములోనే ఒకలక్షణముగా కనిపించును. వారిపూర్వులలో నొకడగు భీమనమంత్రి సుభగుడు కూడ ; ఆ సౌందర్యస్ఫురణము పోతనలోకూడ కొంత సంక్రమించియుండ వచ్చును. ఆయనతల్లి చాల దయామయి. ఆమెలో మెత్తదనమేకాక ఒక గంభీరత కూడ ఉండెడిది.[2] ఒక రాచఠీవిగల, గొప్ప మనస్సుగల యిల్లాలామె. ఈ తల్లి

దండ్రుల గుణములు పోతనలో బహువిధముల ప్రకాశితములై యుండుననుట సత్యదూరము కాజాలదు. తల్లిలోవలెనే పోతనలో మెత్తదనమున్నది. దానివెనుక గంభీరతయునున్నది. అవసరము వచ్చినపుడు సత్యధర్మ ప్రకటనార్థమై నిలువగలసత్వమునుఉన్నది. ఇదియేతరచుగా భాగవతములో మనకు కనిపించు పోతనమూర్తి.

పోతన తల్లిదండ్రులు శైవులు. తండ్రి శైవశాస్త్రమతము గనినవాడు[3] తల్లి సదాశివపాదయుగార్చనానుకంపానయ వాగ్భవాని.[4] అన్న తిప్పయయు ఈశ్వరసేవా కాముడు.[5] ఈ శివారాధనము వారికుటుంబములో నొక క్రమాగత సంప్రదాయముగా కానవచ్చును. పోతన వంశములోని కేసన మల్లన కవులకు శైవాచార్యుడగు ఇవటూరిపర్వతాలు గురువగుటయు స్మరణీయాంశము. వీరభద్ర విజయము పోతనార్యుని బాల్యరచనముగా నంగీకరించిన అతడివటూరి సోమనారాధ్యుని శిష్యుడగును. ఏదైనను పోతన కుటుంబమునకు శైవముతో సన్నిహితసంబంధము కలదని అంగీకరించి తీరవలెను అసలు ప్రాయికముగా స్మార్తులలో నధికభాగము శివారాధకులే. ఉత్తర రామాయణమున తిక్కనయు మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలుడనని చెప్పుకొనుట సర్వజనవిదితమే. శ్రీనాథుడును ఈశ్వరార్చన కళాశీలుడనని నైషధమున వ్రాసికొన్నాడు అటులే పోతన కుటుంబమును శివారాధన తత్పరమైనదై యుండవచ్చును. అంతేకాని వీరభద్రవిజయములో పలికినట్టి వీరశైవము పోతన అవలంబించి యుండుననుట నమ్మరాని విషయము. బాల్యమున పోతన అట్టివాడై యుండవచ్చుననియు, వయసుముదిరి - భాగవతరచనాకాలము వచ్చునప్పటికి శివవిష్ణువుల కభేదముభావించు దృష్టి బయలుదేరి - అద్వైతమార్గానుయాయియై యుండవచ్చుననియు కొందరు భావించుచున్నారు. అటులే శ్రీవిద్యారణ్యశ్రీపాదులకు సమకాలికులైన శ్రీవేదాంతదేశికులవారి కుమారుడు శ్రీనైనారాచార్యులవారు సింగయమాధవేంద్రుని ఆస్థానమునకు వచ్చి విమతవాదులనోడించి ఆ రాజేంద్రునకు వైష్ణవమతమిచ్చినట్లు వైష్ణవమత గ్రంథములు నుడువుచున్నవనియు, రాజు వైష్ణవమతావలంబియైనపుడు సామంతనృపులును తద్ధర్మమవలంబించిరనియు, పోతనగారి భాగవతరచనకీ వైష్ణవమతవ్యాప్తి కూడ ప్రోత్సాహకరమై యుండవచ్చుననియు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారూహించియున్నారు.[6] భోగినీ దండకకర్తగా పోతనను సంవీక్షించిన అతడు రాచకొండ ప్రభువుల నొకకాలమున ఆశ్రయించినట్లే కన్పట్టుచున్నది. తరువాతికాలమున రాజాశ్రయమును వదలివైచినను ఆయాస్థానమున దృశ్యమానమైన వైష్ణవమత ప్రభావ మాయనహృదయమునాకర్షించి యుండవచ్చును. అదియునుగాక మతవిషయ

మున సామాన్యముగా నొకమాట చెప్పవచ్చును. సర్వవిధభావ చాలనవైఖరులు భారతదేశములోని మతములలో అంగీకార్యములే యైనను తీవ్రస్వభావులు వీరశైవ, శాక్తేయములను, లలితస్వభావులు వైష్ణవమును ఆశ్రయించుట తరచుగా గోచరించును. మెత్తని గుండెగల వ్యక్తులు మోక్షము సాధించుటకు వారిమనస్తత్వమున కనుగుణమగు మృదుభక్తిమార్గము లెన్నుకొందురు. ప్రేమ, శృంగారము, పరవశభజనము, మొదలగు లలితమధుర పద్ధతులను వైష్ణవమతము ప్రచారము చేసినది. ఆ మార్గములలో భక్తులగు ప్రహ్లాద గోపికాదుల కథలుగల భాగవతము పోతన మనస్సునకు బాగుగా నచ్చియుండును.

ఏమైనను శైవవైష్ణవభేదదృష్టిలేని తత్వము పోతనది. ఈ విషయము భాగవతగ్రంథము నెత్తుకొనుటలోనే కన్పించును. అతడు మహేశ్వరధ్యానము చేయుచుండగా శ్రీరాముడు కన్పించి తనకంకితముగా భాగవతము రచింప నాజ్ఞయిచ్చినాడు[8]. మరి చిత్రముగా పోతన షష్ఠ్యంతములు కృష్ణపరముగా రచించినాడు. అదియునుగాక గ్రంథాదిని కృష్ణస్తుతియే కలదు. స్కంధాంత గద్యలలో పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర అనియుండుటయు గమనార్హము ఇక స్కంధాంత స్కంధాది పద్యములన్నియు పోతన రచించినంతవరకు రామ సంబోధనాత్మకములే. నారయయు ఏకాదశ ద్వాదశములు రామాంకితమే కావించెను. గంగన, సింగనలు మాత్రము కృష్ణసమర్పితముచేసిరి. వీని అన్నింటికిని స్పష్టమగు కారణములు లభింపలేదు. గంగన, సింగనలు తమవి స్వతంత్ర గ్రంథములుగా భావించి అట్లు చేసియుందురని సమాధానము చెప్పకొనవచ్చును. కాని పోతనార్యుని శివ, రామ, కృష్ణ వ్యవహారము సమీచీనముగా, సమగ్రముగా సమన్వయింపగలమార్గము కన్పట్టుటలేదు.

భాగవతరచననాటికి పోతన బాగుగా వయస్సు మళ్ళిన వాడుగాతోచును. అనేకపాత్రల వర్తనములను, వివిధవర్ణనములను పరిశీలించిన ఒక సువృద్ధుడు పలుకుచున్నట్లుగా హృదయమునకు స్పందనము కలుగును. ఆయన పాత్రలతో ౘాతల్లీ, రమ్మౘతండ్రీ : రానాయనా! అని పిలుచుచున్నట్లే స్ఫురించును. కొడుకులతో, కోడండ్రతో మనుమలతో ప్రేమవాత్సల్యపూరితుడై వ్యవహరించు ఒక శాంతస్నిగ్ధమూర్తిని భాగవతకర్తగా మనోరంగమున దర్శింపగలము.

కృష్ణుడు భారతయుద్ధానంతరము ద్వారకకువచ్చి భార్యలను పరామర్శించుటలో నిట్టి వయఃపరిణతి గోచరించుచున్నట్లింతకుముందే గుర్తింపబడినది[9] ద్రౌపది

అశ్వత్థామతో సంభాషించిన సందర్భము[10] కుంతిప్రార్థన.[11] భీష్మస్తుతి.[12] మొదలగువానిలో నీ అనుభూతినే నిస్సంశయముగా పొందవచ్చును.

పోతనమూర్తినిగూడ భాగవతమున కొన్నిఘట్టములను జాగరూకతతో పరిశీలించిన ఊహింపగలము. మైత్రేయుని ధ్యానయోగమున వర్ణించుచు పోతన రచించిన ఈక్రిందిపద్యము చూడుడు.

సీ॥ ఘనసారరుచి వాలుకా సముదంచిత
సైకత వేదికా స్థలమునందు
యమ నియమాది యోగాంగక్రియా నిష్ఠ
బూని పద్మాసనాసీనుడగుచు
హరిపాద సరసీరుహన్యస్త చిత్తుడై
బాహ్యేంద్రియ వ్యాప్తి బారదోలి
సకలవిద్వజ్జన స్తవనీయసేముచితా
చార వ్రతోపవాసముల గ్రుస్సి

తే॥ యున్న పుణ్యాత్ము విగత వయోవికారు
వినుతసంచారు భువనపావనవిహారు
యోగిజనగేయు సత్తతిభాగధేయు
నాశ్రిత విధేయు మైత్రేయు నవుడుగాంచె.[13]

దీనిలో పోతన ధ్యానపద్ధతి పలుకబడియున్నట్లు తోచును. కృత్యవతరణికననుసరించి గంగాస్నానముచేసి ఆ సైకతములలో ధ్యానము చేయుట పోతన కలవాటైనట్లే తెలియుచున్నది అక్కడి అభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగయగు గంగయే యిక్కడి ఘనపాపతమః పతంగ యగు గంగ. అక్కడి మహనీయ మంజుల పులినతల మండపమే ఇక్కడి ఘనసారరుచివాలుకా సముదంచిత సైకత వేదికాస్థలము. పోతన యేపని చేసినను సజ్జనానుమతమున చేయువాడని కావ్యావతరణిక తెలిపినది పైపద్యములోకూడ సకల విద్వజ్జన స్తవనీయ వ్రతముండుట గమనార్హము. ధ్యానశీలుడగు వ్యక్తి అధికభోజనము చేయరాదు. కడుపునిండతినిన కమ్మని నిద్రవచ్చునేకాని కమలాక్షధ్యానము కుదురదు. అట్లని అసలాహారము మానివేసి శుష్కభూతశరీరుడై ఘోరముగా తపించుటయు ధ్యానమార్గముకాదు. అది

ఘోరవీరవ్రతులగు తపస్వులపద్ధతి. ఉచితాహారము, ఉచితోపవాసము, భక్తియోగము నకు ఉత్తమమార్గములు. అందుకే సముచితాచార వ్రతోపవాసములని పోతన ప్రయోగించినాడు వ్రతముగాని, ఉపవాసముగాని, చివరకాచారముగాని సముచితముగా నుండవలెననియే ఆయన సిద్ధాంతము. ఏప్రక్కకైనను మేరమీరుట ఆయనమార్గము కాదు. ఆ విధమగు నియమములను పాటించెడు వ్యక్తి నాతికృశాంగుడు, నాతిస్థూలుడై యుండవలెను. పోతనయు నటులే యుండియుండునని ఊహించుట సత్యదూరము కాబోదు. తలిదండ్రుల పోలికననుసరించి మంచిచాయగల మేనితో, తాను పాటించిన నియమములననుసరించి, యించుక కృశావయవుడై, ఆశాపాశము బంధింపని మన స్తత్వము కలవాడుగాన నిత్యసంతృప్తిగల ప్రశాంతముఖముతో వయోమనఃపరిణతి గలిగి ఆయన అలరారెడివాడని భావింపవచ్చును.

సాంసారికముగా పేదవాడని పోతననుగూర్చి అనుశ్రుతముగా కథలు విన వచ్చుచున్నవి. ఆ కథలసంగతి యెటులున్నను,పేదరికము సంగతిమాత్రము సత్య మనియే అనిపించును. కృష్ణుడు భార్యలతో "కడమల్ గావుగదా! భవన్నిలయముల్" అనుటలోను[14], సంపదలతో సంబంధముండ వలసిన పనిలేని గజేంద్రుడు "కలుగదే నాపాలి కలిమిసందేహించు కలిమిలేములులేక కలుగువాడు" అని ప్రార్థించుటలోను[15], ఈవిషయము స్ఫురితమగుచున్నది.

ధనము లేకున్నను ఆత్మగౌరవమును అభిమానమును గలవ్యక్తి పోతనా ర్యుడు. 'హోము హిరణ్యదానములు పుచ్చుకొనంగ, ధనంబులేమియున్ దేము'[16] అని శృంగిచేత పల్కించుటలో ఆయన వ్యక్తిత్వమే ప్రస్ఫుటముగా గోచరించు చున్నది. ఆనాటి రాజులకు కృతులిచ్చి పురములు, సొమ్ములు, వాహనములు పుచ్చు కొనుట నరకమునకు పోవుటకే అని ఆయన విశ్వసించినాడు.[17] ఈసందర్భమున కృతులను నరాంకితము చేసిన నన్నయ తిక్కనాదులందరును నరకమునకు పోదురని 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి' .... అను భాగవత పద్యములో స్ఫురించుచున్న దనియు అందుచే ఇది ప్రక్షిప్తమై యుండుననియు, అదియునుగాక పోతనవంటి మృదుహృదయుడు మనుజేశ్వరాధములని పరుషవాక్కు పలుకడనియు కొందరు విమ ర్శకులు పలుకుచున్నారు. పోతనార్యుడెన్నడును నరాంకితము చేసినంత మాత్ర మున నన్నయ తిక్కనాదులను దూషించు స్వభావము కలవాడుకాడు. ఆ మహాకవుల యందాయన కత్యంత భక్తియుండుట కృత్యవతరణికలో ఆయన కావించిన కవిస్తుతి చేతనే తెలియుచున్నది. ఆయన మనుజేశ్వరాధములని పలికినది తనకాలములో తనకు

తటస్థించిన రాజులనుగూర్చియే కాని సర్వకాలములలోని రాజులనుగూర్చి కాదు. 'ఇమ్మనుజేశ్వరాధముల' అను పదప్రయోగములోని మొదటి త్రికము ఈవిషయమున సాక్ష్యము నొసగగలదు. ప్రజాపీడకులైన ఆనాటి రాజులయందు పోతనకు కలిగిన వైముఖ్యమే ఆయనచే నట్టి పద్యమును రచింపజేసి యుండును దీనికి మరియొక నిరూపణముగా

ఉ॥ కాటుకకంటినీరు చనుకట్టుపయింపబడ నేలయేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నినునాకటికిం గొనిపోయి యల్లక
ర్ణాట కిరాటకీచకులకమ్మ త్రిశుద్ధిగనమ్మ భారతీ!

అను పోతనార్యుని చాటువునుగూడ గ్రహింపవచ్చును. ఆయన జీవితములో రాజులచేత ఏదో బాధపడియుండుటచేతనే పైన ప్రయోగించిన 'మనుజేశ్వరాధములు కర్ణాట కిరాటకీచకులు మొదలైన పదములు వెలువడియుండును. గజేంద్ర మోక్షణములోని 'నాకడ్డపడరాడె నలి నసాధువులచే బడిన సాధుల కడ్డపడెడువాడు'[18] అను నది యిందుకొక ఆంతరంగిక సాక్ష్యముగా నిలుచుచున్నది.

ఇక భాగవతములో భక్తునిగా పోతన వివిధ పాత్రలలో దర్శనమిచ్చినాడు. ప్రహ్లాదునిలో గోపికలలో ఇతర భక్తిరసభరిత వ్యక్తులలో తాను లీనుడై వ్యవహరించినాడు. వ్యాసుని మార్గము ననుసరించి భాగవతధర్మములను, విశేషములను ఎన్నింటినో సముజ్జ్వలముగా వర్ణించి జీవితమును చరితార్థము చేసికొనినాడు.

వేదాంత తత్త్వపరిశీలన దృష్టితో పోతన సర్వమత సామరస్యము కలిగిన వాడు. అద్వైత మాయన కాదర్శము. అందుకే తరచుగా శ్రీధరవ్యాఖ్యనే ఆయన అనుసరించెను. కానీ వ్యక్తిగా ఆయన మహాభక్తుడు. ఔపనిషద దివ్యబోధమును సంభావించిన క్షణములందు జ్ఞానజ్యోతి స్సాక్షాత్కారము నొందినను మరుక్షణముననే అత్యంత ప్రపన్నుడై హరి భజనములో పారవశ్యము నొందును. ఇది పోతన జీవితములో మహత్తరమగు జ్ఞాన భక్తి యోగముల సమ్మేళనము.

ఆయన జీవితములో నిష్కామయోగి. భాగవతారంభముననే శ్రీ కైవల్య పదము చేరుట తన వాంఛయని చెప్పికొన్నాడు. అందు కనుగుణముగా శ్రీరామ చంద్రుడు ఆయనకు భాగవత రచనచే భవబంధములు తెగునని వరమిచ్చినాడు. దశమ

స్కంధాంతమున ఆయన రచించిన ఈ క్రింది పద్యముకూడ ఈ కైవల్యభావననే స్ఫురింప జేయుచున్నది.

మనుజేంద్రోత్తమ! యేనునీకు త్రిజగన్మాంగల్యమై యొప్పజె
ప్పిన ఈకృష్ణ కథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిగ్రో
లిన పుణ్యాత్ములుగాంతు రిందు సుఖముల్ నిర్ధూతసర్వాఘులై
అనయంబున్ దుదిగాంతు రచ్యుత పదంబైనట్టికైవల్యమున్[19]

కైవల్యము తుదిగాంతురనుటలో ఒకవిధముగా తన రచనాంతమును స్ఫురింప జేసి భాగవతరచనా రహస్యమును పోతన ధ్వనితము చేసినట్లనిపించును.

ఎటులైననేమి భాగవతమంతటి మహాగ్రంథమును ఆమహనీయుడు రచించినను తానురచించుచున్నాననను అహంకార మ్మాయనకెన్నడును కల్గుగలేదు. పలికించెడి వాడు రామభద్రుడనియే ఆయన విశ్వసించినాడు.[20]

ఆయన జీవితకాలమున వాంఛించిన మరియొక్క విశేషము ముఖ్యమైనది కలదు. అదేమనగా

నగుమొగమున్ సుమధ్యమును నల్లనిదేహము లచ్చికాటప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ సుదే
భగతియు నీలవేణియు కృపారసదృష్టియు గల్గు నెన్నడి
మ్మృగపొడసూపుగాతకనుమూసినయుప్పుడువిచ్చునప్పుడున్[21]

జీవితకాలమున మానవునకు రెండేదశలు. కనుమూసినది. కనుతెరచినది. ఈ రెండు స్థితులలోను భగవద్దర్శనము నాయన వాంఛించినాడు. దయామయుడగు విష్ణుదేవుని మూర్తిని కన్నులముందు సర్వదా దర్శించుట ఆదర్శముగా పెట్టుకొని తత్సిద్ధికై సాధనచేసిన పోతన వ్యక్తిత్వము మహోన్నతము. జీవితకాలమున, జీవితాంతమున, ఆయన కోరిన కోరికలు తప్పక ఫలించియుండును.

## అనుబంధము - 1

# భాగవతము - సమకాలీనసమాజము

ఏకవి కావ్యమువ్రాసినను ఆ రచనాకాలమునాటి దేశకాల పరిస్థితులు ఆతని కావ్యముపై ప్రభావము చూపును. ఈ సాంఘికముద్రను తప్పించుకొనగలవా రెవ్వరును లేరు. జాగరూకతతో పరిశీలించిన సమాజమున కెంతదూరముగానున్న వ్యక్తి రచనలోనైనను ఎక్కడనో ఒక్కెడ అనాలోచితముగా అపరిశీలితముగా సమకాలీన సంస్కృతి ప్రతిబింబింపకపోదు. ఏమానవుడును తాను పుట్టిపెరిగి జీవించిన సమాజముచే ప్రభావితుడు కాకుండనుండలేడు. తానునేర్చిన భాష, తానుచదివిన విద్యలు తన సర్వానుబంధములును చుట్టునుగల సమాజపరిధిలోనివే మానవుని భావపథమే దానిచే మూర్తిదాల్చును. పూర్వజన్మకృత పుణ్యపాపవిశేష వాసనాయుతుడై అరుదెంచిన జీవి సంస్కారమును సమాజగత విద్యావాతారణములు తీర్చిదిద్దును. వానను తడియనివారును ఉండవచ్చునేమోకాని దీనిని తప్పించుకొనువారుండుట అసంభవము. దానిప్రభావమంతటిది. ధనము, విద్య, సుకృతి, దుష్కృతి అవి ఇవియననేల సమస్త ధర్మార్థ కామములును సమాజ సహజీవన ఫలములు.

ఈ కారణముచేతనే సమస్తదేశములలోను భిన్న కాలములలో జాతీయచరిత్రము తెలిసికొనుటకు సారస్వతమొక ఆధారమైనది. ఆంధ్రదేశములోను వివిధకవుల రచనలలో ప్రతిబింబించిన సాంఘికజీవనము గుర్తించుటకు విమర్శకులు బహువిధముల ప్రయత్నించినారు.

ఆంధ్రభాగవతములో ప్రతిబింబితమగు సమాజజీవనమునుగూర్చిన పరిశోధనము నేటివరకంతగా జరిగినట్లు కన్పింపదు. అదియునుగాక శ్రీనాథుడు, పాలవేకరి కదిరీపతి కృష్ణదేవరాయలు మొదలగువారి గ్రంథములలోవలె భాగవతములో సాంఘిక పరిస్థితులెక్కువగా ప్రతిబింబింపవు. కవి మనస్తత్వమే ఇందుకు కారణమని చెప్పవలెను.

దేశదేశములు తిరిగి సామాన్యునినుండి చక్రవర్తిదాక బహువిధ పరిచయములు గలిగి వాని నన్నింటిని వర్ణింపవలెనను మహోత్సాహముగల శ్రీనాథుని పద్యములును, తాను చక్రవర్తియయ్యును తీవ్రలోక పరిశీలనగలిగిన కృష్ణరాయల రచనలును,

అటులే మరికొందరి రచనలును సమకాలీనాంధ్ర సామాజిక జీవనమును చిత్రించుటకు పూనుకొనినంతగా పూనుకొనక పోయినను పోతన భాగవతమును పూర్తిగా సహకరింపదని చెప్పజాలము. బహుభావసంకులమగు మానవజీవిత పథములలో భిన్న సంస్కారులగు వ్యక్తుల వర్తనపద్ధతులు సహజముగా భేదించుచుండును. సంప్రదాయములు, ఆచారములు, మతప్రవర్తకల ప్రబోధములు మానవమస్తిష్కములపై తమ తమశక్తిని చూపి ప్రపంచమునెప్పటికప్పుడు పరిణామ విపరిణామ మార్గముల త్రిప్పుచుండును. ఆమహితప్రభావము వైయక్తిక విశిష్టతావశమున కొందరిరచనలలో ఎక్కువగా నుండును. మరికొందరి రచనలలో తక్కువగా నుండును. ప్రాచీనాంధ్ర సారస్వత మంతయు సంస్కృతానుకరణమే యైనను తెనుగు కవులనుసరించిన స్వతంత్రానువాదవైఖరిచే వారి వ్యక్తిగతసంస్కారమును, తదనుగుణముగా వారి నాటి దేశకాల పరిస్థితులును అందు ప్రవేశించినవి. ఆవిధముగా భాగవతములో పోతననాటిసాంఘిక పరిస్థితులెన్నో చోటుచేసికొనుట కాంచవచ్చును. వానిలో కొన్ని ఈక్రింద క్రోడీకరింపబడుచున్నవి.

ఆశ్రితులగుకవులకు రాజులు బహువిధములగు సత్కారములు చేయుట చిరకాలముగా మనదేశమున నొక మర్యాద. పోతన భాగవతము రచించు నాటి కాసంప్రదాయ మున్నతదశలో నుండెడిది. కవుల కగ్రహారములు, వాహనములు మొదలగున వెన్నియో రాజు లిచ్చుచుండెడివారు. ఇదంతయు కవులు తమకిచ్చిన కావ్యములకు ప్రతిఫలము.[1]

భగవద్భక్తి ప్రజలకు మిక్కుటముగా నుండెడిది. గ్రహణ కాలమున నదికి వెడలి స్నానముచేసి దేవునారాధించుట చిరకాలానుగతమై నాడును పాటింపబడుచున్న ఆచారములలో నొకటి[2]

శైవమతస్థులగు విద్యావంతులు తత్సంబంధమగు గ్రంథములను చదువుటత్యంత ప్రధానముగా భావించెడి వారు. సంస్కృతములో వ్రాయబడిన శైవ శాస్త్రములేకాక వీరశైవమునకు ప్రధాన భూమికయగు కర్ణాటమున వచన శాస్త్రములను శివభక్తి గేయములానాడు బయలు దేరినవి. వానిని చదువుటకూడ నాడధికముగా నుండెడిదేమో యనిపించును.[3]

శైవవైష్ణవాది మతచర్చలు నాడెక్కువగానున్నట్లు తోచును. నాట్యశాస్త్రము తెలియనివాడు నర్తనక్రమ మెరుంగలేనట్లుగా ఎంత తార్కికచాతురి కలిగినను కుతర్కవాది ఈశ్వరుని మేరలుచేసి ఎరుగలేడని ప్రాజ్ఞులు భావించెడివారు.[4] రాచకొండ

రాజుల కాలములో వైష్ణవము వ్యాప్తినొందుటచే వైష్ణవసూక్తులును ప్రజలలో బాగుగా వ్యాపించినవి. 'నదైవం కేశవాత్పరం, సర్వం విష్ణుమయం జగత్, జితంతే పుండరీకాక్ష, మంగళం మధుసూదన' మొదలగు వైష్ణవసూక్తులను శుకపికశారికాదులే పలుకగలిగెడివి.[8]

భారతీయ నాట్యరంగమునాటికే బహువిధముల వృద్ధిపొందినది. యవనికలతో, పటములతో, వాద్యములతో నాటకరంగ ముజ్జ్వలముగా నలంకరింపబడి యుండెడిది.[6]

శత్రువులపై పగ తీవ్రముగా నున్నయెడల వారి తలద్రొక్కిగాని స్నానము చేయరాదని పట్టుదల ఉండెడిది. తాము జయించిన రాజుల బొమ్మలను కాలి గండపెండారములలో ధరించుటయు నిట్టిదే.[7]

నిరంతర యుద్ధభయమునకు తోడుగా దొంగల భయమొకటి నాడు విపరీతముగా నుండెడిది.[8] మొత్తముమీద నిట్టి క్రూరకృత్యములచే భయపడి ఇండ్లు, ఊళ్ళు విడిచిపెట్టి జనులొక్కొక్కసారి వలసపోయెడివారు వారిగృహము లుమ్మెత్త, జిల్లేడు పొదలకు నిలయములయ్యెడివి.[6]

వేటాడెడివారుపయోగించెడి సాధనములును, తీసికొని వెళ్ళెడి వస్తుజాలమును చిత్రమైనవి. వలలు, ఉరులు, చిరుగుకండెలు, చలిది, చిక్కము, విల్లంబులు, తడక, ఉరిగోల మొదలగునవి బోయవారుపయోగించెడి సామాగ్రి.[10] పూర్వకాలము నుండియు పొలముదున్నుటలో కారుకారున దున్నిన క్షేత్రము లావుచెడుననియు అందుచల్లిన బీజములు నిస్తేజములై యుండి లెస్సగా నంకురింపవనియు గమనముండెడిది.[11] కడుపాకలికోర కిండ్లలోను, పొలములోను దొంగతనము చేసినవారిని శిక్షింపరాదని సామాన్యముగా జనులు తలచెడివారు.[12]

ఉత్సవములు మొదలగునవి వచ్చినప్పుడు మామిడాకు తోరణములుగట్టి ముంగిళ్ళన్నియును బాగుగా కడిగి ముగ్గులు పెట్టెడివారు[13] సామాన్య గృహస్థులగు పెద్దవారు కలిసికొనినపుడు పరస్పరము కుశలప్రశ్నలుగా కొడుకులు భక్తివిధేయులై యున్నారా? కోడండ్రు మీమాటను దాటుటలేదుగదా? విబుధసత్కారము బాగుగా జరుగుచున్నదా? పదార్థ వస్త్రభూషణములకు లోటులేదుకదా! అంతయును కల్యాణ సమన్వితమేకదా! అని శుభసమాచారములడిగెడివారు.[14]

తెలుగు బాలికలు చిన్నతనమున పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు పేయుచు తోడి యబలలతో వియ్యములందు కొనెడివారు. గుజ్జనగూళ్ళు వండుకొని చెలులకు పెట్టు

కొనెడివారు ఉయ్యాలలూగుట, బంతులాడుట, నాటి బాలికల ముఖ్యమైన ఆటలు.[15] బంతులనెట్లు తయారు చేసెడివారోకాని పాటువెంటనే మింటికెగయు లక్షణము కలిగి యుండెడివట[16]. ఆడపిల్లలేకాక మగపిల్లలును ఇటువంటి ఆటలు కొన్ని ఆడెడివారు. దాగిలిమూతలు, బంతెన గుండులాట[17]. గొత్తెలు దొంగల ఆట[18] మొదలగునవి బాల్యక్రీడలు.

నాగరక జానపదక్రీడలు భిన్నభిన్నముగా నెన్నోవిధములు. పిల్లలలో కొంద రావులైన ఒకడు గోవల్లభుడై రంకెవైచుచు వంగి నడచెడివాడు. మిగిలినవారును తదను గుణముగా వర్తించెడివారు. ఒకడు రాజైన తక్కినవారు భటులు. రాజుగా నున్న పిల్లవాడు మిగిలినవారి నాజ్ఞాపించి ఆయా పనులు చేయించెడివాడు. దొంగాట మరియొకటి అందరను నిద్రపోవుచున్నట్లు నటింప వారి యాభరణములు మరి యొకడు తీసి దాచిపెట్టును. ఒకడు సూత్రధారియై మిగిలినవారిని బహురూపుల ఆడిం చును[19]. ఒకని నెన్నుకొని వాడు దూరస్థలమున నుండగ పరుగెత్తుకొని పోయి మిగి లిన వారు వానిని ముట్టుకొనుట ఒకఆట. ముందెవ్వడు ముట్టుకొనిన వాడు గెలిచి నట్లు[20]. కందుక క్రీడలలో మరియొక విధముకలదు. రాళ్ళనే కందుకములుచేసి అవతల తృణదారు శిలాకల్పితములగు గురులొడ్డి ఈకందుక శిలాప్రక్షేపణములతో లక్ష్యములు తాక వేయవలయును. గురిసరిగా కొట్టినవారు జేతలు. గురి తప్పినవారు నిర్జితులు. ఓడినవారు గెలిచిన వారిని కొంతదూరమున గీయబడిన గిరి వరకు మోయవలెను. దీనిని రెండు గుంపులుగా జేసి ఆడవచ్చును. గుంపులకు నాయకులు పెన్నుద్దులు. మిగిలిన వారు చిర్రుద్దులు[21]

కొందరు పెద్దవారు కర్రసాము కత్తిసాము మొదలగునవి నేర్చుకొనెడివారు. శారీరక విద్యలలో మల్లవిద్యకు చాలా ప్రాధాన్యముండెడిది. కుస్తీపోట్లాట జరిగెడి రంగస్థలము మెత్తని ఎర్రమట్టితో నుండెడిది[22]. మదించిన మల్లులు నల్లని నడ గొండలవలె ప్రకాశించెడివారు. శిరమున సన్నని సిగదక్క వేరెట్టి కేశపాశమును లేక కోరమీసములతో నత్యంతభయంకరముగా నుండెడివారు.[23] ఓడినవారు గెలిచిన వారి చల్లడముక్రింద దూరిపోవుట ఒకనియమము[24]

శారీరకమగు పనిలోని కుద్యుక్తులగు వ్యక్తులు పుట్టములు పిరిచుట్లు చుట్టు కొని కొప్పులు బంధించుకొని నడుముకు గుడ్డచుట్టి బిగించి పనికి దిగెడివారు.[25] ముఖ్య ముగా గొల్లవారు పశువులగాచుటకై పోవునపుడు ధోవతిని కురుచచుంగులు పుచ్చి కట్టుకొనెడివారు. చల్దికావళ్ళు మూపులవహించి సజ్జంబులగు కజ్జంబులు కట్టుకొని పద త్రాణవేత్ర దండధరులై క్రేపుకదుపుల చప్పుడించి రొప్పుకొనుచు నరిగెడివారు.

ఊరిలోనుండి పశువులను తోలుకొనిపోవుటకు గుర్రుగా కొమ్ములూదెడివారు. ఆధ్వనిని విని ఇండ్లలోనివారు పశువులు విడుచుట జరిగెడిది. గొడ్లుకాచెడివారు పిల్లనగ్రోవు లూదుట సర్వసాధారణము.[26] వాగుల వంతలచెంతల గరికజొంపముల లంపులుదిని మంపులుకొని గుంపులుగొని నెమరులువెట్టుచు నొదువుగల పొదుగులు కదల వాదల జాదనం బరువిడు దూడల క్రీడల వేడుకలం గూడుకొని ఇళ్ళవాకిళ్ళ కావులుచేరగా పౌరులు వానినుండి అమృత సమానమగు పాలను పిండుకొనెడివారు.[27] తెల్లవారు జామునను, ఇంచుక తెల్లవారిన పిదపను పెరుగు చిలుకునప్పుడు గొల్లఇల్లాండ్రు పాటలుపాడెడివారు.[28] ఏదైన శుభకార్యము వచ్చినచో వారు మందలోని పశువుల నన్నింటిని. పసుపు, నూనెలు నలది నలంకరించెడివారు. చిగురాకు తోరణములుకట్టి దేవునిజెండాలెగురవైచి ధూప దీపములతో ఇండ్ల వాకిండ్లలంకృతము చేసెడివారు. ఎక్కడికైన పెద్దలఇండ్లకు పోవలసి వచ్చినయెడల శుభసమయములలో గోపకులు కంచుకములు, తలచుట్లుదాల్చి పసిడియాభరణములు మేనధరించెడివారు నేతులతో, పెరుగులతో, పాలతో, వెన్నతో, నీళ్ళతో వసంతములాడుకొనుచు సరససల్లాపము లాడుట వారిలో ఉత్సాహమునకు చిహ్నము.[29]

తెలుగు స్త్రీల బహువిధాలంకరణము సుప్రసిద్ధము. ఒదలికాంతులు పట్టులేని సన్ననివలిపములు దాల్చుట వారికి చాల ప్రీతికరము.[30] కలవారికాంతలు పసుపులాడి ఉరోజముల కుంకుమము నలంకరించుకొని ప్రకాశమానములగు వస్త్రములు తాల్చి కొప్పున చంపకదామమును పెట్టుకొని మెడలలో మాదలదండలు ధరించి ఒప్పారెడి వారు.[31] స్త్రీలకు మంగళసూత్రము విడువరాని మాంగల్య చిహ్నముగా నుండెడిది. తమకుగల సమస్తమును దానము చేసెడివారుకూడ దానినిమాత్రము వదలెడివారు కారు.[32]

ప్రాచీన కాలమునుండియు ఈ దేశమున కన్యాశుల్కమే వివాహమున ఆచార ముగా వచ్చుచున్నది.[33] వరశుల్కమిటీవలది.

గర్భవతులైన స్త్రీలకు సంప్రదాయబద్ధమగు రక్షలుచేయుట తరచుగా పాటింప బడిదెది. మంత్రించిన విభూతినొసట బొట్టుగా పెట్టుట రక్షలు కట్టుట మొదలగునవి మామూలు[34] గర్భములోనే శిశువు మరణించి బహిర్గతుడుగాకున్న యెడల ఘోర వేదనతో తల్లి మరణింప వలసి వచ్చెడిది ప్రసవము సక్రమముగా జరిగినపిదప వేదవిదులచే స్వస్తి పుణ్యాహవాచములు చదివించి జాతకర్మములు చేయించి పితృ దేవతలనర్పించి దానధర్మములు చేసెడివారు.[35] పసిపాపనికి నూనె తలయంటి

పసుపుపూసి బోరుకాడించి హరిరక్షపొమ్మని నీళ్ళుకొన్ని చుట్టి రాజల్లి తొట్టిలోనుంచి దీవించి ఆడువారు పాటలుపాడెడివారు.[36] నేటికిని పెద్దవారు పసిపిల్లలను స్నానము చేయించిన యెడల స్నానమైపోయిన పిదప చివర కాసినినీళ్ళు చుట్టును త్రిప్పి శ్రీరామరక్ష, నూరేండ్లాయుస్సు అనుచుందురు.

వెన్నెలవేళలలో క్షీరాన్నము కుడుచుట, మిత్రసహితులై విహరించుట ఒక ఉల్లాసము.[37] పట్టణములలో కాలమును తెలుపుటకు జాంఘికులు చేతిగంటలను ప్రయోగించెడివారు.[38] అరణ్యప్రాంతములలో ఏనుగలను పట్టుకొనుటకు మామిడి చిగుళ్ళతోచేసిన బంతి మచ్చుగాపెట్టుట జరిగెడిది.[39]

చిత్రపటములు వ్రాయుట ఎంతో ప్రాచీన కాలమునుండి ప్రసిద్ధమైనవిద్య. నాడు మిలమిలని మంచుతోడ పురుణించు ధళధళమని మెరుంగులు తురంగలిగొను పటంబు నావటంబుసేసి, వజ్రంబున మెదియించి పంచవన్నియలు వేరువేర కనక రజతపాత్రంబులనించి కేలం దూలిక ధరియించి చిత్రలేఖనము గావించెడివారు.[40] తరచుగా నీవిద్యలో స్త్రీలు నిపుణలై యుండెడివారు.

నీరుతోడుటకు కలశములు బంధించిన దారుయంత్రము లుపయోగించుట నాడు ప్రచారములో నుండెడిది.[41] ధనికుల ఇండ్లలో సలిలధారాయంత్రము లుండెడివి. ఉత్సవములలోనైనచో నీరుచల్లుటకు చిమ్మన గ్రోవులు వాడెడివారు.[42] ఈవిధముగా పోతన కాలమునాటి సాంఘికాచారములు భాగవతములో వివిధప్రదేశముల గోచరించుచున్నవి ఆయన రచించిన అమూలకభాగములచే కొంతవరకు నాటిసమాజజీవనము నిటులూహించుట కవకాశము కల్గినది.

అనుబంధము 2

# పోతన కవిత్వము - పూర్వకవి సామ్యములు

మహాకవులచే తదనంతరకవులు ప్రభావితులగుట సాహిత్యరంగమున నొక సహజసంవిధానము. పోతన భాగవత రచన నారంభించిన నాటికి దేశమునగల సారస్వతసముపస్థితి యింతకుముందే పరిశీలింపబడినది. మహాకవులగు నన్నయాదుల గ్రంథముల నాయన సమగ్రముగా ననేకపర్యాయములు పఠించి యుండుననుటలో నెట్టిసందేహమును జెందవలసిన పనియులేదు. ఇదియిటులుండ సంస్కృతమున నాటి కపారమగు సాహిత్యము మూర్తిదాల్చి యున్నది. వ్యాస వాల్మీకి, కాళిదాస, బాణ మయూరాది మహాత్ముల రచనలు పోతన బాగుగా అధ్యయనము చేసినట్లే భాగవతము ననుసరించి ఊహించుట కవకాశము కలదు. తత్సంబంధమగు విషయములు కొన్ని ప్రస్తావవశమున నటనట పలుకబడినవి. తెనుగుకవుల కవితాసామ్యములు పోతన కవిత్వమున నెట్లు కన్పించుచున్నవో సమీక్షించుట ప్రస్తుతాంశము.

నన్నయ :- ఆంధ్రసారస్వతమున నాదికవి నన్నయభట్టు. ఆయనయే పోతనకు కవితావిద్యయందాచార్యుడని నిస్సంశయముగా పలుకవచ్చును. అధిక సంస్కృత పదసమన్వితమును అక్షరరమ్యతావిశిష్టమును అగు ప్రసన్న మధురశైలికి తెనుగు సాహిత్యమున నన్నయ ఆది గురువు. పోతన శైలియు నట్టిదే. అంతేకాక కొన్నిసందర్భములందు వారి పద్యములలో స్ఫుటమగు పోలికలుకలవు. అట్టివానికి కొన్ని ఉదాహరణములు-

1 మ॥ అమితాఖ్యానకశాఖలంబొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్క పుష్పవితతిన్ శోభిల్లు కృష్ణార్జునో
త్తమనానాగుణకీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యానజా
త మహాభారత పారిజాతమమరున్ ధాత్రీసురప్రార్థ్యమై[1]

ఇది భారతస్వరూపమును రూపకాలంకారమున వర్ణించిన పద్యము ఇటువంటిదే భాగవతముననుకలదు. చూడుడు.

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై.[2]

2. యయాతిచరిత్రలో - యయాతి దేవయానికి తన దక్షిణ హస్తమునిచ్చి నూతి నుండి ఉద్ధరించుటను నన్నయయిట్లు వర్ణించెను.

చం॥ జలధివిలోలవీచి విలసత్కలకాంచి సమంచితావనీ
తల వహనక్షమంబయిన దక్షిణహస్తమునన్ దదున్నమద్
గళదురుఘర్మవారికణకమ్రకరాబ్జమువట్టి నూతిలో
వెలువడ కోమలిందిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.[3]

అదేఘట్టమున దీనిననుకరించు పోతన పద్యమిది-

శా॥ సప్తాంభోనిధి మేఖలావృతమహా సర్వంసహాకన్యకా
ప్రాప్త్యవ్యద్వరదక్షదక్షిణకరప్రాలంబమున్ జేసి ప్రో
త్క్షిప్తం జేసె యయాతి కట్టుకొన పైచేలంబుమున్నిచ్చి ప
ర్యాప్తస్వేదజలాంగి నాళిసముదాయస్వర్గవిన్ భార్గవిన్[4]

'పై చేలంబుమున్నిచ్చి' యనుటలో ఔచిత్య నిర్వహణమునకై పోతన చేసిన కల్పనా చాతుర్యము గోచరించుచున్నది.

3. దుష్యంతుని వేటను నన్నయయిట్లు చిత్రించెను.

కం॥ సరభసపరిచలిత మహా
శరభద్విపరిపు వరాహశార్దూలమద
ద్విరదాది ప్రకరభయం
కరవనమధ్యమున నృపతి కడుకడిమిమెయిన్.[5]

దానినే పోతన యిటుల రచించెను

కం॥ గండక కంఠీరవభే
రుండశశవ్యాళ కోలరోహిషరురు వే

దండ వ్యాఘ్రమృగాదన
చండ శరభశల్యభల్ల చమరాటవులన్.[6]

ఛందస్సమాస నిర్మాణభావములలో సామ్యమిటస్పష్టము.

4. నన్నయ కణ్వాశ్రమవర్ణనమిది.

సీ॥ శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుడగిలి
కదలక వినుచుండు కరులును కరికర
శీతలచ్ఛాయ తచ్ఛీకరాంబు
కణముల చల్లనిగాడ్పునపడి వాని
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్న పిండతతులు
తే॥ కడగిభక్షింపనొక్కట కలిసియాడు
చున్న యెలుకలు పిల్లులు నొండుసహజ
వైరివర్గంబులయు సహవాసమపుడు
సూచి మునిశక్తి కెంతయు చోద్యమంది[7]

ఇట్టి సర్వభూత సమానవర్తనమునే పోతనయు కణ్వాశ్రమ వర్ణనమున కావించెను. చూడుడు.

సీ॥ ఉరుతరశ్రాంతాహియుగళంబులకు పింఛ
ముల విసరెడి కేకిముఖ్యములను
కరుణతో మదయుక్తకలభంబులకు మేత
లిడుచు ముద్దాడు మృగేంద్రములను
ఘనమృగానవనములు గాపుగా లేళ్ళతో
రతులు సాగించు సారంగములను
నునువుగా హోమధేనువుల కంఠంబులు
దువ్వుచు నాడు శార్దూలములను

తే॥ దారి కలహించు మూషికదంపతులకు
మైత్రినందించు మార్జాలమల్లములను
మరియు జాతివైరంబులు మానికూడి
కలిసి క్రీడించు మృగముల గాంచెనతడు[8]

5. అర్జునుడు పట్టితెచ్చిన ద్రుపదుని జూచి ద్రోణుడు పలికిన మాటలను నన్నయ యిట్లు రచించెను

కం॥ వీరెవ్వరయ్య! ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె? అహహా! మ
హారాజ్యమదాంధకార మదివాసెనొకో?

ఈసంభాషణ వైఖరి కనుకరణము యశోద కృష్ణునితో నాడిన మాటలలో కన్పట్టుచున్నది. చూడుడు

కం॥ వీరెవ్వరు? శ్రీకృష్ణులు
గారా! యెన్నడును వెన్న గానరటకదా!
చోరత్వం బించుకయును
నేరరట! ధరిత్రినిట్టి నియతులు గలరే[10]!

6. దమయంతి నలుని నగారణ్యముల నన్వేషించుటను నన్నయ యిట్లు వర్ణించెను.

సీ॥ సహకార! మత్ప్రియ సహకారు పున్నాగ!
పున్నాగు, తిలక! భూభువన తిలకు
చందన! బుధహరిచందను, పుష్పితా
శోక! సుహృజ్జన శోకదమను
వకుళ! కులైకదీపకు విభీతక! భయో
పేతార్తిహారు నలు ప్రీతితోడ
గానరే! కానలలోన లోకోత్తరు
నన్నిమానిన్మానికి నరిగి యరిగి

ఆ॥ అడుగు నడుగు లెండ బోడమాడ పొక్కిన
నిర్ఝరాంతరముల నిలుచు బొలుచు
గిరులదరుల యెడల సురుగుపొగ్రహముల
తొంగితొంగి చూచు తోయజాక్షి[11]

గోపికలు విరహవేదనావశలై కృష్ణుని వెదకునప్పుడు పోతన యిట్టిపద్యమునే రచించెను.

సీ॥ పున్నాగ! కానవే! పున్నాగవందితు
తిలకంబ! కానవే! తిలకనిటలు...[12]

7. కద్రువ చేసిన యింద్రస్తుతిలో నన్నయ సమాసనిర్మాణము చూడుడు.

చ॥ సరసురసిద్ధ కింపురుషనాగ నభశ్చరముఖ్యులెల్ల...[13]

ఉషాపరిణయకథలో దీనిని పోతన అనుసరించెను. చూడుడు.

చ॥ నరసురయక్షకింపురుషనాగనభశ్చర సిద్ధసాధ్యకి
న్నరవర ముఖ్యులన్...[14]

శివకవులు :- నన్నెచోడుడు, మల్లికార్జునపండితారాధ్యుడు పాల్కురికి సోమనాథుడు ప్రఖ్యాతశివకవులు. ప్రథమ ప్రబంధముగా ప్రసిద్ధివడసిన నన్నెచోడుని కుమారసంభవము ప్రౌఢాలంకారిక శైలీయుతము. అందును నాతడు ద్విత్రిప్రాసలు, నంత్యప్రాసలు, రూపకాద్యలంకారములు, లయగ్రాహ్యాది వివిధవృత్త ప్రయోగములు కావించుటచే నట్టివానిలో కొన్నింటితో భాగవతపద్యములు పోలియుండ వచ్చునుగాని అవి నన్నెచోడుని కవితాప్రభావ ఫలములని చెప్పజాలము. ఏలన అలంకారప్రియుడగు పోతన అట్టివానిని తానేరచించి యుండుననుటసహజము. అది యునుగాక విస్పష్టమగుసామ్యము అంతగా గోచరించుట లేదు.

అటులే మల్లికార్జున పండితారాధ్యుడు రచించిన శివతత్వసారరచనా సామ్యములును భాగవతమున కన్పడుటలేదు. శివకవులలో పాల్కురికి సోమన కవిత్వముతో సామ్యములు మాత్రము విమర్శకులు గుర్తించియున్నారు. ఒకవిధముగా నిద్దరితత్వములలో కొంతసాన్నిహిత్యము కలదు. భక్త్యావేశము కవిత్వములో ప్రతిఫలించుట ఇద్దరిలోను సమానధర్మము. సోమనది వీరభక్తియైన పోతనది జ్ఞానభక్తి. ఆవేశ

పూరితుడైనను సోమనవలె పోతన పరమతదూషణము కావింపడు. ఇష్టదైవమునకు సర్వార్పణము చేసికొను విషయమున మాత్రమిద్దఱును తుల్యులు. కవితాదృష్టితో బసవపురాణమున నీక్రింది ద్విపదలు చూడుడు.

క్షీరాబ్ధిలోపల క్రీడించుహంస
కోరునే పడియల నీరు ద్రావంగ
చూతఫలంబులు చుంబించు చిలుక
భాతిబూరుగుమ్రాని పండ్లుకన్గొనునె
రాకామల జ్యోత్స్న ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటి ద్రావ
విరిదమ్మి వాసన విహరించు తేటి
పరిగొని సుడియునే ప్రబ్బలితరుల[15]

ఈ భావములనే చతుర్వేదసారమున నొక సీసపద్యమున సోమనాథుడు రచించినాడు. భాగవతము నందలి ప్రఖ్యాతమగు - మందారమకరంద మాధుర్యమును గ్రోలు మధుపంబువోవునే మదనములకు....[16] అనుపద్యమును - నీరదాగమమేఘ నిర్ముక్తపయః పానచాతకంబరుగనే చౌటిపడెకు[17] అనుపద్యమును వీనిని బాగుగా పోలి యున్నవి.

తిక్కన :- శైవవైష్ణవాదిమత కల్లోలితమైన మానవ మస్తిష్కములకు శ్శాంతిని ప్రసాదించుటకే తిక్కన పోతన లిరువురిరచనలును నాటి తెనుగుదేశమున నుదయించినవి. ఇద్దరును అద్వైతమార్గానుయాయులే. నాటికాలమున హరికై హరుని హరునికై హరిని తిరస్కరించువారే తరచుగా కనబడుచుండిరి. హరిహరతత్వ సమన్వయ మెంతయో వివేచనాపరులకుగాని యుండదు. జనులలో ఆవేశపరులున్నట్లు సమన్వయపరులుండరు. ఉద్రిక్తులున్నట్లు జ్ఞానులుండరు. జ్ఞానము సర్వాధికము భక్తికాని, కర్మకాని, యోగముగాని, జ్ఞానస్థితినొందనిది కైవల్యము నొసగజాలదు అజ్ఞానమును హరిహరాద్వైతముగా తిక్కనదర్శించెను. తిక్కనవలెనే పోతనయు జ్ఞానాధిక్యము నంగీకరించినవాడే. కాకున్న తిక్కన భక్తునిగాకంటె నెక్కువజ్ఞానిగా దర్శనమిచ్చిన పోతన జ్ఞానిగాకంటె భక్తునిగా దర్శనమిచ్చును. ఏదైనను భక్తి జ్ఞానముల సమ్మేళనము సముదాత్తస్థితి నొందిన జీవితములు వారివి. అద్వైతము

తిక్కనకు నిత్యసిద్ధి పోతనకది ఆదర్శము. అది పరమసత్యమని ఆయన యెరుగును కాని ఆయనమార్గము భక్తి. ఆయన జీవితము భక్తిపూరితము భక్తిమహోన్నత స్థానము నొందిన సమయమున ఆతడు జ్ఞానజ్యోతియగు అద్వైతసాక్షాత్కారము నొందును. ఆస్థితి గతించిన వెంటనే మరల భక్తుడగును.

ఈదృష్టితో పరిశీలించిన తిక్కన పోతనల జీవితములే వారికవిత్వముతో సమన్వయము పొందినవనుట గోచరించును. ఇక నిద్దరిరచనములను పరిశీలించిన సారస్వత రంగములో తిక్కనకు పూజ్యస్థానమునిచ్చినాడేకాని నన్నయ మార్గము ననుసరించినంతగా పోతన తిక్కన ననుసరింపలేదు. తిక్కనశైలి అనునుకరణీయము. పదిమాటలు చెప్పవలసినచోట నొకమాటనేచెప్పు ఆర్థికుడాయన. పోతనార్యునిదో వర్ణనాత్మక శైలి. ఆయన ఒకమాట చెప్పవలసినచోట పదిమాటలు చెప్పును. అందును ఆవేశపరుడైన వేళల కొన్నిసందర్భములందు చాలనెక్కువగా విస్తరించును. ఐనను తిక్కనయన్నను, ఆయన రచనయన్నను గల అపారగౌరవముచే సామ్యములు కొన్ని దృశ్యమానమగుట పరిశీలింపవచ్చును. అందును దైవనిర్దేశముచే గ్రంథరచన నారంభించి జన్మరాహిత్యమునే ఫలముగా తమయిష్టదైవములచే వరము నొందిన వారిద్దరిలో నటులుండుట సహజమే.

1. భారతమున ఆశ్వాసాంతములందు కందమును, మాలినిని నియతముగా తిక్కన యుంచెను. పోతనయునట్లే కావించెను.

2. విరాటపర్వములో భీమునకు నొక మల్లునకు పోరాటమును తిక్కన మిగుల నైపుణ్యముతో వర్ణించెను. అందలి మల్లయుద్ధరహస్యములు పోతన రచించిన కృష్ణ చాణూర యుద్ధములో గోచరించుచున్నవి.

3. భీముని క్రోధమును తిక్కన యిట్లువర్ణించెను.

చ. కనుగొని కోపవేగమున కన్నుల నిప్పులు రాల సంగముల్
దనరగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతవంతపీ
డన రటదాస్యభంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తన ఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తియై[18]

పోతన వర్ణించిన దంతవక్త్రు క్రోధము పైదానివలెనే కలదు. చూడుడు.

